

## శ్రీమదాంధ్ర వాల్మీకి

# వచన రామాయణము

## అయోధ్యా కాండము



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ



రచయిత్రి శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ
పతిదేవులు (పరమపదవాసులు) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట రాఘవాచార్యులు అయ్యవార్లతో

Published by
www.pravachanam.com

# శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము

(రిజిష్టర్ ట్రస్ట్ 327/95, తేది 18-8-95)


శ్రీ జీయర్ స్వామివారి కార్యాలయం
7-7-41, రామారావు పేట
కాకినాడ - 533 004
తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఫోన్స్ : 0884 - 2371064, 2371070.





వ్యవస్థాపకులు
పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ
రామానుజ జీయర్ స్వామివారు


తేది : 18-09-2020

## మంగళాశాసనములు

శ్రీమద్రామాయణం శ్రీరామానుజ సంప్రదాయానికి మూలాధారమని, సాక్షాత్తు వేదమని, శ్రీరాముడు వేద పురుషుడని మన పూర్వాచార్యుల వాక్కు.

అట్టి శ్రీమద్రామాయణమును సంప్రదాయానుగుణముగా, సరళ వచనములో రచించారు పండితురాలైన శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ గారు. వీరు శతాధిక వృద్ధులు. వారికి అనేక మంగళాశాసనములు.

శ్రీమతి సీతమ్మగారి శతజయంతి సందర్భంగా ప్రకటిస్తున్న ఈ సరళ వచనరూప రామాయణము అందరికీ ఉపయోగ పడాలని మా ఆకాంక్ష.



ఈ పుస్తకం ముద్రణకి ప్రవచనం.కామ్ వారు సహకరిస్తున్నట్లు తెలిసింది. వారికీ అనేక మంగళాశాసనములు.

(signature)

(శ్రీరంగ రామానుజ జీయర్,
కాకినాడ)



శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారి

## శతజయంతి సందర్భంగా

కుటుంబ సభ్యుల కానుక

# అయోధ్యాకాండము



పరిష్కర్త

శ్రీ విం జమూరి శేషఫణి శర్మ

ముద్రణా సహకారం

pravachanam.com బృందం

# అయోధ్యా కాండము

**శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**



ముద్రణ

**నవంబరు, 2020**

వెల

**అమూల్యం**

ముద్రణా సహకారం

**pravachanam.com బృందం**

సంప్రదించుటకు

**శ్రీ ఎస్.టి.పి.ఎస్.వి. రాఘవాచార్యులు**

9490942884

ప్రింటర్

**ముద్రిక ప్రింటర్స్, విజయవాడ**

# నివేదన

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ నారాయణుల కటాక్షముచే మంచి ఆరోగ్యముతో మా మధ్య కదలాడుచూ ఈ శార్వరి నామ సంవత్సర ఆశ్వయుజ బహుళ ద్వాదశి, హస్తా నక్షత్రము అనగా 12-11-2020 నాడు నూఱవ వసంతము పూర్తిచేసుకొనుచున్నారు మా కుటుంబపెద్ద శ్రీమతి శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మగారు. ఈమె పతిదేవులైన పరమ పదవాసులు శ్రీమాన్ వేంకటరాఘవాచార్యులువారు గొప్ప ఉపాసకులు, మంత్రశాస్త్రవేత్త. వీరికి నలుగురు కుమారులు మఱియు ముగ్గురు కుమార్తెలు. ప్రస్తుతము రెండవ కుమారుడైన శ్రీమాన్ శ్రీవెంకటేశ్వర్లుగారి కుటుంబానికి సేవా భాగ్యము కలిగించుచు హైదరాబాదు నందు నివసించుచున్నారు.

ఆమె పుట్టింటి నుండి సంగీత సాహిత్యాలు, సంప్రదాయకత, పఠనాసక్తి, ఆర్షజ్ఞానము, దైవచింతన అరణంగా తెచ్చుకొని మెట్టినింట పతిదేవుల సాహచర్యములో దైవోపాసన, పరోపకారము అలవరచుకున్న ఉభయవంశ పవిత్ర. తల్లిదండ్రులైన శ్రీమాన్ మొలుగు వెంకట నరసింహాచార్యులు, వెంకటనరసమ్మ శిక్షణలో వాల్మీకి రామాయణము ఆమెకు నిత్యపారాయణ గ్రంథమైనది. అదియే ఈ గ్రంథ రచనకు నాందియైనది. అజరామరమైన శ్రీమద్రామాయణానికి ఎన్ని వ్యాఖ్యానములు, అనువాదములు ఉన్నా వేటి తీరు వాటిదే. ఆయా రచయితల అనుభూతులు కూడా వాటి వాటి ప్రత్యేకతలు కలిగి ఆస్వాదయోగ్యంగా ఉంటాయి. 'ఆంధ్రవాల్మీకి' శ్రీ వావిలికొలను సుబ్బారావు (వాసుదాసు) గారి 'ఆంధ్రవాల్మీకి రామాయణ' పద్యకావ్యము పఠన ఆమెకు రామాయణముపై మరింత అవగాహన పెంచడమేగాక సామాన్యులకును

అర్థమగునట్లు తనదైన శైలితో తెలుగు వచనములో రామాయణమును ఉత్తర కాండ సహితముగా అనువదించుటకు మూలమైనది. ఆమె రచన స్నిగ్ధమైన తేటనీటిధార, సహజమైన శైలీప్రవాహము.

ఈ సంకల్పమునకు తగిన ప్రేరణ యిచ్చి ప్రోత్సహించినవారు ఆమె సోదరులైన ఆధ్యాత్మికవేత్త శ్రీమాన్ మొలుగు రంగాచార్యులుగారు కాగా రచనలోని సహజధారను పరిష్కరించినవారు పెద్దకుమారుడైన రాధా కృష్ణమాచార్యుని మిత్రులు, పండితులు, కవులునైన శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. ఆమెపై నున్న వాత్సల్యముతో 'ప్రవచన శిరోమణి' శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు వారి అభినందనములను తెలియజేయగా 'న్యాయ-ఉభయవేదాంత ప్రవీణ' శ్రీమాన్ మొలుగు రామానుజాచార్యులు గారు వారి ఆశీస్సులను అందజేశారు.

ఈ రామాయణ కథానాయకుడైన శ్రీరాముని అన్నదమ్ములవలె నుండెడి ఈమె కుమారులు తొలి ప్రయత్నముగా వీరి రచనలలోని 'రామానుజ చరిత్ర', 'బాలకాండము'లను మూడవ కుమారుడైన శ్రీమాన్ నరసింహాచార్యులు - లీల దంపతులును, 'సుందరకాడము'ను శ్రీమాన్ రాధాకృష్ణమాచార్య - భూదేవి దంపతులును, 'దశరథుని కోడళ్ళు'ను మూడవ అల్లుడైన శ్రీమాన్ కరి రాధానాధాచార్యులు - విజయలక్ష్మి దంపతులు ప్రచురింపజేసిరి. ఈమెకు సేవచేసి ఈ రచనలు చేయుటకు చక్కని వాతావరణము కల్పించినవారు నాల్గవ కుమారుడైన శ్రీమాన్ శ్రీమన్నారాయణ, సీత దంపతులు.

అటు పిమ్మట సీతమ్మగారు ఈ వచన రామాయణ మూలప్రతులను శ్రీమత్ ఉపనిషత్ సిద్ధాంత ఆచార్య పీఠము (కాకినాడ) వ్యవస్థాపకులు అయిన శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్

స్వామివారికి సర్వహక్కులతో సమర్పించినారు. అంతేగాక వీరి కథా సంపుటీకరణములైన సన్మార్గదర్శనము, ఆత్మజ్ఞానమునకాధారము, అహం వేద్మి మొదలగునవి స్వామివారి ఆధ్యాత్మిక మాసపత్రిక 'శరణ్య'లో ప్రచురితమైనవి.

శతజయంతి సందర్భమునకు తగిన బహుమాన రూపములో ఈ వ్రాతప్రతులను వెలుగులోనికి తీసుకురావలెనను, శాశ్వతముగా నిక్షిప్తపరచ వలెనను కోరికతో ఈ వచన రామాయణమును (ఏడు కాండలు) నేటి సరళి ననుసరించి అంతర్జాలమునందు ఉంచినచో అందరికీ అందుబాటులో నుండునని తలచి, పెద్దల అనుమతితో ప్రవర్తించుచుంటిమి. ఇందుకుగాను పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు తమ దివ్య మంగళాశాసనములను కృపజేసినందున ఆమె మఱియు ఆమె కుటుంబము తరపున స్వామివారికి అనేకానేక దాసోహములు. అలాగే అంతర్జాలము నందుంచుటకు, ముద్రణకు సహకరించిన 'ప్రవచనం.కాం' బృందము వారికి మా ధన్యవాదములు. ఈ ఆలోచన చేసి, సాకారము చేయుటలో ముఖ్య భూమిక వహించిన వారి మనుమలైన శ్రీమతి కొమాండూరి శిరీష, కులశేఖర్ దంపతులు ఎంతో అభినందనీయులు. ఈ గ్రంథము www.pravachanam.com నందు ఎల్లవేళలా లభ్యమగును గాన ఈ అవకాశమును అందరూ సద్వినియోగపరచుకొనవలసినదిగా మనవి.

ఈ పుస్తకము పఠించు సహృదయులకు శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రులవారు కరుణా కటాక్షముల ననుగ్రహించి సర్వశ్రేయాలు కలిగించుగాక!

**కుటుంబ సభ్యులు**

**(12-11-2020)**

# ముందుమాటలు

శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ ప్రసాద సిద్ధికొరకై యా దివ్యమహిషిని ప్రార్థన చేసి నే చెప్పబోవు తొలి పలుకులు రసజ్ఞులైన మహనీయ పాఠకులందరు ఆలకింతురు గాక.

నా చిన్నతనమున మా తండ్రిగారైన మొలుగు వెంకట నరసింహాచార్యులు గారు నాకు అక్షర జ్ఞానముతో బాటు కావ్యపఠనమందు ఎంతయో అభిమానము కలిగించిరి. సంస్కృత వాల్మీకి రామాయణముపై మక్కువ వారివలననే కలిగినది. దానిని చదివినను పూర్తిగా అవగాహనము చేసుకొనలేనను భయముతో సంస్కృతమునకు సరియగు ఆంధ్ర పద్య కావ్యమునకై యెంతయో యత్నించితిని. నా తపన ఫలించి అట్టిది లభించినది. కాని యెంత హృద్యముగ నున్నను పద్యమును చదువువారు నేడు కరవైపోవుచున్నారు. పండితులకు సంస్కృతమైనను, ఆంధ్ర పద్యమైనను, వచనమైనను ఒకటే ఉపాదేయమే వచనమైనచో సామాన్యులును చదివి యానందించగలరు. నేను ఆంధ్ర రామాయణ గ్రంథలభ్యతకై పడిన తపన – వాల్మీకి రామాయణమునకు సరియగు తెలుగు వచన రామాయణమునకై మరి యెవ్వరును పడరాదని తలచి – యీ రచనకు పూనుకొంటిని.

నాకు లభించిన ఆంధ్ర వాల్మీకి రామాయణ పద్యకావ్యము మూలానుసారియైయున్నది. ఆంధ్ర వాల్మీకి, వాసుదాసు వంటి సార్థక నామములు గల శ్రీ వావిలికొలను సుబ్బారావుగారిచే రచింపబడినది. కనుక

దానిని చదివి వచన రూపమునకు తెచ్చుటకు ఉత్సాహపడితిని. రామాయణము వంటి కావ్యమును అందరు చదివి ఆనందించునట్లు ప్రసన్న మాధుర్యమైన వచనములో వ్రాయుట నాకు సాధ్యపడునా? అను శంక నన్ను బాధించు చుండగా, మా ఇలవేల్పులు శ్రీ సకల భువన సామ్రాజ్యలక్ష్మీ అమ్మవారును, శ్రీ ఆపదోద్ధారక ఘోర వీర లక్ష్మీనృసింహస్వామివారును, శ్రీ పంచాయతన వేణుగోపాలస్వామి వారును రచనకు ఉపక్రమించుమని నన్ను ఆదేశించిరి.

శ్రీమాన్ మాంత్రిక రాణ్మౌళి, శ్రీమత్పండిత మంత్రరత్న బిరుదాంకితులైన నా పతిదేవులు శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకటరాఘవాచార్యుల వారి యాదేశము లభించినది. వారి ఆదేశముల ననుసరించి, ఆదేశకర్తలపైననే భారముంచి రచనకు ఉపక్రమించితిని.

మా పొరుగువారైన శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రిగారి సతీమణి సుశీలాదేవిగారు కావ్య పఠనమునందు ప్రీతి కలవారు. పరహృదయములను అవగాహన చేసుకొను సహృదయ స్నేహపాత్ర. వారు నేను వ్రాసిన దానిని చదువుచు సూచనలనిచ్చుచు ప్రోత్సహించిరి. నా మనుమలు శ్రీధర్, శ్రీకాంత్‌లు శ్రద్ధతో భౌతిక సౌకర్యములు కల్పించుచు వచ్చిరి. నా సోదరుడు మొలుగు రంగాచార్యులు రచనలో మెళకువలు తెలుపుచు, వాక్య నిర్మాణమున సూచన లిచ్చి సహాయపడినాడు. నా పెద్దకుమారుడు రాధాకృష్ణమాచార్యులు కోరగా గ్రంథమును పరిష్కరించుటేకాక శుద్ధప్రతిని కూడ వ్రాసియిచ్చిన పండితులు, ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు నగు శ్రీ వింజమూరి శేషఫణి శర్మగారు. వీరు కవులు, సాయీభక్తులును. కాళిదాస విరచిత రఘువంశమును ఆంధ్రమున పద్య కావ్యముగా 'రఘువంశ తిలక చరితము' అను పేరున, మయూర కవి విరచిత సూర్యశతకమునకు వ్యాఖ్యను వ్రాసి ప్రచురించినవారు, ఇంకను అనేక రచనలు చేసినవారు. వీరికి నాయందు గల సోదరీ వాత్సల్యము,

శ్రీరామచరితముపై గల అభిమానమును యింతటి శ్రమ తీసుకొనుటకు కారణములైనవి.

వీరందరికి శ్రీ సీతారాములు ఆయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షింతురు గాక!

ఈ గ్రంథమును శ్రీ సకలభువన సామ్రాజ్య లక్ష్మీనారాయణ స్వామివారికి తత్కటాక్ష లబ్ధికోరి నా హృదయ కుసుమముతో జతచేసి సమర్పించుచున్నాను. ఇందలి గుణములను గ్రహించి దోషములు విసర్జించ గోరుచున్నాను. కథానాయకుడు శ్రీరామచంద్రుడు సాగరమును దాటించి హనుమను అనుగ్రహించినట్లు యీ సంసార సాగరము నుండి నన్ను తరింపజేసి పరమపదము ననుగ్రహింప గోరు భాగవత పదదాసి.

**(సం) శ్రీమత్తిరుమల పెద్దింటి వెంకట సీతమ్మ**

**(అయ్యవారిరుద్రవరము)**






శ్రీమాన్ శ్రీమత్తిరుమల పెద్దింటి వేంకట రాఘవాచార్యులుగారు మంత్రానుష్ఠానము చేసి సిద్ధి నొందిన మహనీయ చరిత్రులు. వారి ధర్మపత్ని వెంకట సీతమాంబగారు, వారి ధర్మపత్నియై జన్మసిద్ధమైన భగవద్భక్తికి మెరుగుపెట్టుకొనిన ధన్యురాలు. ఆమె లౌకిక విద్యలలో ప్రావీణ్యమును సంపాదింప యత్నించలేదు. కాని ఉత్తమ గృహిణిగా శ్రీ రాఘవాచార్యులుగారి సాహచర్యమున, భగవదుపాసనమున పరినిష్ఠితురాలై భగవదనుగ్రహ పాత్రతనందినారు. భగవత్కటాక్ష విశేషముచే దివ్యమైన జ్ఞానవైశద్యము, సౌమ్యమైన వాక్కు, ప్రకృతిసిద్ధమైన మాధుర్యము వారి కలవడినవి. ఈమె పతివ్రతయగుటచే పతివ్రతయై కారుణ్యరూపిణియై ఛాయవలె శ్రీరామచంద్రుని అనువర్తించి, తన నడవడిచే లోకాన్నే కాక ప్రియుని కూడ పరవశింపజేసిన ధన్యచరిత. భూజాత సీత చరిత మీమె మనసు నాకర్షించినది.

“సీతాయాశ్చరితం మహత్” అని పేరుపొందిన శ్రీరామాయణము ఆంధ్ర వాల్మీకి నుండి వెల్వడినది. అది ఈమె భాగ్యవశముచే నిత్యపారాయణ గ్రంథమైనది. పెద్ద పాండిత్యము కాని, భాషాజ్ఞానము కాని లేదని చెప్పుకొనుచున్న ఈమెకు ఆ రామాయణము నంతను తన వాక్యములతో తెనుగున వ్రాయవలెనని కోరిక కలిగినది. ఇది పూర్వజన్మ సుకృత ఫలము. శ్రీరాముని చరితము చదువుట, అనుభవించుట మాత్రమే కాక తామాస్వాదించిన దానిని తమదిగా చేసుకొని తన వాక్కులతో ఆవిష్కరించవలెనని కోరిక కలిగినది. దానికి తగిన భాష, ఆవిష్కరణ శక్తి వారి ఉపాస్యదైవము వారికి అనుగ్రహించినారు.

ఆంధ్ర వాల్మీకి విరచిత శ్రీరామాయణము వాల్మీకి ప్రతి శ్లోకమునకు అనువాదము మాత్రము కాదు. రహస్యార్థప్రతిపాదకములగు శబ్దములను విడువక అనువాదము నందిచ్చిన మహత్తర గ్రంథము, దాని నర్థము చేసుకొనుట కష్టము - కాని అర్థము చేసుకొనినారు. చేసుకొని సులభము, నిర్దుష్టము, స్పష్టము, అన్వయ క్లేశరహితము నగు మధుర ప్రసన్న భాషలో వచనముగా అందించి జీవితాన్ని సార్థకము చేసికొనినారు. శ్రీరామాయణము ప్రాచేతసుల నుండి వెల్వడిన వేదము. వేదమున పూర్వభాగార్థమును వాల్మీకి వాచ్యార్థమున కవిగా ప్రతిపాదించినాడు. అంతరమగు ధ్వన్యర్థమున ఆధ్యాత్మికమైన వేదోత్తర భాగార్థమును మునిగా సూచించినాడు. ఈ రామాయణమున శ్లోకమును కాని, పాదమును కాని అధ్యయనము చేసినంతనే భగవత్సాయుజ్యము నొందెదము అని పెద్దలు చెప్పుదురు. అట్టిచో ఈమె ఏడు కాండలు చదివి అనుభవించి జీర్ణము చేసుకొని తనదిగా తెనుగు వచనమున ఆవిష్కరించి ధన్యత నందినారు. ఈమె భాగ్యమే భాగ్యము.

ఈ అనువాదము అనువాదము వలె లేదు. స్వతంత్రముగా సాగినది. భాష సహజము, మధురము, ప్రసన్నము. వాక్యము సంస్కృతమునకు అనువాదముగా ఉండక అచ్చమైన తెనుగుదనమును సంతరించుకొన్నది. బాలకాండములో అశ్వమేధయాగ సందర్భమున ఆమె చేసిన అనువాదము ఆశ్చర్యజనకముగా నున్నది. పండితులకు కూడ దురవగాహమైన యాగక్రమ వివరణము పండితులకు కూడ సంశయము తీరునట్లు, పామరులకు కూడ సులభముగ అర్థమగునట్లు వ్రాసినారు. ఇది చదువుకొనిన జ్ఞానము కాదు. భగవదుపాసనచే వచ్చిన భాష-విషయ వైశద్యము. తెనుగున ఇంతవరకు ఎన్నో - గ్రాంథికభాషలో, వ్యావహారిక భాషలో గూడ అనువాదములు వచ్చినవి. భాషలో, వాక్య నిర్మాణములో ఇంత అందము సౌలభ్యము వేరొకదానిలో చూడమనుట అతిశయోక్తి కాదు - వాస్తవము.

ఆమె అనుభవించిన శ్రీరామచరితమును లేశమాత్రమనుభవించి ధన్యత నొందిన వాడనగుటచే అనువాదమును చూచి ఆనందించి ఆమె చేసిన ప్రయత్నమును అభినందింపకుండ ఉండలేకనే యీ మాటలు వ్రాయుచున్నాను. కాని ఆమె ద్వంద్వాతీతురాలు. ఆమెకు వెనుక బలము ఆమె ఉపాస్యదైవము. ఆ దైవబలము పలికించగా వాల్మీకి నోటినుండి శ్రీరామాయణ మంతయు బ్రహ్మానుగ్రహముచే వెల్వడినట్లు ఈ వచన శ్రీరామాయణము ఈమె నోటి నుండి వెల్వడినది. ఆంధ్ర పాఠకలోకము అన్యూనాతిరిక్తముగ వాల్మీకి రామాయణమును గ్రహించుటకు ఈ గ్రంథము సాయపడును.

ఆమె తరించుటయే కాక అందరిని తరింపచేసిన ధన్యచరిత మా సీతమ్మగారికి శ్రీ సీతారామచంద్రులు తమ విశేష కటాక్ష ప్రసాదముచే ఇతోధికముగ లోకానికి తమకున్న దైవీసంపదను పంచిపెట్టు శక్తిని, భక్తిని ప్రసాదింతురు గాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

**(సం) శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

**26-12-1989**



**శ్రీ హయ వదన పరబ్రహ్మణే నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ఆశీస్సు



**సుఖాయ కర్మాణి కరోతి లోకః నతైస్సుఖంవా న్యదుపారమం వా।**
**విందేత భూయాస్తత ఏనదుఃఖం యదత్ర యుక్తం భగవన్వదేన్నః॥**

అని నటుల ఈ ప్రపంచమున ప్రకృతి బద్ధులగు చేతనులందరును సుఖాపేక్షచే కొన్ని కార్యములందు ప్రవర్తించుచున్నారు. అందువలన వీరికి సుఖప్రాప్తి గాని దుఃఖ నివృత్తి గాని సంభవించకపోవుటయే గాక అధికముగా దుఃఖములు సంభవించుచున్నవి. ఇటుల ప్రకృతి పిశాచికావిష్టులై ప్రకృతి సామ్యము ననుభవించుచు స్వభావ సహజమగు జ్ఞానానందమలత్వాదికమును, పరమపురుషశేషత్వమును విస్మరించి నానావిధ సాంసారిక దుఃఖముల ననుభవించుచున్నను క్షణకాలము కూడ ప్రకృతి సంబంధము లేక యుండ జాలరు. ఇది యొక విచిత్ర సంఘటన. ప్రకృతి సంబంధ విచ్ఛేద మెటుల సంభవించును? ఇందుల కుపాయమెద్ది? దీనిని తెలుసుకొనుటకు సాధనము లేవి? యని విచారింపగా ప్రత్యక్షము అతీంద్రియార్థములను గోచరింప చేయనందునను, అనుమానము ప్రత్యక్షాపేక్ష మగుట చేతనున్నూ – ఇవి సాధనము లన వీలులేదు. ఇక శబ్దమును సాధనముగా గ్రహించవలెను. అదియు పౌరుషేయమైనచో సజాతీయ పురుషులయందు విశ్వాస ముండదు గాన వారు చెప్పినదాని ననుసరించుట అసంభావితము. దీనిని విచారించి నిరుపాధిక వత్సలుడును దయాసముద్రుడును సర్వశక్తుడు నగు భగవానుడు

అపౌరుషేయము నిత్యనిర్దోషము సకల పురుషార్థబోధకము నగు వేదమును తన నాభికమలమున జన్మించిన చతుర్ముఖుని కుపదేశించెను. ఆ వేదమింత వరకు అవిచ్ఛిన్నముగా పాఠక్రమమున వచ్చుచున్నది. దీని కర్థము దుర్బోధక మగుట వలన వివరణ మపేక్షిత మగుటచేత సర్వేశ్వరుడు మహాత్ముల కొందరి నవతరింపజేసి వారిలో తా నంతఃప్రవిష్టుడై వారి ముఖమున వాటిని వివరించుటకు ప్రవర్తించిన వాడాయెను.

ఆ వివరణములు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు – అని వ్యవహరింపబడుచున్నవి. ఇందు స్మృతులు మానవ పారాశర్యాదులు. ఇవి భగవదారాధన రూపమును ఫలాపేక్షి జనానుగ్రాహకము నగు కర్మ కాండమునకు వ్యాఖ్యారూపములు. ఇతిహాసములు – రామాయణ భారతాదులు. ఇవి మహాపురుష చరిత్ర బోధకములగుచు వేదాంత భాగ వ్యాఖ్యారూపములు. పురాణములు – విష్ణుపురాణ, భాగవతాదులు. ఇవి సర్గాదిలక్షణపంచక సమేతములై వేదాంతార్థ ప్రకాశకములు. ఆగమములు పాంచ రాత్రాదులు. ఇవి దేవతారాధన బోధకములు. ఇందు ఇతిహాసము సాక్షాదుపనిషద్వ్యాఖ్యాన మగుటచే స్మృత్యాదికమున కంటె ప్రశస్తము. ఇందు రామాయణము సీతారామ రూప మానుష వేషధారులగు శ్రీ శ్రియఃపతుల యొక్క చరితమును బోధించు నదియు, చతుర్ముఖ ప్రేరితుడగు వాల్మీకి మహర్షిచే రచింపబడినదియు మోక్షసాధనమగు భగవచ్ఛరణాగతిని సీతా రూపమును ధరించిన శ్రీదేవి యొక్క పురుషకార వైభవమును ప్రతిపాదించునదియునై యున్నది. కనుకనే –

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదఃప్రాచేత సాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా ॥**

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథ కుమారుడుగా నవతరించగా – ప్రమాణము ప్రమేయానుసారి కనుక – ప్రమాణమగు వేదము వాల్మీకి మహర్షి వలన రామాయణ రూపమున నవతరించినదని ప్రశంసించబడి యున్నది.

శ్రీమద్రామాయణము సీతారాముల చరిత్రమైనను ఇందు ప్రధానముగా

సీతాచరిత్రమే చెప్పబడినదనియు, ఇది గొప్పదనియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్" అని వాల్మీకి మహర్షి చెప్పియుండెను. సీతాచరిత్ర దేనికంటె గొప్పది? అనిన రామచరిత్రకంటె – గొప్పదని యభిప్రాయము. పూర్వాచార్య గృహీతమగు నీ క్రింది శ్లోక మీ విషయమును స్పష్టపరచుచున్నది.

**"మాతర్మైథిలి రాక్షసీస్త్వయి తదైవార్ద్రా పరాధాస్త్వయా**
**రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకంతం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః**
**సానస్సాంద్ర మహాగస స్సుఖతు క్షాంతిస్తవా కస్మికీ ॥**

రావణ సంహారానంతరమున హనుమంతుడు సీతా సమీపమునకు వెళ్ళి రాక్షస స్త్రీలు నీ విషయమున అపరాధము చేసి యున్నవారు గాన వీరిని సంహరించుటకై అనుజ్ఞ నీయవలసినదనగా రాజాశ్రితులు రాజాజ్ఞచేతనే గదా ఏపనినైన చేయుట. అట్టి వారి విషయమున కోపించుట యుక్తము కాదని రాక్షసస్త్రీలు తమ రక్షణను ప్రార్థించక పోయినను వారిని రక్షించెను. శ్రీరామచంద్రుడు శరణ ప్రార్థన చేసిన కాకాసుర విభీషణుల రక్షించెను. ఇందువలన రామచరితము కంటె సీతాచరితము గొప్పదను ఆశయము చేతనే "సీతాయా శ్చరితం మహత్" అని చెప్పెను.

ఇట్టి శ్రీరామాయణమును సర్వజనులకు సులభగ్రాహ్య మగునటుల వచన రూపమున వ్రాసి లోకోపకారము గావించినదీ సీతామతల్లిక. సీతమ్మకు సీతాచరితమే మనోహరము ఆనందావహము కదా! కనుకనే భగవచ్చరితము లనేకము లున్నను ప్రథమమున శ్రీరామాయణము వ్రాయబడినది. ఇటుల భగవచ్చరిత బోధకములగు యితర గ్రంథములను కూడ సుగ్రాహ్యములగు నటుల వచన రూపమున వ్రాయుట కీమెకు భగవాను డాయురారోగ్యోత్సాహాదుల నొసంగుగాక!

(సం) **మొలుగు రామానుజాచార్యులు**
**ముగ్గుళ్ళ**

# విషయసూచిక

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ శారదాయై నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

# అయోధ్యా కాండము

కం॥ శ్రీమత్సుగుణాభరణా!
ధీమత్సరణ ప్రసూన దీపిత చరణా!
స్వామీ! చిద చిద్ద్రవిణా!
శ్రీమహితా! యొంటి మిట్ట సీతారమణా!

## మొదటి సర్గము

**భరతుడు శత్రుఘ్నునితో దన మేనమామ యింటికి వెళ్లుట :**

కైక పుత్రుడగు భరతుడు తనయందనురక్తుడును పవిత్రుడును నిత్యశత్రుఘ్నుడును తనకు తమ్ముడును నగు శత్రుఘ్నుని తనవెంట తీసికొని మేనమామ యింటికి వెడలెను. (భరతుడు భగవత్పరతంత్రుడు. శత్రుఘ్నుడు భాగవత పరతంత్రుడు) మేనమామ తమ్ము కన్నబిడ్డల వలె చూచుచుండగా గొప్పవైన సత్కారములను చేయుచుండగా ప్రేమతో జూచుచుండగా తమ్మునితో గలసి భరతుడు సుఖముగా నుండెను. అయోధ్యలో కంటె నధికముగా

సుఖపరంపరలను బొందుచున్నను సచ్చరితులగు భరత శత్రుఘ్నులు ఎల్లప్పుడును వృద్ధుడైన తమ తండ్రినే తలంచుచుండిరి. కోసల రాజైన దశరథుడును దూరదేశమున నున్న ఇంద్రవరుణ సమానులైన భరత శత్రుఘ్నులనే స్మరించుచుండెను. దశరథునకు తన నాలుగు బాహువులో యనునట్లున్న పురుషసింహులగు నలువురు తనయులు మనస్సునకు మిక్కిలి యిష్టులైరి.

**శ్రీరామచంద్ర కల్యాణ గుణ వర్ణనము :**

ఆ నలువురిలో మహానుభావుడును, అమితమైన తేజస్సు గలవాడును భూతగణములందు బ్రహ్మవలె గుణాఢ్యుడునునగు రాముడు తండ్రియైన దశరథునకు మిక్కిలి మోదమును చేకూర్చుచుండెను. గర్వితుడైన రావణుని జంపుటకై దేవబృందముచే స్తోత్రము చేయబడినవాడై సనాతనుడగు విష్ణువే ధరయందు నరాకృతితో నిట్లు జన్మించెను. అమితమైన తేజస్సుతో ప్రకాశించు ఆ పుత్రునిచే కౌసల్య దేవలోకాధిపతియు వజ్రహస్తుడు నగు నింద్రునిచే వెలుగొందు అదితి వలె ఎక్కువైన ప్రకాశమును బొందెను. అందమునను భుజపరాక్రమమునందును అసూయ లేకుండుటయందును జగత్తునం దెవ్వరును తండ్రిని బోలినవాడగు నా రఘునందనుని బోలజాలకుండిరి. ఎవరైనను తనకు నొప్పి కలిగించు మాటలాడినను తాను కఠినమైన మాటలను పలుకడు. స్థిరమైన శాంతితో నవ్వుచు మృదువైన సమాధాన మొసగును. అతడు విజ్ఞుడగుటచే నెవ్వరైనను ఎప్పుడైన కొంచె ముపకారము చేసిన నెల్లప్పుడు దానిని స్మరించుచు, ఇతరులు చేసిన యపకారము లెన్ని యున్నను వానిని స్మరించకుండును. తాను విలువిద్య నేర్చునప్పుడైనను, జ్ఞానముచే గాని, వయస్సుచే గాని, శీలముచే గాని, విశిష్టగుణములచే గాని వృద్ధులైన సజ్జనులు తన్ను జూడవచ్చిన వారితో సంప్రదాయ ప్రకారముగా నిష్టాగోష్ఠిని సలుపుచుండును. తియ్యనైన ఇంపైన మాటలతో తానే ముందు పలుకరించును. తన బలముచే శత్రువుల నణచినను ధీమంతుడగు నతడు అహంకరింపడు. డంబములు పల్కడు. నిశ్చలమైన

మనస్సుతో ముసలివారలను, పండితులను పూజించును. తన సుగుణములచే ప్రజల నానందపరచును. ప్రజానురాగమునకు బాత్రుడగును. అతడు దయ గలవాడు. కోపమును తనలోనే నిలుపుకొనగలవాడు. బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మణులను పూజలతో తృప్తి నొందించును. బాధనొందువారిని జూచి తానును బాధనొంది రక్షించును. ధర్మమును దప్పనివాడు. తన నియమముల నెన్నడును వీడనివాడు. నిత్య శుచిత్వము గలవాడు. ఆదరముతో తన వంశము యొక్క ప్రతిష్ఠను కాపాడువాడు. స్వధర్మమును క్షాత్రధర్మమును గౌరవించును. దీనిచే గొప్ప కీర్తి కల్గుననియు స్వర్గాది పుణ్యలోకములు లభించుననియు తన మనమున తలచును. అమంగళములగు పనులకు వెళ్లడు. విద్యలకు నిధియైనవాడు. ప్రొద్దు గడచుటకైనను ధర్మ విరుద్ధములైన కథలను చెప్పడు. వినడు. ఉత్తరోత్తర యుక్తులతో బృహస్పతి వలె చక్కగా మాటాడును. రోగము లెప్పుడు నంటనివాడు. మహాబలాఢ్యుడు. దేశకాలముల నెఱిగినవాడు. మధ్యవయస్కుడు. ప్రశస్తమైన మాటలు గలవాడు. చూడగానే ఎదుటివారి చేవ గుర్తింపగలవాడు. గొప్ప త్యాగము గలవాడు. సద్గుణములచే సాటిలేని వాడని నిశ్చయింప బడినవాడు. ఇట్టి మంచి గుణములకు నిధియైన రాముడు జనుల మనస్సులను రంజింపజేయువాడై ప్రజలకందఱకు తమలోనున్న ప్రాణముగాక వెలుపలి ప్రాణమువలెనుండెను. ప్రజలందఱు నెల్లప్పుడును రామా! రామా! యని జపించు చుందురు. రాముడు వ్రతములను విద్యలను బూర్తిగావించి షడంగములతో గూడిన వేదములను చదివెను. అస్త్రశస్త్ర విద్యలందు తన తండ్రియైన దశరథునే మించిపోయెను. తండ్రి వంశమును తల్లి వంశమును భూమిపై గొప్ప కీర్తి పొందునట్లొనర్చెను. సజ్జనుడు – దైన్యరహితుడు – సత్యవాది – ఋజువర్తనుడు నగు ధర్మార్థములను తెలిసిన బ్రాహ్మణుల చేతను, శిష్టులగు వృద్ధులచేతను సుశిక్షితుడైనవాడు. ధర్మార్థ కామములను త్రివర్గము నెఱిగినవాడు. లౌకికములు శాస్త్రీయములునైన యాచారములను తెలిసినవాడు. వానిని నడుప సమర్థుడు. ఎదురులేనివాడు. గంభీరుడు. గుప్తముగా

మంత్రాలోచనము చేయువాడు. సుఖదుఃఖములను సమముగా జూచువాడు. సంపాదనమునకు, వ్యయము చేయుటకును తగిన కాలములు తెలిసిన గొప్ప మేధావంతుడు. గట్టి భక్తి గలవాడు. స్థిరమైన బుద్ధి గలవాడు. కఠినమైన మాటలను నాలుక తుదకు రానీయడు. దుష్టమైన ధనము నాశించడు. దుష్టజనులను దరిజేరనీయడు. మందబుద్ధి గలవాడు కాడు. ప్రమత్తుడు కాడు. తన తప్పును ఎదుటివారి తప్పును తెలిసికొనగలవాడు. శాస్త్రములు చక్కగా జదివినవాడు. ఎవరికైనను మేలు కోరువాడు. గుణములకు నిధియైనవాడు. హెచ్చుతగ్గు లెఱిగినవాడు. న్యాయము ననుసరించి నిగ్రహానుగ్రహముల జేయువాడు. మంచివారిని పోషించుటయందును, శత్రువులను నిగ్రహించుట యందును నేర్పు గలవాడు. సంపాదించుటయందు సమర్థుడు. అవసరమును బట్టి ఖర్చు చేయువాడు. శాస్త్రములందును తదితర విద్యలందును శ్రేష్ఠుడు. ధర్మార్థములను దెలిసి సుఖించువాడు. అలసుడు కాడు. వైహారికములైన శిల్పాది విద్యలందు నేర్పరి. ధనమును తగు విధముగా విభజించి వ్యయించుట తెలిసినవాడు. ఏనుగులను గుఱ్ఱముల నెక్క నేర్చినవాడు. దుష్టము లైనచో వానిని లొంగదీయగలవాడు. ధనువు పట్టెడు వారిలోనెల్ల శ్రేష్ఠుడు. అతిరథులలో అందరు మెచ్చదగినవాడు. తనయంతట సైన్యము నడపించువాడు. శత్రువుల కెదురుగా తానే ముందు పోవువాడు. కోపించినచో స్వర్గలోక వాసులైన దేవతలు వచ్చి యుద్ధమునకు తలపడినను వారలను చీకాకుపరచగల జయింపరాని పరాక్రమము గలవాడు. అసూయచే క్రుంగిపోడు. కోపమును జయించినవాడు. గర్వమను మాట మనస్సునందు తెలియని వాడు. మహాబలాఢ్యుడయినను దేనిని అవమానింపడు. కాలవశముగా వచ్చు పనులకు లొంగిపోడు. ద్వేషమును మనస్సునకు రానీయడు. ఎదుటివారు వృద్ధిని పొందిన సంతోషించువాడు. బుద్ధియందు బృహస్పతిని బోలినవాడు. పరాక్రమమున స్వర్గపతియైన యింద్రుని బోలినవాడు. ముల్లోకముల నానందపరచువాడు. సూర్యవంశమున బుట్టిన

వాడు. సర్వలోకములందు పూజింపదగినవాడు. శాంతములు, ప్రజల కానందమును గలిగించునవి, తండ్రి కాహ్లాదమిడునవి, దాంతములునయిన గుణములచే నా రామచంద్రుడు కాంతులతో దినకాంతుడగు సూర్యునివలె మిక్కిలి ప్రకాశించెను. ఇట్టి పవిత్రుని, నియమ వ్రతములు గలవానిని, చెనకరాని పరాక్రమము గలవానిని, సుగుణనిధిని, మహాప్రకాశుని, లోకపాలురతో సాగివచ్చువానిని, ఆ రామచంద్రుని తనకు ప్రేమపాత్రుడగు భర్తగా భూకాంత కోరుకొనెను.

## దశరథుడు రామచంద్రుని యువరాజు జేయ యోజించుట :

సాటిలేని గుణగణములు గల తన తనయుని గాంచి దశరథుడు ఎట్టులైనను నేను బ్రతికి యుండగనే రాముని యువరాజుగా చేయవలెను. నేను ముసలివాడనైతిని. వీని యెడ నాకు ప్రేమ యెక్కువ. ఏ విధముగా పట్టాభిషేకమును జేతునని యాలోచించుచు, రాముని రాజుగా జేయుటయే నాకు మిక్కిలి యిష్టము. ఇతడు ప్రజలయందు దయగలవాడై యుండును. ప్రఖ్యాతిగా వర్షమును గురియించు ఇంద్రునివలె లోకులందరకు ప్రీతి గలిగించును. వారు నాయందుకంటె వానియందు అభిమానము కలిగియుండిరి. పరాక్రమమునందు యముని నింద్రుని బోలినవాడు. బుద్ధియందు బృహస్పతి యంతవాడు. ధైర్యమున మేరువును బోలినవాడు. నాకంటెను గుణవంతుడు. సచ్చరిత్రుండైన నా కుమారుడు రాముడు ఈ రాజ్యము నేలుచుండగా ఈ వయస్సులో నేను, కన్నులార చూచి స్వర్గమున కేగు భాగ్యము కలుగునా? యని తలంచినవాడై అనన్య సామాన్యములైన గుణములచే రాజులందరిలో నధికుడగు రాముని యువరాజుగా చేయవలెనని దశరథుడు తన మంత్రులతో ఆలోచించి సంకల్పించెను. భూమియందును ఆకసమందును కనిపించు చున్న యపశకునములను జూచియు తన శరీరము నావరించిన ముదిమిని జూచియు ప్రాజ్ఞుడైన దశరథు డీ నిర్ణయమునకు వచ్చెను. చంద్రుని బోలు ముఖము గలవాడును, తన శోకమును పోగొట్టువాడును, సుగుణవంతుడునునగు రామునకు ప్రజల యనురాగము సిద్ధించుటను తలపోసి; తనకును, ప్రజలకును శ్రేయస్సును గలుగజేయు వాడైన రాముని తొందరగా రాజును జేయ గోరుచుండెను. తనకు కాలము సమీపించు చుండెనని దశరథుడు

తన మదిలో తలంచుచుండెను.

## దశరథుడు రాముని యువరాజు చేయ పౌరులతో నాలోచించుట :

ఈ విషయము నాలోచించుటకై దశరథుడు సామంతరాజులను, ముఖ్యులగు వారందరిని, పౌరజనపదులను పిలువ బంపెను. దూరమున నున్న బందుగులైన కేకయ రాజును, జనకరాజును చెవుల పండువుగా తరువాతనే వినెదరుగాక యని దూరదేశ మగుటచే వారిని దశరథుడు పిలువ బంపలేదు. (కేకయ రాజు కైక తండ్రి, జనకుడు సీత తండ్రి) అట్లు పిలుపును వినివచ్చిన వారందరికిని నివసించుటకు విడిదులనిచ్చి యథేచ్ఛముగా సొమ్ములనొసగి, ప్రజలందరకు దర్శనమిచ్చు రీతిగా తరువాత రాజు దర్శన మిచ్చెను. శత్రు విజయుడగు దశరథుడు కొలువు తీర్చియుండగా వరుసగా రాజులందఱు వచ్చి రాజు చూపించిన ఆసనములయందు తనను గొలిచియుండగా దశరథుడు దేవతలతో గూడిన యింద్రునివలె ప్రకాశించెను.



# రెండవ సర్గము

**దశరథునుపన్యాసము :**

దశరథ మహారాజు నిండు కొలువైయుండి సభలో నున్న వారందరిని జూచి యిట్లు చెప్పఁదొడగెను. ఆ పలుకులు సాటిలేని యానందమును గూర్చునవియు, దుందుభి ధ్వని వంటివియు, గంభీరములును, రాజయోగ్యములును మాధురీధుర్యములునై యొప్పారెను.

"నా పూర్వులెల్లరును ప్రజలను తమ కన్నబిడ్డల వలె నెల్లప్పుడును రక్షించిరి. ఇది మీకందఱకును దెలిసిన విషయమే కదా! యిక్ష్వాకు వంశమున బుట్టిన నేను నా పూర్వులచే సౌఖ్య కరముగా పాలింపబడిన యీ జగమున కింకను నెక్కుడైన శ్రేయస్సును సమకూర్చు నాలోచన చేయుచున్నాను. మా పెద్దలు నడచిన మార్గమున హెచ్చరికతో యథాశక్తి ప్రజలను గాపాడితిని. అది మీ మనసులకు దెలిసిన సంగతియే కదా! ఏ సమయము నందైనను భూతలమునకు మేలు చేయగోరు నా యీ శరీరము ఖ్యాతితో నీ తెల్ల గొడుగు నీడలో నుండి దుర్భరమైన ముసలితనమును బొందినది. అఱువది వేల సంవత్సరము లేకొఱత లేకుండ గడచినవి. శరీరమున శక్తి నశించినది. తెఱపు మఱపు కలుగక ముందే ఈ భారమును దించి హాయిగా నుండ దలచితిని.

ఎంతో ధైర్య శౌర్యములు గలవాడు, ఇంద్రియములను జయించినవాడు ఈ వసుంధరను భరింప గలవాడు ధర్మము తెలిసినవాడు మాత్రమే తాల్ప వలసిన ఈ గొప్పదైన రాజ్యభారమును మోసి మోసి యిక విశ్రాంతి తీసికొనవలెనన్న కోరిక కలిగినది. ఈ పనికి మీరందఱు నా కనుజ్ఞనిండు. ఇచ్చటనున్న బ్రాహ్మణ శ్రేష్ఠులందఱకు నిష్టమైనచో, మీరందఱు నిష్టముతో

నొప్పుకొన్నచో నా జ్యేష్ఠ కుమారుడైన రాముని, శత్రువుల బారద్రోల గలవానిని, నింద్రసమానుని, ధర్మము తెలిసినవానిని, మహానుభావుని, సర్వగుణములందు నాతో సమానుని, పుష్యమితో గూడిన పూర్ణచంద్రుని బోలువానిని, మేటి విల్కానిని, నరశ్రేష్ఠుని యువరాజుగా నియమింప దలచితిని. ఎవ్వడధిపతియైనచో ముజ్జగములైనను నాధవత్తరములై (ఉత్తమ రాజ పరిపాలితములై) ప్రకాశించునో అట్టి శ్రీమంతుడైన లక్ష్మణుని యన్నయైన రాముడు ఈ భూమండలమునకు రాజగుట తగియుండునుగదా! ఈ నిమిషము నందే యీ భూభారమును రాముని యందు నిల్పి, ఈ భూమికి గొప్పదైన శ్రేయస్సు గలుగజేసి భారము తొలగుటచే నేనును మిక్కిలి సుఖించెదను. ఓ మహాజనులారా! ఇది తగిన ప్రయోజనమును గలిగించున దైనచో, ఇది మంచి యాలోచనయేయైన యెడల, దీనిని పూర్తిచేయుట ఎటులో నాకు దెలియ జేయుడు. ఇంతకంటె మేలైనది యున్నచో నాలోచింపుడు. ప్రేమచే నిట్లంటిని. మధ్యస్థులగువారు హితము నాలోచించినచో ఆత్మీయులగువారి యాలోచనకంటె మేలుగా నుండును." అని దశరథ మహారాజు పలుకగా గొప్ప సంతోషమును బొంది రాజులందఱును, వర్షించు మేఘమును జూచి భూమియందంతట కేకారవములు చేయు నెమళుల సమూహమువలె మేలు మేలని మెచ్చుకొను శబ్దములతో నాసభయంతయు ప్రతిధ్వనులు చేయుచు కంపనమును బొందెను.

**పౌరులు శ్రీరాముడు యువరాజగుటకు సమ్మతించుట :**

అంతట ధర్మార్థములను దెలిసిన రాజుయొక్క వాక్యములను వినినవారై బ్రాహ్మణ శ్రేష్ఠులును పౌర జనపదులును గలిసి యాలోచించి వృద్ధనృపతితో ఏక వాక్యముగ నిట్లు చెప్పిరి. "రాజా! ఎన్నియో యేండ్లు పూండ్లు గడచినవి. నీవు వృద్ధుడవైతివి. ఈ భూతలమునకు రామచంద్రుని నందముగా యువరాజుగా జేయుమని నిన్ను వేడుకొను చున్నాము. మహాబాహుడును,

రఘువంశ శ్రేష్ఠుడును, భయంకరమగు బలము గలవాడును నగు శ్రీరాముని, పట్టపుటేనుగుపై నెక్కిన వానిగను ఛత్రముతో శోభిల్లువానిగను జూడ గోరుచున్నాము.” అని వారందఱు పలుకగా విని వారి మనస్సులలో నుండు కోరికలను దెలిసికొన గోరినవాడై ఏమియు దెలియనివానివలె దశరథ మహారాజు వారి నెల్లరను జూచి యిట్లనెను. “ఓ జనులారా నా మాటను మీరు వినియు వినకముందే యెక్కుడు కోరికతో రాముని రాజుగా గోరితిరే. మీ కోరిక జూడగా నా కనుమానము కలుగుచున్నది. నిజము చెప్పుడు. నేను ధర్మాత్ముడను గానా? ప్రజలకు సుఖమును కలుగజేయలేదా? మీ యిష్టము ననుసరించి నేను నడవలేదా? నన్ను విడచి నా కుమారుని రాజుగా గోరుటకు కారణంబేమి” యను దశరథుని మాటలను విన్నవారై వారందఱొక్కమాటగా నిట్లనిరి.

**పౌరులు శ్రీరాముని గుణములు వర్ణించుట :**

“ఓ దశరథ మహారాజా! దేవసమానుడగు రాముని యందనేకములగు కల్యాణ గుణములు గలవు. ఆ గుణము లానందమును కలుగజేయునవి. వానిని మేము చెప్పెదము. చెవులపండువుగా వినవయ్యా! శ్రీరామచంద్రుడు సత్యపరాక్రముడు. దివ్యగుణములచే నింద్రునకు సాటియగువాడు. ఇక్ష్వాకు కులమునందందఱికంటె గొప్పవాడు, ఋజుత్వము, ధర్మము గలవాడు. లోకులచే పొగడబడువాడు. రామునివలననే ధర్మమును సంపదయును పుట్టినవి. ప్రజల నానందింపజేయుటలో చంద్రుని పోలినవాడు. స్వచ్ఛమైన ఓరిమియందు భూమిని బోలినవాడు, బుద్ధియందు బృహస్పతితో సమానుడు. పరాక్రమమున నింద్రునకు సాటియైనవాడు. సర్వధర్మములను దెలిసినవాడు. సత్యసంధుడు. శీలవంతుడు. అసూయ లేనివాడు. తనయందు దప్పుచేసిన వారినైన నాదరముతో జూచువాడు. దుఃఖములో నున్నవారి నూరడించువాడు. తనకు చేసిన యుపకారమును మరువనివాడు. ఇంద్రియములను జయించినవాడు.

చాల మెత్తని మనస్సు గలవాడు. స్థిరచిత్తుడు. మధుర భాషణములు గలవాడు. సత్యవాది. అందరి మాటలను వినువాడు. పెద్దవారిని వృద్ధులను బ్రాహ్మణులను యథావిధిగా బూజించువాడు. రణమునందు దానమునందు నుత్సాహము గలవాడు. దేవతలకు, నరులకు రాక్షసులకు దెలియని యస్త్రములయందు నేర్పరి. సాంగముగా వేదములు తెలిసిన గొప్పవాడు. దేవతల వ్రతములు చేయుటలో నిష్ణాతుడు. అద్భుతముగ సంగీతము తెలిసినవాడు. బుద్ధిమంతుల చేత పొగడబడువాడు. మంచి మనస్సు గలవాడు. మంగళకరమగు వంశమున జనించినవాడు. సాటిలేని సద్గుణములు గలవాడు. ఎల్లప్పుడు నిర్మలమైనవాడు. పల్లెలను పట్టణములను గాచుటకై లక్ష్మణునితో గూడి యుద్ధములకు వెడలి శత్రువులను జయింపక తిరిగిరానివాడు సుమా రాముడు. శరణన్నవారిని దయతో గాపాడువాడు. ఎచ్చటికైనను యుద్ధమునకు బోయి తిరిగి వచ్చునప్పుడు రథముమీద గాని యేనుగుమీద గాని తన యిల్లు చేరక ముందే పురజను లందఱను తనవారిని వలె బిలిచి వారి క్షేమముల నడుగును. మీ కుమారులు సంతోషముగ నున్నారా? మీ భార్యలు సుఖముగా నున్నారా? సేవకులు శిష్యులు సుఖులేనా? మీ యగ్నిహోత్రములు క్షేమముగా జరుగుచున్నవా? మీ శిష్యులు మీ యాజ్ఞ మీరుటలేదు గదా! అల్లుండ్రు ఆడపడచులు కుశలురేనా? కోడండ్రు సౌఖ్యముగనున్నారా? అని తన బిడ్డలను తండ్రి యడుగునట్లుగా గ్రుచ్చి గ్రుచ్చి అందరను పేరు పేరున కుతూహలముగా అడుగువాడు. జనులకు గష్టములు గలిగిన దానెక్కువగ దుఃఖమును పొందెడువాడు. జనమునకు సంతోషము గలిగినపుడు తాను గూడ తండ్రివలె సంతోషించును. ఎక్కువైన కష్టములు గలిగినను సత్యవాక్యమును తప్పని నేర్పు గలవాడు. శత్రువుల నెదిరించు నప్పుడింద్రధనువు వంటి పెద్దవిల్లు ధరియించునను బిరుదు గలవాడు. రోషములో గాని సంతోషములో గాని పొల్లుపోవని మాటల బల్కువాడు. ఆ నారాయణుఁడే

ప్రత్యక్షమైనాడా? యనిపించు గొప్ప తేజస్సు గలవాడు. సూటి తప్పక బాణమున వదలు నేర్పుగలవాడు. మంచి యుక్తులతో మాటలాడుట యందు గురుని బోలువాడు. ధర్మము తప్పని మాటలు గలవాడు. దేవతల రాజైన యింద్రుడు కూడ నీతనికి సమానము గాడు. సొంపైన విండ్లను బోలిన కనుబొమలు గలవాడు. విషయ సుఖములకై చపలత్వము పొందనివాడు. అహంకారము లేనివాడు. ఎక్కువైన మహిమ గలవాడు. ఈ లోకము నొక్కటి నేలుటయేమి? మూడు లోకములనైన నేలగలవాడు. వధింపదగినవారినే వధించును గాని చంపదగని వారి జోలికైనను బోనివాడు. అందులకే అతడు సత్యశూరుడనుట. కోరిన కోరికలను దప్పక యీడేర్చుటచే ఎల్లరకు సంతోషము గలిగించును. భాస్వంతుడు తన కిరణములతోవలె రాముడు తనయొక్క శాంతములు ప్రజల కిష్టములు నగు గుణములతో ప్రకాశించును. అటువంటి రాముని సత్య శౌర్యములకు నిధియైనవానిని సకల సద్గుణములు గలిగి సజ్జనులచేత నుతింపబడువానిని, లోకపాలురను బోలినవానిని ప్రఖ్యాతిగా భూదేవి తన భర్తగా కోరినది. (రాజులందఱు భూమిని గోరుదురు. భూమియే రాముని కామించుచున్నది.) ఈ ప్రకారమైన మంచి గుణములు గల శ్రీరాముని కుమారునిగా కన్నావు. ఓ రాజా! యెంత పుణ్యము చేసితివయ్యా! మరీచికి కశ్యపుని వలె నీ కితడు జన్మించెను. “ఆ శ్రీరామునకు సుఖమగు గాక. రాముడు చిరంజీవి యగు గాక. రాముడు నిరామయుండగు గావుత. ఆ రామునకు దేహబలమెల్లప్పుడు గలుగు గావుత.” అని దేవతలు గంధర్వులు, మానవులు, పన్నగములు రాష్ట్రములందును జనపదములందును పట్టణము లందును ఇతర దేశములందును మన రాజ్యమునను ఎల్లప్పుడు గోరుచుందురు. శ్రీరాముని మేలును గోరినవారై నగరములను రాష్ట్రములందు, పట్టణములందు నెల్లవేళలను బ్రతినిత్యము దేవతలను నియమముతో సేవించుచుందురు. స్త్రీలును

ముదుసలివారును యువతులును గ్రామజనులును, నగర జనులును రామునే గాని యన్యులను స్మరింపరు. నల్లకలువలవంటి శరీర చ్ఛాయ గలవాడును, సౌందర్యముచే మదనుని జయించినవాడును, కమ్మని గుణములు గలవాడును, తామరలవంటి నేత్రములు గలవాడును, శత్రువుల గర్వమును నశింపజేయు వాడును, జనుల నాల్కల యందు నివసించువాడును, దయకు పాదైన వాడును, సుందరమైన కపోలములు గలవాడును, నవయవనమును పొందిన వాడును, సాటిలేని కీర్తి గలవాడును, సముద్రుని బోలు గాంభీర్యము గలవాడును, పర్వతమును బోలు ధీరత్వము గలవాడును, సజ్జనులతో స్నేహముగ నుండువాడును, సత్యధర్మములతో గూడిన వాడును, మనోహరముగా మృదువుగా మాటలాడువాడును, దోషములను బారద్రోలు వాడును నగు రాముడు యువరాజ పదవి యందుండగా ఆ దేవతలకు దేవుడైన విష్ణువు వంటి అతనిని జూడగోరుచున్నాము. మా యొక్క శ్రేయస్సును గోరినవాడవై మా కోరికను వేగముగా దీర్పవే"యని సంతసమును బొందినవారై చేతులు జోడించి యెల్ల ప్రజలును చెప్పగా విని దశరథుడు మనస్సులో సంతోషించి తన యానందమును బ్రకటించుచు నిట్లు పలికెను.



# మూడవ సర్గము

## పట్టాభిషేక సంభారములు గూర్ప దశరథుడాజ్ఞ యిచ్చుట :

"ఏమి నాయదృష్టము. ఓ ఆర్యులారా! నా తనయుని యౌవరాజ్యాభిషిక్తుని జేయుటకు సమ్మతిని మీరందఱు నేకకంఠముతో జెప్పుటచేత నేను మిక్కిలి సంతోషమును బొందితిని" అని వారినందఱిని సత్కారములతో తృప్తిగావించి వామదేవ వసిష్ఠులను జూచి "మీరు శ్రీరఘూత్తముని పట్టాభిషేకమునకు వలయు సంభారములను సమకూర్పవలెను. ఇది చైత్రమాసము. సర్వసుఖములనిచ్చుట కనువగు కాలము. వనములన్నియు ఫలములతోను పుష్పములతోను నిండి యున్నవి. ఇది పవిత్రమగు కాలము. ఇప్పుడే నా పుత్రుని యువరాజుగా జేయదగును" అని దశరథ మహారాజు చెప్పి యూరకుండగా మంచిది మంచిది యని జనులందఱు తొందర తొందరగా పలికిరి. ఆ నినాద మణగగానే మెల్లని మాటలతో రాజు మునులలో శ్రేష్ఠుడైన వసిష్ఠునితో నిట్లు చెప్పెను. 'శ్రీరామాభిషేకమునకు మీరలుపకరణములను సిద్ధము చేయింపుడు' అని పలుకగా ముని యెదురుగానున్న బుద్ధిమంతులగు మంత్రివర్యుల దిక్కు చూచి ..

## వసిష్ఠుడు మంత్రులతో వలసిన సంభారముల జెప్పుట :

"బంగారు, రత్నములు, కానుకలు, ఓషధులు, పేలాలును, తెల్లనైన మాలికలును, తేనెయును, కమ్మగా గాచిన నేయియును, నూతన వస్త్రములును, రథములును, ధ్వజములును, సర్వవిధములైన ఆయుధములును, చతురంగ బలంబులును, భద్రగజమును, తెల్ల చామరములును, తెల్లనైన గొడుగును, నూఱు బంగారు కుండలును, బంగారు కొమ్ములు గల ఎద్దును సంపూర్ణముగా

నున్న పెద్దపులి చర్మమొకటియు, చందనము మొదలైన హోమమున కుపయోగించు ద్రవ్యములును తెల్లవారకముందుగా రాజగృహములో దేవమందిరమందు జేర్పింపుడు” అని చెప్పి మరియు నిట్లనెను. “పుష్ప హారములతోను, మంచి గంధముతోను అంతఃపుర ద్వారములందముగా నుండునట్లలంక రింపుడు. పన్నీటిని కలయంపిగా జల్లుడు. సుగంధము వ్యాపించునట్లుగా ధూపములు వేయింపుడు. పాలుపెరుగులతో అన్నములను తెల్లవారగనే నూరువేలమంది బ్రాహ్మణులకు భక్తిశ్రద్ధలతో పెట్టవలయును. రేపటి యుదయమున మీరలు బ్రాహ్మణులను బిలిపించి యోపికతో దక్షిణలతో పేలాలను నేతిని పెరుగును ఈవలెను. సూర్యోదయమయిన వెంటనే స్వస్తివాచనము జరుగవలెను సుమండీ. దాని కోసము ఓ పూర్వాత్ములారా! గొప్పవారైన బ్రాహ్మణులను బిలిపింపుడు. పీటలను సిద్ధముసేయుఁడు. తోరణములు గట్టింపుడు. అన్ని మందిరములందును సున్నములను గొట్టింపుడు. దట్టముగా కలయంపి చల్లింపుడు. ముగ్గులను బెట్టింపుడు. తాళములతో, నర్తకవర్గముతో గూడ నందముగ నలంకరించుకొనిన వేశ్యలను రాజభవనము యొక్క రెండవ కక్ష్యయందుండునట్లు చేయుడు. దేవాలయములలో బ్రాహ్మణులు పూజలు చేయునట్లు చేయుడు. సత్రముల యందు తగురీతిని వలసినట్టు లన్నము మొదలయినవి పెట్టవలెను. రామాభిషేకోత్సవము నందు ప్రకాశించెడు ఖడ్గములతో నొప్పుయోధులు మంచి వస్త్రములు ధరించి ఠీవిగా రాజభవన ప్రాంగణమునందు బ్రవేశింపవలయును.” ఈ ప్రకారముగా కార్యము లన్నియును నియమించి రాజునకు తాను జేయవలసిన పనులను జెప్పి యచటినుండియే యన్ని పనులను చేయించెను. ఈ విధముగా అన్ని కార్యములను స్థిరపరచి వామదేవ వసిష్ఠులు దశరథ రాజును జూచి అన్ని పనులను గావించితిమని చెప్పగా నతడు సంతోషించెను.

**దశరథుడు శ్రీరాముని సభకు బిలిపించుట :**

అంత దశరథుడు సుమంత్రుని జూచి సుకృతవంతుడయిన రామచంద్రుని

నాయొద్దకు దీసికొనిరమ్మన సుమంత్రుడు వెంటనే శ్రీరాముని దీసికొని వచ్చుటకు వెడలెను. దశరథుడు నాల్గుదిక్కులనున్న రాజులును మ్లేచ్ఛులును శైలవాసులును, వనవాసులును తనను సేవించు చుండగా, దేవతలచే సేవింపబడుచున్న దేవేంద్రుడో యనునట్లు ప్రకాశించుచు సాటిలేని మహా ప్రాసాదమున నుండి నిర్మలమైన రథమునందు ప్రకాశించుచున్నవాడును, మనోజ్ఞ గుణములు గలవాడును, మదగజేంద్ర గమనుడును, పద్మనయనుడును, ఆజానుబాహు డును, నల్లని మేఘముతో సమానమైన మేనిఛాయ గలవాడును, చంద్రబింబముతో సమానమైన ముఖకాంతి గలవాడును, గాంభీర్య గుణ నిలయుడును, గంధర్వరాజ తుల్యుడును, దయారసముచే సాటిలేనివాడును, సన్నుతింపదగిన స్వభావము గలవాడును, ప్రశస్తమైన సత్వ గుణము గలవాడును, నౌదార్యము గలవాడును, ఎల్లరను రక్షించుటయం దుత్సాహము గలవాడును, పర్వతమువలె ధీరుడును, లోకుల తాపములను పోగొట్టు వాడును, భయంకరమగు వేసవిచే తపించెడు భూ ప్రజకు సంతోషమొసగు వర్షించు మేఘము వంటివాడును, గొప్పనైన రూపము, ఔదార్యము, సుగుణములు కలవాడగుటచే పురుషుల మనస్సులనైనను ఆకర్షించువాడుననగు శ్రీరాముని జూచుచు, చూచుచు నెంతయోసేపు చూచియు సంతృప్తిలేక మైమరచియుండగా, రాముడెక్కిన రథము నగరి సింహద్వారమును జేరెను. అంతట సుమంత్రుడు కైదండనిచ్చి సీతాకాంతుని రథము నుండి క్రిందికి దించి, తండ్రిని జూడబోవు చున్న ఆ దేవసదృశుని వెనుక చేతులు జోడించి చనుచుండెను. తన తండ్రియైన దశరథుని జూడవలెనను కోరికతో జానకీపతియగు రాముడు, ఆ రాజు ఉన్న రాజభవనోపరి భాగమునెక్కి వినయముతో చేతులు జోడించి ఆయనను సమీపించెను. దీపించిన భక్తితో “రాముడను వచ్చితిని” అని చెప్పి సాష్టాంగ ప్రణామ మొనరించి నిలువగా కుమారుని చూచి రాజు సంతోషముతో గౌగిలించుకొని రత్నఖచితమైన బంగారపు టాసనమునందు కూర్చుండుమని

రాముని ప్రేమతో నాజ్ఞాపించెను. సూర్యుడుదయించు నప్పుడు మేరు పర్వతమును బ్రకాశింపజేయు చందమున ఆ గొప్పదైన యాసనమును తన గొప్ప తేజముతో రాముడు ప్రకాశింపజేసెను. అనేకములగు చుక్కలచే ప్రకాశించు శరత్కాలపు టాకాశము చంద్రునిచేత ప్రకాశించునట్లు కౌసల్యా తనయుడైన రామునిచేత ఆ సభ ప్రకాశించెను. అద్దములో చూడనగు తన ప్రతిబింబమో అనునట్లు తన రూపము అచ్చు గ్రుద్దినట్లున్న ముద్దుల కుమారుడగు రాముని జూచి తన మనస్సులో దశరథుడు చాల మురిసెను. చిన్న చిరునవ్వు మనోజ్ఞముగా ముఖమునకు వన్నెపెట్టినట్లు సొగసు గుల్కుచుండగా తన చిన్నారి సుతుని గన్నులార గాంచుచు విష్ణుమూర్తికి కశ్యపుడు చెప్పునట్లుగా దశరథుడు ఇట్లు చెప్పదొడగెను.

**దశరథుడు శ్రీరామునకు దన యభిప్రాయము దెల్పుట :**

"నాయనా! రామచంద్రా! అనురూప గుణవతి యగు నా పట్టపుదేవి యందు సుగుణవంతుడగు కుమారుని నిన్ను గంటిని. నీవును నీ యమేయములగు గొప్ప గుణములచేత ప్రజల మెప్పును బొందితివి. ఈ పుష్యమీ నక్షత్రము నందే ఓ కుమారా గ్రణీ! నిన్ను యువరాజుగాఁ జేయవలయునని తలంచితిని నీవు స్వభావముచేతనే వినయము, సుజన వర్ణితములగు సుగుణములు గలవాడవు. నరులలో నీకే విధముగను సరితూగువారు లేరు. నే నెఱుగుదును. నీ వెఱుగని నీతులెందైన నున్నవా? ఓ కుమారా! నేను నీకు క్రొత్తగా నేవి నేర్పగలను? ఆదరముచేతను అధికమగు పుత్రవాత్సల్యము చేతను నేను నీకు కొన్ని చెప్పుదును. వినుము. వినయము గలవాడవై, ఇంద్రియములను జయించినవాడవై, ఎల్లప్పుడు మంచి శీలము గలవాడవై అభివృద్ధి నందుము. కామ క్రోధములు గలిగించునట్టి దుర్వ్యసనములందు అనురక్తుడవు గాకుము. పరోక్షముగను ప్రత్యక్షముగను విషయములను దెలిసికొనుచు మంత్రులను

ప్రజలను సంతోషపరచుము. ధన ధాన్యాగారములను అస్త్ర శస్త్రశాలలును ఎప్పుడును వెలితి లేకుండునట్లు చూచుకొనుము. ఈ ప్రకారముగా భూమిని బాలించుచున్న రాజును జూచి భూమియందు జనులెల్లరును సంతోషమును బొందిన వారగుదురు. అతని హితమును గోరువారందఱును అమృతమును బొంది సంతసించు దేవతలవలె సంతసింతురు.” అని దశరథ మహారాజు రామునితో జెప్పుచుండగా విని రాముని యొక్క మిత్రులు వేగముగా పరుగు పరుగున కౌసల్య యొద్దకు వెడలి రాజు చెప్పిన శుభవార్తను సంతోషముతో జెప్పిరి. ఆ కౌసల్యయు శ్రీరాముని గూర్చిన శుభవార్త వినిపించినయతని మిత్రులకు అధికమగు ధనమును, హారములను, వివిధములగు మణిభూషణములను నొసంగెను. తండ్రికి నమస్కరించి రథము నెక్కి శ్రీరాముడు తన మందిరమునకు వెళ్లెను. వెంటనే పౌరులును రాజునను్జ్ఞ గైకొని వెడలి తమ కోరికలు ఫలించెనను సంతోషముతో ఇలువేల్పులనభీష్టములైన పూజా విధానములతో తృప్తిపరచిరి.



# నాలుగవ సర్గము

ఇట్లు పౌరులకందఱకు ననుజ్ఞనిచ్చి వారు వెడలిన తరువాత నిశ్చితమతియైన దశరథుడు మంత్రి సహితముగ, రేపే పుష్యమీ నక్షత్రము కాన రఘురాముని యువరాజును జేయుటకు తగియున్నదని నిశ్చయమును సభయందు బ్రకటించి యింటిలోనికి వెడలెను.

**దశరథుడు శ్రీరాముని దన నగరునకు బిలిపించుట :**

ఈ విధముగా రాజంతఃపురమునకు వెళ్లినవాడై తన యొక్క సూతుని జూచి శ్రీరాము నింకొకమారు తోడితెమ్మని చెప్పగా సూతుడు వేగముగా రాముని గృహము ముంగిట నిలిచి వార్త బంపగా శ్రీరాముడు తన మనస్సున సంశయమందినవాడై సూతుని బిలిపించి "రాజుగారు నన్ను బిలిపించిన పని యెటువంటిది యని అడుగగా సూతుడు మిమ్ములను తీసికొని రమ్మనియే చెప్పెను. మీరు వెళ్లుటయో వెళ్లకుండుటయో మీ యధీనములే" అనెను. ఆ మాట విని రఘురాముడు తొందరగా తండ్రిగారిని జూడ నేగి దూరము నుండియే దండవత్ప్రణామము చేయగా దశరథుడు ప్రేమతో కుమారుని లేవనెత్తి కౌగిలించుకొని యుక్తమగు పీఠమున గూర్చుండ నియమించి కడు ప్రియమైన మాటలను రామునితో చెప్పెను.

**దశరథుడు శ్రీరాముని యువరాజు జేయుటకు గారణము లాయనతో జెప్పుట :**

"శ్రీరామా! నేను ముసలి వాడను. పెక్కువేల సంవత్సరంబులు ప్రాజ్యముగా రాజ్యమును బాలించితిని. కోర్కెలను మనసు దీర ననుభవించితిని. వివిధ పదార్థములతో అన్నములతో, దక్షిణలతో అనేక సత్క్రతువులను జేసితిని. సిరులు

విలసిల్లునట్లు యథా శాస్త్రముగా విరివిగా దానములు చేసితిని. సర్వశాస్త్రముల నభ్యసించితిని. దేవబ్రాహ్మణ పితృదేవతా ఋణముల దీర్చికొంటిని. సంపదచే సర్వభోగములను కామితములను తనివి దీరునట్లుగా ననుభవించితిని. ఓ పురుష శ్రేష్ఠా! బలవంతుడవు, సాటిలేనివాడవు ప్రియుడవు నగు నిన్ను కుమారునిగా గాంచితిని. ఓ ఉత్తమ చరితుడా! శ్రేష్ఠ గుణములు గలిగిన నిన్ను మిక్కిలి యనురాగముతో యువరాజుగా జేసి భూజనులందఱు సంతోషించు నట్లొనరించుటొక్కటే నాకు గల గొఱత. కావున నేను జెప్పునది కాదనకుండగా నీవు చేయదగును. ఓ పావనశీలా! నీవు రాజు గావలెనని ప్రజలందఱు తమ అభీష్టమును దెలిపిరి. నిన్ను తొందరగా యువరాజును జేసెదను. నీవీ రాజ్యమును భరింప బూనుము. ఇట్లు చేయుటకు గారణమేమి యంటివేని చెప్పెదను. భయంబుగొల్పు దుర్నిమిత్తముల ననేకము స్వప్నములందు చూచుచున్నాను. పిడుగులు, నుల్కలు మహా ధ్వనితో బడుచుండుట జూచితిని. జ్యోతిష్కులు జన్మతారను రాహువు కుజుడు సూర్యుడు తగులుచున్నారని చెప్పగా వింటిని. కుమారా! ఇంకేమి చెప్పుదును. ఇట్టి శకునముల యొక్క ఫలముల నాలోచించి చూడగా రాజు మరణించుటయో లేక గొప్పనైన యాపదను బొందుటయో సంఘటిల్లును. కాన వత్సా నేను ప్రాణములతో నుండగనే ఈ రాజ్యమును స్వీకరించుము. నా మనస్సిప్పుడిట్లున్నది. ఇంక నెప్పుడెట్లుండునో తెలియదు. కావున నిప్పుడే యౌవరాజ్యాభిషేక గౌరవము పొందుము. రాఘవా! నేడే పునర్వసు నక్షత్రము వచ్చినది. రేపు పుష్య యోగమగుట చేత శాస్త్రజ్ఞులు నీవు యౌవరాజ్యము స్వీకరించుటకు మంచిదని చెప్పిరి. కాన వెంటనే జరిగించుటకు నా మనస్సు తొందరపెట్టుచున్నది. ఈ రాత్రి నీవును సీతయు నుపవాసమును చేయుడు. దర్భలపై బరుండుడు. ఇట్టి కార్యములు చేయుచున్న తరి విఘ్నములు కలుగుచుండును. ఎట్టివారికైనను జాగ్రత్తగా నుండు టవసరము. నీ స్నేహితులను రాత్రి నిన్ను ప్రేమతో కాపాడునట్లు చెప్పుము.

అదియు గాక నా మనస్సులో నింకొకటియు నున్నది. ఏ విధముగా జూచినను భరతుడు మేనమామ యింటి నుండి రాకమునుపే పట్టాభిషేకము పూర్తి చేయుటయే మేలని తోచుచున్నది. నాయనా! నేనిట్లు చెప్పితిననుకొనకుము. నీ తమ్ముడైన భరతుడు జితేంద్రియుడు. ధర్మము తప్పక నడచువాడు, కరుణ గలవాడు, అన్నయందు భక్తి గలవాడు. అయినను మానవుల మనస్సు లతి చంచలములయినవి. ధర్మము దప్పనివారియందైనను సజ్జనుల యందైనను ఆ మనస్సులు అయినదేమో యయినదని భావించునవగును. కనుక రేపు పట్టాభిషేకము చేసికొందువుగాక వెళ్లిరా నాయనా! రామా! అని దశరథుడు చెప్పగా రాముడు సాష్టాంగముగా నమస్కరించి తన భవనమునకు వెడలి వెంటనే తన తల్లి యంతఃపురము నకు వెళ్లెను. అట్లు వెళ్లి దేవమందిరమున తెల్లని పట్టువస్త్రమును ధరించినదియు, తన కుమారుని రాజ్యశ్రీయుక్తుని జేయుమని తప్పని భక్తితో మ్రొక్కుచున్నదియు, ఇలువేల్పుపై దన మనస్సును నిల్పి ధ్యానించుచు మౌనముగ నున్నదియు, సాటిలేని విధమున బ్రాణాయామము చేసి పరాత్పరుడగు జనార్దనుని తలంచుచున్నదియు, తన పట్టాభిషేక వార్త విని సుమిత్రయు లక్ష్మణుడు ముందుగా వచ్చి సీతను గూడ నక్కడకు రప్పించుటచే ఆ ముువ్వురితో గూడి యున్నదియు, సాధ్వియు నగు తన తల్లిని జూచెను. చూచి, నమస్కారముగావించి రఘూత్తముడు వీనులవిందులైన మంచి వాక్యములను, సంతోషముతో శరీరము గగుర్పొడువగా నిట్లు చెప్పెను. “ఓ జననీ! నాయనగారు భూ పరిపాలన ప్రక్రియను జేపట్టుమని నన్నాజ్ఞాపించిరి. రేపే యౌవరాజ్య వైభవమును పుచ్చుకొను మనిరి. నన్నును నా భార్యను నీ రాత్రి యుపవసింపుడని నా తండ్రి పురోహితులతో గూడి సంతోషముతో జెప్పెను. ఇప్పటి నుండి నాకును మీ కోడలికిని శుభము కలుగునట్లు చేయవలసిన క్రియలను చేయుము.”

## కౌసల్య శ్రీరాముని దీవించుట :

ఈ ప్రకారముగా శ్రీరాముడు చెప్పగా చాల కాలము నుండి వినగోరియున్న యా వాక్యములను విని సంతోషబాష్పములు కలిగినదై మధుర వాక్కులతో నిట్లనెను. “కన్నతండ్రీ! రామా! చిరంజీవిగా వర్ధిల్లుము. ఐశ్వర్యములు గలిగి నీవు నా బంధువులను సుమిత్ర యొక్క బంధువులను సంతోషపెట్టుము. నిన్నెంత కల్యాణ నక్షత్రమున గంటినో నీవిట్లు నీ జనకుని సంతోషపెట్టుచున్నావు. నీ విప్పుడిక్ష్వాకు రాజ్యరమకు బ్రభువవగుటచే నేను చేసిన హరిసమర్చనము ఫలవంతమైనది. ఓ ముద్దులయ్యా! నీ శత్రువులకు చెడుకాలము వచ్చినది.” అని కౌసల్య చెప్పగా మందహాసముతో బ్రకాశించుచున్న ముఖముతో తన తమ్ముడైన లక్ష్మణుని జూచి “లక్ష్మణా! గొప్పదైన యీ భూమండలము నంతయును నాకు తోడుగా నుండి నీవు పరిపాలింపుము. రాజ్యలక్ష్మి నీవు నా రెండవ యాత్మవగుటచే నిన్నును సేవించును. భోగములను, రాజ్యఫలముగా వచ్చెడు వానిని ఇంక నీ యిష్ట ప్రకారముగా ననుభవింపుము. నీ కొఱకే గదా నేను రాజ్యమును గాని జీవితమును గాని గొప్పగా జూచెదను.” అని యిట్లు తన యనుఁగుం దమ్మునకు జెప్పి తల్లులైన కౌసల్యా సుమిత్రలకు భక్తితో నమస్కరించి సీతకును దనకును నాజ్ఞ తీసికొని తన యంతఃపురమునకు వెళ్లెను.



# ఐదవ సర్గము

## దశరథు పంపున వసిష్ఠుడు శ్రీరాముని సీతను ఉపవాస ముంచుట :

దశరథ మహారాజు వశిష్ఠ మహర్షిని జూచి "మన రామచంద్రుని, నతని పత్నియగు సీతను కీర్తియు రాజ్య సంపదలు లభించునట్లుగా నుపవాస వ్రతమును జేయించుటకు మీరు వెళ్లవలయును." అని చెప్పగా మహా మతిమంతుడగు నా మునినాథుడట్టులేయని బ్రాహ్మణులకు యోగ్యమైన యొక రథము నెక్కి రఘూద్వహుని యింటికి వెడలెను. అట మూడు ద్వారములను దాటి వెడలగా రాముడు మౌని రాకను దెలిసినవాడై యెదురేగి వసిష్ఠుని రథము నుండి దింపి నమస్కరింపగా ముని ఎక్కువైన ప్రేమతో యిట్లని పల్కెను. "అన్నా! నీ జనకుడు ప్రీతితో నిన్ను నహుషుడు యయాతిని వలె యువరాజును జేయ దలపెట్టెను గదా. నేడు నీవును సీతయును నుపవాస విధిని జేయవలెను. రేపే రాజు పట్టాభిషేకము జరిపించునట." అని ఆ సూర్యవంశజుని, భూజాతను విధివిహిత రీతితో మంత్రయుక్తముగా ఉపవాస నియమము జేయించి శ్రేష్ఠతపస్వియగు నా వశిష్ఠుడు శ్రీరఘురాముడొనర్చు నర్చనల నందుకొనెను. ముని తిరిగి వెడలుచుండగా వెనువెంట రాముడు రాగా నిలు నిలుమని రాముని నాజ్ఞాపించి తాను రామ నివాసమును వీడి రథముపై పురమార్గమున వెళ్లెను.

## శ్రీరామ పట్టాభిషేకమునకై జనులు గుంపులు గూడుట :

మునిశ్రేష్ఠు డీ విధముగా వెడలగా ప్రియంవదులగు తన మిత్రులు సేవించుచుండ సీతాకాంతుడు తన భవనములోనికేగి తగు మాటలతో వారిని బ్రీతుల నొనర్చి అనుజ్ఞ నీయగా వారును సంతోషముతో వెడలిరి. వికసించిన కమలములును, మంచి జలపక్షులును గలిగి యొప్పుచున్న కొలను వలె రాముని భవనపు ముంగిలి పురుషుల యొక్కయు, యువతుల యొక్కయు సమూహములతో మిక్కిలి ప్రకాశించెను. ఇసుక చల్లినను నేల రాలనట్లుగా మూగిన జనుల గుంపులు గలవియును, ఎప్పుడెప్పుడు పట్టాభిషేకమును జూతుమాయని కోరికతో నున్న ప్రజలతో నిండినవియును, జన సమూహముల

నెడు తరంగముల నుండి హర్షధ్వానములనెడు ధ్వనులు గలిగి సముద్రముతో సాటివచ్చునవియును, నీళ్లుచల్లి యరటిచెట్లను గట్టి ముగ్గులు దీర్ప బడినవియును, ఎప్పుడెప్పుడు సూర్యోదయమగునా యని మొగముల నెత్తి తూర్పు దిక్కును గాంచుచున్న బాలురు బాలికలు యువతులు వృద్ధులు మొదలగువారిచే నొప్పుచున్నవియును నయి ఇరుకుగా గన్పించు వీధులను మౌని చూచెను. మిద్దెలను మేడలను ధ్వజములు కట్టబడి, యీ వార్తను ఆకాశముననున్న దేవతాస్త్రీలకు సంతోషముతో దెల్పుచున్నవో యన్నట్లు ఎగురజొచ్చెను. జనసమూహముచే నలంకరింపబడినదియు, జనులకు సాటిలేని యానందమును గల్గించునదియు నగు పట్టణమున గుతూహలులగు జనుల జూచుచు బ్రజ బంతులు తీర్చిన రీతిగా మెల్లగా సాగుచుండెను. ఆనందముతో మౌని యివి యన్నియు గాంచుచు వెళ్లి వెళ్లి ప్రకాశమానమై తెల్లని మేఘపుటంచువలె నొప్పుచున్న రాజప్రాసాదమును జేరనేగగా నింద్రుడు బృహస్పతికి వలె నా రాజు తొందరగా లేచి వసిష్ఠున కెదురు చని వెళ్లిన కార్యమును గురించి ప్రశ్నించెను. వసిష్ఠుడన్ని కార్యములను సక్రమముగా జరిపించితిననెను. రాజుతో గూడ సభలోనున్న ప్రజలందరును గురువును గౌరవించి పూజింపగా, తరువాత రాజు జరిగిన వృత్తాంతమును విని గురువు యొక్క సెలవంది, ఇంకను ఉన్న జనసంఘమునకు సెలవిచ్చి పంపించెను. ఎక్కువైన సంతోషముతో వారలను బంపి రాజు సింహము పర్వతగుహలో జేరునట్లుగా, తగిన మంచి వేషములతోనున్న యనేక స్త్రీలతో గూడి ఇంద్రభవనమువలెనున్న రాజమందిరమును బ్రవేశించి నక్షత్రములచే నొప్పు ఆకాశమును జందురుడు వలె తన కాంతులచే దానిని ప్రకాశింపజేసెను.



# ఆరవ సర్గము

## శ్రీరాముడు నారాయణార్చనము చేయుట :

పురోహితుడగు వసిష్ఠుడట్లు వెడలగా రామచంద్రుడు స్నానమొనరించి నియమ వంతుడై విశాలములైన కన్నులు గల తన పత్నిని గూడి తన యింటిలోనున్న శ్రీరంగనాథు నర్చించెను. యథావిధిగా తలయందు హవిస్సు గలిగిన పాత్రను ధరించి యగ్నియందు మంత్రపూతమగు నేతిని భక్తితో పరదైవమైన రంగనాథుని దలచుచు హోమము చేసి, హోమశేషమును మిక్కిలి ప్రీతితో భుజించి శ్రీహరిని మనసునందు నిల్పికొని దైవ మందిరమునందే దర్భలను పక్కగా పరచుకొని వాఙ్మనస్సులను నిగ్రహించుకొని జనకసుతతో గూడి శయనించెను. ఒక జాము రాత్రి యుండగనే మేలుకొని తన మందిర మంతయు నలంకరింప జేయించెను. సూతులును వంది మాగధులును మనోహరములగు వాక్యములతో చెవిపండువుగా బొగడుచుండ రామచంద్రుడు నిశ్చలమైన మనస్సుతో సంధ్యవార్చి విష్ణుదేవునకు శిరము వంచి నమస్కరించి, తెల్లని వస్త్రమును గట్టి, బ్రాహ్మణ శ్రేష్ఠులను స్వస్తి వాచనము చేయ నాజ్ఞాపింపగా, వారి గంభీరము మనోహరమునగు స్వస్తి వాచన ధ్వని, పట్టణమునందు తూర్యధ్వనులననుసరించుచు వ్యాపించెను. కౌసల్యా తనయుడు భార్యాసహితుడై నియమవ్రతమును నుపవాసమును బూర్తిచేసెనని విని సంతోషముతో నయోధ్యాపురజనులందరు నా వేకువనే పట్టణము మనోహరముగా నలంకరింప నారంభించిరి.

## శ్రీరామపట్టాభిషేకమునకై యయోధ్య యలంకరింపబడుట :

తెల్లని మబ్బులను బోలిన దేవాలయములయందును, మంటపములందును,

నాల్గు మార్గముల కూడలి ప్రదేశములందును, ప్రాకారములపై నిర్మించిన మంటపములందును సమస్త వస్తువులతో నిండిన వ్యాపారుల యంగళ్ల యందును గృహస్థులతో నిండిన సంపత్సమృద్ధములగు మందిరములయందును, సభాభవనములందును, ఎత్తైన వృక్షముల యందును ధ్వజములను, చిత్రములగు పతాకములను నెగురవేసిరి. ఇచ్చటచ్చట యనునది లేకుండ అంతట నటులు, నర్తకులు, గాయకులు మొదలగు వారి గానములు చెవుల పండువుగా మనస్సులు చొక్కునట్లుగా వ్యాపించెను. రామచంద్రుని పట్టాభిషేకమును జూచుటకు నాల్గుమార్గముల కూడలులయందును గృహముల ముంగిళ్లయందును మూగిన స్త్రీలు పురుషులు మిక్కిలి సంతోషముతో ఒకరితో నొకరు రామచంద్రుని యభిషేకమును గూర్చి యనేక విధములుగా ముచ్చటించుచుండగా, బాలురు బాలికలును నిండ్ల ముందర ముచ్చటగా ఆడుకొనుచు తమలోదాము చిన్ని చిన్ని మాటలతో నెల్లప్పుడు నా చరిత్రమునే చెప్పుకొనుచుండిరి. పూవుదండలను పుష్కలముగా గట్టి, అగరు సాంబ్రాణి ధూపములు వేసి, చందనము పన్నీరు గలిపి గలాపి చల్లి, రాజమార్గములను మిక్కిలిగా శృంగారించి, రాత్రియే యూరేగింపుగా వచ్చునో రాముడని సంశయముచే వీధుల కిరుప్రక్కను వృక్షములను పాతి వాటికి రత్నములను దీపములను గట్టి అలంకరించి ముదిత మానసులై ప్రజలు నాల్గు మార్గముల కూడలులందు గుంపులుగూడి రాముని పట్టాభిషేకపు వైభవము నెప్పుడెప్పుడు చూతుమను నభిలాషతో నెదురుచూచుచు రాముని గుణములను గొనియాడుచు రాజును మెచ్చుకొనుచు నిట్లు పలుకుచుండిరి.

**పట్టాభిషేక విషయక జన సంభాషణము :**

"ఆహాహా! దశరథ మహారాజెంతటి ధర్మాత్ముడో గదా! తనకేండ్లు చెల్లినవని తలచి కుమారుడగు శ్రీరామచంద్రుని యువరాజుగా జేయుటకు పట్టాభిషేకము చేయబోవుచున్నాడు. రామచంద్రుడు మనకు రాజగుటచేత మనమందరమును

ధన్యుల మైతిమి. లోకమునందలి ఉత్తమ హీన తారతమ్యము నెరిగిన వాడు, గర్వరహితమైన మనస్సు గలవాడు, ధర్మాత్ములలో నెల్ల నుత్తముడు, సోదరులయందు ప్రేమ గల వాడు తన తమ్ములనెట్లు దయతో జూచునో అట్లే దయతో మనలను గూడ జూచువాడు, మహారాజు యొక్క కరుణ చేత మనలను రక్షించురాజుగా నింతకాలమునకు వచ్చుచున్నాడు. ఎవని యనుగ్రహముచే శ్రీరాముడు మన పురమునకు రాజు కాబోవుచున్నాడో ఆ రాజగు దశరథుడు భూమియందాయువు వృద్ధి జెంది సుఖించుగాక" అని యిట్లు మిక్కుటమైన సంతోషముతో పౌరులు తమలో దాము మాట్లాడుకొనుచుండిరి. జనపదములలో నివసించు వారు ముందు దినముననే యీ వార్తను వినుటచే గుంపులు గుంపులుగా నాలుగు దిక్కుల నుండి వచ్చుచుండగా వారి మాటల యొక్క ధ్వనులచే భూమ్యాకాశముల మధ్య భాగము నిండగా పట్టణము పర్వకాలమునందలి సముద్రము వలె ఘూర్ణిల్లుచుండెను.



# ఏడవ సర్గము

## మంథర యయోధ్యాలంకారమును జూచుట :

ఎక్కడ పుట్టినదో తల్లిదండ్రులెవ్వరో యెవ్వరికిని దెలియనిదియు (అభిషేక విఘ్నమునకై యొక దేవతాస్త్రీ దేవతలచేఁ బంపబడెనని గాథ) కైకేయికి బంధుజనులచే నీయఁబడిన దాసియు, పొట్టకూటికై కైకను వీడక సేవించునదియునగు మంథర చంద్రునివలెఁ దెల్లనైన యొక మేడపైకెక్కి వేడుకతోఁ నలువైపుల జూచెను. నీళ్లు చల్లుటచే తడిగా నున్న వీధులును, వింతగొలుపునట్లు వెదజల్లబడిన పుష్పములును, తలంటుకొన్న జనులును, పందిళ్లును, జెండాలును చేతులలోఁ బువ్వుదండలు పిండివంటకములును ధరించి తిరుగుచున్న జనులును, శుభ్రముగా నున్న దేవతా గృహములును మంగళప్రదములై వినుటకింపుగా నున్న వాద్యధ్వనులును గలిగి సంతుష్టులగు సకల జనులు గలదియై వేదనాదములు గలదై, మిక్కిలి మదించిన గజములు నశ్వములు గలదై, వృషభముల ధ్వనులు గలదై మిక్కిలి యలంకృతమై యొప్పుచున్న యయోధ్యను జూచి మనస్సులో నాశ్చర్యపడినదై పట్టువస్త్రము గట్టుకొని సంతోషముతో వికసించిన ముఖము గలదియగు నొక దాదిని చూచి యిట్లు పలికెను. "ఓ ధాత్రికా! చెప్పుము. అర్థమునందుఁ గోరిక గలదయ్యును నెక్కువ సంతోషముతో రాముని తల్లియగు కౌసల్య ప్రజలకు దానములేల చేయుచున్నది? ఓ రమణీ! పట్టణమందలి ప్రజలెల్లరు సంతోషమును బొందుచున్నారు. రాజైన దశరథుడు గొప్పనైన శుభకార్యమును దేనినైనను జేయుచుండెనా యేమి? చెప్పుమన పొంగి పొరలుచున్న సంతోషముతో నుప్పొంగుచున్న శరీరముతో నాదాది కుబ్జ (మంథర)తో నిట్లనెను. "రాజు

రేపు పుష్యమీ నక్షత్రమందు జితేంద్రియుఁడైన రాముని యువరాజుగా జేయును” ఆ మాటలు చెవిబడగానే కుబ్జ కోపముతో మండిపడుచు కైలాస సమానమైన మేడనుండి దిగి వెళ్లి పాపపు బుద్ధిగలదై, హాయిగా పవ్వళించియున్న కైకతో నిట్లనెను.

**మంథర కైకకు రామపట్టాభిషేక వార్త చెప్పి దుఃఖించుట :**

“కైకేయీ! లేలెమ్ము. మందమతిగలదానా! కొంప మునిగినది. ఆపదయను సముద్రమున లోతుగా మునిగియు దెలియకున్నావు. భర్తచే తిరస్కరింపఁ బడినదానా! దౌర్భాగ్యురాలా! వృథాగా సౌభాగ్యవతినని చెప్పికొందువుగాని మండువేసవిలో నీటియందుండు జలమువలె నీ సౌభాగ్యము నేలగలియు చున్నది. నీవు వెఱ్ఱిదానవై రాజు సదా నీవు చెప్పినటుల వినుననెడు దురభిప్రాయముతో విఱ్ఱవీగుచుందువు” అని పరుషమైన మాటలను జెప్పుచున్న పాపపు తలంపులు గల మంథరను జూచి మిక్కిలి వ్యథజెంది చిన్నపుచ్చుకొని కైక యిట్లనెను. ఏడ్చునట్లున్న ముఖముతో దీనముగా నుంటివేల? ఇప్పుడు వచ్చిన కష్టమేమి?” అని మంచిమాటలతో కైక యడుగగా, మాటనేర్పరియగు మంథర యెఱ్ఱబడ్డ కన్నులుగలదై కేకయరాజు కుమార్తెకు శుభమును రాఘవున కపకారమును దన మనస్సులో తలంచినదై మిక్కిలిగ గన్నీరు గార్చుచు నామెతో నిట్లు చెప్పెను. “ఓ వనితా! నీకు వినాశము జరుగుచున్నది. ఏమి చేసినను తప్పునట్లులేదు. రేపు నీ భర్త శ్రీరాముని యువరాజుగా జేయుచున్నాడట. ఓ కైకేయీ! దీనిని వినుటచే మిక్కిలి భయ శోకములతో నిండిన మనస్సు గలదాననై, నా శరీరము నిప్పులలో పొరలించినట్లగుటచే భరింపలేక నీ క్షేమమును గోరుదానను గనుక తొందరగా నీకు జెప్పుటకై వచ్చితిని. నీకు శోకము గలిగిన నాకు విపరీత మయిన శోకము గలుగును. నీకు వృద్ధి గల్గిన నాకును వృద్ధి గలుగును. సందేహము లేదు. ఓ నల్లకలువల వంటి కనులు గలదానా! యీ విషయమును దెలియునట్లుగా వినుము. పేరెన్నికయిన రాజవంశమున నీవు

పుట్టితివి. ఇట్టి దానవయ్యును ఈ గుట్టు తెలిసికొనలేవైతివి. ఇంక మాటలతో నేమగును? రాజధర్మ రహస్యమెంత క్రూరమైనదో తెలిసికొనలేవుగదా! నీ భర్త మాటలు ధర్మయుక్తములేగాని భావము మాత్రము మిక్కిలి దారుణమైనది. పువ్వు దేనెలు చల్లునట్లున్న మాటలు కంఠము నుండి మాత్రమే (హృదయము నుండి కావు) తెలిసికొనలేక నీ భర్తను మంచిమార్గమున నడచువాడని తలంచి మోసపోయితివి. దాని యొక్క చెడుఫలితమే యింత ఘోరమై నిన్నిపుడు తాకినది. అచ్చిక బుచ్చికగా మాటలను చెప్పి నీ మెప్పుకొఱకై వగలుపోవుచు నిచ్చట మెత్తని వానివలె నుండి యచ్చట కౌసల్యకు నైశ్వర్యముల నిచ్చుచున్నాడు. చుట్టములను జూచుటయను నెపముపెట్టి నీ కుమారుని దూరముగా బంపి తన పెద్దభార్య కుమారుని రాజు దుష్టబుద్ధియై రేపే రాజును జేయబోవుచున్నాఁడు. ఉపేక్షించినచో శత్రువు, సర్పము నెట్లపకారము చేయునో ఓ తెలివితక్కువదానా! దశరథుడిప్పుడు నిన్ను నీ కుమారుని నట్లే చేసెను. ఓ చిన్నదానా! అపరిమితములైన సుఖపరంపరలను బొందినదానా! పాపాత్ముఁడును అనృతమును మనసులోఁ దలచువాడును నగు దశరథుడు రాముని భూమికి రాజుగా జేసినచో నీవును నీ బంధువులును జెడిపోకుందురా? అన్నింటను జాతుర్యము కలదానవు. ఆశ్చర్యముతో విశాలములయిన కనులు గలదానా! నా మాటలు వినుము. నీ కుమారుని నిన్ను నన్ను కాపాడుకొను నొక యుపాయమును దలంపుము. నీకు మేలెట్లు కలుగునో యాలోచించి చేయుటకిదే తగిన సమయము సుమా. మతిచెడి వేఱువిధముగా జేసి చెడిపోవకు'మని మంథర యీ ప్రకారముగా తొందరపెట్టగా భర్తయను నెపమున నున్న శత్రువని యెఱుగక మూఢురాలా! తల్లివలె నతని హితము గోరుచు సంచరించితిని. ఈ రాజును సర్పమును వలె తొడపై నిడికొని లాలించితివి.

**పట్టాభిషేక వార్త జెప్పిన మంథరకు గైక పారితోషికమిచ్చుట :**

సుందరమైన ముఖముగల కైకేయి మంథర పలుకులను విన్నదై మిక్కిలి

సంతోషముతో శారదరాత్రియం దుదయించిన చంద్రరేఖవలె లేచెను. ఆనందముతో శరీరము పొంగగా మిక్కిలి యాశ్చర్యముతో తాను ధరించిన మంచిదైన యలంకారమును దీసికొమ్మని కుబ్జకిచ్చి ఆ లేడివంటి కన్నులు గల కైకేయి యామెతో నిట్లనెను. "మంథరా! నాకు పరమ ప్రీతికరమైన వార్తను ముందుగా నీవు చెప్పినందుకు నిన్ను మెచ్చుకొనుచున్నాను. నా కెక్కువ యానందమును గలిగించు నింతటి వార్తను చెప్పినందులకు నీకు తగు రీతిగ నింతకంటె మించినది యేమివ్వవలెనో నీవాలోచించి నాకు జెప్పుము. ఆ శ్రీరామునకును, భరతునకును నే మాత్రమైనను భేదము నేనెఱుగను. అందుచేత రాజు రామునకు పట్టాభిషేకము చేయుటవలన నా మనస్సు సంతోషింప కుండునా? ఇంతకుమించి యానంద మొసఁగ గల వార్త చెప్పుట నీ తరమా? ఇంతకు మించిన వరమేదైనను గోరుకొమ్ము ఇచ్చెదను" అనగా...



# ఎనిమిదవ సర్గము

## మంథర కైకను దూషించుట :

కోపముతోను దుఃఖముతోను మనస్సు తాపమును బొందుచుండగా ఈర్ష్య గలిగినదై తటాలున నా సొమ్మును వేగముగా బారవైచి మంథర రాజుయొక్క భార్యను జూచి బాధ నొందుచు నిట్లు పలికెను. “ఓ మూర్ఖురాలా! సంతోషమును బొందుటకా యిది సమయము? శోకసముద్ర మధ్యమున మునుగుచు నిన్ను నీవు దెలిసికొనలేకున్నావు. మహా భయంకరమైన విపత్తు మిక్కిలి కఠినముగా దాపురించినది. దానిని నీవు మేలనుకొని సంతోషమును బొందుచున్నావు. నేను నిన్ను జూచి నవ్వకుండ నుండగలనా? నీవింత తెలివిలేనిదానవయి నందులకు నేను విచారించుచున్నాను. సహజశత్రువగు సవతి యొక్క కుమారుని వృద్ధి మృత్యువువలె రాగా నిట్లు సంతోషముతో నే ప్రాజ్ఞి (తెలివిగలది) యైనను గంతులువైచునా? నీకు వివేకమున్నచో దీనిని నీ మనస్సున నేమిగా దలంచితివో చెప్పుము. రాజ్యముమ్మడిసొమ్మగుటచే రామునకు భరతుని వలన ప్రాణభయ సంశయముండును. భయపడువాని నుండి యే భయము కలుగును. ఇంతయు నాలోచించి నేను విషాదముతో గూడిన మనస్సు గలదాన నయితిని. శ్రీరాముని త్రికరణశుద్ధిగా సౌమిత్రి యెల్లప్పుడు సేవించుచుండును. రాముని లక్ష్మణుడు వలె భరతుని శత్రుఘ్నుడు కొలుచుచుండును. జనన మందిన వరుస చూచినను ఓ చెలీ! భరతుడే దగ్గరవాడగును. లక్ష్మణ శత్రుఘ్నులు వెనుకటివారగుదురు. కావున వారు రాజ్యక్రమమును దరువాత పొందుదురు. ఆ సీతాపతి ఎక్కువగా వివేకము గలవాడును యుద్ధకళయందు నేర్పరియును, సమయోచితముగా కార్యములను నడపువాడును నగుటచే నీ పుత్రుడగు భరతుని దలచుకొన్నచో

నా శరీరము వణకుచున్నది ఇదె చూడుము. ఓ యింతీ! కౌసల్య యెంత పుణ్యము చేసినదో కదా. రేపు పుష్యమి. రాజు తన పుత్రుని విప్రులచే యౌవరాజ్యమున పట్టాభిషిక్తుని జేయింపఁగా సంతోషముతో జూడగలదు. ఐశ్వర్యమును గీర్తియును ప్రేమయును దనకు సమకూరగా సవతులందఱు దుఃఖింపగా సంతోషమును బొందు కౌసల్యకు క్రిందై చేతులు జోడించి దీనురాలవై మాతో గలసి దాస్యము చేయుచుందువు. భరతుఁడు గూడ రఘురామునకు బంటు భావమున బాధనొందును. రాముని పత్నియగు సీతయు పరిచారికలును సంతోషముతో నుండ నీ కోడలును బరిచారికలును నెంతో బాధనొందుదురు. దీనిని దొలగించుటకేమి మార్గమో ఆలోచింపుము."

**మంథరకు కైక శ్రీరాముని గుణములను వర్ణించి చెప్పుట :**

ఈ విధముగా బ్రీతిలేక పలికిన మంథర మాటలను విని కైకేయి రఘువంశ శ్రేష్ఠుడగు రాముని మంచి గుణములను ఆ దాసితో నిట్లు చెప్పదొడగెను. "ఓ మంథరా! ఆ రాముడు చేసిన మేలును మరువడు. నిర్మలుడు. సత్యమును దప్పనివాడు. ఇంద్రియ నిగ్రహము గలవాడు. గురువులచేత బాగుగా శిక్షింపబడినవాడు. ఇంతేగాక రాజు యొక్క జ్యేష్ఠ పుత్రుఁడును అగుటచే యువరాజుగా నియమింపఁబడుటకు తగఁడా? శ్రీరాముడు తన తమ్ములను సేవకులను తన తండ్రి వలెనే ప్రేమతో బోషింపగలవాడు. అటువంటి రాముని యభిషేక వార్త విని ఈ మాదిరిగా దుఃఖమును బొందెదవేమే. మంథరా! భరతుడెట్లు నాకు ప్రేమపాత్రుడో యట్లే రాముడు గూడ నాకు నెల్లప్పుడు ప్రేమింపదగినవాడే. రాముడు తన కన్నతల్లికంటె నెక్కువ భక్తితో నా కుపచారములు చేయుచుండును. జానకి భర్తయగు రాముడు రాజైనను నా కుమారుడైన భరతుడు రాజయినట్లుగా నానందింతును సుమా. తనమాదిరిగానే తమ్ములను కూడ రాముడు చూచుకొనును. వేర్పాటుబుద్ధులు రామునకు లేవు. ఈ ప్రకారముగా కైక చెప్పగా వేడి నిట్టూర్పులు నిగిడించుచు మంథర తన గాఢమైన దుఃఖము మనస్సును ప్రేరేపించుచుండగా రాజపుత్రియగు

కైకతో నిట్లు పలికెను. నూఱు సంవత్సరములైనను రాముని తరువాత నా కుమారునకు సంపదలతో గూడ రాజ్యమబ్బును. దీనికి నీవేల యసూయపడెదవు. తండ్రి సంపద తనయునకు రాకుండునా? ఇప్పుడు శుభము ప్రాప్తించినది. వంశపారంపరగా మీదట గూడ ప్రాప్తింపగలదు. ఎందులకు మనస్సున సంతాపము నందెదవు. తృప్తినొందవలదా? న్యాయరీతిని గనరా?

## మంథర కైకకు దుర్బోధము చేయుట :

"ఓ కైకా! ఎంత మూర్ఖురాలవైతివే! మహాదుఃఖ మనెడు సముద్రములో మునిగి యుండియును గాంచలేకున్నావు. జానకీ భర్త రాజయినచో తరువాత నాతని పుత్రుడు రాజగును. గాని నీ సుతుడైన భరతునకు ప్రభుత్వము భోగములు నెట్లు కలుగును. రాజులు పుత్రులెంతమందియున్న నందరిని రాజులుగా చేయరుగదా. పిన్నవారు ఎంత బుద్ధిమంతులయినను బెద్దవానినే రాజు చేసెదరు. అందుచే రాముడు రాజయిన నీ ముద్దుల కుమారుడనాథుడై రాజభోగములను విడచిపెట్టి శ్రమపడుచుండగా నేనేవిధముగా జూడగలనాయని నిన్ను తొందర పెట్టితిని. నీ సవతి యొక్క వైభవమును జూచి సంతోషించియా? యిస్సీ! యీ కానుకను నాకిచ్చితివి. ఉన్న విధమును వివరించెదను అడ్డులేని రాజ్యమును బొంది రాముడు తరువాత నీ కుమారుని వనములకో.. స్వర్గ లోకమునకో బంపుట చేయగలడు. ఇది నీవు నమ్ముము. మూర్ఖురాలవై బాలుడగు నీ పుత్రుని మేనమామను జూడఁబంపితివి. ఇంతకంటె మోసముండునా? స్థావరములందు గూడ సమీపమున నుండుటచే స్నేహము వృద్ధియగును. ఇఁక రాజునకు బుత్రుల విషయమున జెప్పవలసినదేమున్నది? అదియు నీవలననే తొలగి పోయెను. నీ కుమారుని యందు ప్రేమగల తమ్ముడైనను నిచ్చటనున్న నొక విధముగా మేలయ్యెడిది. అదియును లేదు గదా. ఓ కైకేయీ! ఇటు వినుము. వనములలో నివసించువారిచేత కొట్టివేయబడదగిన వృక్షములు తమ సమీపమున ముండ్లపొదలు పెనవేసికొని యుండుటచే భయపడకుండును గదా. శ్రీరాముని లక్ష్మణుడెప్పుడును విడువడు. శ్రీరాముడు కూడ సౌమిత్రిని

గారాబముతోను దయతోను గాపాడుచుండును. అశ్వినీదేవతల జంట యొక్క సౌభ్రాత్రము వలె వారిర్వురి యొక్క భ్రాతృ వాత్సల్యము ప్రఖ్యాతిగా జెప్పికొనదగినట్టిది లక్ష్మణునకు రాముఁడెప్పుడును గీడు దలపెట్టడు. నీ కుమారునకు మాత్రము కీడు తప్పదు. కనుక నీ పుత్రుడు చేయవలసిన పని మేనమామ యింటినుండియే యే వనములకైనను వెళ్లుటయే. ఇదియే నీకు మేలు. నీ కుమారుని దశరథుడే ప్రీతితో ధర్మబద్ధముగా రాజుగా జేసిన యెడల నీ బంధువులందఱును ప్రహృష్టములైన మనస్సులతో నొప్పుదురు. బాలుడును, ఎల్లప్పుడు సుఖములనే యనుభవించినవాడును. సీతాపతికి సహజముగా శత్రువయినవాడును నగు భరతుడు సంపదలు గోలుపోయినవాడై యెట్లు రామునకు లొంగి బ్రదుకగలడు? అడవిలో సింహము యొక్క బారినపడిన యేనుగువలె నీ కుమారుడు రాముని యొక్క బారినబడును. అందుచేత నీవు తొందరగా ముందుముందుగానే పూనుకొని నీ కుమారుని రక్షించుకొనుట కర్తవ్యము. నీవు పూర్వము సౌభాగ్య గర్వముచే నిక్కుచు నీ సవతియగు రాముని తల్లిని ధిక్కరించలేదా? ఆ జాణయైన కౌసల్య ఆ అక్కసునంతను నీపై క్రక్కకయుండునా? సముద్రములచే జుట్టబడిన భూమండలమంతయు పర్వతములు పత్తనములతో గూడ వేగముగా తన వశమయినవెంటనే ఓ కైకా! నీకును నీ బిడ్డడైన భరతునకును దుర్వృత్తిచేత రాముడు గొప్ప కీడు దలపెట్టును సుమా. ఇది నిర్ణయము. నీకు దీనత్వమును పరాభవమును నెట్లు తప్పును? నీ సవతి కొడుకు రాజైన యెడల భరతునకు గీడు తప్పదు సుమా! ఇది నిజము. అందుచే నీ కుమారుడు రాజ్యమేలునట్లును రాముడు వనవాసి యగునట్లును నీవుపాయము నాలోచింపుమా."



# తొమ్మిదవ సర్గము

**కైక మంథరను శ్రీరామపట్టాభిషేక విఘ్నము సేయ నుపాయమడుగుట :**

అని మంథర చెప్పగా విన్న కైకేయి కోపముచే నెఱ్ఱబడ్డ నేత్రములతో నొప్పుముఖము గలదై వేడి నిట్టూర్పులు నిగుడుచుండగా కుబ్జను జూచి యిట్లనెను. “ఇప్పుడే రఘువంశ శ్రేష్ఠుడగు రాముని నడవులపాలుచేసి తొందరగా నా పుత్రుని యౌవరాజ్యము నందింపుగా నిలబెట్టెదను. మంథరా! రాముని రాజ్యభ్రష్ఠునిగను, తొందరగా నా కుమారుని రాజుగాను జేయుటకు నుపాయము నొక్కదానిని జెప్పుము” అనిన పాపపు గార్యములయందు ప్రావీణ్యము గలదియైన కుబ్జ కైకతో నిట్లనెను. “బళిరే! బళిరే! నీ కుమారుడు రాజ్యమును బొందుట కొక్క యుపాయమును దెలియలేకున్నావా? అదియు నీ మేలుగోరి తెల్పెదను వినుము. నీకు తెలిసియు మరచిపోయితివా? లేక నాకు చెప్పక దాచుచున్నావా? ఓ చెలువా! నీవే పూర్వము ప్రేమతో నాకు పలుమారులు చెప్పలేదా. నా మాట వినవలెననెడు కోరిక నీకున్న యెడల యుపాయమును జెప్పెదను. బుద్ధిమంతురాలవై వినుము. సర్వమును విన్న తరువాత మనసులో నాలోచింపుము” అని చెప్పిన కుబ్జ యొక్క మాటలు విన్నదై కైకేయి తన ప్రక్కమీద నుండి కొంచెముగా లేచినదై సంతోషముతో గూడిన ముఖముగలదై కుబ్జతో నిట్లనెను. ఓ మంథరా! నా కుమారు డీ భూమికి రాజగునట్లును రాముడెట్లైనను రాజు కాకుండునట్లును నొక యుపాయమును జెప్పుము” అను కైకేయికి పాపములనే యాలోచించు మంథర రామచంద్రుని విభవమును జెరుపగోరినదై సంతోషముతో గూడిన మనస్సు గలదై యిట్లనెను.

**మంథర కైకకు శ్రీరామపట్టాభిషేకము విఘ్నముసేయ నుపాయంబు చెప్పుట:**

పూర్వమొకప్పుడు దేవతలును రాక్షసులును యుద్ధము చేయుచుండగా శంబరాసురుఁ డింద్రుని జయింపనుండగా నింద్రుడు సహాయమర్థింపగా దక్షిణ దిశయందు దండకారణ్యము ననుసరించి శత్రుపట్టణమగు వైజయంతము మీదకు శత్రువులను దపింప జేయు విధముగా రాజును నీవును వెడలలేదా? ఆ తిమిధ్వజుడగు శంబరుడు వందలకొలది మాయలు గలవాడు. ఆ యుద్ధరంగమున దెబ్బలు తగిలి గాయములై విశ్రాంతిగ నిద్రించు చున్నవారిని రాక్షసులు దుర్మార్గమైన వృత్తిచే పట్టిచంపుచుండగా ఆ సమయమున ఓ కైకేయీ! నీ భర్తయైన దశరథుడు క్రోధముతో అద్దనుజులను దాకి యుద్ధము చేయుచు ఆ రాక్షసులచే నొప్పింపఁబడి వ్రాలెను. గాయములైన రాజునుజూచి నీవా రథమును దూరముగా రణస్థలము నుండి తోలుకొనిపోయి రాక్షసుల బారినుండి తప్పించినదానవై కాపాడితివి. అట్లు రక్షించుటచే రాజు సంతోషించి నీకు రెండు వరముల నిచ్చెను. ఓ కైకా! నీకిష్టమైన వరములను రెండు కోరుకొనుమని రాజు చెప్పగా నీవు నీకు కావలసి వచ్చినపుడు కోరుకొనెదనని చెప్పితివి గదా. ఇప్పుడెట్లు మరచిపోయితివి. నేను నీ క్షేమమును గోరుదానను గనుక యీ కథను నా మనసులో నుంచుకొంటిని.

**మంథర కైకకు రాజుపై గోపము వచ్చినట్లు నటింప బోధించుట :**

తామరరేకుల వంటి కనులు గలదానా! ఓ కైకా! నీ భర్త నిన్ను సంభ్రమముతో జేరవచ్చినపుడు నీవు పూర్వమిచ్చిన వరములను కోరుకొనుము. శ్రీరామ పట్టాభిషేక ప్రయత్నము మాన్పించుటయును, నీ భరతునకు రాజ్యాభిషేకమును, శ్రీరాముడు పదునాల్గేండ్లు వనవాసము చేయుటయును గోరుకొమ్ము. పదునాల్గు వత్సరములు రాముడరణ్యమున నుండుటచే రాజైన నీ కుమారునియందు ప్రజలకు ప్రీతి స్థిరపడును. ఓ కేకయరాజ పుత్రీ! కోపము వచ్చినట్లిప్పుడే పోయి మంచమును వీడి కోపగృహమునందు మాసిన చీర గట్టుకొని,

సంకోచమును మదిలో నుంచక, నేలపై బరుండి నీ భర్త దగ్గరకు రాగానే యేడ్చుచుండుము. వానివంక చూడకుము. పిలిచినను పలుకవలదు. నీ విభుడు నీ యందెంతో యనురాగము గలవాడు. ఇందు సందేహము లేదు. నీ యందున్న అనురాగముచే నీకై నిప్పులలో దూకమన్నను దూకును. నీ కోపమును రాజు చూడలేడు గనుక ఓ తరుణీ! అతడు నిన్నలుగ నిచ్చునా? ఓ సుందరీ! నిశ్చయముగా నీకై ప్రాణములనైనను విడుచును. భయపడకుము. నీ భర్త నీ మాట జవదాటడు. (మూర్ఖురాలా) అమాయికురాలా! సౌందర్యపు బలము నీకున్నదనుట తెలిసికొనలేకున్నావు గదా! నీవు తలపెట్టిన కార్యమును మరచిపోకుము. వెలగలిగిన ముత్యములను గాని, బంగారమును గాని గొప్పవైన రత్నములను గాని యెన్ని యిచ్చెదనన్నను వానిపై మనసు పోనీయకుము. దేవతలకు రాక్షసులకు సంభవించిన యుద్ధమున రాజిచ్చిన రెండు వరములను నీవతనికి జ్ఞాపకము చేసిన నీవు తలచుకొన్న కార్యము పూర్తిగా నెరవేరును సుమా! నిన్ను మంచి మాటలతో లాలించి నీవు కోరిన కోర్కెలను తీర్చెదను, చెప్పుమన్న రాజును ముందుగా నీ వాడిన మాట తప్పవు గదా యని సత్యవాక్యమునకు గట్టువడునట్లు చేసి, రాజా! వేగముగా రాముని పదునాల్గేండ్ల యరణ్యవాసమునకు బంపుము. తరువాత భరతుని నీ ధాత్రికి బట్టము గట్టుము అని వేడుకొమ్ము. రాముడరణ్యవాసము చేయునట్లుగా పట్టుపట్టి కోరుము. రాముడరణ్యమునకు వెడలిన నంతయు మంచి జరుగును. మూల బలమంతయు నీ కుమారుని భయభక్తులతో సేవించును. రాముడడవులలోనే మృతి నొందును. ఇది నిక్కము. అట్లు జరుగక యొకవేళ రాముడు మరలి వచ్చినను కైకా! ఇంతలో నీ కుమారుడు లోకులను సంతోషపరచును. పూజింపదగిన వారలను బూజించును. క్రొత్తమిత్రులతో బలము పుంజుకొనును. రాజ్యములో కొంత బలమును సంపాదించును. ఓ కైకా! భయమును దూరముగా బంపి వరములను గోరుటకు సమయ మిదే సుమా! కనుక రాముని రాజుగా

చేయనీకుము” అని మంథర చెప్పగా కైకయును మిక్కిలి సంతోషముతో నిండిన మనస్సు గలదై విషమువంటి ఆ బోధను తనకు హితమని భావించెను. వెళ్లరాని చోటులకు వెళ్లగోరిన గుఱ్ఱపుపిల్లవలె ఆశ్చర్యమును బొందినదై కుతూహలము పెంపొందుచుండ కైక మంథరతో సంతోషమున నిట్లనెను.

## కైక మంథరను మెచ్చుకొనుట :

“ఓ కుబ్జా! నీ వింతటి ప్రౌఢవని నేనింతవరకు తెలిసికొనలేనైతిని. కుబ్జలు ధరణిలో నెంతమంది లేరు. ఒక్కదానికైనను నీ సాటి నేర్పరితనమున్నదా? సూర్యవంశ శ్రేష్ఠుడగు రాజు యొక్క యాశయమును నేనింతవఱకు గుర్తింపనైతిని. నాకు సన్నిహితురాలవైన నీ వొక్కతెవే నా మేలును మనసునందు తలచినావు కదా! వంకరటింకరగానున్న మరుగుజ్జు స్త్రీలెంతమంది లేరు. ఇస్సీ! వారివంక చూచుటకైనను బుద్ధిపుట్టునా? శరీరమున వంకర టింకరతనము గలిగియుండియు నీవు నీ విలాసములచే నీ ప్రియదర్శనముచే గాలికి వంగియున్న యందమైన పద్మమును తిరస్కరించుచున్నావు. భుజములవరకు ఎత్తుగా పొంగియున్న నీ యెదనుజూచి సిగ్గుపడినదో యన్నట్లు సుందరమగు నాభితో గూడిన యుదరము మొదలుకొనియున్న శరీరభాగము సన్నగిల్లినది. అందముగా నిండైయున్న జఘనభాగమును, బలసియున్న పెద్దస్తనములును నిర్మలమై నీలమై చంద్రసదృశమైన ముఖమును మనోహరమైన మొలనూలి గంటల మ్రోతయును. పొందికయైన పిక్కలును. పలుచనై పొడవుగానున్న పాదములును గలిగి మంథరా! యెంత యందముగ నున్నావే? తెల్లనైన చీరనుగట్టి పొడవయిన తొడలతో నొప్పుచు మెల్లగా నాముందు నీవు నడచుచుండగా మదించిన రాజహంసియనఁ దగియున్నావు. ఆ శంబరాసురుడు వేయి మాయలను మాత్రమే నేర్చెను. ఓ చేడియా! ఆ మాయలు నంతకు మించిన వేనవేల మాయలు నీలో కొల్లలుగా నున్నవి గదా! రథము యొక్క ఘోణము (చక్రసమీపమున నుండెడి యున్నత ప్రదేశము) వలె నీ దీర్ఘమయిన వక్షమునందు రాజనీతులు కుట్రలు నిలువయున్నటుల నేడే తెలిసికొంటిని. భరతుడు యౌవరాజ్యమున పట్టభద్రుడైనచో, రాముడు తొందరగా వనములకు వెళ్లినట్లైన, ఓ చానా! నీ యెదకు శ్రేష్ఠములగు మణులతో

గూర్చిన దండను చుట్టబెట్టెదను. నీ వదనమున తిలకమును దిద్దెదను. శరీరమున నాభరణములుంచెదను. నీకు గట్టుకొనుటకు మంగళకరములగు వస్త్రములనిచ్చెదను. నీవు చంద్రబింబము నెకసక్కెములాడు సాటిలేని మొగముతో దేవతాస్త్రీని బోలి నీకుఁగాని జనులను గర్వముతో దిరస్కరింపగలవు. ఎల్లప్పుడు నీవు నన్ను సేవించు విధముగా నీ కుబ్జలందఱును నీకు వశవర్తులై సేవచేయుచుండగా మిగుల బ్రకాశించెదవు." వేదిక యందగ్నిహోత్రునివలె తెల్లనైన మెత్తని పడకయందు పరుండి తన్ను జూచి పొగడుచున్న కైకను జూచి కుబ్జ "యాలస్యము చేసినచో గతజలసేతుబంధనమగును గదా!

## కైక కోపగృహముఁ జొచ్చుట :

లేలెమ్ము. రాజువచ్చెడు వేళ యగుచున్నది. ఓ చంద్రముఖీ! వెడలి యెదురు చూచుచుండుమ"ని పలుకగా ఆ చంచలనయన యగుకైక మంథరతోగూడి కోపగృహమును విసురుగా బ్రవేశించెను. కైకేయి తన సౌందర్యమును జూచి గర్వించినదై 'రాజంతపని చేయుటకు బూనుకొన్నాడు గదా!' యను క్రోధము గలదై ప్రకాశవంతములైన బంగారముతో మణులతో తయారుచేయబడిన యాభరణములు తారహారములు మొదలైనవి దూరముగా దీసివైచి యీ ప్రకారముగా కుబ్జతో చెప్పెను. "ఓ కుబ్జా నా నియమమును వినుము. రఘురాము డరణ్యమునకు వెడలగా వెంటనే నా కుమారుడు రాజుగావలెను, లేదా ఓ మంథరా! నన్నుపేక్షచేసిన యా రాజునకు నేను చచ్చిన కబురును నీవు నివేదింపవలెను. ఒకవేళ రాజు రామునకే యభిషేకము చేసెనేని భూమిమీద నా జీవిత మింతవఱకే సుమా! ఛీఛీ! మణులును, ఆభరణములును వస్త్రములును బంగారములును నెందులకు?" అని కైక పలుకగా క్రూరమైన మాటలు చెప్పుటలో నేర్పు గల్గిన కుబ్జ ఆ కైకేయిని జూచి రఘువంశ రామచంద్రునకు మిక్కిలి చేటు కలుగునట్లు ఇట్లనెను. "ఓ భామినీ! వినుము. సీతాదేవి భర్తయైన రాముడే భూమికి రాజైనచో నీవును, నీ కుమారుడును నిశ్చయముగా గష్టములను బొందెదరు. దీనిని మఱవబోకు సుమా! అందుచేత నీవేవిధముగా నైనను నీ కుమారుడు రాజగునట్టు లాలోచింపుము" అని యనేక విధముల కుబ్జ బోధింపగా కుబ్జ మాటలనెడు బాణములచే గొట్టబడినదై కైకేయి చేతుల నెదపై జేర్చి కోపావేశముచేత

వికలమైన మనస్సు గలదై "ఆహా! నా భర్త యిట్లు చేయునా?" యని తలంచుచు మంథరను పొగడుచు, తన భర్తను నిందించుచు, "అవురా! ఎంతకు తెగించెను అయ్యో! నా మగడని, నా ప్రియుడని నమ్మిన నాకింత దుఃఖమును కలిగించెనే" యనుచు, కుబ్జను జూచుచు "ఓ కుబ్జా! వినుము నే నిక్కడ నుండి యమధర్మరాజు పట్టణమునకు వెళ్లుటయో లేక భరతుడీ భూమికంతటికి రాజగుటయో జరుగవలెను. రాముడు చాలా కాలమడవులలో తిరుగుచుండగా నా కనులు చల్లగా నుండునట్లు చూచెదను. ఓ మంథరా! ఆ రాముడు గనుక రేపే యడవులకు వెళ్లకపోయినచో నేను పాన్పునందు బరుండను. పూలదండలను ధరించను. నా కన్నులకు గాటుకను పెట్టుకొనను. నీళ్లను గాని యన్నమును గాని ముట్టుకొనను. చందనము పూసికొనను. నేను బ్రతుకుదు ననుకొనుచున్నావా?" అని పరుషమైన మాటలను పలుకుచు కైకేయి భూషణములను తీసివేసినదై కోపాతిశయముచే నల్లబడిన ముఖము గలదై యింట మంచి పాన్పున బరుండక నేలను బడిన కిన్నరస్త్రీ వలె నొప్పెను. నక్షత్రములు మాసిపోవునంతటి చీకటి గ్రమ్మిన యాకాశమో యనునట్లొప్పెను.



# పదియవ సర్గము

**ఈ** ప్రకారముగా దనను పాపపు తలంపులు గల మంథర ప్రేరేపింపగా విషము పూసిన బాణముతో గొట్టబడిన కిన్నరి వలె నేలపై బడి చేయవలసిన పనిని దీర్ఘముగా నాలోచించుకొని తన మనస్సున నిశ్చయించుకొన్నదై కైకేయి కుబ్జ మొగము జూచుచు "నాకు మేలు గలుగజేసితివి. బాగుగా జేసితి"వని పొగడుచు రోషముతో ఆడుపామువలె సెగలు వచ్చునట్లు నిట్టూర్పులు నిగిడించుచు తాను తలచిన పని సొంతమగునో కాదో యని సందేహముతో తన మనస్సునందు తాను చేయవలసిన పనిని తలచుకొనుచుండెను. సంపదలను గోరెడు మనస్సు గల కుబ్జ కైకేయి యొక్క స్థిరమైన తలంపును దెలిసికొన్నదై తాను తలచిన కార్యము పూర్తియైనట్లుగా సంతోషమును బొందుచు బులకించిన శరీరము గలదయ్యెను. కైకేయి యీ ప్రకారముగ తాను చేయవలసిన పనిని నిశ్చయించుకొన్నదై, మిక్కుటమగు కోపముచే ఘూర్ణితమైన మనస్సు గలదై కనుబొమలు ముడివడగా భూమిపై బడి దొరలుచు నుస్సురనియనుచు లోనగలత చెందుచు తన మహాభరణములను పూల దండలను నంతట నెగజల్లెను. అవి భూమిమీద పడగా భూమి తారలతో గూడిన యాకసమా యనునట్లుగా నొప్పుచుండెను. ఒక్కటిగా పెనవేసికొన్న జడతోను, ముడివడిన కనుబొమలతోను, వికృతముగానున్న యాకారముతోను, మాసిన చీరతోను, ఆకాముక తొలగిన యలంకారములు గలదై భూమి మీద బరుండెను.

**దశరథుడు పట్టాభిషేక వార్త దెలుప కైక గృహంబునకు బోవుట :**

శ్రీరామపట్టాభిషేక కార్యక్రమముల నిర్వహించుటకాజ్ఞాపించి గురువులచేత

ననుజ్ఞను పొంది దశరథుడు మనస్సు సంతోషమును బొందుచు తన నివాసమునకు వెళ్లెను. రాముని పట్టాభిషేకవార్త భూమియందంతట ప్రకటమైనది గదా. "నేను ముందుగా బోయి కైకేయికి చెప్పవలదా! యని తలంచుచు దశరథుడు తనకిష్టమైన యీ శుభవార్తను తనకు బ్రియమైన ప్రియురాలికి చెప్పుటకై ప్రేమతో కైకేయి యంతఃపురమును తెల్లని మేఘములతో ప్రకాశించుచు రాహువుతో గూడియున్న యాకాశమును కలువలమిత్రుడైన చంద్రుడు ప్రవేశించినట్లు – ప్రవేశించెను. ఆ యంతఃపురము చిలుకలు కోకిలలు నెమిళులు మొదలగు వాని కూతలవల్ల కలిగిన ధ్వని గలది. పొట్టివారగు స్త్రీలతో (వామనిక) నొప్పునది. తరుగని పుష్పభారముతో నొప్పుచున్న లతలతో ప్రకాశించుచున్న సుందర భవనములు గలది. వెండితో జేసినవి దంతముతో జేసినవి బంగారుతో జేసినవియగు నరుగులు కలది. ఎల్లప్పుడు పుష్పములు ఫలములు గలిగియుండెడి చెట్లు గలది. సుందరులైన స్త్రీలతో శోభించుచున్నది. దేవలోక సమానమైనది. క్రౌంచపక్షులు చేయు ధ్వనులచేతను, వెండి దంతములు బంగారములతో చేయబడిన యాసనములతోను క్రొత్త సంపెంగలతో నొప్పుచున్న రంగుల తీగలతోను, అన్నపానములతోను, భక్ష్యములతోను పెంపుడు రాజహంసల ధ్వనులతోనుతతము మొదలుగా గల చతుర్విధ వాద్యములతోను మనస్సునకు ఇంపు గూర్చుచున్న ఆ యంతఃపురమును బర్వతమువలె ధీరుడైన యా రాజు ప్రవేశించి మన్మథుని బాణములచేత కొట్టబడి కలిగిన మనస్సు గలవాడై పడకటింటి పడకపై లేడికన్నుల వంటి కన్నులు గల కైకేయికై వెదకి కనబడకపోవుటచే నెంతయో చింతించెను. తన భార్య ఆ సమయములో నెప్పుడును పడకటింటిని వదలియుండుట లేకపోవుటచేతను, తానెప్పుడు నావిధముగా వట్టిదైన గృహమును ఇదివరకెన్నడును ప్రవేశించుట లేకపోవుట చేతను దశరథుడు వికలమైన మనస్సు గలవాడయ్యెను. "ఎన్నడును నీవేళప్పుడు ఎక్కడికిని వెళ్లదే. ఈ చిగురువంటి శరీరము గలది నే డొంటరిగా నెక్కడికి వెళ్లినదో కదా" అని స్వార్థపరురాలై మూర్ఖురాలై దుఃఖించుచుండుట కొంచెమైన

నెఱుగని యా రాజు ప్రతీహారిని జూచి "కైక యెచ్చటికి వెళ్లినద"ని యడుగగా నా ద్వారరక్షకి భయముతో చేతులు జోడించి వినయముతో నిట్లు పలికెను. "ఓ రాజా! రాణి కోపముతో మండిపడుచు తొందర తొందరగా కోపగృహము నకు వెళ్లినది" అనగా వ్యాకులమైన మనస్సుతో, గొప్పదైన విచార భారముతో కలగి యా కోపగృహము చెంతకు వెళ్లినవాడై చూచెను. మిక్కిలి తగనిరీతిగా గట్టినేల మీద పరుండి యధికమైన దుఃఖముచే బాధపడుదానిని, పీకి పారవేసిన లేత తీగ మాదిరిగా నలిగినదానిని, భూమిపై వ్రాలిన దేవస్త్రీ వలెనున్నదానిని, నేలపై బడిన కిన్నరివలె నున్నదానిని, దిక్కులేక నేలకూలిన యప్సరసవలె నున్నదానిని, భూమియందు వ్రాలిన మాయవలె నున్నదానిని, వలత్రాళ్లలో జిక్కి తప్పించుకొను దారి నెఱుగక బాధనొందు జింకవలె నున్నదానిని కైకను దశరథుడు, గజరాజు వ్యాధునిచే గొట్టబడిన యాడయేనుగును ముట్టుకొనునట్లు భయముతో మెల్లగా ముట్టుకొన్నవాడై యవ్వనములో నున్న కైకను, తన ప్రాణములకంటె ప్రియమైనదానిని, పాపాత్మురాలిని, కామి యగు నా ముసలి రాజు కాముకయగు నామెను భయముతో గాంచుచు నిట్లు పలికెను.

**దశరథుడు కైక దుఃఖ కారణమడుగుట :**

"ఓ సుందరమైన కైకా! నీవు కోపగించుకొనుటకు కారణమేమియో నేనెఱుగను. ఇట్లు కలవరపడుటకు గారణమేమి? నాకు జెప్పుము. నీకీ దుఃఖమును గలిగించిన వాడెవ్వడు? నిన్నెవడవమానించెను? స్త్రీలందఱిలో మణివంటిదానా! నీవిట్లు ధూళిలో పండుకొని యుండుటచే నా మనస్సు చుఱచుఱ కాలిపోదా? ఓ కలువ కన్నులదానా! దయ్యము పట్టినట్లేల యిట్లు పడియున్నావు? నిన్నీ దుర్దశయందు చూచుటచే నా మనస్సు పగిలిపోవుచున్నది. దేవతల బోలినదానా! నేను నిత్యము పోషించుచున్న కోట్లకొలదిగా గొప్పవారైన వైద్యులులేరా? నీ శరీరమున నున్న వ్యాధిని దెలుపుము. ఒక్క నిమిషములో బాగొనరింతురు. ఎవ్వరికేమి చేసిన నీ కిష్టమగునో చెప్పుము. నిన్ను బాధించిన

యే దురాత్మునకు కీడు గలిగించవలెనో చెప్పుము. ఎవ్వనికి దుఃఖమును గూర్చుటచే నెవ్వడు సంతోషింపదగునో యానతిమ్ము ఓ కృశోదరీ! ఏడ్వకుము. ఇట్లేల నీ శరీరమును క్రుంగజేసెదవు. ఓ చానా! నీకై చంపదగని వానినైన జంపించెదను. చంపదగిన వానినైన విడిపింతును. ధనికుని బీదవానిని జేసెదను. నిరుపేదను ధనవంతుని జేసెదను. ప్రేమతో చెప్పుము. నేనును నా వారును నీ సేవకులము గామా? ఓ యువతీ! యేల చింతింతువు. నీవు మనస్సులో దలచిన పనిని నేనే విధముగనైన భంగము కలుగజేయుదునా? నా ప్రాణముల నైనను నీవు కోరినచో నిచ్చెదను. నామీద నీకెందుకింత యవిశ్వాసము వచ్చినదో చెప్పుము. నా ప్రేమ నీకు దెలియదా? తూరుపుదేశమునందు, సింధుదేశము నందు సమృద్ధి గలిగిన మత్స్య సౌవీర దేశములందును, మగధ దేశమందును, దక్షిణదేశమందును, కాశియందును, కోసలదేశమందును, వంగదేశమునందును ఉన్న యేవస్తువులనైనను కోరుకొనుము ఓ కోమలీ! నా పూర్వపుణ్యముల సాక్షిగా నీ కవి యిచ్చెదను. లేలెమ్ము. ఈ యాయాస మెందులకు? ఓసి పిరికిదానా (భీరుః) ! చెప్పు మేవిధముగ నీవు భయమును వ్యాకులత్వమును బొందితివి? నీ భయమును సూర్యుడు మంచును వలె నశింపజేయుదును" అని యూరడించగా తన మనసులోనున్న కోరికను రాజునకు చెప్పకముందే యతని దుఃఖమును మఱింతగా పెంచవలెనని కైకేయి తలంచెను.



# పదునొకండవ సర్గము

## కైక కోర్కె నెరవేర్చెదనని దశరథుడు ప్రమాణము చేయుట :

మన్మథుని యొక్క బాణముల యొక్క తీవ్రమైన దెబ్బలచే మిక్కిలి వ్యథచెందుచున్న తన భర్తయైన దశరథుని జూచి యా కైకేయి కుటిలమైన మాటల నేర్పుతో కఠిన విషయములను చెప్పదొడగెను. "ఓ రాజా! నే నేరోగము చేతను బాధనొందుటలేదు. నా కపకారము నెవ్వరు చేయలేదు. నీ వలననే నా కోరిక సఫలము కావలెను. నీకు చేయుట యిష్టమైనచో చేసెదనని శపథము చేసితివేని చెప్పెదను." అనగా చిన్న నవ్వు నవ్వి మన్మథాగ్నిచే గాల్పబడ్డ మనస్సు గలవాడైన యారాజు తన సతి యొక్క శిరమును తొడ మీదకు జేర్చినవాడై, తన చేతులతో జుట్టును ప్రేమతో సవరించుచు నిట్లు పలికెను. "ఓ కామినీ! గర్వముచేత నా మనస్సును తెలిసికొనలేకున్నావు. ఓ వనితా! జగత్తంతయు వెదకి చూచినను నీకంటె ప్రియమైన వస్తువింకొకటి యున్నదా? పురుషులలో మన రామునికంటె ప్రియమైనవారు నాకెవరున్నారు? ఓ యింతీ! జయింపరాని వాడును, ముఖ్యమయినవాడును, మహాత్ముడును, నా ప్రాణమైనవాడును, రఘువంశ శ్రేష్ఠుడును నగు రామునిమీద శపథము చేసెదను. నీ కోరికను చెప్పుము తీర్చెదను. ఓ చంచలాక్షీ! యెవ్వనిని ముహూర్తకాలము చూడకున్న సంతాపమును బొంది భూమియందు నిజముగా బ్రదుకజాలనో యటువంటి రామునిపై శపథము చేయుచున్నాను. నీ మాటను నెరవేర్చెదను, చెప్పుము. రామచంద్రుని కొఱకై నా శరీరము నైనను విడచెదను. దయలేక తక్కిన కుమారులనైనను విడచిపెట్టెదను. రాజశ్రేష్ఠుడగు నా రామునిపై శపథము చేసెదను. ఓ సతీ! నీ మాటను నెరవేర్తును. సరోజముల వంటి కనులు గల ఓ కైకా! నా మనస్సు యొక్క చందము తెలిసికొని, నా వాక్కు మనస్సు ఏకముగా నుండుట బాగుగా గుర్తించి తొందరగా నీ యొక్క కోరికలను జెప్పుము. నేను

బ్రదుకలేను సుమా. నన్ను రక్షింపుము. (నన్ను వశము జేసికొన్న) నీ (సౌభాగ్య) బలము బాగుగా నెఱిగి యుండియు నీ విట్లు సంశయింపదగునా? నేను చేసిన పుణ్యముల సాక్షిగా బాస చేసెదను. నీ కోరిక తప్పక తీర్చెదను" అని దశరథుడు పలుకగా కైక సంతోషముతో వికాసమును బొందిన వదనము గలదై, తన మనస్సులోని సంకల్పము నెరవేరినట్లు తలంచినదై, రాజు భావము తెలిసి సంతోషమును బొంది, తమ మధ్య మధ్యవర్తులెవ్వరు లేకుండుటచే నా క్రూరస్వభావము గల స్త్రీ యాకస్మికముగా వచ్చిన యమునివలె భయంకరము లగు మాటల నిట్లు పలికెను. "ఓ రాజా! ముందుగా శపథము చేసి నా కోరిక నిచ్చెదనంటివి. నీ మాటలను భూమియు, సూర్యుడును, చంద్రుడును, ఆకాశమును, రాత్రియు, పగలును, అగ్ని మొదలుగా గల దేవతలును, భూతములును, దిక్కులును, మీ గృహదేవతలును, మఱియు తక్కిన ప్రాణులును, రాత్రించరములును వినెదరుగాక! నీతిమంతుడును, ధర్మజ్ఞుడును, ఎల్లప్పుడు సత్యమును జెప్పువాడును, స్థిరమైన మనస్సు గలవాడును నగు నా భర్త దయతో వరముల నిచ్చెను, ఓ దేవతలారా! రాజు మాటలను వినుడు!

**కైక తన పూర్వవరముల వృత్తాంతమును జెప్పుట :**

అని కైకేయి బిగ్గరగా జెప్పి కామమోహితుడగు రాజును సత్యమనెడు పాశములచేత బంధించినదై "ఓ రాజా! పూర్వపుమాట జ్ఞప్తియందున్నదా? దేవతలు రాక్షసులు యుద్ధము చేయుచు నిన్ను సహాయము కోరగా ఆ యుద్ధములో విరోధుల యొక్క బాణములచేత కొట్టబడి మూర్ఛితుడవైన నిన్ను రణరంగమున నేను ప్రమాదము లేకుండ జాగ్రత్తగా కాపాడలేదా? అప్పుడు నీయంత నీవే రెండు వరముల నీయలేదా? ఆ వరములనిప్పుడిమ్ము. ఓ రాజా! నీవు సరసద్గతతో ఆ వరముల నీయకపోయినచో నేనిప్పుడే మరణింతును. వింటివా? వరములను రెంటిని నీయొద్ద నిక్షేపముగా దాచితిని. వాటిని తిరిగి తీసికొన గోరితిని. అందుచే నిన్నడుగుచున్నాను. నాకు వాటినిమ్ము" అని పలుకగా వలలోనికి పరువెత్తు లేడివలె స్త్రీ యొక్క యుచ్చులలో బడినవాడై "ఓ తరుణీ! జ్ఞాపకము వచ్చినది. మరల నిచ్చుచున్నాను" అని చెప్పెను. (కాలుడు

కాలుపట్టి కాటికీడ్వ కాముడు కేలుపట్టి కైక కాలి(క్రిందకీడ్చెను) మఱల కైక “ఓ రాజా! నీవానాడిచ్చిన యా వరములు రెండింటిని నిప్పుడడుగుచున్నాను. వానిని విశదముగా జెప్పెదను. నీవు వినుము. సత్యమును మనస్సులో నిలుపుకొన్నవాడ వగుము.

**కైక భరతు పట్టాభిషేకము, శ్రీరామప్రవాసము వరంబులుగ గోరుట :**

శ్రీరాముని యొక్క పట్టాభిషేకోత్సవము నాపుచేసిన వాడవై యా సంభారములతో యథావిధిగా నా కుమారుడైన భరతునకు పట్టాభిషేకము జరిగించవలెను. ఇది యొక వరము సుమా! రాజా! నీవు పూర్ణమైన మనస్సుతో సురాసుర ఘోర యుద్ధమునందు నాకిచ్చిన రెండవ వరమును గోరుటకు సమయము వచ్చినది. సూర్యవంశ శ్రేష్ఠుడైన ఓ రాజా! నారచీరలు గట్టి జింక చర్మము ధరించి జుట్టు జడలుగట్టునట్లు చేసికొని మౌనియై పదునాలుగేండ్లు దండకావనమందు సీత భర్తయైన రాముడు సంచరింపవలెను. అడ్డులేనటు వంటి యౌవరాజ్యము నా కుమారునకిప్పుడే సంక్రమింపవలెను. ఇవియే నా మనస్సు నందున్న కోరికలు. మునుపు నీవిచ్చిన వరములనే యిప్పుడు నేను మరల కోరుచున్నాను. ఆ శ్రీరామచంద్రుడు వనములకు వెళ్ళుటను నేనీ కన్నులతో నిప్పుడే చూడవలెను. ఈ భూమియందు రాజులకు రాజువని ప్రఖ్యాతిని బొందినవాడవు కావున సత్యమును దప్పని వాడవు కమ్ము. నీ కులము కల్మషములేనిది నీ జీవితమును సార్థకము చేసికొనుము. ఓ సత్యభాషణా! ఇహమును పరమును బొందవలెనన్న మానవులకు సత్యమే శరణమను మునివర్యుల యొక్క మాటలను వినలేదా?”



# పండ్రెండవ సర్గము

## కైక కోరిన వరములను విని దశరథుడు పరితపించుట :

అని కైకేయి పలుకగా మిక్కిలి దారుణమైన యా పలుకులను విన్నవాడై రాజు తహతహనొంది ఎక్కువైన చింతచేత కుంది ఒక ముహూర్తకాలము చింతించి తొందరతో తనలో తానే యిట్లనుకొనెను. “ఆహా! యిది యేమి? నాకు కలరాలేదు కదా? మతి చెడిపోలేదుగదా? పూర్వజన్మమందనుభవించబడిన కార్యమిట్లు తోచుచున్నదా? మనోవ్యాధిచేత మనస్సు చలించుటయా?” అని మనస్సులో దలంచుకొని దుఃఖముతో నా రాజచంద్రుడు క్రుంగిన వాడయ్యెను. రాణి యొక్క ములుకుల వంటి మాటలచే గొట్టబడి సొమ్మసిల్లి కొంతసేపటికి మేలుకాంచి యొక ఆడపులిని జూచిన లేడి మాదిరిగా మనస్సు వికలమై దుఃఖితుడై వట్టి నేలపై నుండి మంత్రముచే గట్టువడ్డ పాముదవలె దీర్ఘమైన నిట్టూర్పులు విడచుచు కోపముతో “హా! ఛీ!” యని పలికి దుఃఖముచేత మూర్ఛను బొందినవాడై మరల తెలివొంది కోపపు చూపులతో గాల్చెడు విధముగా కైకతో నిట్లు పలికెను.

## దశరథుడు కైకను దూషించుట :

“ఓసీ! దురాత్మురాలా! అయ్యయ్యో! యిది యెంతటి గయ్యాళితనమే? ఓ రాతిగుండెదానా! సజ్జనులచే స్తుతింపబడు యీ వంశమును నశింపజేయుటకై యిక్కడకు వచ్చితివా? నాయందుగాని రామునందుగాని వీసమంతైనను పాపమున్నచో చెప్పుము. నీవిట్లు ద్రోహమును తలపెట్టుటకు గారణమేమి? రాముడు నిన్ను కన్నతల్లివలె నెల్లవేళలను మనస్సులో తలంచును గదా! ఈ చెడుపనికెందుకు తలపెట్టితివి? ఎక్కువ విషము గల పామును తెలివితక్కువ

వాడనై రాజకన్య యనుకొని భ్రమనుజెంది నా గృహమునందు జేరనిచ్చితిని. కీడు తెచ్చుకొంటిని. ఎల్లప్పుడును లోకులందఱు మంచి గుణములుగల రామచంద్రుని మిక్కిలిగా బొగడుచుండగా నేనేమి నేరమును మోపి నా ప్రియకుమారుని నడవులకు బంపుదును. కౌసల్యనైనను విడుతును. సంపదలనైన విడుతును. సుమిత్రనైన విడుతును. నా ప్రాణములైనను విడిచెదను. ఓ పడతీ! పితృదేవుని యందు భక్తిగల, మంచి నడవడిగల యా రామచంద్రుని విడువలేను. నీమదిలో నమ్ముము. నా జ్యేష్ఠపుత్రుడైన శ్రీరాముని గన్నులార చూడగా చూడగా ప్రేమ యతిశయించును. ఓ దుష్టురాలా! ఒక్క నిమిషమైనను రాముని విడచి బ్రతుక గలుగుదునా? సూర్యుడు లేకున్నను లోకము, నీళ్లు లేకున్నను పైరులు ఒక క్షణమైన నిలుచునుగాని నా రాముని వదలినచో నా శరీరమున ప్రాణములేవిధముగా నిలువగలవు? పట్టుపట్టి యింతటి ఘోరమైన కఠినమైన పాపకార్యమును నాచేత జేయింతువు. దీనిని మానవే. ఓసి దుర్మార్గురాలా! నీ కాళ్లమీద పడి వేడెదను. నన్ను రక్షింపుము. ఓ కైకా! నాకు భరతునిపై ప్రేమ యున్నదో లేదోయని తెలిసికొన గోరి భరతుని యభిషేకమును గోరితివేమో. ఇంతవఱకు ప్రేమతో రాముడు నాకు పెద్దకొడుకు. భరతుడు చిన్నవాడు. రాముడు ధర్మగుణము గలవాడు. శ్రీమంతుడు అని నా సంతోషమునకై యిచ్చకములాడితివా? లేక రామునిచేత సేవలు పొందుట కట్లుంటివా? ఇప్పుడా రాముని పట్టాభిషేక వృత్తాంతమును విని వ్యథతో గూడినదానవై నన్ను మిక్కిలి దుఃఖపెట్టుచున్నావు. ఓసీ కఠినురాలా! పరుల మాటలను విని సొంత యింటినే పాడుచేసికొనుచున్నావా? నీతి తెలిసిన నీవు దుష్టమైన నీతితో మతిచెడినదాన వగుటచేత ఓ వనితా! నీ మూలమున మెచ్చదగిన యిక్ష్వాకు వంశమునకే చెడుకాలము వచ్చినట్లున్నది. ఇంతకు ముందెప్పుడును కొంచెమైనను ప్రియముకాని మాటలను పలికి యెఱుగవు. ఎటువంటి అనుచితములను చేసినదానవు గావు. ఇప్పుడిట్లు చేయుదువా? యిది యేమి మాట? ఓ నీరజాక్షీ! నేను నమ్మలేకున్నాను. నాతో నీవెన్నిమారులో నాకు భరతుడెట్టివాడో రాముడును

అట్టివాడే యని పలికియుంటివి. అటువంటి ధర్మాతుడైన రాముడు పదునాలు గేండ్లడవి యందెట్లు కష్టపడగలడు?

**దశరథుడు శ్రీరాముని గుణములను వర్ణించుట :**

శ్రీరాముడు చాల సుకుమారమైనవాడు. నీతిమంతుడు. ప్రజలకు హితమొనరించుట యందాసక్తి గలవాడు. ధర్మముగా నడచువాడు. ఓ భామా! నీకు భక్తితో సేవలు సేయువాడు. అటువంటి రాముడెందుల కడవులకు వెళ్లవలెను? భరతుని కంటెను రాముడు నీ సేవలు చేయుటలో శ్రేష్ఠుడని నేను తెలిసికొంటిని. నీ సేవలు సేయుటలో రామునికంటె భరతుని యందు నిన్ను సేవించుటలో విశేష గుణములేమియున్నవో నీవైన చెప్పుము. నాకేమియు గన్పింపలేదు. ఇట్టి గుణములు కల రాముడు వనములలో విడువదగిన పుత్రుడా? మనసార పూజించుటయందును, గొప్పదైన గురుభావమును తలచుటయందును, గౌరవపు మాటలయందును క్రియలయందును శ్రీరామునికంటె నధికముగా నెవరు నిన్ను సేవించువారో చెప్పుము? వేలకొలది స్త్రీలయందుగాని సేవకులందుగాని ఒక్కరైన నెన్నడైన నొకనిందగాని యపవాదుగాని వేళాకోళమునకైన రామునిపై నీకు చెప్పియున్నచో వ్రేలుమడచి చెప్పగలవా? నిర్మలమైన బుద్ధితో మంచిమాటలతో రాముడు సమస్త ప్రాణికోటికి కోరికల నిచ్చువాడై తన త్యాగముచే లోకులను తన యందిష్టము గలవారిగా జేయును. సత్యమైన మాటలచే లోకములోనున్న ప్రజలను, దానముచే దరిద్రులను, తగిన శుశ్రూషచేత గురుజనంబులను, తన బాణములచే యుద్ధమున శత్రువులను రామచంద్రుడు గెలువగలవాడు, శ్రేష్ఠమగు సత్యము, దానము, గొప్పనైన తపస్సు, నిర్మలత్వము, స్నేహగుణము, త్రికరణశుద్ధి, గురుసేవ, విద్య, త్యాగము నను నవి స్థిరముగా నా రాముని యందే యొప్పుచుండును. త్రికరణశుద్ధి గలవాడును, దేవసమానుడును, ఋషులవంటి తేజస్సు గలవాడును, గొప్పదైన కీర్తిని సంపాదించినవాడును నగు రాముడు విడిచిపెట్టదగినవాడా? దేవీ! అప్రియములైన మాటలను జగములచే

ప్రేమింపబడు రామునికై మనస్సులో నైనను తలపెట్టలేను. అటువంటిది నీ ప్రేరణచే నా ప్రియపుత్రునితో అప్రియములు నేనెట్లు పలుకుదును?

**దశరథుడు కైకను వేడుకొనుట :**

ఓర్పును నింద్రియనిగ్రహమును, త్యాగమును, సత్యమునందాసక్తియు, ధర్మమును, కృతజ్ఞతయు, సర్వజీవులయందు దయ చూపుటయును గల సీతాపతిని నాకు దూరము చేసితివేని అయ్యయ్యో! ఇక నా గతి యేమిటి? పురము నన్ను పొమ్మనుచున్నది కాదు రమ్మనుచున్నది. ఓ రమణీ! నేను ముసలివాడను సుమీ, తపస్విని, దీనుడను నిన్ను మఱి మఱి వేడుచున్న నన్ను దయతో గాపాడుము. సముద్రము వఱకు గల భూమియందు లభించెడు ధనమంతయు గవ్వయైనను తీసికొనకె నీ కిచ్చెదను. ఓ తరుణీ! నామీద కోపమును బొందకుము. దయతో జూడుము. చేతులు జోడించి మ్రొక్కుదును. నీ కాళ్లనైనను పట్టుకొనెదను. రామునిమీద పగ సాధింపకుము. ఓ కైకా! నీవే వానికి శరణముకమ్ము. ఈ దుఃఖమును మాన్పుము. ఇట్లు చేసినచో నాకధర్మము సోకదు" అని రాజు మిక్కుటమైన శోకసముద్రమున మునిగిన చిత్తము గలవాడై భూమిపై సొమ్మసిల్లిపడెను. మూర్ఛను పొందెను. మరల లేచెను. "శోకమనెడు సముద్రము యొక్క తీరము నే విధముగనైన జేర్పవే ఓ బాలా!" యని దుఃఖించు చున్న రాజును జూచి కైకేయి శోషముతో గూడిన భయంకర వాక్యముల నిట్లు పలికెను.

**కైక దశరథుని దూషించుట :**

"ఇచ్చెదనని చెప్పి, నేను వరములను కోరగానే యీ ప్రకారముగా నేడ్చుచున్నవాడవు. ఇక తగుదునని నలుగురిలో ధార్మికుడనని చెప్పుకొనుటకు నీకు నోరెట్లు వచ్చును. అందరకు ధర్మము నెట్లు చెప్పెదవు? ఓ ధార్మికోత్తమా! ఎచ్చటనైనను భూమియందు గల రాజర్షులును నీవును గలసినచోట నీ రాజచంద్రుడు గొప్ప ధార్మికుడన్నచో నే విధముగా మాటాడుదువు. ఎవతె

యనుగ్రహమున బ్రతికితినో అట్టి కైకేయి యెడలనే మాట తప్పితినని చెప్పుదువా? నీ కారణమున నెల్లరాజులకు నపకీర్తి వచ్చును గదా. ఇప్పుడన్న మాటనే తప్పుకొన జూచెదవు. పూర్వకాలమున శిబి యను రాజచంద్రుడు పావురమును బాధపెట్టుచున్న డేగకు తన శరీరము నుండి మాంసమును గోసి యొసగలేదా? కన్నులిమ్మని యొక బ్రాహ్మణుడు యాచింపగా నతడు కోరిన విధమున గన్నులిచ్చి యలర్కుడను రాజు సాటిలేని యుత్తమగతి నొందలేదా? సముద్రము చెలియలికట్టను దాటి యేల రాదు. నియమము తప్పకుండుటచేతనే గదా! నీవివియెల్ల చక్కగా నాలోచించినవాడవై నీ మాట యసత్య మయ్యెనని దూషింపబడకుండగా నీ జగత్తునందు కీర్తిని నిలబెట్టు కొనుము. నీవు ధర్మమును విడచిపెట్టిన వాడవై సత్యమును మనస్సున దలంపక రాముని ప్రేమతో రాజుగా జేసి యెల్లప్పుడును గోసలరాజ పుత్రికతో రమింతువా? ధర్మమో లేక యధర్మమో, అసత్యమో, సత్యమో ఏదియైన నగుగాక! ఓ దుర్మార్గుడా! నీ ప్రమాణమును నీవీయకున్నచో నేనెట్లు విడిచిపెట్టుదును? రాముని రాజుగా జేసినచో ఓ రాజా! మహావిషమును ద్రావి నీ ముందే నీవు చూచుచుండగనే చనిపోయెదను. ఇది నిజము సుమా! రాముని తల్లియైన కౌసల్యకు చేతులు జోడించి యందఱు నమస్కరించుచుండగా భూమిపై బ్రతికి యుండి చూచుట కంటెను చనిపోవుటయే ఓ రాజా! నాకు మేలైన పని.

**కైక నిష్ఠురోక్తులకు దశరథుడు విహ్వాలుడగుట :**

ఓ రాజా! నాపైనను భరతునిపైనను శపథము చేసి చెప్పుచున్నాను వినుము. దయ చూపక రాముని నిప్పుడడవులకు బంపుట తప్ప వేఱొకదానిచే నేను తృప్తిని బొందను.” ఈ ప్రకారముగా బలికి కైకేయి విచారముతో కుందుచున్న రాజుతో మాటలాడక యూరకుండెను. దశరథుడును దన భార్య కోరిన చెడ్డకోరికలను తలచి మనస్సునందు కలతను భయమును బొందినవాడై క్షణకాలము కోపముతో మాటాడుట మానివేసిన భార్య నట్లే చూచి దుఃఖముతో దపించినవాడై పిడుగుల వలె దాకుచు తాపము గలిగించుచు మనస్సునకు

అప్రియములైన మాటలచేత తొట్రుపాటును చెందుచు, బాధనొందుచు, నాకైక తలపెట్టిన దుర్మార్గమైన పనిని దలచుకొని, యీ దురాత్మురాలెంతటి పనికి పూనుకొన్నదిరా! యని భావించెను. మఱల నంతలోనే తాను చేసిన ప్రమాణమును తలంచుకొని బాధనొందును. రాముని గూర్చి యాలోచించుచు వెచ్చనైన నిట్టూర్పులు విడచుచు – రామా! రామా! యని పలవరించుచు రాజు మూర్ఛవచ్చి, మొదలంట నరికిన భూమిపై దబాలున బడు వృక్షమువలె భూమిపై పడెను. మనస్సు నశించిన వానివలెను, మతి చలించినవాని మాదిరి గాను, గొప్ప రోగముచే బీడింపబడిన వానివలెను, తేజము నశింపగా మంత్రములచే గట్టువడ్డ పాము మాదిరిగాను నయి దశరథుడు కైకతో మిక్కిలి దీనముగా నిట్లు పలికెను.

**దశరథుడు కైకేయితో న్యాయ నిష్ఠురములాడుట :**

"ఓ కైకా! నీ కెవ్వరిట్టి చెడ్డకోరికను మంచిదని బోధించినవారు? సిగ్గులేక నీవీ విధముగా దయ్యముపట్టిన దానివలె నాతో పొగరుపట్టిన మాటల నాడజొచ్చితివి. ఓ కోమలీ! యీ వికటమైన ప్రవర్తన నీయందు నే నింతకు ముందు చూడలేదే. ఇప్పుడే వ్యతిరేకముగా గన్పించుచున్నది. ఏమిటే నీకు కలిగిన భయము? ఎందుకే నీ విటువంటి కోరికలను కోరుచుంటివి? చిన్న వానికి బట్టము గట్టుటయు జ్యేష్ఠుడగు రాముని నుగ్రములైన యడవులకు బంపుటయు నేల గోరెదవు. ఛీఛీ! నీ భర్తకును, కుమారులకును లోకులకును ప్రియముగావింప దలచినచో నీ విపరీత పద్ధతులను మానుకొనుము. ఓ దయలేనిదానా! క్షుద్రమైన పాపములు మనస్సులో గలదానా! నాయందు గాని రామునియందు గాని యెట్టి యపరాధమునైనను జూచితివా? ఎందుచేత నీవు దుఃఖించుట? ఊరకూరక యిట్లు మాటాడుట నీతియా? సాధుత్వము గల స్త్రీలకు తగిన రీతియా? రాముడు లేకుండగా భరతు డీ రాజ్యము నేలుట కంగీకరించునా? ఓ భామినీ! రామునికంటెను భరతుడు ధర్మము నెఱిగినవాడు సుమా! రామా! నీవు వనములకు వెళ్లుమని చెప్పగానే రాహువుచేత కబళింప

బడిన చంద్రబింబమువలె వెలవెలబోవు రాముని ముఖమును నేనెట్లు చూడగలను. హితులైన వారందఱును సమ్మతించిన పని భంగమునొందగా శత్రువులచేత సైన్యమంతయు జంపబడినట్లుగా నేనెట్లు మరల సుఖము నొందగలను? అన్ని దిక్కుల నుండియును ప్రేమతో గుంపులుగా వచ్చిన రాజులు నన్నేమందురు? ఈ రాజింత కాలము ఏ విధముగా రాజ్యపాలనము సాగించెనని నవ్వరా? పెద్దలైనవారు, సజ్జనులు, విద్వాంసులు రామచంద్రు డెక్కడనున్నాడని యడుగగా నేమని చెప్పువాడను? కైకేయి నన్ను పీడింపగా నా కుమారుని పోగొట్టుకొంటినని చెప్పుదునా? అది నిజమైనను పదుగురు గూడియున్న సభలో జెప్పిన మాట చెల్లింపకపోయిన సత్యమును భంగపరచినట్లు గాదా? ఓ సుందరాంగీ! నీ మాటపట్టి నడచినచో నెన్ని విధములుగా జూచినను ఇహమును బరమును పోవునుగదా. రాముని నడవులకంపించగా కౌసల్య నా కొడుకేడని యడిగిన నేనేమని యీ ప్రియముకాని మాటను చెప్పుదును? కౌసల్య నాకు సమయోచితముగా స్నేహితుని వలెను దాసివలెను భార్యగను సొంత తోడబుట్టిన దానివలెను కన్నతల్లివలెను సంచరించునది. మంచి మాటలాడునది, మంచి కోరికలుగలది, పుత్రప్రేమ గలది. ప్రేమకు మిక్కిలి యర్హురాలయినది. ఇట్టిదయిన ఆ కౌసల్యను నీ మూలమున నేను తెలివి తక్కువవాడనై గౌరవముగా జూడనయితిని. నేను పెట్టిన కష్టములు తలచిన కడుపు తరుగుకొని పోవుచున్నది. ఓ వగలమారీ! నేను నీకై చేసిన దంతయు దలచుకొనిన వ్యాధిచే బాధపడుచున్నవాడు తెలిసికొనలేక చేసిన యపథ్యమయిన భోజనము వలె నా బాధను బెంచసాగినది. రాముని యందిటువంటి కొఱగాని నెపములు కల్పించి యడవులకు బంపినచో చూచి భయముచెంది సుమిత్ర నన్నేవిధముగా నమ్మును? నేను చచ్చిపోవుటయును దన భర్త యడవికి వెళ్లుటయును నీ రెండును విన్నదై (సింహము నడుమువంటి నడుముగలది) సింహమధ్యయగు సీత యీ గొప్ప దుఃఖమునెట్లు సహించునో గదా? అయ్యో! తన భర్త యడవికి వెళ్లిన భరింపరాని దుఃఖమునొంది జానకి మనసు చెడినదై

హిమాలయమునొద్ద కిన్నరుని పోగొట్టుకొన్న కిన్నరి వలె పడిపోవునుగదా. అడవికి బోవుచున్న నా కుమారుని, కంటికి కడవెడు నీరుగార్చుచు నేడ్చుచున్న జనకరాజ సుతను జూచి నేను చాలకాలము జీవింపగలనా? సీతాపతిని వదలి బ్రదికి యుండుట నా తరమా? నా చావును జూచినదానవై తరువాత వైధవ్యమును బొందినదానవై యీ రాజ్యమును నీ పుత్రునితో గలసి నీవే తలగట్టుకొనుము. తళతళమని మెరసిపోయెడు విషము గలపబడిన మధువును ద్రాగి తరువాత బాధపడు మానవునివలె భార్యవనుకొని దుర్మార్గురాలవగు నిన్ను దలకెక్కించుకొని బాధపడుచున్నాను. మృగములను బట్టువాడు వినసొంపైన గానసుధచేత జింకనుబట్టి వధించినట్లు మనస్సునకు నచ్చెడు నబద్ధములను చెప్పి నీ యిష్టము వచ్చినట్లుగా నీ వశముచేసికొని నన్ను చంపనేర్చితివి. భార్యతో సుఖములను బొందుటకై పుత్రునమ్మిన నన్ను జూచి పండితులు వీధులలో కల్లుద్రావిన బ్రాహ్మణుని నిందించిన మాదిరిగా చెడదిట్టరా? నీ మాటలను విని కూడ నిన్ను మన్నించి యూరకున్నాను. ఇది యెంతటి కష్టము? ఎంత దుఃఖము? ఇది పూర్వజన్మమున నేను జేసిన పాపము. అనుభవింపక యెట్లు తొలగును? పాపాత్మురాల వగు నిన్ను చాల కాలము కాపాడితిని. ఉరిత్రాడువని తెలిసికొనలేకపోయితిని. చిన్న పిల్లవాడు దుష్టమైన పామును ఒంటరిగా ముట్టినట్లు నిన్ను మృత్యువునువలె చేపట్టితిని. ఎంతటి హీనుడు, ఎంతటి కాముకుడు, ఎంతటి దుష్టబుద్ధి కలవాడు ఈ రాజు. తన ముద్దుల కుమారుని రాముని భార్యకై యడవులకు బంపుచున్నాడిదేమి పాపమో యని యెల్లలోకముల నుండు జనులును నన్నెల్లప్పుడు దూషింపక యుందురా? అనేక వ్రతముల తోను బ్రహ్మచర్య నియమములతోను బాధనొందిన కుమారు డిప్పుడు సుఖపడవలసిన సమయములో నడవులపాలయ్యెనే. మహానుభావుడైన రాముడు పాపభూయిష్ఠుడనయిన నాకేల పుట్టెనో? అయ్యో! ఓ వామాక్షీ! నా కారణముననే తండ్రిలేని వాడగుచున్నాడుగదా! అడవులకు వెళ్లుము కుమారా! యని నేను చెప్పగా అటులనే యనును గాని రెండవ మాట చెప్పడుగదా!

అట్లుకాక రామచంద్రుడు ప్రతికూలమైన మాటను చెప్పువాడైన నా కెంత మేలు చేసినవాడగును? కళంకములేని వాడగుటచే రామచంద్రుడు నా తెలివి తక్కువ విధానమును తెలిసికొనడు. అయ్యో! అడవులకు వెళ్లుమనగానే యటులనే యనును గాని యెందులకు వెళ్లవలెనని గూడ యడుగడు కదా! రాము నరణ్యములకు బంపిన వెంటనే యెల్లజనులచేత నిందింపబడుటను సహింపలేని సాటిలేని పాపాత్ముడనగు నన్ను తప్పక మృత్యుదేవత యముని గృహమున కీడ్చుకొనిపోవును. నేను యమపురమునకు రామచంద్రుడు వనములకు వెళ్ళిన తరువాత నా వారి నందఱను నీవే విధముగా గష్టపెట్టెదవో యని నా మనస్సు కలతజెందుచున్నది. రాముడడవికి వెళ్లినచో నేను చచ్చిపోవుట యథార్థము. మాతోడనే కౌసల్యయును మృతిని బొందును. ఎల్లవేళలందును లక్ష్మణుడు రాముని విడచియుండడు. అందుచేత నతడన్నతోడనే యడవులకు వెళ్లును. శత్రుఘ్నుడు మునుపే భరతునితో వెళ్లెను గదా! అక్కటా! భర్తయును పుత్రులును తనను వదలివెళ్లినచో సుమిత్ర దుఃఖసముద్రములో మునిగినదై నా వెంటనే యమపురికి వచ్చును. నన్ను, కౌసల్యను, సుమిత్రను, మంచి గుణములుగల ముగ్గురు కుమారులను ఎక్కువైన దుఃఖములో ముంచి నీవే సర్వసుఖములను అనుభవించుచు, అందరును ఛీఛీ యనుచుండగా నుండుము. శ్రీరాముడును నేనును లేనటువంటిదై, స్థిరమైనదియు, గౌరవింపబడినదియు, సద్గుణములచే బ్రకాశించునదియు, ప్రశాంతమైనదియు నగు రఘురాజుల వంశము పాడుపడగా నీ వీ రాజ్యము నేలుకొనుము. రాముడడవులకు వెళ్లుట నీ కుమారున కిష్టమైన యెడల నేను చనిపోయిన వెనుక నా యుత్తర క్రియలను నీ కుమారుడు చేయకుండుగాక! ఓసీ! దుష్టురాలా! ఓసీ! నాపగదానా! నేను చచ్చిపోగా రాముడడవికి వెళ్లగా నీవు విధవవయి నీ పుత్రునితో గూడి యీ సర్వరాజ్యమును కోరిక తీరునట్లుగా నేలుకొనుము. గొప్పనైన యపకీర్తియు, దృఢమైన పరాభవమును, ప్రజలచేత నిందయు ఓసీ! పాపప్రవృత్తి గలదానా! నీ రూపము ధరించి, నా యింట,

మహాపాపాత్ముని యింటియందు వలె నిలిచినవి. గుఱ్ఱములను, రథములను, గజములను నెక్కి సంచరించు నట్టి నా కుమారుడు అనాథునివలె ప్రక్కన తోడులేకుండగా నొంటరిగా ముండ్లతోను రాళ్లతోను నిండియున్న యడవులందు పాదములు బొబ్బలెక్కునట్లుగా పాపమెట్లు సంచరింపగలడు. నా కుమారుడు వొంకముగా భోజనము చేయువేళలలో కుండలములతో నందముగా నలంకరించుకొన్న వంటవారు మంచి మనసులతో నేను ముందు వడ్డించెదను, నేను ముందు వడ్డించెదను అని వంతులు వేసికొనుచు నెల్లప్పుడును ప్రశస్తమైన సుందరమైన మృదువుగా నున్న యన్నమును, పానమును పెట్టుచుండ తీసికొనువాడు. అట్టులుండు నా సుతుడు అడవులమధ్య నుండు చెట్టుచెట్టునకు, పెద్దగుట్టగుట్టకు దిరుగుచు, కారము చేదు వగరు నుట్టిపడు పచ్చి కాయలను, నేలలో త్రవ్విన కంద మొదలయిన దుంపలను తీసికొని యెట్టులో పొట్టనింపికొని దేవిరిగొట్టువాని వలె నెట్లు తిరుగునో గదా! ఎంతయో విలువ గల వస్త్రములను మనస్సున కానందము గలుగునట్లు ధరించి యొక్కువైన సుఖమును బొందు శ్రీరాముడు కావిరంగు గుడ్డలను బొంతల మాదిరిగా కట్టుకొని యే ప్రకారముగా నీ భూమిమీద సంచరించును? ఈ భూమిని భరతుడేలుచుండగా రాము డడవులకు వెళ్లుటయా? అయ్యో. ఓ కుటిలమైన బుద్ధిగలదానా! నీ కెవ్వరు చెప్పిరే యిటువంటి దారుణమైనదియు నెన్నడు నూహించనిదియు నగు నాలోచన? స్త్రీలు క్రూరమైన మనస్సు గలవారనియు, నెల్లప్పుడు తమ మంచినే కోరుదురనియు, నతిగుప్తముగా నెంతయిన కీడు కలుగజేయుదురనియు లోకములో నందురు గాని, యిస్సీ! నేనట్లు భూమియందు గల స్త్రీలందరిలోను నేరములను పల్కబోను. ఓ మృత్యుదేవతా! ఒక్క భరతుని యొక్క తల్లికి మాత్రమే యిటువంటి నింద చెల్లును. ఓసీ! క్రూరచిత్తురాలా! నన్నిట్లు బాధించుటకుగాను మనస్సులో గట్టిదైన పట్టు పట్టితివా? ఓ దుష్టురాలా! అనర్థములు కలుగజేయు కార్యములు చేయుదానా! నీ మంచిని మాత్రమే కోరుకొనుదానా! ఎప్పుడైనను నే సమయమునందైనను నాయందుగాని, సర్వలోకములకు మంగళములను

గూర్చునట్టి రఘురాముని యందుగాని యన్యాయమైన పనిని జూచితివా? నీవీ ప్రకారముగా నన్ను బాధించుటయును నేను రాము నడవులకు బారద్రోలుటయును ఈ లోకమున నుండువారు చూచినచో నిజముగా భర్త యందు ప్రేమ గలవారయ్యును స్త్రీలు భర్తలను విడచిపెట్టుదురు. తండ్రులు కడుపార కన్నబిడ్డలనైనను దయలేనివారై విడచిపెట్టెదరు? ఓ నిందితమైన చరిత్ర గలదానా! భూమితనయ భర్తయైన రాముని దుఃఖమనెడు సముద్రములో మునిగిన వానినిగా ఊచి జనులందఱును నిన్ను కోపముతో జూడకుందురా? ఓ యనర్థములకు మూలమైనదానా! దేవకుమారుని వంటి రూపము గలవాడును, దివ్యమైన యలంకారములతో సుందరముగా నున్నవాడును, సీతాదేవి భర్తయు నగు నా కుమారుడు నా దగ్గరకు వచ్చుచుండగా జూచి మనస్సులో తలంచుకొని పొంగిపోయెడువాడను. నా యెదుట రాముని జూచినంతనే నాకు పడుచుందనము వచ్చినట్లనిపించుచుండును. సూర్యుడు లేకున్నను, వర్షించుట క్రిందుడు లేకున్నను జగత్తు నిలుచును గాని అడవికేగు రాముని చూచి యొక్కడైనను ప్రాణములతో నుండునా? అయ్యో! నా నాశనమును గోరుదానిని, మన్నింపరాని శత్రువును, పాపాత్మురాలిని నిన్ను అకస్మాత్తుగా వచ్చు మృత్యుదేవతను వలె నా యిల్లు చేరనిచ్చితిని. ఓసీ! విపరీతమైన నడవడి గలదానా! క్రూరమైన విషముతో గూడిన గొప్పదైన భుజంగమును తొడమీద నుంచుకొన్నట్లుగా నిన్ను తీసికొని వచ్చినందున నేనిట్లు చచ్చిన వాడనైతిని. రాముని, లక్ష్మణుని, నన్ను తిరస్కరించి యీ పట్టణమునందును, రాష్ట్రమునందును భూమియందును గల బంధువుల నందఱిని జంపి యీ భూమండలమును నీ కుమారుడే యేలనిమ్ము. నీవు కూడ ఓ కామినీ! నా శత్రువుల మనస్సులను అగాథమైన సుఖసముద్రములో నోలలాడింపుము. ఓ కఠినమైన మనస్సు గలదానా! వినుము. పుండుపై కారము చల్లినట్లు నన్నటమటింపచేయుదువా? హెచ్చు రోషముతో భర్తయను గౌరవము లేకుండ యిట్లు కష్టపెట్టుదువా? ఓసీ! కుటిలమైన మనస్సు గలదానా! నీ నోరు వేయిముక్కలై తొందరగా భూమిపైబడును గాని. నిలువజాలదు. రాముడు

చెడ్డమాటలాడడు. ఎప్పుడును, ఎవరికిని కీడు గలుగు మాటలనాడి యెఱుగడు. ఎవ్వరిని మనస్సు నొచ్చునట్లు మాట్లాడడు. పెద్దలు చెప్పు మాటలకెదురు చెప్పడు. మంచి గుణముల నొక్కదానిని గూడ వదలిపెట్టడు. నా కుమారుడగు రఘురాముడు అందరకు నిష్టమైనవాడు. వానిని నిందించుటకు నీకు నోరెట్లు వచ్చినదే గయ్యాళిగంపా! నీవు చచ్చెదవేని చావుము. నీవు మిక్కిలిగ మండిపోదువేని మండిపొమ్ము. మిక్కిలి తాపమును బొందదవేని పొందుము. పెద్ద పర్వతము మీది నుండి వేగముగా ఒక వేయి ముక్కలుగానయి దూకుము. అంతేగాని నీవు కోరినట్లు నీ యిష్టమును చేయజాలను సుమా! కేకయ రాజు యొక్క వంశమును కలుషితము చేసినదానా! నీవు వాడియైన కత్తివాదర వలె క్రూరురాలవు. ఎప్పుడును చెడ్డమాటలు గలదానవు. మిక్కిలి కఠినమైన దుష్టమైన మనస్సు గలదానవు. అపకారముచేసి సొంత కులమునే నాశనము చేయు దానవు. నా మనస్సునకు మిక్కిలి యప్రియమైనదానవు. విరసురాలవై నా మనస్సును మూలముట్టుగా కాల్చెదవా? అటువంటి నీవు చచ్చుటయే మంచిది. ఓ కైకా! నా కుమారుడు వనములకు వెళ్లగా నేను బ్రతికియుండుటే కల్ల. ఇది నిజము. నా సౌఖ్యము మాట చెప్పనేమిటికి? నేనొకవేళ బ్రతికియున్నను నీతో నాకేమి పని? నా కనిష్టమును జేయకుము. మరల మరల నీ పాదములకు మ్రొక్కెదను" అని ఈ విధముగా రాజు హా! యని ననాథుని వలె నేడ్చుచు, తాను చెప్పినట్లు వినకపోవునట్టి యా కైక చేతిలో చిక్కి దుఃఖించి చాచిన యామె పాదములపై పడబోయి ముట్టుకొనక, రోగముచే బాధపడువాడో యనునట్లు మహాదుఃఖముతో నిండిన హృదయము గలవాడై భూమిపై బడెను.



# పదమూడవ సర్గము

**పు**ణ్యము క్షీణింపగానే స్వర్గము నుండి పడిపోవు యయాతి వలె తగని విధముగా నేలమీద పడియున్న రాజును పూర్వమటువంటి దుఃఖము ననుభవించని వానిని చూచి కొంచెమైనను వెరపులేనిదై భయపెట్టుచు అనర్థములకు మూలమైనదియు నెరవేరని కోరిక గలదియునగు కైక పాపమని తలంపక పూర్వపు వరములనే మరల నడుగుచు తన భర్తను చూచి విడువక యిట్లనెను. "ఓ రాజా! నేను సత్యమును చెప్పువాడను. దృఢవ్రతుడను అని నిన్ను నీవు పొగడుకొను చుందువు. నాకిచ్చిన వరములను దీర్పకయే ఋణగ్రస్తుడవు గావలెనని భ్రాంతిపడుచున్నావా?" అని కైక తనను నిందింపగా దశరథుడు మూర్ఛను బొందినవాడై కొంతసేపటికి మూర్ఛదేరి రోషముతో గూడినవాడై "నేను లోకాంతరములకు వెళ్లగా రాముడు గొప్పనైన యడవులకు వెళ్లగా పూర్ణముగా కోర్కె సిద్ధించిన దానవై యుండుము. ఓసీ! దుష్టురాలా! నన్ను దేవతలందరును ఛీఛీ యనుచుండగా నెట్లు సహింపగలను? కైకేయి కొఱకై రాముని యడవి కంపితినను మాట సత్యమయినను అది యసత్యముగానే తోచుచున్నది. కలుగక కలుగక గొప్పనైన తపస్సుచేత గన్నటువంటి పుత్రుని, పవిత్రుని, శ్రీరాముని నేనెట్లు విడచిపెట్టెదను? పరాక్రమముగలవాడును, సిద్ధహస్తుడును, క్రోధమును జయించినవాడును, ఓర్పునకు మారురూపమైనవాడును సుందరమైన తామరరేకుల వంటి నేత్రములు గలవాడును, నల్లకలువరేకు వంటి శరీరచ్ఛాయ కలవాడును, దీర్ఘములైన చేతులు గలవాడును, దివ్యాకృతి గలవాడును నగు రాముని, మనోభిరాముని, విక్రమధాముని నెట్లు దుర్వృత్తిచే దండకాటవికి బంపింతును? మిక్కిలి

సుఖజీవనుడు, దుఃఖమెట్టిదో తెలియనివాడు నగు రాముడు బాధనొందుచుండ నేనెట్లు సహింతును? చెప్పుము. దుఃఖములు పొందగూడనివాడైన రాముని దుఃఖములలో ముంచకుండ నున్నవాడనైనచో నీ దేహమును విడచిన తరువాత నైనను సాటిలేని సుఖములను స్వర్గమునందైనను పొందెదను. అయ్యో! పాపాత్మురాలా! దయలేనిదానా! నాకు ప్రియమైన పుత్రుని శ్రీరాముని సుకుమారుని నిట్లు బాధలనుబెట్టి యీ భూమియందు పరాభవమును నిత్యమగు నపకీర్తిని నాకు కలుగజేయుటకై నీవేల పాలుపడితివి?" అని ఈ ప్రకారముగా విలపించుచు మిక్కిలి కలతచెందిన మనస్సుతో రాజు తాపమును బొందుచుండగా సూర్యుడస్తమించెను. క్రమముగా రాత్రియయ్యెను. జగత్తంతయు ప్రకాశముతో పండువెన్నెలలు కాయుచుండగా నా రాత్రియంతయు నివారింపరాని దుఃఖముచేత బాధనొందుచు నేడ్చుచుండుటచే రాజునకు భరింపరానిదై కన్పట్టెను. వేడి నిట్టూర్పులు విడుచుచు ఆకసము వంక దృష్టిని నిల్పినవాడై యేడ్చుచు నతడిట్లు చెప్పెను. "చేతులు జోడించి మ్రొక్కెదను. నన్ను దయతో జూడుము. చుక్కలతో నలంకరింపబడిన ఓ రాత్రీ! తెల్లవారనీయకుము. లేదా నన్ను దుఃఖపెట్టుచున్న దయలేనటు వంటి కైక ముఖమును జూచుటయైనను దప్పునట్లుగా వేగముగ తెల్లవారుము. ఇచటి నుండి లేచిపోయెదను" అని పలికి కైక యొక్క ముఖమును జూచి చేతులు జోడించి యా కైకేయిని ప్రసన్నురాలినిగా జేసికొనుటకై వినయముతో గూడిన మాటలతో రాజిట్లు ప్రార్థించెను.

**దశరథుడు కైకను ప్రార్థించుట :**

"దీనత్వమును పొందినవాడను. మంచివాడను. నీ యొక్క యాజ్ఞలో నుండువాడను. రేపోమాపో చచ్చుటకు సిద్ధముగ నున్నవాడను. ఓ యభిమానవతీ! నీ భర్తను భూపతిని గదా! దోసిలి యొగ్గి యభిమానమును వదలి నిన్ను వేడుచున్నాను. నన్ను మన్నింపుము. ఒంటరిగా గూడ కాదు.

నేడు నిఖిలమైన రాజులు పౌరులునుండగా రాముని రాజును చేసెదనని శపథము చేసితిని. ఏ ప్రకారముగా నిప్పుడామాటను త్రోసివేయుదును. ఓ చిన్నదానా! కరుణగలదానా! మంచి నడవడిగలదానా! నా మాటల నాలకింపుము. నన్నాయాస పెట్టకుము. నన్ను దయతో జూడుము. ఓ కైకా! నీవిచ్చిన రాజ్యము రామచంద్రు డనుభవించుగాక. రామచంద్రుని క్షమింపుము. గొప్పదైన మంచి కీర్తి నీకు భూమియందు కల్గును. ఇది రామునకును, నాకును, జనులెల్లరకును, భరతునకును, గురువులకందఱకును సమ్మతమగును." అని జాలి పుట్టునట్లుగా శోకించువాడను, ఎఱ్ఱవడిన కన్నులు గలవాడను, మంచి మనసు గలవాడను, కన్నీరు నిండిన కనులు గలవాడను నగు భర్తకు మంచి సమాధానము చెప్పకున్న కైకను దుష్టభావము పెంకెతనము ప్రతికూలమైన మాటలు గలదానిని జూచి పుత్రుడు వనములకు బోవునే యని మనస్సునకు దోచినవాడై యేమియు మాటాడలేనివాడై శోషించినవాడై శోకమున మునిగెను. దహించుచున్న దుఃఖముతో బాధపడుచు, నిట్టూర్పులను విడచుచు, అట్లే పడియుండ సూర్యోదయమయ్యెను. అప్పుడు ప్రబోధగీతములను బాడు వందిమాగధుల గీతముల నాపి నలిగినవాడై ...



# పదునాలుగవ సర్గము

## దశరథునకు కైక సత్యము బోధించుట :

పుత్రశోకముచేత భూమిపై బడి మూర్ఛలతో బాధపడుచున్న భర్తను జూచి పాపాత్మురాలైన కైక యిట్లు పలికెను. "ఓ రాజా! ఇచ్చెదనని బాస చేసినవాడవై యిప్పుడు దానిని చేయక పాపివైపోయెదవా? ఇట్లు నేలమీద పడి దొరలుచున్నావు. లే లెమ్ము. నేనేల పోనిత్తును? వరములను దీర్పుము. నీవు ధర్మపద్ధతిని తలంపుము. ధర్మబుద్ధి గలవారు సత్యమే గొప్పదైన ధర్మమని చెప్పెదరు. నీవు ధర్మము నెందుకు సలుపవు. నేను సత్యమునే ఊతకఱ్ఱగా పట్టుకొన్నాను. సత్యమును వదలిపెట్టవలెనని ఊరక తగని దుఃఖమున మునుగుచున్నావు. ఓ రాజా! తన మాటను నిలబెట్టుకొనుటకే గదా మున్ను శిబి చక్రవర్తి తన శరీరమును డేగకై కోసి యిచ్చి యుత్తమమైన గతిని పొందెను. ఆ సత్యము కొఱకే గదా తన కన్నులను దానమిమ్మని ప్రార్థించిన బ్రాహ్మణునకు ఏమాత్రము దుఃఖములేక దేవవినుతుడైన యలర్కుడను రాజు తన నేత్రములనిచ్చెను. సముద్రుడీ భూమిని ముంపదలచినచో నడ్డమున్నదా? తన మర్యాదను దలచికదా అతడీ భూమిని దాటకుండెను. సత్యమొక్కటే బ్రహ్మము. సత్యమునందే ధర్మములన్నియు నివసించి యుండును. సత్యమే యక్షయములైన సకల వేదములు. ఒక్క సత్యమువలననే శాశ్వతమైన పరలోకప్రాప్తి కలుగును. కనక నీ మనస్సులో కొంచెమైనను ధర్మచింత యున్నచో సత్యమును వదలిపెట్టకుము. నీ మనస్సులో కొంచెమైన ధర్మచింత యున్నచో నా కోర్కెను ఫలించునట్లు చేయుము. నీవిచ్చిన యా రెండు వరములను ఇయ్యక తప్పుకొంద మనుకొన్నావు. నేను వదలుదాననుగాను. ధర్మము దాటకుండుట మేలని

యిన్నిమారులు చెప్పుచున్నాను. గాన తొందరగా నీ దినముననే రాముని వనములకు బంపుము. మూటికి ముమ్మాటికి నిదియే నా మూర్ఖపు పట్టుదల. నాతో జేసిన బాసను వేగముగా దీర్చకపోయితి వేని నా మాట వినుము. నీ మీద ఒట్టు సుమా. నీవు చూచుచుండగనే ఇచ్చట పడి ప్రాణములను విడచెదను" అని కోపముతో జంకొకింతయునులేక యిట్లు బెదరింపు మాటలాడుచున్న కైకకు తన వినాశమునకు కారణమైన దానమిచ్చిన బలి చక్రవర్తి మాదిరిగా సత్యమనెడు పాశములచేత కట్టబడ్డవాడై ధైర్యము గోల్పోయి కృశించి మనసులో చాల తాపమును పొంది వెలవెలపోయిన మొగముతో కాడికి చక్రములకు నడుమనున్న యెద్దువలె రాజు మిగుల బాధనొందెను.

**దశరథుడు కైకను విడనాడుట :**

ఆ రాజు కొంతసేపటికెట్లో కొంచెము తెలివినొంది ధైర్యమును బూని కైకను జూడ నసహ్యపడినవాడై కోపముతో మొగమావలకు ద్రిప్పికొన్నవాడై యిట్లనెను. 'దుర్మార్గురాలైన కైకా! అగ్నిసాక్షిగా మంత్రయుక్తముగా పవిత్రమైన విధముగా పుచ్చుకొన్న నీ చేతిని, నిన్ను, నీ వలన పుట్టిన కారణమున నీ నా కుమారుని నేను విడచితిని. రాత్రి చెల్లిపోయెను. తెల్లవారుచున్నది. కుమారుని యొక్క యభిషేకమునకై గురుజన సమూహములు నన్నింక తొందరపెట్టెదరు. ప్రఖ్యాతముగా రామచంద్రుని కొఱకై సమకూర్చబడ్డ వస్తు సముదాయముతో ప్రేతమునైన నా యొక్క ఔర్ధ్వదైహిక క్రియలును రాముడే చేయుగాక. ఈ ప్రకారముగ రామచంద్రుని యభిషేకమునకు విఘ్నమును నీవు కలుగజేసితివి గాన ఓ దుష్టురాలా! వివేకరహితురాలా! నీవును నీ పుత్రుడును నాకింక నీళ్లుగూడ విడువరాదు సుమా! మునుపు సంతోషముతో పొంగిపోవుచుండగా చూచిన పురజనులను, సంతోషము పోయినవారై ముఖములు వంచుకొని ఎక్కువైన దుఃఖములో మునిగియుండగా నేనెట్లు చూడగలను?" అనుచుండగా చుక్కలు కనబడకుండపోగా చంద్రుడు పడమటి సముద్రమున గ్రుంకగా, తూర్పు

దిక్కు చూచుటకందముగా గనిపించగా, రాత్రి గడచి తెల్లవారుటను జూచి పొంగివచ్చు రోషముతో కైక రాజుతో నిట్లనెను. "ఓ రాజా! ఏమిటి యిటువంటి మాటలాడెదవు? భరింపరాని గొప్ప వ్యాధివలె బాధపెట్టు మాటలతో నేల యాలస్యము చేసెదవు. అడవులకు బంపుటకై రాముని పిలుచుకొని రమ్మని కబురు పంపుము. నా కుమారుని రాజుగా జేయుము. నన్ను వెంటనే శత్రువులు లేనిదానిగ నొనర్పుము. అట్లు చేసినచో నీవు ధన్యత్వము నందెదవు." తన భార్య యిట్లు చెప్పగా నా రాజు తీక్ష్ణమైన కొరడాచేత కొట్టబడి బాధనొందిన గుఱ్ఱమువలె కోపముతో మండిపడి యిట్లు పలికెను. "ఓసీ! ఈ ప్రకారముగా సత్యమనెడు ధర్మపాశములచేత కట్టుపడవలసి వచ్చెను. వినాశము నొంది నా మనస్సు చెడెను. శుభమైన నడవడిగల రామచంద్రుని జూడవలెననిపించు చున్నది" అనుచుండగా నంతట తూర్పున సూర్యుడుదయించెను చీకటులు విడిపోవగా పట్టాభిషేకమునకు ముహూర్తము సమీపించెను. అంత వసిష్ఠుడు స్నానము చేసి యోగ్యమైన రీతిగా..

### వసిష్ఠుడు పట్టాభిషేక సంభారములతో వచ్చుట :

శిష్యులతో గూడ అన్ని విధములైన సంభారములను తీసికొని పట్టణములోనికి వచ్చుచు కస్తూరి పన్నీరు కలిపి చల్లుటచే తడిగానున్న దారులు గలదియు, పూలదండలతో నలంకరింపబడి సుందరముగా నున్నదియు, చిత్రమైన జెండాలతో శోభిల్లుచున్నదియు సంతోషించిన జనసమూహము గలదియు, వస్తువులతో నిండిన యంగడులు గలదియు, గొప్పనైన యుత్సవములతో నున్నదియు, చందనముచే, అగురుధూపములచే సువాసనలతో నిండిన ప్రదేశములు గలదియు సీతాపతి యభిషేకమును జూడ కుతూహలము గలదియు అందమున నమరావతీపురమును బోలియున్నదియునైన యయోధ్యాపురమును జూచుచు ఆయాప్రదేశములను దాటి రాజుయొక్క యంతఃపురమును జేరవచ్చెను. కలకలమని కూయు పక్షులతోడను,

పట్టణములోని ప్రజలతోడను, ఆహితాగ్నులయిన బ్రాహ్మణుల తోడను, ఋషులతోడను సభ్యులతోడను నిండియున్న యంతఃపురమును జూచుచు వచ్చి..

**వసిష్ఠుడు తన రాక దశరథునకు దెల్ప సుమంత్రు బంపుట :**

అచ్చట గుమికూడియున్న జనులను ముందుగా తప్పుకొనునట్లు చేయుచు ప్రీతితో మందిరము లోపలకు వెళ్లునప్పుడు వెలుపల నిలిచి కనిపించుచున్న బుద్ధి విశారదుడైన సుమంత్రుడను మంత్రిముఖ్యుని జూచి “ఓ సుమంత్రా! నీవు తొందరగా వెళ్లి నేను వచ్చినటుల రాజునకు దెలియజేయుము. ఇవిగో గంగాజలములతో నింపబడిన బంగారు కుంభములు. ఇవిగో సముద్ర జలములతో నిండిన ఘటములు. అవిగో అభిషేకమునకు గాను తేబడినట్టి మేడికఱ్ఱతో చేయబడిన మంగళకరమైన యాసనము. అవిగో నవధాన్యములు, తేనె, గంధము, మణులు, పెరుగు, నేయి, పేలాలు, దర్భలు. వారే యెనమండ్రు కన్యలు. అదిగో ఖడ్గము. అదియే మదించిన యేనుగు. పూలును పాలును అవిగో. సాటిలేని నాలుగు గుఱ్ఱములవిగో. రథమదిగో. ధనస్సు, నరులచే మోయబడు పల్లకీ అవిగో. అదిగో తెల్లనైన గొడుగు. వెల్ల చామరములవియే. బంగారు కలశమదిగో. చూడుము. బంగారపు కట్టుత్రాళ్లును బలిసిన మూపురమును గల తెల్లనైన యాబోతును చూడుము. నాలుగు కోఱలతో నొప్పుచున్నదియు మంచి జూలు కలదియు గొప్ప బలము గలదియునగు శ్రేష్ఠమయిన గుఱ్ఱమదిగో. అదే సింహాసనము. ఒప్పుచున్న పులిచర్మమదే. ప్రజ్వరిల్లుచున్న యగ్నియును వాద్యసమూహములును నవియే. వారే యలంకరించుకొన్న వేశ్యాంగనలు. బ్రాహ్మణులరుగో. ఆచార్యులందఱునరుగో. అవియే గోవులు. పుణ్యమైన మృగములును పక్షులును అవిగో. పౌరులును, పల్లెలలో నివసించువారును, కోమట్లును, రాజులును వారే. అందరితో కొలువు కూటము నిండియున్నది చూడుము. రామచంద్రుడు పుణ్యమైన నక్షత్రమునందు రాజ్యమును పొందుగాక! నీవు వెళ్లి రాజును తొందరపెట్టుము. సూర్య

డుదయించెను." అని చెప్పగా సుమంత్రుడు రాజుకొలకు తొందరగా వెళ్లెను. ముదుసలి వానిని, రాజు యొక్క మనస్సునకు నచ్చినవానిని అంతఃపురమునకైన నడ్డులేకుండగా విడువవచ్చునని రాజు ఆజ్ఞ యిచ్చియున్న కారణమున ద్వారపాలకుడు సుమంత్రుని లోనికి బోవనిచ్చెను.

**సుమంత్రుడు దశరథుని నిద్ర మేలుకొలుపుట :**

ఆ రాజనుభవించుచున్న దుర్భరమైన యవస్థ తెలియనివాడు గనుక తొందరగా వెళ్లి సుమంత్రుడు రాజును సమీపించి చేతులు జోడించి మంచి మాటలతో రాజును గూర్చి తానుదయసమయమున పలుకదగిన పద్ధతిలో మిక్కిలి భక్తిపూర్వకముగా నిట్లనెను. "ఓ రాజా! అవధరింపుము. సూర్యుడు రాగానే పొంగు సముద్రుని వలె సంతోషింపుము. రాక్షస శత్రువగు నింద్రుని మాతలిమేలుకొలుపు నటుల నిన్ను మేలుకొలుపుచున్నవాడను. సాంగములైన వేదములు బ్రహ్మను బోధించునట్లు బోధించుచున్నవాడను. భూతలమును సూర్యచంద్రుల వలె బోధించుచున్నవాడను. మహారాజా! రాజశ్రేష్ఠా! తొందరగా లెమ్ము. అనేక విధములైన యందముగానున్న యాభరణములతో ప్రకాశించు నట్లుగా నలంకరించుకొని బంగారుకొండ (మేరు పర్వతము)ను వదలివచ్చు సూర్యునివలె లోకములు మెచ్చునట్లుగా రమ్ము. ఓ రాజేంద్రా! చంద్రుడును, సూర్యుడును, నింద్రుడును, శివుడును, కుబేరుడును, వరుణుడును, అగ్నియు నీకు జయమును కలుగజేయుచు రక్షించెదరుగాక! పూజ్యమైన రాత్రి వెళ్లినది. ప్రభాతమయినది. ఇకపైని చేయదగిన క్రియలను జరిగించుటకు సమయము సమీపించినది. నీ విక లెమ్ము. తగిన విధముగా పౌరులను జనపదులను వేద వేత్తలను వెంటనిడికొని వసిష్ఠమౌని వచ్చియున్నాడు. నీ పుత్రుని పట్టాభిషేకము చేయుట కనుజ్ఞనిమ్ము. కాపలాదారులేని పశువులును, సేనాధిపతి లేని సేనయు, చంద్రుడులేని రాత్రియు, గోపాలుడులేని యావులును, రాజులేని పురములు రాజ్యములును సమములు" అని సుమంత్రుడు అర్థవంతముగను, సామముగను జెప్పిన మాటలను విన్నవాడై రాజు గొప్పనైన విషాదముతో శోకించుటచే

నెఱ్ఱనైన కన్నులతో జూచుచు "మిక్కిలి వాడియైనవియును మర్మములను భేదించునవియును నగు మాటలతో నన్ను కష్టపెట్టెదవేల" అని పల్కగా, రాజు యొక్క శోకపూరితములైన మాటలను విని అతని యొక్క విహ్వలత్వమును జూచి చేతులు మోడ్చి సుమంత్రుడు మనస్సులో భయపడినవాడై కొంచెము వెనుకకు జరిగెను.

## కైక సుమంత్రునితో శ్రీరాముని తోడి తెమ్మనుట :

తనంతట తాను చెప్పలేక దైన్యముతో పడియున్న రాజును జూచి యాలోచనలకు నిధియైన కైకేయి మంత్రితో నిట్లు పలికెను. 'రాజు రాముని గురించిన సంతోషముతో గూడిన మనస్సు గలవాడై యెంతయో నిద్రలేనివాడగుటచేత శ్రమనొందినవాడై యిప్పుడే కొంచెము కనులు మూసెను. అందుచేతనే సుమా ఏమియు మాటాడుటలేదు. ఓ సుమంత్రా! తొందరగా వెళ్లి ఆ సీతాదేవి భర్తయైన రాముని వేగముగా నిక్కడకు తోడ్కొని రమ్ము. ఇది శుభమే. నీవు వేరుగా దలపకుము" అని చెప్పగా నతడు సంతోషము మనస్సున కలుగుచుండగా 'రాముని యొక్క యభిషేకమునకే యీ కైకేయి యిట్లు తొందరపెట్టి చెప్పుచున్నది. నిజముగా నీ రాజు దానిని గురించియే యింత యలసట పడుచున్నవాడు. నిక్కముగా రామచంద్రుని యభిషేకము నేడే జరుగును' అనుకొనుచు సంతోషముతో పొంగిపోవుచున్నవాడై తొందరగా కౌసల్య కుమారుని చూడవలెనను కాంక్షతో అంతఃపురమును వీడుచు క్రిక్కిరిసిన జనసమూహములను దాటి చేతులలో గొప్ప ధనములను బట్టుకొని మనస్సులలో నెక్కువైన ప్రేమతో నొప్పుచున్న సంతుష్టులైన పౌరులను రాజులను జూచెను.



# పదునైదవ సర్గము

వేకువనే లేచినవారై వేదపారంగతులైన బ్రాహ్మణులందఱును బహిరంగముగ సభ దీర్చినవారై, పట్టణమున గల వారందఱును దళముల కధికారులును మంత్రులును ఇంకను ఇతరులైన ముఖ్యులును నొక్కచోట చేరినవారై సుర్యోదయమయినది. పుష్యమి నక్షత్రము వచ్చినది. ఇది లక్ష్మణాగ్రజుని జన్మలగ్నము వచ్చినది. అభిషేకమునకై యమర్చిన సంభారములన్నియు నవిగో యిచ్చటనే యున్నవి. మంగళ జలముతో నింపబడిన కుంభములును అందమైన సింహాసనమును, బాగుగా పరువబడిన పెద్దపులి చర్మముతో, ప్రకాశించు రథమును సముద్రజలమును, గంగా యమునలు కలియుచోటు నుండి తెచ్చిన జలమును, తూర్పు దిక్కునకు ప్రవహించునవియును ఉత్తర దక్షిణములకు ప్రవహించునవియును పైకి ప్రవహించునవియును నైన నదుల యొక్క జలములును, పద్మములచేతను, కలువలచేతను కూడిన నీటితో నిండి మామిడి చివుళ్లతో గప్పబడిన బంగారు కలశములును, మంగళ వేషములు గలిగి సర్వాభరణముల నలంకరించుకొన్న వారాంగనలును, చంద్రకిరణముల వంటి కాంతి గలిగి మణులచే నలంకరింపబడిన బంగారు చామరమును, చంద్రమండలమువలె సుందరమైన తెల్లని గొడుగును, పాండు వర్ణము గల యెద్దును, తెల్లని గుఱ్ఱమును, మదమెక్కియున్న పట్టపుటేనుగును, దర్భలు పాలు అవిగో. మంగళకరములైన వాద్య సమూహములును, మంగళకరములైన మణిమయములైన స్వర్ణాభరణములతో నలంకరింపబడిన యెనమండ్రు కన్యలును, వందులును నేయియు నవిగో యనుకొనుచుండిరి. ఆ రాజు లందఱును సీతాకాంతుని యభిషేకమునకై తమకు తగియున్నటువంటి

కానుకలను తీసికొనివచ్చి సభలో గూర్చుండి తమలో నిట్లనుకొనుచుండిరి. 'సూర్యోదయమైనది. రాజు కనిపించడేమి? ఎవ్వడు నీ విషయమును తగు విధముగా రాజునకు చెప్పడేమి? రామునకై యన్నియును సిద్ధమైనవి. ఆలస్యమేల?'

**సుమంత్రుడు సామంతరాజులతో సంభాషించుట :**

అని తలంచుచుండగా నా రాజులను జూచి సుమంత్రుడిట్లనెను. 'రాజు రాముని బిలువుమనగా నక్కడకు వెళ్లుచున్నాను. రాజునకు ఘనులగు మీరు పూజ్యులు. సీతాపతి కంతకంటె పూజ్యులు గావున నోర్చుకొనుడు. నేను నిదే వెళ్లి రాజును దర్శించి మీ యొక్క మాటగా క్షేమమడిగి మేలుకొని యుండియు వెలపలకెందులకు రాలేదో యడిగెదనని చెప్పి సామంతరాజుల ననుసరించు విధమునెఱిగిన సుమంత్రుడు రాజును జేరబోయెను. సాటిలేని యా సౌధమును నిరాటంకముగ ప్రవేశించి రాజు యొక్క వంశమును పొగడుచు రాజునకును తనకును తెర మాత్రమడ్డముగా నుండునంతవఱకును శయ్య దగ్గరికి వెళ్లినవాడై 'ఓ మహాత్మా! నీ వంశము చాల గొప్పది. సూర్యుడును, ఇంద్రుడును, చంద్రుడును, ఈశ్వరుడును, అగ్నిహోత్రుడును, కుబేరుడును, వరుణుడును కలసి నీకు జయమును సంతోషమును కలుగజేయుదురుగాక. రాత్రి వెళ్లి పోయినది. ఓ రాజచంద్రమా! మేలుకొమ్ము. బ్రాహ్మణులును, రాజులును, పూజ్యులును సజ్జనులును నీ కొఱకై సభలో వేచియున్నారు. చేయవలసిన కార్యములను తొందరగా జరిగింపుము.'

**దశరథుడు సుమంత్రునితో శ్రీరాముని పిలుచుకొని రమ్మని చెప్పుట :**

అని సుమంత్రుడు కొనియాడుచుండగా నతనిమాటలను గుర్తించిన దశరథుడు "నేను నిద్రపోవుట లేదు సుమా. రాముని తోడ్కొని రమ్మనిన మాట నెందులకు చేయక పోయితివి. ఇకనైనను వెళ్లి రాముని నిచ్చటకు

వేగముగా తీసికొనిరమ్ము” అని చెప్పగా రాజు వాక్యములను విన్నవాడై యట్లే యని సౌధమును వెడలి రాజమార్గములను జూచెను. ప్రేమతో గుంపులుగా, రామునియందున్న యనురాగము వెల్లివిరియగా రాముని యొక్క కథలను భూమినున్న జనులందఱును చెప్పుకొనుచుండగా, ఆ మాటలను వినుచు సంతోషమును బొందినవాడై వెళ్లి కైలాస శిఖరమునకు సాటివచ్చునదియు, నింద్రుని పట్టణమగు నమరావతిని బోలినదియు, కుబేరుని మేడకు జతయయినదియు దేవతల నివాసమగు మేరుపర్వతపు శృంగముతో సమాన మైనదియు, అందమైన తలుపులును, సంతోషము గలిగించు నరుగులును, బంగారపు బొమ్మలును, గొప్ప మణులతో గట్టబడిన తోరణములును గలిగి శరత్కాల మేఘమును బోలియున్నదియు, ప్రకాశమానమైన మణులచేతను పుష్పమాలికలచేతను నలంకరింపబడినదై, చందనముతో నగురు ధూపముతో సువాసితమై, వ్యాపించిన మంచి ముత్యములును రత్నములును గలదియై, దర్దరపర్వతము వలె సువాసనలు వెదజల్లుచున్నదై, బెగ్గురుల, నెమిళుల యొక్క మనోహరములైన ధ్వనులతో గూడినదై, స్తంభాదులపై బాగుగా చెక్కబడిన తోడేళ్ల బొమ్మలు గలదై శ్రేష్ఠములగు కాంతులతో మిఱుమిట్లు గొల్పుచు సూర్యచంద్రులను బోలినదై, యనేక విధములైన రంగులు గల పక్షులచేత మేరువు గుహను బోలినదై, చేతులు జోడించి యున్న పరిజనులతోను, కానుకలను బట్టుకొని యచ్చటచ్చట బారులుతీరి నిలిచియున్న పల్లెటూరివారి తోడను అలంకరింపబడినదై, పెద్ద మేఘమువలె నుండి వేడ్కమీర నలంకరింప బడినదై, కిరాతులు, కుబ్జజనులు తిరుగాడుచున్నదైన రామచంద్రుని యొక్క భవనమును చూచినవాడై యచ్చట గుంపులు గుంపులుగా మూగియున్న పౌరులను జూచి సంతోషముచే ప్రకాశించుచున్న ముఖము గలవాడయ్యెను. దేవేంద్ర భవనమును బోలిన రాముని మేడను చూచి రఘురాముని మెచ్చుకొను చున్న సజ్జనులుండుటను జూచి సుమంత్రుడంతఃపురమును సమీపించి యందా

రాజకుమారుని యొక్క ముందు రాబోవు మంగళకార్యమునకై యెదురు చూచుచున్న వారి యొక్క మంచివైన మాటలను విన్నవాడై, సవిలాసముగా చిలుకలు పలుకు నినాదములతో నిండియున్న యా భవనమునందు, చేతులు జోడించి నిలుచున్నవారును, కానుకలను దాల్చిన లోకులను, అంజనశైలి సదృశమై మదించిన యుగ్రమైన శరీరముతో మంగళకరమైన శత్రుంజయమను పేరు గలిగిన సహింపరాని పరాక్రమము గలిగిన యేనుగును, యేనుగులతో, గుఱ్ఱములతో, రథములతో వచ్చియున్న మంత్రులును ద్వారము ముందు నిలిచియుండగా వారలను జూచి ముందునకు నడచి విస్తారమైన మణిగణము లతో ప్రకాశించు సముద్రమును మొసలి ప్రవేశించినట్లు నిరాటంకముగా బ్రవేశించెను.



## పదునాఱవ సర్గము

నడివయస్సులో నున్నవారలును, క్రొత్త కుండలములతో బ్రకాశించు వారలును, అప్రమత్తులును, మిక్కిలి యనురాగము గలవారలును ప్రాసము, ధనుస్సు, శక్తి మొదలైన యాయుధములను ధరించినవారలును నగు ద్వార రక్షకులను జూచెను. తరువాత వృద్ధులై, బెత్తములను ధరించి, గంధాదికములను బూసికొని మంచి కావివస్త్రములను ధరించి మిక్కిలి జాగరూకతతో అంతఃపురమును రక్షించువారిని జూచెను. పూర్వవిషయముల నెఱిగిన సుమంత్రుడు సమీపింపగా అందరును సంభ్రమముతో నాసనముల నుండి దిగినవారైరి. వారల నాదరముతో జూచి సమర్థుడైన సుమంత్రుడు 'వాకిట సుమంత్రుడు నిలిచియున్నాడని సీతాపతికి వేగముగా నెఱుగజెప్పుడు.' అనగా వారు వెళ్లి సీతా సహితుడైన రామునకు తెలియజెప్పిరి. అతడును తన తండ్రి కాంతరంగికుడైన సుమంత్రుని దన సమీపమునకు చనవుతో రప్పించెను.

**సుమంత్రుడు రామునితో దశరథుని వాక్యములు చెప్పుట :**

అతి రమణీయమైన శయ్యపై ముత్యాలదండలు ధరించిన వానిని ఘుమఘుమయను వాసనలతోనున్న ఎఱ్ఱనైన చందనమును మేననలందుకొని యున్నవానిని, ఝణఝణమని ధ్వనించునట్లుగా వీవనతో జానకీదేవి విసరుచుండగా హాయిని పొందుచున్నవానిని, తన యొద్ద సీతాదేవి నిలిచి యుండగా చిత్రాసమేతుడైన చంద్రుని మించియున్నవానిని, ప్రకాశించుచున్న తన కాంతి విశేష ప్రవాహములచేత సూర్యుని బోలు వానిని, సకలమైన సౌభాగ్యములతో కుబేరుని వంటి వాడయి కూర్చొనియున్న రామభద్రుని

సుమంత్రుడు చూచి నమస్కారమును జేసి యతని గుణములను స్తోత్రముచేసి వినయముగా చేతులు జోడించి “మీకు విహారమున శయ్యాసనములందు సుఖమే కదా!” యని అడిగి తెలిసికొని, తిరిగి భూజాత భర్తయైన రామునితో నిట్లనెను. “ఓ కౌసల్యాతనయా! రామా! రాజు కైకేయీ సహితుడై యుండి వేగముగా మిమ్ము చూడవలెనని కోరుచున్నవాడు. అచ్చటికి మీరు విచ్చేయుడు” అనగా..

### శ్రీరాముడు సీతాదేవికి రాజాజ్ఞ నెఱింగించుట :

రాముడా మాటచే సంతుష్టచిత్తుడయి సుమంత్రునికి సత్కారములు చేసినవాడై సీతాదేవిని చూచి “ఓ మానినీ! రాజును, రాణియు, నాకు ప్రేమతో ప్రభుత్వము నొసగు విషయమును గూర్చి చర్చించుచున్నవారు. మెచ్చబడిన నడవడిగల కైకేయీ మాత నన్ను గూర్చి తన భర్తను మిక్కిలి తొందరించును. వివేకము గలదికాన రాణియు రాజు యొక్క యాలోచన తెలిసికొని నాకు శుభము కలుగజేయుటకై కోరుచుండుటచేత భర్తను నా యభివృద్ధికై తొందరపెట్టును. కేకయ రాజపుత్రి భర్త హితమును కోరునది. నాయభివృద్ధిని కాంక్షించునాజనిని. నాయదృష్టము కొలది యా మహారాజు ఆయన ప్రియ పత్నియు, నాయర్థనామముల యభివృద్ధిని కోరునట్టి సుమంత్రుని దూతగా నిచ్చటికి పంపిరి. ఇది యోచింపగా నెంతయో యుచితమైయున్నది. సభ యెట్టిదో దూత యట్టివాడు. ఓ చెలియా! రాజు నన్నిప్పుడే యువరాజుగా జేయును. ఓ సుదతీ! నేనిప్పుడే వెళ్లి రాజును జూచి సుఖముగా తిరిగివచ్చెదను. ఓ చెలియా! నీవు నేను వచ్చునంతవఱకును నీ చెలికత్తెలతో వేడుకగా నుండుము.” ఇట్లు భర్తచేత సమ్మానింపబడిన సీతాదేవి వాకిటివరకును వచ్చినదై దివ్యమంగళ విగ్రహుడైన తన హృదయేశ్వరుని జూచి శుభములను గోరుచు నిట్లనెను. “బ్రాహ్మణ సేవితమగు రాజ్యమున రాజసూయాభిషేకముతో రాజు నిన్ను బ్రహ్మ ఇంద్రునికి జేసినట్లు సంతోషముతో పట్టాభిషిక్తుని జేయునుగాత!

దీక్షలోనున్నవానిని, నియమ సంపన్నుని దివ్యమైన తేజస్సు గలవానిని, కృష్ణమృగచర్మము ధరించిన వానిని, పవిత్రుని, మృగశృంగమును బట్టినవానిని నిన్ను జూచి సేవింప నాశ్రయించెదను. సర్వవిధములైన శుభములు నీకు కలుగుగాక! తూర్పుదిక్కున వజ్రాయుధమును ధరించిన యింద్రుడును, దక్షిణమున సూర్యపుత్రుడగు యముడును, పడమట సముద్రములకు రాజైన వరుణుడును, నుత్తర దిక్కున నిలబిలానందనుడైన కుబేరుడును నెల్లవేళల నిన్ను కాపాడుచుందురు గాక!" ఇట్లు పలుకుచున్న సీతను వెనుకకు వెడల ననుజ్ఞ యిచ్చి పట్టాభిషేకమునకై మంగళకౌతుకము చేసికొనియున్న రాముడు సూతునితో గూడి తన సౌధము నుండి సంతోషముతో బయలుదేరిన వాడయ్యెను.

**శ్రీరాముడు దశరథ గృహంబునకు బోవుట :**

పర్వతగుహను వీడు సింహమో యనునట్లుగా దర్పము మెరయగా మందిరమును వీడి మొదటి ద్వారమునకు ప్రక్కగా చేతులు జోడించి నిలిచియున్న సుమిత్రాదేవి సుతుడైన లక్ష్మణునితో గూడి మధ్యనున్న కక్ష్యను ప్రవేశించి యచ్చటనున్న తన మిత్రుల నాదరముతో పలుకరించి యచ్చటనుండి బయలుదేరి అగ్నికాంతి బోలు ప్రకాశము గలిగి పులిచర్మముచే నలంకరింపబడి, మేఘధ్వని, సూర్యకాంతి, తగినటువంటి వైశాల్యము, గున్నయేనుగుల వంటి గుఱ్ఱములు కలిగి దేవేంద్రుని రథము యొక్క వేగమువంటి వేగము గలదియైన రథమును శ్రీరామచంద్రుడు తూర్పుదిక్కున చంద్రుడుదయించినట్లుగా నెక్కెను. ఛత్రమును చామరమును చేతుల మెరయుచుండగా ధరించి వెనుక లక్ష్మణుడు కాచియుండగా, నాకాశమార్గమున నురుముచున్న మేఘమో యనునట్లుగా నారథము మిక్కిలి శబ్దించుచుండగా, నుదయ పర్వతము మీద నుండి బయలుదేరు చంద్రుని మాదిరిగా తన నివాసమును వదలి బయలుదేరుచుండగా చూచుచున్న జనుల యొక్క కలకల శబ్దమధికమై వ్యాపింపగా, చందనాది

సుగంధ ద్రవ్యములను పూసికొన్న జనులును, విండ్లు ఖడ్గములు ధరించినవారు వేనవేలుగా ముందుగా నడచుచుండగా వెనుక ప్రక్కగా వేలకు వేలుగా గుఱ్ఱములు నేనుగులు వెన్నంటి రాగా మంగళకరములైన వాద్య విశేషముల ధ్వనులును వందిమాగధుల యధికమైన జయజయ ధ్వనులును, ఏనుగుల గుఱ్ఱముల యొక్క కంఠధ్వనులును, గొప్పగా వినిపించుచున్న శూరుల యొక్క నినాదములును అన్నిచోటుల నుండియు వినిపించుచుండ, భూషణములతో నలంకరింపబడిన స్త్రీలందఱును కిటికీలయందున్న వారై దోసిళ్లతో పూవులను రామునిపై జల్లిరి. నేలమీదను, మేడలమీదను కిటికీలయందును నుండి చూచుచున్న స్త్రీ జనులు సీతాపతిని కుసుమ సుకుమారుని నతడు సంతోషించు నట్లుగా స్తుతించిరి. ఓ కౌసల్యా కుమారా! సఫలమైన గమనము గలవాడవై సింహాసనస్థుడవైన నిన్ను జూచి నీ తల్లి మిక్కిలి సంతోషించును. ఓ సీతా మనోహరా! పతివ్రతాతిలకమగు సీత పూర్వజన్మమున నెట్టి తపస్సును జేసినదో! యా రోహిణి చంద్రుని వలె నిన్ను గూడి నీ ప్రియురాలయి యలరుచున్నది. రామచంద్రా! నిన్ను రాజుగా పొందుటకు మేమేమి శ్రేష్ఠమైన వ్రతము చేసితిమో గదా! దశరథరాజు యొక్క దయచేత రాముడు మనకు రాజగును. మనము పూర్తిగా కోరికలు తీరినవార మగుదుము. ఇక నితని పరిపాలనములో మనము కష్టమను మాటనే మరచిపోయెదము.” అని యిట్లు స్త్రీలందఱును తనను గురించి చెప్పికొను మాటలను విని సంతుష్టుడై వెళ్లి గుఱ్ఱములు, నేనుగులు, స్వస్తివాచకులు, మాగధులు, వందిజనులు, సూతులు, పౌరజనులు, పుణ్య పురుషులు, జనులతో నిండియున్నదియునగు రాజమార్గమును జూచెను.



# పదునేడవ సర్గము

**అం**దముగానున్న జెండాలతోడను పరిమళవంతములైన యగురు ధూపములతోడను తెల్లని మబ్బులో యనునట్లుగా ప్రకాశించుచున్న గృహముల తోడను, అగురు చందనాది పరిమళ ద్రవ్యములతోడను, సన్నని మేలైన పట్టువస్త్రములతోడను, స్ఫటికముల ముత్తెముల సమూహములతోడను, నోరూరించు రుచులు గలిగిన భక్ష్యములతోడను, వరుసలుగా నున్న యంగళ్ల తోడను, ప్రకాశించుచు నాకాశమున నున్న దేవతల మార్గమా యనునట్లున్న రాజమార్గమున సంతోషముతో రామచంద్రుడు వెళ్లుచు హవిస్సు, పెరుగు అక్షతలు పేలాలు రాజార్హములైన దివ్యమైన రూపముల సమూహములు – పుష్పమాలికలు మొదలైన వానిచేత తగు విధముగా పూజింపబడిన మార్గముల కూడలి ప్రదేశములను చూచెను.

**ప్రజలు శ్రీరాముని దీవించుట :**

అక్కడనున్న వారందఱును ఆనందముతో తనకు దీవనలిచ్చుచుండగా వారందఱిని తగిన విధముగా మర్యాదలచేత తృప్తులను చేయుచు వెళ్లుచుండగా వారు భక్తియుక్తముగా “మీ తాతలును ముత్తాతలు నే్రప్రకారముగా రాజ్యమును పాలించిరో యా రీతిగా వీవును నీ రాజ్యమునకు రాజువై మమ్ములను ప్రేమతో పాలింపవయ్యా శ్రీరామచంద్రా! మీ తండ్రి తాతల పాలించిన రాజ్యము కన్నను నీ రామరాజ్యమున సుఖముగా బ్రతుకగలము. రాముడు గనుక రాజు గాకపోయినచో మాకన్నమును అధికములైన ధనమును కూడనెందులకు? మనకు శ్రీరాముని పట్టాభిషేకముకంటెను గొప్పదైన శుభము ఏమి రాగలదు? శ్రీరాముని యొక్క యుత్సవ మిప్పుడు జరుగుచుండగా నింకొక పనిపై మనస్సు లెట్లు వెళ్లగలవు? ఏమి పుణ్యఫలితమో యిది. ఇంతవఱకెవ్వరికిని దొరక నటువంటి శ్రీరామచంద్రుని యొక్క పట్టాభిషేకము మన జన్మ సార్థకమగు నట్లుగా చూడగలుగు చున్నాము.” అనుకొనుచు శ్రీరాముని మీద నిల్పిన

తమ చూపులను, మనస్సులను గొప్పవాడైన రాముడు చాల దూరముగా వెళ్లినను లోకులందఱును కొంచెమైనను త్రిప్పుకొన లేనివారైరి. ఆయన కనుమరుగైనను అంతకుముందు చూచిన సంస్కార దారుఢ్యముచేత శూన్యమునందు గూడ రఘురాముని యాకారమును మిక్కుటమైన కోరికతో చూచుచుండిరి. ఎవ్వడు రాముని చూడడో, రామునిచేత నెవ్వడు చూడబడడో వాని బ్రతుకది యెందులకు? భూమియందు నిందింపబడిన వాడైన ఆ యధమ మనుష్యుని వాని మనస్సే అసహ్యించుకొనును. నాలుగు జాతుల వారిని ప్రేమతో జూచుట చేతను, చిన్న పెద్దయను తారతమ్యము లేకుండ అన్ని వయసుల వారిని ఆదరించుటచేతను జనులందఱు నెల్లప్పుడును పవిత్రుడును ధర్మాత్ముడును నగు రామచంద్రుని వెంటనుండెదరు. నాల్గుమార్గముల కూడలులకును, మంటపములకు, దేవుడుత్సవ దినములలో నూరేగు మార్గములకును, దేవాలయములకును సంతోషముతో సీతాకాంతుడు ప్రదక్షిణముగా రాజ భవనమునకు వెళ్లెను. మేఘసమూహము వంటిదై యింపైన ప్రాసాదముతో నొప్పుచున్నదై మఱియు వెండికొండయో యనునట్లుగా నాకాశమును ముద్దుపెట్టుకొనుచు నిర్మలమై, రత్నసమూహములచే నలంకరింపబడి రమ్యములైన గృహములతో ప్రకాశించుచు మహేంద్ర సదనమో యనునట్లు సాటిలేని సౌందర్యముతో నొప్పు దివ్యమైన తన జనకుని మందిరమును బ్రవేశించి, విండ్లు ధరించిన వీరు లెల్లప్పుడును విడువకుండ కాపలా కాయుచున్న మూడు కక్ష్యలను రథముతోడనే మిత్రులతో గలసి దాటినవారై యవతలి రెండు కక్ష్యలను కాల్నడకతో దాటినవాడై యచ్చట తనతో వచ్చిన హితులందఱిని నిలువమని చెప్పి తన తండ్రి మిక్కిలి మక్కువతో సంచరించు నంతఃపురమునకు రామచంద్రుడు వెళ్లగా జనులెల్లరు రాముని యొక్క రాకకోసమై ద్వారమునొద్ద యెక్కువైన యుత్సాహముతో – సముద్రము చంద్రుని రాకకై యెదురుచూచునట్లుగా కాచుకొని చూచుచుండిరి.



# పదునెనిమిదవ సర్గము

## శ్రీరాముడు దశరథుని స్థితికి వగచుట :

ఆ ప్రకారముగా వెళ్లి రామచంద్రుడు, విశాలమును శుభకరమునగు ఆసనమునందు మహాశోకముచే ముఖము వివర్ణతను బొంది వాడిపోగా, కనులవెంట కన్నీటి ధారలు కారుచుండగా కైకతో పెడమోమయియున్న తండ్రిని చూచి వినయము గలవాడై తగు విధముగా నభివందనముచేసి తరువాత కైకేయి పాదములపై వ్రాలి లేచి నిలువబడగా దశరథుడెక్కువయిన శోకముతో 'రామా'యని పలికి వేరొక వాక్యము పలుకడయ్యెను. కుమారుని చూడడయ్యెను. పూర్వమెప్పుడును చూడనటువంటి యాపదలో క్రుంగిపోవుచున్న రాజు యొక్క భయంకరమైన రూపమును తాను కన్నులతో జూచి రాముడు పామును త్రొక్కినవానివలె భయపడెను. ఉపమానరహితమైన శోకముచేత పీడింపబడిన వానిని, సంతోషమే లేనివానిని, చైతన్యరహితుని, ఘనమైన దీర్ఘమైన నిశ్వాసములు విడుచువానిని, కష్టదశ నొందినవానిని, రాహువుచే పీడింపబడిన సూర్యునివలెను, సంక్షుభితమైన సముద్రమువలెను, నసత్యములాడిన సన్మునివలెను నున్నవానిని చూచి తాను కూడ తొట్రుపాటునొంది, పర్వము లందు సముద్రము చెందినట్లు కలతజెందినవాడై తన తండ్రికి కలుగరాని యీ దశ యెట్లు వచ్చెనోయని తలపోయుచు మనస్సునందు భయముతో రాము డిట్లు చింతించెను. "అయ్యో! నన్ను చూచికూడ ముఖమునందిపుడు వికాసమునేల పూనకున్నాడు? ఎప్పుడైన నేదైనను కోపముచెందినను నన్ను చూడగానే ప్రేమతో నాదరించువాడు. ఆ మార్గమిప్పుడు తప్పినట్లు తోచుచున్నది. నావంక చూచి ఇప్పుడెంతో దీనముగా బాధపడుచున్నాడు. కారణమేమోగదా!"

అని తన మనస్సులో నాలోచించుచు నెక్కువగుచున్న శోకముచేత విహ్వలత్వమును పొంది తన ముఖము తెల్లబోగా భయముతో చేతులు జోడించి..

**శ్రీరాముడు కైకను దశరథుని దుఃఖకారణ మడుగుట :**

మనస్సు తల్లడిల్లిపోవుచుండగా శ్రీరాముడు బాధతో కైక వంక చూచి “ఓ తల్లీ! నేను పొరపాటున గూడ నా తండ్రి కెట్టి తప్పును చేయలేదు. ఈ విధముగా నన్ను చూచుట కొప్పుకొనుట లేదు. నాతో మాటలాడుటకు గూడ మొగమెత్తుట లేదు. ఇందులకు కారణమును చెప్పుము. నీవయిన నోదార్పుము. నాపై నెంతయో ప్రేమతో నెప్పుడు సంచరించెడువాడు నా తండ్రి. తానిప్పుడోతల్లీ! మాటలాడుటకు గూడ నిష్టపడుటలేదు. ఇది యేదైనను శరీరములో పుట్టిన తాపమా? మనోవేదనయా? భూమిని పుట్టిన జీవునకు రోగమనునది రాకుండునా? దేహమును దాల్చినవాని కెప్పుడును సుఖమే కలుగునా? తన చిన్న కుమారుడగు భరతుని గురించి యశుభమునేదైన వినలేదుగదా. నా జనుల విషయమున కీడునేదైనను గనలేదుకదా. ఆయన యే విషయము నైనను జెప్పినది చేయక నా తండ్రిని నొచ్చుకొనజేసినచో భూమియందొక్క ముహూర్తకాలమయిన నేను బ్రతుక నొల్లను. ఆయన కోపించినచో నేనెట్లు జీవింతును? సత్యముగా తనకు తరించుటకుచితమైన దేహమునిచ్చి భువిలో కాపాడిన ప్రత్యక్ష దైవమైన తండ్రికి విశ్వాసరహితుడై యెవడైన నెదురాడగలడా? ఓ తల్లీ! నిజము చెప్పుము. ఈ ప్రకారముగా తండ్రి వగచుటకు నీ వభిమానవతివై దూషించుచు కోపావేశముతో పురుషోక్తులాడలేదు గదా! నిజము చెప్పుము. రాజున కీ ప్రకారముగా నిదివరకెన్నడు నెఱుగని బాధ యెట్లు వచ్చెను. ఈ ప్రకారముగా నెందుకు బాధపడుచున్నవాడో యిందుకు గల కారణమేమియో చెప్పుము” అను రాముని యొక్క మాటలను విని లజ్జను వదలిపెట్టినదై మనస్సున వికలత్వమును పొందకుండ కైక యతనిని చూచుచు, తన మేలునే మదిలో

తలంచుచు, ఔచిత్యమును మనస్సున నెంచక యిట్లు పలికెను. “ఓ కౌసల్యాతనయా! నీ తండ్రికి కోపము కలుగలేదు. శరీరమున దాపమును లేదు. మనస్సున నున్న కోర్కెను నీకు చెప్పినట్లైన కోపము వచ్చునేమో యని భయమును జెందుచున్నాడు. నేను చెప్పుదునా? నీవు గనుక యాపనిని చేసినట్లైన రాజునకు మనస్తాపము తీరిపోవును. ఇష్టుడవైన నీతో నెట్లప్రియమును చెప్పుదునని భయమును పొందుచున్నవాడు. అందులకే నీతో మాటలాడుటకు గూడ నాలుక వచ్చుటలేదు. కుమారా! ఆ మాట చెప్పుదునా? మునుపు నాకు గౌరవపూర్వకముగా వరములనిచ్చి, యిప్పుడు వాటిని నేనడుగగా నల్లునివలె బాధనొందుచున్నవాడు. నాయనా! ప్రతిజ్ఞ చేసియు, గతజలమును సేతువుతో కట్టజూచుచున్నాడు. తానన్న మాటను తానే తప్పుట యాపదకాక న్యాయ మగునా? నాయనా! రామా! ప్రాజ్ఞులు సమస్త భువనములకు మూలాధారము ధర్మమని యందురు గదా? మీ నాయన నీమీద ప్రేమచేతను, నా మీద కోపముచేతను తానిప్పుడు తప్పకుండునట్లుగా నీవయినను, నీ తండ్రి మాట మేలుగానీ యది కీడుగానీ చేసెదవేని చెప్పెదను. నా మాటలు నీవు వ్యర్థము కానీయకున్నచో రాజు మనస్సులోని ఆలోచనను చెప్పెదను. నీ యందలి మొగమోటము చేతను, నీ కప్రియమోయను భావము చేతను నీ తండ్రి తానయి నీకు జెప్పడు” అని యీ ప్రకారముగా చెప్పుచున్న కైకను జూచి మిక్కిలి బాధనొందుచు రాజునెదురుగా తన మనస్సులోని భావము తెలియునట్లుగా స్పష్టముగా నిట్లు పలికెను. “ఇస్సీ! ఓ తల్లీ! యిది యేమి మాట? యిట్లు మాట్లాడుట తగునా? నన్ను శ్రీరామునిగా నెఱుంగవా? బాగున్నది. వినుము. రాజు నాజ్ఞచేత నా దేహము నగ్నిజ్వాల కింధనముగా జేసెదను. వేగముగా విషమునైనను త్రావుదును. మహాసంరంభముతో సముద్రముననైన దూకెదను. ఇంకను నీకనుమానమెందులకు? నాకు దశరథుడు, రాజును, గురువును

తండ్రియు గాన నాకు మేలునెప్పుడు మనస్సున గోరుచుండును. అతని యొక్క యిష్టమును నెప్పుడును తీర్చెదను. ఓ తల్లీ శపథము చేసి చెప్పెదను. ఈ రాముడు రెండు మాటలాడువాడు కాదని తెలిసికొనుము" అని రాముడు పలుకగా..

## శ్రీరామునితో కైక తన వరముల వృత్తాంతము చెప్పుట :

మంచి నడవడిగలిగిన సత్యవాదియైన చక్కనైన వానిని జనులచేత పొగడబడినవానిని రాముని జూచి టక్కరితనము జాణతనము గలిగిన యాకైక యుక్కును గరగించి చెవులలో పోసిన యటుల నిట్లనెను. "పూర్వము దేవతలకు రాక్షసులకు జరిగిన యుద్ధమున శరీరమున బాణములు గ్రుచ్చుకొనిన నీ తండ్రిని గర్వించియున్న రాక్షసులకు వశము కాకుండునట్లుగా నేను యుద్ధరంగమునందు కాపాడితిని. కుమారా! అప్పుడీ రాజు నాకు రెండు వరములను కృతజ్ఞుడై దానికి మారుగా నిచ్చెను. ఆ రెండు వరములచేతనే ఓ రఘురామా! నీ తమ్ముడగు భరతుని ప్రేమతో రాజును జేయుటయును, నీవు వెంటనే దండకారణ్యమునకు వెళ్లుటయును కోరితిని. ఓ రామచంద్రా! నీ తండ్రికిని నీకును ప్రఖ్యాతిగా అసత్యదోషము కలుగకుండ చూచుకొనెదవేని నా మాటను సంతోషముతో వినుము. నా కోరికను దీర్పుము. నాయనా! నేను చెప్పిన మాటలనన్నిటిని వింటివిగదా! తండ్రి యొక్క మాటను దాటి ప్రవర్తింపకుము. పదునాలుగు సంవత్సరముల గొప్పవైన యడవులలో చరించుటకు గానిప్పుడే వెళ్లుము. నీ పట్టాభిషేకమునకు సమకూర్చిన వస్తువులు భరతునకుపయోగించును. పట్టాభిషేక సంరంభమును వదలి జడలును చర్మమును ధరించి వెళ్లుము. అనేకములయిన రత్నములతోను విస్తారమైన వైభవముతోను, రథగజ తురగములతోను ప్రకాశించుచున్న యీ కోసల దేశమును నా కుమారుడగు భరతుడు రాజై యేలుచుండును గాక! సాటిలేని

దయ గల యీ రాజు నాకీ రెండు వరముల నిప్పు డిచ్చియును మతిచెడిన వానివలె బాధతో ముఖము వెలవెలపోవుచుండగా నీ ప్రకారముగా నిన్ను చూచుట కిష్టపడకున్నాడు. పుణ్యమైన నియమము గలవాడా! ఈయన మాట నెరవేర్చి యీ భూపతి సత్యవాది యను కీర్తిని నిలిపినవాడవై తరించునట్లు చేయుము." ఈ విధముగా ఆమె యెన్ని కఠినములైన మాటలను పల్కినను ధీరబుద్ధి గల రాముడు మనస్సునందు కొంచెమైనను శోకముచే గలతజెందలేదు. దశరథుడీ మాటలన్నిటిని విని పుత్రవియోగాన్ని చేక్రాగుచు పుత్రశోకముచే నెంతయో తపించెను.



# పందొమ్మిదవ సర్గము

## అరణ్యమునకు బోవ శ్రీరాము డంగీకరించుట :

మరణముతో సమానమైనవియును, మిక్కిలి ప్రియము కానివియునునైన సవతితల్లి మాటలను శత్రు భయంకరుడైన రామచంద్రుడు విని మనస్సు నందించుకంతయైనను బాధనొందనివాడై ఆమెతో నిట్లనెను. "ఓ జననీ! యింతమాత్రమునకేనా నా తండ్రి నన్ను చూచి మాటాడలేక దుఃఖమందు చున్నాడు? తల్లీ! జడలను ధరించి యెల్లప్పుడును నారచీరలు గట్టుకొని రాజు యొక్క మాటలను సార్థకముగా చేయుచు భయంకరమైన యడవుల కిప్పుడే వెళ్లెదను. కాని నాకీ విషయమును చెప్పుము. ఈ రాజచంద్రుడు మునుపటివలె నన్ను చూచియును, నా రాకకు సంతోషమును పొందడేమి? నీ యెదుట నేను యథార్థము చెప్పుచున్నాను. ఇప్పుడే నారచీరలు జడలు ధరించి నీ మనసు సంతోషమును జెందునట్లుగా వనములకు వెళ్లెదను. నీ మనస్సున నూరడిల్లుము. కోపగించుకొనకుము. నాకు హితుడును, తండ్రియును, గురువును, రాజును కృతజ్ఞుడును అగు ఈయన నన్ను నమ్మి యీ పని చేయుమనగా నీ భూమియందు బ్రతికియుండియు నెందులకు ప్రియము చేయకుందును? చూడ చూడగా నొక్క విషయమును గూర్చియే బాధను జెందుచున్నాను. మనస్సు తల్లడిల్లుచున్నది. అయ్యో! రాజు స్వయముగా నన్ను పిలిచి నాయనా! ప్రీతితో భరతుని రాజుగా జేసెదను అని ప్రేమతో నొక్క మాట నాతో జెప్పకపోయెను. నేనేమి యపరాధము చేసితినో! పలుమాటలేల? భరతునకెంతో సంతోషముతో మున్నే రాజ్యమును, ప్రాణమును, ధనసముదాయమును నేనై యిచ్చివేయలేనా? రాజు – అంతేకాక తండ్రియు

తాన్నె కోరగా, నీకు సంతోషకరముగా నా ప్రతిజ్ఞ ప్రీతితో చేకుందునా? తల్లీ! రాజును సేదదీర్చుము. నేలవైపు చూచుచున్న కన్నులు గలవాడై కన్నులవెంట నీరుగారుచుండగా నెందులకిట్ల దుఃఖమును పొందవలెను? రాజుయొక్క యనుమతితో నీ కుమారుడగు భరతుని తీసికొనివచ్చుటకు అతని మేనమామ యింటికి దూతలను బంపించుము. నేనడవులకు వెళ్లెదను. తండ్రి నాతో స్వయముగా జెప్పలేదని నెపమును చెప్పను. ఇది యొప్పని తప్పని మాటాడను" అని చెప్పుచున్న రఘురాముని మాటలకు కైక యాత్మలో హెచ్చుగా సంతోషమును పొంది యిట్లనెను. "అట్లే చేసెదను. ఇప్పుడే దూతలను బంపించి నా కుమారుని పిలిపించెదను. ఆలస్యమును సహింపలేను. సరే నా కుమారుని సంగతి యెందులకు? ఎదురుచెప్పక నీవు వనములకు వెళ్లుము. పోవుటకు సిద్ధముకమ్ము. నీ తండ్రి సిగ్గుచే మాటలాడుట కిచ్చగింపడు సుమా! మిక్కిలి దైన్యముతో తనంత తాను సతమతమగుచున్నాడు. దానిని నీవు వేరుగా భావింపకుము. నీ వడవులకు వెళ్లునంతవఱకు నీ రాజు కూడు నీళ్లు ముట్టనివాడై యిట్లే భూమి మీద బడియుండును" అని కైక పలుకగా దశరథుడా మాటలను విన్నవాడై "ఛీ! యిది యెంతటి కష్టము" అని యనుకొనుచు మనసులో కలతచెందినవాడై దుఃఖముచేత తపించి శయ్యయందు సొమ్మసిల్లినవాడయ్యెను. అప్పుడు రాముడు రాజును లేవనెత్తి తల్లి చెప్పిన మాటలను విని కొరడాతో గొట్టబడిన గుఱ్ఱమువలె - వెంటనే తాను వనములకు వెళ్లవలెనని యాలోచించెను. ఆ దుష్టురాలు తనతో బలికిన వాక్కులనెడి శరములకు దుఃఖము జెందక, సీతాపతి తన యుద్దేశము తెలియునట్లుగా నా పాపపు కైకతో నిట్లనెను. "ఓ కైకా! ధనము సంపాదించుటే పరమార్థమని తలచువాడను గాను. నీ భూమియందు నిలుచుటకు గూడ నిష్టపడను సుమీ. నీవు నిజముగా దెలిసికొమ్ము. గొప్పదైన సత్యమును, ధర్మమును నియమముగా గల యతులతో సాటివచ్చువాడనని నీ మనస్సునందు హెచ్చుగా తలంపుము. ఇది చేయుట

ఒక లెక్కయా? వినుము. తండ్రికి సంతోషమును గలిగించు యే పనినైనను మానకుండగా నా ప్రాణములనిచ్చియైనను, నెట్టులైనను చేయువాడను. తండ్రికి సేవ చేయుటకంటె, నతని మాటను నెరవేర్చుటకంటె నీ భూమియందు మేలైన ధర్మమింకొకటి యున్నదా? నా జనకుడు వెళ్ళుమనకున్నను ఓ తల్లీ! నీ మాట ననుసరించి యిప్పుడే వనములలో పదునాల్గు సంవత్సరములు నీ కోరిక తీరునట్లుగా వసించుటకు వెళ్లెదను. బలవంతము చేసి రాజును బాధపెట్టితివి. నాతో నొక్కమాట చెప్పవైతివి. నన్నాజ్ఞాపించు నధికారము గలదానవయ్యును నా బుద్ధితత్వమును గుణమును దెలిసికొనలేని దానవయితివి. నాతల్లి యనుజ్ఞను గైకొని నా భార్యనోదార్చి వచ్చువఱకు నయ్యెడు ఆలస్యము నోర్చుకొనుము. నీకు సంతోషము కలుగునట్లుగా నే నడవిలో నివసింప బోవుదును. భరతుడు రాజై తండ్రికి శుశ్రూష చేయునట్లుగా ఓ తల్లీ! నీ వతనికి చెప్పుము. భూమి యందిది పూర్వము నుండి వచ్చునట్టి యాచారముగదా" అని రాముడు చెప్పు చుండగా విని దశరథుడు భరింపరాని శోకవేగము చేత గొప్పదైన శబ్దములతో అరచినట్లుగా పలవరించెను.

**శ్రీరాముడు కౌసల్యా గృహమునకు బోవుట :**

అప్పుడు రాముడు తన తండ్రికి ప్రదక్షిణము చేసి నమస్కరించి గయ్యాళి యగు కైకేయికిని వందనము చేసి, ప్రకాశమానమగు నంతఃపురమును తొందరగా వదలి కన్నీరు నిండిన కనులతో క్రోధముతో మండిపోవుచున్న మనస్సుతో తమ్ముడగు లక్ష్మణుడు వెంటరాగా ప్రదక్షిణ పూర్వకముగా అభిషేకభాండములకు నమస్కరించుచు 'ఇవి యన్నియు భరతుని యొక్క యభిషేకమున కుపయోగించుగాక యని ప్రార్థించుచు, వానియందు తన మనస్సును, దృష్టిని మిక్కిలిగా ప్రసరింపనీక, ఛత్రమును, సుందరమైన చామరములను, రథమును, బంధువులను, స్నేహితులను వదలిపెట్టి చలించని యింద్రియములు గలవాడై యా జనుల యొక్క దుఃఖమును దలచి వగజెందుచు

తన తల్లియైన కౌసల్య యొక్క యింటి మార్గముగా వెళ్లెను. సమస్త సుఖములును, రాజ్యభోగములును తొలగిపోయినను రామునకు యోగికివలె ముఖమున వికాసము తొలగిపోలేదు. జనులను మోహింపజేయు నాకృతి గల చంద్రునకు రాత్రి యొక్క యాగమనము మాలిన్యము కలుగజేయుట కెన్నడైనను సమర్థ మగునా? ఆ కీడు కలుగజేయు వార్త తెలియజేయుటకై వెళ్లుచున్న రామచంద్రుని ప్రకాశవంతమయిన ముఖపద్మమునందు చూచువారెవ్వరు నే విశేషమును చూడజాలకపోయిరి. గొప్పనైన బుద్ధిశక్తిచేత రాముడు శరత్కాలమున పూర్ణముగా నున్న చంద్రునివలె తేజస్సును కొంచెమైన కోలుపోలేదు. కొంచెమైన సంతోషమును విడచిపెట్టడు. పొంగివచ్చు దుఃఖమును మనస్సునందే యణచుకొన్నవాడై గొప్ప పరాక్రమము గలవాడగు లక్ష్మణుడు తనవలెనే తనవెంట వచ్చుచుండగా లోకులను సంతోషముతో మంచి మాటలతో సంతోషపడునట్లు చేయుచు నెవ్వరికిని తన పట్టాభిషేక భంగవార్తను వారు ప్రాణములను విడుతురను శంకచే చెప్పక తన తల్లి యొక్క సౌధమును ప్రవేశించెను.



# ఇరువదవ సర్గము

**అ**ట్లు రాముడంతఃపురమును వదలి తల్లి నగరుకు వెళ్లగా లోపల సౌధములలో నివసించు స్త్రీజనము యొక్క ఘొల్లుమను శోకధ్వనులు ఆకాశమునంటెను. “హా! ఎంత విపరీతము పుట్టినది? రామచంద్రుడు వనములలో నివసించునట. ఇప్పుడు గతి యేది? ఎట్లు తాళగలము? ఏమి చేయగలము? తన జనకుడు చెప్పకపోయినను నంతఃపురములో నుండు మా అందఱి పనులనెంతో చనువుతో చేయుచు, అందఱకు సమ్మతియగునట్లు చేయుచు మాకు శరణంబును దిక్కు కూడనయి తన తల్లిని సేవించినట్లు తాను పుట్టినది మొదలుకొని మిక్కిలి భక్తితో మనలను కూడ సేవించు చుండువాడు గుణములచే గౌరవింప దగినవాడు నగు రాముడు వనములకు వెళ్లుచుండెను. తన యందెవ్వరైనను నొక తప్పు చేసినను, దుర్భాషలాడినను విని కూడ కోపగింపడు. కోపింపవలసిన విషయములను వేగముగా వదలి వేయును. తన మీద కోపగించుకొన్నవారియందు దయను కొంచెమైన మానడు. అట్టి కౌసల్యా కుమారుడు, ధన్యుడయిన రామచంద్రు డడవులకు వెళ్లుచున్నాడు. అయ్యయ్యో! సర్వభూత సంఘమునకు గతి యెవ్వడు? పుణ్యాత్ముడైన రాముని దయలేక యడవులకు మతితప్పి పంపించుచున్న రాజు ఈ భూమిమీద జీవుల సమూహమును హింసించుచున్న యట్లే కదా! యని దశరథుని యొక్క భార్యలందఱును భయము కలుగునట్లు తన్ను నిందించుచు పెద్ద ధ్వనితో గోలుగోలున నేడ్వగా దశరథుడది విన్నవాడై చిన్నబోయిన మనస్సుతో శయ్యయందు పడిపోయెను. ఆ ధ్వనిని లక్ష్మణ సహితుడైన రాముడు విన్నవాడై మనస్సునందే దుఃఖము నడంచుకొన్నవాడై ఏనుగువలె నిట్టూర్పులు విడుచుచు తల్లియొక్క యంతఃపురమును సమీపించి యందు మిక్కిలి పూజ్యుడును వృద్ధుడును నయిన ద్వారపాలకుని మఱియు నచ్చట మూగిన యఖిలమైన

జనులను చూచి వారలు తనను జూచి జయజయ ధ్వనులతో లేచి నిలువగా ముందుకు బోవుచు మొదటి కక్ష్యను దాటి రెండవ దానిని ప్రవేశించి యందు రాజపూజ్యులును, వేద పండితులును, వృద్ధులును నైన బ్రాహ్మణ శ్రేష్ఠులను జూచి వారందరికి వరుసగా నమస్కరించి రామచంద్రుడు తరువాతి కక్ష్య ద్వారము నెల్లప్పుడు కాచియుండు ముసలివారిని పిల్లలను సమీపింపగా, వారందఱును దీవించి వెళ్లి కౌసల్యతో సీతావిభుడు వచ్చుచున్నవాడని చెప్పగా తాను కూడ రాత్రి నుండియు వ్రతమునుబట్టి తెల్లవారగనే విష్ణుపాదములయందు భక్తిని నిలిపినదై.

## శ్రీరాముడు కౌసల్యను జూచుట :

రామునకు మంచి గలుగుటకై యమితమైన భక్తితో శ్రీమహావిష్ణువును పూజించు చున్న పుణ్యశీలయు, తెల్లనైన పట్టుచీరను గట్టి విద్యుక్తముగా వ్రతములు చేయుచున్న పరమసాధ్వియు, మంత్రములతో శుభములను గోరుచు నగ్నిలో హోమము చేయుచున్న మంచి చరిత్ర గలదియును, నియమములచేత కృశించినదై తన దైవతమును నీటిచే నభిషేకము చేయుచున్నదియును, నగు తల్లిని చూచి, దేవపూజకై తెప్పించిన పెరుగు, నెయ్యి, పాలు, పేలాలు, పువ్వుల దండలు, పాయసము, ఒప్పుచున్న నిండైన కడవలు, సమిధలు మొదలగు వస్తువులను చూచి రాముడు తల్లికి నమస్కరించెను. అట్లు వచ్చిన కుమారుని జూచి యెక్కువైన ముచ్చటతో ఆడగుఱ్ఱము గుఱ్ఱపు పిల్లనువలె ఎదురువచ్చి ప్రేమమీర కౌగిలించుకొని శిరస్సు మూర్కొనుచు మిక్కిలి ప్రీతితో కౌసల్య అన్యులతో పోల్చరాని తేజముగలవానిని, రఘువంశ శ్రేష్ఠుని, తన హర్షమనెడు సముద్రమునకు (ఉప్పొంగించు) పూర్ణిమచంద్రుని వంటి వానిని ప్రేమ పూర్వకముగా దీవించెను. “రామా! ఇప్పుడే వెళ్లి నీ తండ్రిని జూడుము. సత్యప్రతిజ్ఞ గల యా రాజీయగా యువరాజత్వమును పొంది వృద్ధిని గనుము. చిరంజీవివై వర్ధిల్లుము” అని పలుకుచు దయతో భోజనము చేయుమని వేసిన పీటను చేతితో మెల్లగా స్పృశించి, కొంచెము సిగ్గుచెందినవాడై చేతులు జోడించి తన తల్లికిట్లు చెప్పదొడగెను. ఆ రామునకు మిక్కిలి వినయమనెడు గుణము

సహజసిద్ధము. నుతింపబడిన గుణములు గల తన తల్లియెడల గల మిక్కుటమగు భక్తితో వినమ్రుడై తన పోకడను గూర్చి యిట్లు చెప్పదొడగెను.

**శ్రీరాముడు తల్లితో తానరణ్యమునకు బోవు వార్త చెప్పుట :**

"ఓ తల్లీ! నీవు తెలిసికొనలేకున్నావు. ఇపుడు నీకును, కోమలమైన మనస్సు గల సీతకును, మంచి గుణములు గలిగిన సౌమిత్రికిని తనయుగ్రత్వముచే మనస్సును బాధపెట్టు దుఃఖము ప్రాప్తమైనది. ఎందుకమ్మా యిక సుఖకరమైన యీ ఆసనములు. ఇప్పుడే దండకారణ్య సీమకు వెళ్లుచున్నాను. దర్భాసనము మీద కూర్చుండుటకు నాకు వేళ యాసన్నమయినది. ఆమిషమును వదలి పండిన పండ్లను తేనెను కందమూలములను తిని ముని మాదిరిగా పదునాల్గు సంవత్సరములు సంచరించెదను. భూపతి యౌవరాజ్యమును భరతున కిచ్చుచున్నవాడు. నన్ను పదునాలుగేండ్లు ముని రూపమును ధరించి దండకావనములో సంచరించుటకు బంపుచున్నాడు. వనములలో ఆఱు, నెనిమిది సంవత్సరములు జన సంచారము లేనిచోటులలో సంచరించుచు స్వేచ్ఛగా కూరలు కాయలు వేళ్లు వెల్లకులు తినుచు మునివలె విషయచింత (ఆమిషము) లేక ప్రొద్దుపుచ్చుచుందును" అని పలుకగా విని గొడ్డలితో నరుకబడిన యడవిచెట్టు మాదిరిగాను, ఆకాశమును వీడి నేలపై దొరలుచున్న దేవత వలెను కౌసల్య భూమిపైబడెను. ఈ విధముగా మొదలునరికిన యరటివలె నేలబడి మూర్ఛితురాలైయున్న పూజ్యురాలగు తన తల్లిని చూచినవాడై వేగముగా లేవనెత్తి రామచంద్రుడు మిక్కిలి గొప్పదైన భారముచే నేలబడిన గుఱ్ఱము వలె ధూళిచే కప్పబడిన దానిని చేతితో మెల్లగా తుడుచుచుండగా తన చెంత గూర్చొనియున్న సుతుని జూచి కౌసల్య గొప్ప శోకముతో కన్నుల నుండి కన్నీటిబొట్లు రాలుచుండ, ఎదుటనున్న సౌమిత్రి వినుచుండగా నిట్లు పలికెను.

**శ్రీరాముడరణ్యమునకు పోవుట విని కౌసల్య దుఃఖించుట :**

నాయనా ! నీవు నా కడుపున పుట్టకుండినచో నీ విధముగా అపరిమితమైన దుఃఖమును పొందియుండువాడవు కాదు గదా! (నీవు నా కడుపున బుట్టుటచే

నీకీ దుఃఖము. నాకు నీవు కొడుకు వగుటచే నాకీ దుఃఖము. వేరొక భాగ్యవతి కడుపున నీవు పుట్టినచో నిరువురమును నిట్లు దుఃఖింపము.) ఇటువంటి దుఃఖములను భరించుటకంటెను గొడ్రాలనై యీ ధరయందు ఎట్లో దినములను గడపుట మేలు కదా! పుత్రకా! గొడ్రాళ్లకు కొడుకులు కలుగలేదనే చింత యొక్కటే యుండును. కొడుకులు కలిగినచో మంచిగా బ్రతికినచో మంచిదే. కాని యిట్లయినచో ఎట్లు భరింపవలెనో చెప్పుము. తండ్రీ! అయ్యో! నేను పెద్ద పెండ్లామునని యైనను నా భర్త ఒక్క రోజునన్నైనను గౌరవపూర్వకముగా మంచి మాటలతో తన హృదయమున జేర్చుకొని సంతోషము కలుగునట్లుగా సౌఖ్యము గాని శుభముగాని సమకూర్చగా నెఱుగను. ఒక్క కొడుకు గల్గెను గదా. ఇప్పుడయినను సుఖములను పొందుదునని తలంచితిని. గడిచినది గడవనిమ్ము. అసహ్యకరములైన వినరాని మాటలను మనస్సును నొప్పించునట్లుగా అధములైన సవతులు నన్నాడుచుండగా కులస్త్రీనైన నేనెట్లు వినగలను. స్త్రీకి ఇంతకంటె దుఃఖకరమైన దింకొకటి యున్నదా? నీవు కూడ వనములకు వెళ్లినచో అంతులేని దుఃఖమునెట్లు సహింపగలను? పలుగాకితనముతో దుర్భాషలను సవతులు పలుకుచుండగా కులస్త్రీనయిన నేను వినుచుండ గలనా? అయ్యో! నా దుఃఖము దీనత్వము నెప్పుడు ముగియునో తెలియదు గదా! నీవుండగానే నాకిటువంటి కష్టములు ప్రాప్తించుచున్నవి. ఇంక నీవు కూడ అడవులకు వెళ్లినచో నాకు చావు తప్ప శరణ్యములేదురా తనయా! నా భర్తకు నా మీద ప్రేమ లేదు. ఇందు సందేహము లేదు. ఓ పుత్రకా! యికమీద గౌరవము కోల్పోయి కైక యొక్క దాసీ జనులకు సాటియగుదును. కాదు కాదు. అది యెట్లు సంభవించును. రామచంద్రా! వారికంటె కూడ నేను అధమాధమురాలినయ్యేదను. ఇక ఏ ప్రకారముగా నీ శరీరమును ధరించు దానను? ఈ దుఃఖసముద్రమునకు గట్టు ఎచ్చటనున్నదో చెప్పుము తండ్రీ! మంచి మాటలను పలుకుచు పలుమారు నన్ను సేవించువారు, నాచేత ఏమియని యెప్పుడో ఒక్కసారి పల్కరింపబడుచుండువారు. ఇక మీద నేను పిలిచినను కైకేయి పుత్రునికి భయపడి ఓ యని పలుకబోరు, మొగము కూడ

చూప నిష్టపడరు. నాయనా! దేనికని దుఃఖింతును? ముఖము మటమటలాడు చుండగా చిటచిటయని చీదరించి కొట్టు మాటలతో, కుటిలమైన గుణములతో అనేకమైన మాయలు తెలిసిన ఆ కైక యొక్క ముఖము చూచుటెట్లో కదా! పదునేడేండ్ల నుండి యెప్పుడు నా భంగపాటులును దుఃఖమును తీరునాయని, సుఖ మెప్పుడబ్బునాయని మనస్సున సంతతమెదురు చూచుచున్నదానను. చివఱకిట్లయ్యెను గదా! (పదునేడేండ్లనగా – ఇప్పుడు శ్రీరామునకు 28 సంవత్సరములు. క్షత్రియులకు 11వ యేట నుపనయనము చేయుదురు. అది మొదలు 17 ఏండ్లు అని భావము. అప్పటి నుండియేగదా ద్విజత్వ ప్రాప్తి. అప్పటి నుండియే యెప్పుడు బిడ్డలు పెద్దవారై తమ్ముద్ధరింతురోయని యాశ కలుగును.) అభిమానమును వదలిపెట్టిన దాననై నా సవతుల యొక్క దుర్భాషలను వినుచు నెన్నాళ్ళు క్షీణించుచు నుండగలుగుదునయ్యా! ఓ రామచంద్రా! నా దుఃఖమెప్పటికి దీరునని సవతియొక్క దుష్టత్వము నోర్చు కొందును? అది నేనెట్లో ఓర్చుకొన్నను సవతులు పెట్టు కష్టముల నెట్లు సహింపగలను? అందముతో పూర్ణచంద్రుని బోలిన నీ ముఖమును ఒక్క నిమిషమైనను చూడక యుండజాలను. అట్టి దాననగు నేను పదునాల్గు సంవత్సరములు నిన్ను జూడక సొంపు గోల్పోయి దీనురాలనై ఓ చిన్నికుమారా! యీ శరీరమున జీవముల నెట్లు నిలుపుదానను? అక్కటా నిర్భాగ్యురాలనగు నేను తపములు వ్రతములు నుపవాసములును ఎన్నో కష్టములననుభవించి చేసినది నా దుఃఖము పెరుగుటకే ఓ పుత్రరత్నమా! నిన్ను కని పెంచితిని. ఒంటరిగా నీవు కాననములకు వెళ్లుదునని చెప్పినను నా గుండెలు బ్రద్దలు కాకుండుటకు కారణము, అది నిశ్చయముగా ఇనుమో రాయియో అయియుండుటే. ఇంక వేరొకటి యైనచో వానల ఆధిక్యముచే క్రొత్తగా వేగముగా బ్రవహించునది నీటి యొరపిడికి చెడిపోయిన యొడ్డో అనునట్లు సమసిపోకుండునా? అయ్యయ్యో! నాకు చావురాదు గదా! యముని యింట నాకు చోటు లేకున్నది. ఇది నిక్కము సుమా! ఏల యందువా? వినుము. నీ

అరణ్యవాస వార్తకు భయపడి యేడ్చుచున్న నన్ను, ఆడలేడిని బలాత్కారముగా బట్టుకొని యీడ్చుకొనిపోవు సింహమువలె యముడు వేగముగా నిప్పుడే యీడ్చుకొని పోవకుండుట కదియే కారణము. ఓ కుమారా! గొప్పదైన యీ ఆపదకు నా గుండె ముక్కలు ముక్కలై పోవకున్నది. ఇది ఉక్కుముక్కయై యుండును. ఇందుకు సందేహ మిసుమంతయు లేదు. దేహుల కకాలములో మరణము రాదు. పూర్వము నోచిన కఠినములైన నోములు, దానములు తపము వ్యర్థములై దుఃఖమును గూర్చినవి. పూర్వమెప్పుడును నేనింత దుఃఖము ననుభవింపలేదు. కొడుకులు కొడుకులని నేను ఘోరమైన తపములను జేసితిని. చివర కవియన్నియును చవిటినేలలో పాతిన విత్తనములయ్యెను. కుమారా! యేమని దుఃఖింతును? భరింపరాని దుఃఖముచే దపింపజేయబడుచున్న వారలు చనిపోవుటకు వీలుకలిగినచో నా కుమారా! నీవిట్లు వెళ్లుచుండుటచే దూడను కోలుపోయిన ఆవు మాదిరిగా ఇప్పుడే యమపురమునకు వెళ్లుదాననుగదా! ఓ రామా! నిన్ను విడచి యిక జీవించినను ఉపయోగమేమి? దూడవెంట జను బక్కగోవు వలె నీ వెనువెంటనే వచ్చెదనుగాని మానను సుమా. నన్ను గూడ తీసికొని వెళ్లుము" అని ఆ కౌసల్య విపరీతమయిన శోకముతో కిన్నరి వలె పుత్రుని కొఱకై నలిగిపోవుచుండెను.



# ఇరువది యొకటవ సర్గము

## లక్ష్మణుడు కౌసల్యతో రాముడరణ్యమునకు వెళ్లరాదని చెప్పుట :

ఈ ప్రకారముగా కౌసల్య విలపించుచుండగా చూచి లక్ష్మణుడు దైన్యముతో గూడిన ముఖము గలవాడై సమయోచితములగు మాటల నిట్లు పలికెను. “ఒక యాడుది యైన కైక యొక్క మాటలయందు గౌరవముంచి కారణమేమియు లేకుండగా రాజ్యమును, భోగములను విడచిపెట్టి పరాక్రమములేక యడవులకు వెళ్లుట యనునది నా మనస్సు నకును ఇష్టముకాకున్నది. రాజన్ననో వృద్ధుడు. పిచ్చివాడు. మన్మథునికి వశమైనవాడై యిట్లాడుచున్నాడు. మతిస్తిమితములేక విషయ సుఖములందు మనస్సు గలవాడయి స్త్రీ ప్రబోధముచేత రాజున కిటువంటి విపరీత బుద్ధి కలిగి యేమేమి మాట్లాడడు? స్త్రీల యొక్క మాయ యనెడు వలలో చిక్కినవాడు మూఢుడగుటలో విపరీత మేమున్నది? రాజు రాము నీమాదిరిగా అడవులకు వెళ్లుమని చెప్పుటకు రాముని యందు గల దోష మేమియో నేను నిజముగ తెలిసికొనలేకున్నాను. ఇంత పాపమా? విరోధి యైనను, ఒక దోషముచేసి దండింపబడినవాడైనను, ఎదురుగా గాని చాటుగా గాని రాముని దూషించుట నేనెప్పుడెఱుగను. దేవతలతో సమానుడును, ఋజుప్రవర్తన గలవాడును, ఇంద్రియ నిగ్రహము గలవాడును, శత్రువులనైనను మంచి మనసు గలవాడై దయతో జూచువాడును, మిక్కిలి పుణ్యాత్ముడును, పూజింపదగినవాడును అయిన తన పుత్రుడగు రాముని రాజు ఒక తప్పైనను లేక, నే రాజధర్మము ననుసరించి యిట్లు పట్టణమును వదలి పొమ్మని శాసించెను? ఇది విన్న పెద్దలు మెత్తురా? చిన్నబుద్ధితో రాజు ధర్మవిరుద్ధమైన

యిటువంటి ప్రల్లదమును పల్కినను, రాజధర్మము తెలిసిన రాజుల యొక్క బిడ్డలు దానిని జెల్లనిత్తురా? ఓ తల్లీ యని పలికి ఓర్పు పట్టలేనివాడై లక్ష్మణుడు మఱల మెల్లగా జానకీదేవి భర్తతో నిట్లు పలికెను.

**లక్ష్మణుడు శ్రీరామునితో అరణ్యములకు పోవలదని చెప్పుట :**

"అన్నా! ఈ విషయము రెండవ చెవికి సోకకముందే భూమండలము నీ యొక్క గొప్పదైన శాసనమునకు తలయొగ్గునట్లుగా నన్ను తోడుతీసుకొని త్వరగా చేయుము. మఱియు యుద్ధరంగమున యమునితో సమానుడవైన నిన్ను నేను విల్లు చేతబూనినవాడనై కాచుకొని యుండెదను. ఇక నీ కొక యడ్డముండునా? ఓ గొప్ప తేజస్సు గలవాడా! తీవ్రమయిన బాణముల సమూహముచే నీ భూమిని నిర్మానుష్యము చేసెదను. అంతటితో బోక భరతుని ఆప్తుడెవ్వడైనను తలపడినచో వీరత్వముతో చించి చెండాడెదను. మెత్తదనము చేత ఏ కీర్తియు కలుగదు. శత్రువుల సమూహముచే అవమానింపబడును. తన భార్యకు లొంగిన వాడై మన తండ్రి పగవాని వలె సంచరించినచో దయ యనునది వదలిపెట్టిన వారమై చంపుటయో చెరసాలలో బెట్టించుటయో జరిగించవలెను. ఇది మంచిపని యిది మంచిపని కాదు అని తెలియకగాని గర్వముచే మదించిగాని తగని మార్గమున వెళ్లెడివానిని గురువునైనను దండింప వలెను. రాజు ఏమి బలము చూచుకొని, నీయందేమి కారణము చూపి రాజ్య భారమును నీకీయక కైకకు ఇయ్యజూచుచున్నాడు? లక్ష్మీ సంపన్నమైనవాడా! రాజు నీ యెడలను నా యెడలను విరోధము పూనినవాడై తానేవిధముగా కైక కుమారుని రాజుగా చేయును? ఓ జననీ! దేవతా! నా మనస్సును తెలిసికొనుము. అన్న యను గౌరవముచేత నీ పుత్రుని యందు నేను అనురక్తి కలవాడను. సత్యమిది యని నా యీ బాణాగ్రముల మీద శపథము చేసి చెప్పుచున్నాను. మండుచున్న యగ్నియందైనను, వనములయందైనను రాముడు ప్రవేశించు చున్నచో నన్ను అతని ముందుండువానిగా నీ మనస్సున తలంపుము. ఓ

జననీ! సూర్యుడు చీకటిని దొలగించునట్లు నీ మనస్తాపమును నా శక్తిచే బారద్రోలెదను. ఇది తప్పక చేయదగిన కార్యము. నా శౌర్యమును రామచంద్రుడును నీవును చూడుడు.” ఈ ప్రకారముగా భాతృభక్తితో అతడాడిన మాటలను విన్నదై, తమకు వచ్చిన యాపదలకు విచారించుచు తామరరేకుల వంటి కనులు గల కౌసల్య కుమారుని జూచి “ఓ రామన్నా! నీ సోదరుడు చెప్పిన మాటలను విన్నావుగదా? పుత్రకా! ఇక నీ మనస్సున కెట్లు తోచిన ఆ విధముగా జరిగింపుము. నా సవతి మాటలను బట్టి ఇంటియందు నన్నెల్లప్పుడు దుఃఖసముద్రమున మునిగియుండుమని చెప్పుట నీ మనస్సునకు ధర్మముగా నున్నదా? గొప్పబుద్ధితో ధర్మమునే నిల్పవలెనని నీకు దోచినచో నన్ను నీ యుపచారములతో సంతుష్టిపరుపరాదా? పుత్రులకు తల్లిని సేవించుట ధర్మమే కదా! పూర్వము నిండైన భక్తితో కౌశ్యపుడనెడు మునీంద్రుడు ఇంటియందుండి తల్లిని సేవించి స్వర్గమును బొందలేదా? గొప్ప గౌరవ విషయమున రాజుకంటె తల్లి తక్కువ యగునా? నీవిక్కడనే యుండుము. నీ వడవులకు వెళ్లుటకు నేననుజ్ఞ నీయను సుమా! ఓ పుత్రకా! నిజము చెప్పుచున్నాను. నిన్ను వదలి యుండిన అన్నమెందులకు? నీళ్లెందుకు? ప్రాణములు మాత్రమెందులకు? సౌఖ్యములన్నవి యేమిటికి? నీవు నా యొద్దనున్నచో నన్నియు నున్నట్లుగా తోచును. లేతపచ్చిగడ్డి తిన్నను నది మనస్సున కిష్టముగా నుండును. నేనింటి యందు దుఃఖించుచుండగా నీ వడవులకు వెళ్లుట కిష్టపడుదువేని, నా తనయా! నేను ప్రాయోపవేశము చేసెదను గాని జీవించుట కిష్టపడను. ఓ పుత్రకా! నన్ను విడచి వనవాసమునకు వెళ్లెదవేని, నధర్మముచే సముద్రునకు బ్రహ్మ హత్యాపాతకము వచ్చినట్లు నీకు గొప్ప నరకము వచ్చును సుమా!” అని విలపించుచు తన చెక్కిళ్ళమీద కన్నీరు కారుచుండగా దుఃఖముతో పగిలిన హృదయము గల తల్లిని జూచి గట్టిదైన హృదయముతో రాముడు ధర్మపద్ధతితో నిట్లు పలికెను.

**శ్రీరాముడు కౌసల్యా లక్ష్మణుల నూరార్చుట :**

"ఓ తల్లీ! జనకుని మాటను దాటుటకు నాకు శక్తి యున్నదా? నీవే మనస్సునందు తలంపుము. నేను వెళ్లెదను. నన్ను చల్లని చూపులతో జూడుము. నీకు సాష్టాంగపడెదను. తన తండ్రి యొక్క మాటను ఆజ్ఞగా తీసికొని వ్రత నియమములు గల కండుడను ఋషి గోవును జంపలేదా? ఓ జననీ! ధర్మసూక్ష్మమును దెలిసి కదా యతడీపనిని చేసెను. దానివలన పాపములు సంభవించినవా? ఓ తల్లీ! ఇంకొకరి మాటలెందుకు? వినుము. మా వంశమునందు పూర్వము సముద్రమును త్రవ్విన రాజులు సగరులనువారు తమ తండ్రి యాజ్ఞతో భూమిని త్రవ్వునప్పుడు వదలిపెట్టని శూరత్వముతో తమ ప్రాణములు కోల్పోవుటకు గూడ వెనుకంజ వేయక యెన్నియో ప్రాణులను సంహరింపలేదా? తన తండ్రి చెప్పె గదాయని గొప్పదైన గండ్రగొడ్డలితో కండలుగా నరుకలేదా కన్నతల్లియైన రేణుకను భార్గవుడు? ఇది మనము వినియుండలేదా? ఎందఱో దేవసమానులగు రాజులు తమ తండ్రి యొక్క ఆజ్ఞ నెరవేర్చి కీర్తిని బొందిరి గదా? ఓ జననీ! నేను మాత్ర మావిధముగా ఏల చేయకుందును? చెప్పుము. నేనొక్కడనే కాదు ఇష్టముతో తండ్రిమాటను నిలబెట్టువారు భూమియందనేకులు గలరు. ఇంతకు మునుపెవ్వరు నాచరింపని ధర్మమును బూని నేను నీకు ప్రతికూలముగా వెళ్లవలెనను కోరిక నాకు లేదు. పూర్వులు నడచిన మార్గము నందే నడచెదను గాని ఇది వేరేమియు గాదు. కనుక తండ్రి చెప్పినది చేయవలయును. తండ్రి మాటను విననివాడనైనచో పాపము సంభవించును. తప్పక వనములలో నివసించుటకు వెళ్లెదను. నీవు విచారింపవలదు. ఓ పుణ్యవర్తనము గల జననీ! కరుణా రసము నిండిన చూపులతో నన్ను స్నానము చేయించి విచారమును వదలిపెట్టి దయతో నన్నడవులకు బంపించుము" అని ఈ విధముగా నిర్మలమైన మనస్సుతో తన

తల్లికి చెప్పి, వివిధ ధర్మముల నెఱిగిన వారిలో శ్రేష్ఠుడును, విలుకాండ్రలో మేటియు నగు రామచంద్రుడు తమ్ముని జూచి యిట్లనెను. “ఓ తమ్ముడా! లక్ష్మణా! వినుము. నీ కెల్లప్పుడును నాయందు స్నేహభావ మెక్కువగుటయును, నీ అమోఘమైన పరాక్రమమును, బలమును, తేజమును నేనెఱుగనా? విచారముతో తల్లి మిక్కిలిగా తపించుట నెరుగనా? సత్యమును, శాంతమును దెలిసిన నీవు కూడ నిట్లు మాటాడవచ్చునా? నీవిట్లు మాటాడుట చేత మన తల్లియైన కౌసల్యకు మనస్సున దుఃఖమధికమగును. అందువలన నీవు మంచి మనసు గలవాడవయి ఈ విధములయిన మాటలను చెప్పకుము. ఈ జగత్తు నందు ధర్మమే శ్రేష్ఠమయినది. ధర్మమే సత్యమునకాధారము. అట్లగుటచే ధర్మయుక్తమయిన జనకుని వాక్యము త్రోసివేయుట తత్వజ్ఞులయిన వారికి ధర్మమా? తండ్రి యొక్క మాట నైనను, తల్లి యొక్క మాటనైనను బ్రాహ్మణుని యొక్క పలుకులనైనను చేసెదనని పలికి వృథాచేయుట ధర్మపరులకు తగదు గదా! తండ్రి వచనానుసారముగా పినతల్లి నాకాజ్ఞ యిచ్చినది. వారి యిష్టమును జేసెదనని ప్రతిజ్ఞ చేసినవాడను. అది యెట్లు తప్పుదును. ఆర్య నింద్యమైన క్రూర పద్ధతిని క్షత్రియ ధర్మమదియని మదిలో భావింపబోకుము. క్రూరత్వమును వీడుము. నా మార్గము ననుసరింపుము. ఇట్లెంతయో దయతో రాముడు తమ్మునితో జెప్పి, తల్లినిజూచి ఆమె రెండు పాదములపై వినయముతో తన తలను మోపినవాడై ఎక్కువైన భక్తితో నిట్లనెను. “ఓ తల్లీ! అడవులలో నివసించు టకుగాను నా కనుజ్ఞనిమ్ము. ఎక్కువగా చెప్పబోకుము. నా ప్రాణములపై నొట్టుపెట్టెదను. స్వచ్ఛమైన దయతో కూడిన చూపులతో నన్ను మన్నించి యాశీర్వదించి స్వస్త్యయనాదికములు ప్రీతితో జేయింపుము. ఉత్సాహముతో గూడిన మనస్సుతో నుండుము. ఓ తల్లీ ప్రతిజ్ఞ తీర్చి వెంటనే వనముల నుండి పట్టణమునకు తొందరగా తిరిగి వచ్చెదను. పూర్వము యయాతి మహారాజు స్వర్గము నుండి భూమికి వచ్చి మఱల స్వర్గమునకు వెళ్ళినట్లు వచ్చెదను.

విచారమును మనసులో నణచిపెట్టుము. తండ్రి వాక్యమును తొందరగా నెరవేర్చినవాడనై వచ్చెదను. కన్నతండ్రియైన రాజుయొక్క వాక్యమును చేయుటయే నాకును, నీకును, సీతకును, లక్ష్మణునకును, సుమిత్రకును తగియుండునుగదా! తల్లీ! గొప్పదైన సనాతనమైన ధర్మ మిదియే కదా! పట్టాభిషేకమునకు చేకూర్చిన వస్తు సముదాయములను వదలి, దుఃఖమును మనసులో తగ్గించుకొన్నదానవై యరణ్యవాసమునకు తగిన విధముగా నాకు సెలవొసంగుము. ధర్మము నాలోచింపుము." ధర్మబద్ధమైనదియు తొందరపాటు లేనిదియు కలతలేనిదియు నయిన కుమారుని యీ మాట నాలకించి తల్లియగు కౌసల్య భూమిమీద సొమ్మసిలిపడినదై, తిరిగి తెలివొంది కుమారుని జూచి మనస్సునందు కలతజెందుచు దైన్యముతో నిట్లనెను. "ఓ బిడ్డ! ధర్మముతో జూడుము. స్నేహముచేత తండ్రితో సమానురాలనగు తల్లిని గదా. నేను దుఃఖపడుచుండగా నన్ను వీడి వనములకు వెళ్లెదవా? నేను సమ్మతింపను సుమా. ఓ రామన్నా! నిన్నెడబాసిన నిక ఈ శరీరములో ఈ ప్రాణములున్న ఫలితమేమిరా. సంపన్నమైన యాపరలోకము మాత్రమెందులకు? పితృలోకమున లభించెడి స్వధ యేల. అమృతమే లభించినను నా కెందులకు? నీవు నా యొద్ద నొక్క నిమిషమైన నున్నచో ఈ జీవలోకమంతయు నున్నంత కంటె నెంతో శ్రేయస్సు కలుగును" అని యేడ్వగా నరులు ఉల్కలను సాధనములతో నిరోధించినను నిలువక తన యిష్టమువచ్చినట్లు వెళ్లు ఏనుగువలె ఆ తల్లి యొక్క కరుణపుట్టు మాటలకు రాముడు తన శ్రేష్ఠమగు మార్గమును మహాధైర్యముతో విడువక నిలిచెను. శరీరము వివశమై భూమిపై వ్రాలిన దీనత్వమును బొందియున్న తల్లిని, హోరుమని కంటికి కడివెడుగా గన్నీరు గార్చుచున్న చిన్న తమ్మునిని చూచియును చలింపడు. రాముడొక్కడు తప్ప ఇటువంటి ధర్మ సంకటమున బడియును ఎవడు మహాధీరత్వముతో ధర్మమును విడచిపెట్టక నడువగలడు?

## శ్రీరాముడు లక్ష్మణునకు ధర్మోపదేశము చేయుట :

తన తమ్ముడైన లక్ష్మణుని జూచి రాముడిట్లనెను. "ఓ తమ్ముడా! నీ స్నేహము నాకు వింతయగునా? నీ పరాక్రమము నాకు తెలియనిదా? తల్లితోపాటు నీవును ఇట్లేడ్చుచు నాకు ఎక్కువైన అలజడిని కలిగించెద విది తగునా? అయ్యో! నా మనస్సును దెలియ లేకున్నావు. నా చిత్తమెల్లప్పుడును ధర్మమార్గము నుండి యెడబాయదు. ధర్మమార్గ మొక్కటియే తనను తప్పక సేవించువానికెప్పుడును ధర్మమును అర్థమును కామమును సమకూర్చును. అది యెట్టంటివేని ధర్మాత్మురాలగు భార్య యెక్కువైన ధర్మమును సమకూర్చును. ప్రేమచే కామసౌఖ్యమును సమకూర్చును. సత్సంతానము వలన అర్థమును గూడ సమకూర్చుచుండును. దేనివలన ధర్మమును, అర్థమును కామమును కలుగవో దాని నెవ్వడైనను చేయుటకు పూనుకొనరాదు. ఎక్కడ ప్రశస్తమైన ధర్మముండునో దానినే చేయవలెను. కేవలము ధనమును సంపాదింప వలయు ననువాడు పెక్కుమందికి విరోధి యగును. కేవలముగా కోరికలకు లొంగిపోయిన వాడు నిశ్చయముగా లోకులచే నిందింప బడువాడు సుమా! తమ్ముడా! లక్ష్మణా! గురువును, రాజును, తండ్రియు, ముసలితనము వచ్చినవాడును, ఒకానొక సమయమునందు కోపముచేతనో, సంతోషముచేతనో మిక్కుటమైన కామముచేతనో ఏవిధముగానైనను చేయుమని యాజ్ఞాపించిన పనిని చేయకున్న నామనుష్యుడు మహా పాపియు, దుర్మార్గుడును, నశించిన కీర్తి గలవాడును నగును గదా! ఈ రాజ్యమును పాలించు రాజు తన యిష్టమువచ్చిన పనిని చేయుమని చెప్పిన దెల్లను చేయకుండ నేనేవిధముగా సహింపగలను. రాజు నాకును భరతునకును ఏ విధముగా శాసించువాడయ్యెనో ఆ విధముగనే తల్లికి కూడ నగును. మదిలో భావింపుము. ఆలోచింపగా భార్యకు భర్తయే గదా పరమార్థము, ధర్మము, దిక్కు. పుణ్య మార్గమునందు నడచువాడగు రాజు బ్రతికియుండగనే యీమె భర్తలేని దానివలె ఏ విధముగా నావెంబడి

వచ్చును? స్త్రీకి ప్రాణనాథుని వీడియుండుట ఎచ్చటనైన ధర్మమగునా? లక్ష్మణా! ఈ భూమియందు కుమారునికంటెను సాధ్వియయిన భార్యకు భర్తయే పూజ్యుడు సుమా. నే నడవులకు వెళ్ళుదును. ఓ జననీ! నాకు స్వస్త్యయనము నొనర్పుము. ప్రసన్నమైన చూపుతో నన్ను జూడుము. జనకుడిచ్చిన యాజ్ఞను దీర్చినవాడనై తిరిగి వచ్చెదను. ఇది సత్యము. గొప్పదనముతో పూర్వము యయాతి మఱలివచ్చినట్లుగా తిరిగి వచ్చువాడను. దయయుంచి నన్ను సత్యవంతునిగా జేయుము. ఓ తల్లీ ధర్మమును విడచి భోగములయందు గొప్పదైన దురాశచేత గొప్పదగు సత్కీర్తిని దూరముగా త్రోసివేయజాలను. లోకపు పోకడ చూడగా ఆయువు క్షణభంగురము. కనుక ధర్మమగు పనిని జేయక హీనమైన సంపదలకై కోరిక వహింపజాలను" అని యీ ప్రకారముగా తన కన్నతల్లిని ప్రియమైన మాటలతో నెమ్మదింపజేసి, ఆ తరువాత తనకిష్టమైన ధర్మపద్ధతులను ఎన్నిటినో తమ్మునకు చెప్పి దండకావనమునకు వెళ్లుట కుద్యుక్తుడై జనప్రియుడగు రాముడు భక్తితో గూడినవాడై తల్లికి ప్రదక్షిణము చెయ్యవలెనని మనస్సునందు దలంచెను.



# ఇరువది రెండవ సర్గము

**శో**కముతో కుమిలిపోవుచున్నవాడును, ఆవరించిన దైన్యముతోడను కోపముతోడను దేహముడికిపోవుచుండగా ముఖమంతయు కన్నులుగా నుండి కోపముతో నున్న సర్పము వలె రోజుచున్నవాడును, నివ్వెరపోయి నిలువబడిన వాడును, తన కూరిమి తమ్ముడును నగు లక్ష్మణుని, సుగుణవంతుని సమీపించి యభివృద్ధి చెందుచున్న ధైర్యముతో నిట్లనెను. “లక్ష్మణా! రోషమును వీడుము. వగచుట మానుము. నిండైన ధైర్యము నవలంబింపుము. అభిమానము పోయెను. అవమానము కలిగెనని నీ మదిలో తలంపబోకుము. మంచి యానందమును బొందుము. అభిషేకమునకై తెచ్చిన సమస్త వస్తువులను వదలివేయుము. వనములలో నుండుటకర్హములైన వస్తువులను తొందరగా సమకూర్పుము. అభిషేకమునకై యే వైభవముతో సమస్త వస్తువులు కూర్పబడినవో ఆ వైభవముతోనే నా వనవాసమునకును వివిధ వస్తువులను సమకూర్పుము. రాముడు వనములకు వెళ్లునో వెళ్లడో యని సౌమిత్రి ప్రేరణచేత నేను వెళ్లనని చెప్పునోయని సందేహముతో మనసులో కలతచెందుచు తత్తరమును పొందుచున్న కైక మనస్సును నీవిప్పుడే సందేహము భయము లేని దానినిగా జేయవలయును. సందేహముతో నా తల్లి (కైక) చింతించుటను నేను సహింపను. ఓ లక్ష్మణా! వినుము. ఎప్పుడైనను, నా మనస్సునకు తెలియునట్లుగానైనను, తెలియకుండు నట్లుగానైనను తల్లులకు గాని తండ్రికి గాని యప్రియమును కొంచెమైనను చేసినట్లు జ్ఞాపకము లేదు. సత్యమైన పరాక్రమము గలవాడును, సత్యమునే మాటలాడువాడును, సత్యమును

తప్పనివాడును, సత్యము తప్పిన పరలోకములు చేరలేమను భయము గలవాడును నయిన నా తండ్రి యింక దిగులు విడచినవాడై యుండుగాక. ఈ రాజ్యాభిషేక మహోత్సవమును ఇప్పుడే మానకున్నచో నా సత్యము వ్యర్థమైపోయెనని రాజు మనస్సులో నెంతో కలత జెందును. వదలని చింతచేత నా తండ్రి విచారించుచుండగా నా మనస్సు తాపమును పొందకుండ ఎట్లుండ గలదు. నీవే చెప్పుము. కనుక పట్టాభిషేక ప్రయత్నము మాన్పించి వెంటనే నేనరణ్యమార్గము పట్టగాకైక తన మనస్సు సంతోషించునట్లుగా భరతుని యందు రాజ్యలక్ష్మిని నిలుపుగాక. చర్మమును నారచీరలును జడలును ధరించి నేను అరణ్యమార్గమున బోవుచుండగా కన్నులార కైక చూచినదై చేతులను గుండెలమీద పెట్టుకొని నిశ్చింతగా నిదురపోవునుగాక! ఎవరివల్ల ఈ శిక్ష విధింపబడినదో నిశ్చయముగా తెలిసినది. కాని వారి యొక్క మనస్సును నేను నొప్పింపజాలను. అందుచే నిజముగా నిప్పుడే అడవికి వెళ్లెదను.

**శ్రీరాముడు లక్ష్మణునితో మేలుగీళ్లకు దైవము కారణమని చెప్పుట :**

"ఓ లక్ష్మణా! కైకేయి యిటువంటి వంచనను చేసెనని కోపగించు కొనకుము. రాజ్యమును పొందుటయు మానుటయును, అడవులకు వెళ్లుటయును, ఆలోచింపగా నిది యంతయును దైవము మాత్రమే చేసినది కాని వేరుగాదు. దీనిని గురించి యింక విచారించుట తగదు. ఈ యాలోచన దైవప్రేరితమే కాకున్నచో ఆ రాణియగు కైకేయికి కావలెనని నన్నిట్లు కష్టపెట్టుట శక్యమగునా? ఓ సౌమ్య స్వభావుడా! నా హృదయమున నా తల్లులు ముప్వురి యందును తేడాను నేనెఱుగనే యెఱుగను. అందులో కైకేయికి తన పుత్రుని యందున్నంత ప్రేమ నాయందు గలదు. నాయందు ద్వేషము లేదు. ఇంతవరకు లేనిది ఈ దినమున కలుగుటకు గారణము దైవముకాక మఱి యేమిటో చెప్పుము. లక్ష్మణా! అంత వాత్సల్యముతో జూచు కైక నన్ను దుర్భాషలాడి యడవులకు బంపుట ఆలోచింపగా బలవంతమైన దైవము యొక్క కృత్యము

కాక పరులు చేయగలరా? పూజింపదగిన మంచి కులమునందు పుట్టినది. రాచబిడ్డయై తాను జన్మించినది. అధికమైన దాన దయాగుణములు గలదని కీర్తిగాంచినది. అటువంటి కైకేయి రాజునొద్ద గయ్యాళి మాదిరిగా ధైర్యము గలదియై కఠినమైన మాటలతో నన్ను తిట్టనెట్లు సాహసించినది? కావున నూహింపరానంతటి మహిమ గల దైవము భూమియందెవ్వరికైన దాటరానిది. ఆ కైక యందు నాయెడల విపరీతమైన బుద్ధిని ఆ దైవమే సమకూర్చెను. పనులు జరిగినప్పుడు తప్ప వేఱు సమయములందు కొంచెమైనను గుర్తించుటకు శక్యము గానిదియు, జయించుటకు శక్యముగానిదియు నయిన దైవము ముందు ఎదురుతిరిగి ఎవ్వరు నిలువగలరు? ఎవరు ఎదిరించుట కుత్సాహము చూపగలరు. తమ్ముడా! సౌఖ్యముగాని, దుఃఖముగాని, శాంతిగాని, కోపముగాని, లాభనష్టములుగాని, తప్పనివైన పుట్టుట చచ్చుటగాని అకారణముగా సంభవించునని మానవ సమూహము భావించుచున్నది గాని అవియన్నిటికిని దైవమొక్కడే మూలకారణము. ఇది తప్పదు. శాస్త్రములందు జెప్పబడినది. నమ్ముము. గొప్ప తపస్సు చేసినటువంటి మునులైనను తమ నియమముల నీటిలో గలిపినటువంటివారై భ్రష్టులై కామక్రోధములచేత చెడిపోవుటకు కారణము దైవము యొక్క చర్యయేగదా! ఎన్నడును జరుగునని తలవని పని ఉన్నటులుండి జరుగుటయు, చేయవలయుననుకొన్న పని చెడిపోవుటయును లక్ష్మణా! యివి యన్నియును సత్యముగా దైవము యొక్క కృత్యములే గదా? ఈ విధమైన నిశ్చయమైన మనస్సుతో నాలో నేనే కాలము యొక్క చర్యలను జూచినచో మనసునందీ పట్టాభిషేక విధానము తప్పిపోవుట నాకు విచారము కలిగించుట లేదు. కాన నీవు కూడ విచారింపక నావలెనే తలచి యింపైన ఈ పట్టాభిషేక కార్యములను విడచిపెట్టుము. దీనిని గూర్చి ఏమియును చింతింపకుము. లక్ష్మణా! అభిషేకమునకు సమకూర్చిన ఘటములయందలి మంచివైన నీరములు తాపసులకు తగిన గొప్పనైన

వ్రతస్నానము చేయదలంచిన నాకుపయోగించును. అయినను ఈ రాజు యొక్క సొత్తయిన జలములు నాకెందులకు? వీనితో స్నానము చేసిన రాజ్యము కొఱకే యిట్లు చేయుచున్నాడేమో యను సంశయముతో కైక బాధ నొందకుండునా? కనుక నేను తెచ్చికొన్న నీరే నా వ్రతస్నానమున కుపయోగించుగాక. ఓ లక్ష్మణా! రాజ్యలక్ష్మి తొలగిపోయెనని బాధచెందకుము. ఎన్నరాని రాజ్యభోగములును, గొప్పనైన వనములలో నివాసమును నే నొక్కమాదిరిగనే మనస్సునందు తలంతును. ఆలోచించి చూడగా మహావన నివాసమే సుఖమును గూర్చును. అందువలన నీవు వ్యథను జెందిన మనస్సుతో విలపించుటెందులకు? ఓ లక్ష్మణా! ప్రాప్తించిన లక్ష్మికి నా పినతల్లి యంతరాయము కలుగజేసినదని విచారింపకుము. ఆమెయందు ప్రేమను విడచిపెట్టకుము. దైవమే ఆమె నోటియందుండి యామెచేత అనరాని మాటల నాడునట్లు చేసినది. ఓ పొగడదగిన మనస్సు గలవాడా! దైవమే దీనికంతకును కారణమని యెరగవా?"



# ఇరువది మూడవ సర్గము

## శ్రీరామునితో లక్ష్మణుడు దైవముకంటె పౌరుషమే గొప్పయని చెప్పుట :

అని రాముడు చెప్పిన మాటలను తలను వంచుకొన్నవాడై విని విని మనస్సులో సుడిపడుచున్న ఖేదమునకు మోదమునకు మధ్యనున్న వానివలె కొంతసేపున్నవాడై సౌమిత్రి గొప్పదైన కోపముతో తొఱ్ఱలో నున్న సర్పమువలె బుసకొట్టుచు, వంకరలు తిరిగిన కనుబొమ ముడి నొసటిపై కదలాడుచుండగా, కోపముతో నున్న సింహము యొక్క ముఖమును బోలి చూడశక్యముగాని మోము గలిగి, ఏనుగు తొండమో యనునట్లున్న చేతిని విదలించుచు తన చూపులను నేలపై రెండు ప్రక్కలకు త్రిప్పుచు, మెడ త్రిప్పి అన్న వంక ఓరగా జూచుచు పెదవి వణకుచుండగా, కన్నులెఱ్ఱవడగా, కోపము కలగినవాడై యిట్లనెను." తండ్రి మాట దాటినచో పాపము సంక్రమించుననియు, రామచంద్రుడే తండ్రి మాట వినలేదటయని మూర్ఖులగు జనులు ధర్మపు వంతెనను తెగగొట్టెదరేమోయను శంకించియు నిట్లు నీవరణ్యములకు బోవ నెంచుచున్నావు. అట్లు చేయుటకిది తగిన సమయము కాదు సుమా! నీ వింతకు సమర్థుడవు కావు? అసమర్థమయిన దైవమునిట్లు నీవు పెద్దచేసి మాటాడుట తగునా? ఆ దైవము తాను చేయదలచుకొన్న పని సిద్ధించుట కితరులపై ఆధారపడును. తానే ఎదురుగా వచ్చి ఏమియు చేయజాలదు. అన్ని తెలిసి భ్రాంతిలేనివాడవగు నీవే తెలివిలేనివానివలె దానిని పొగడుట తగియున్నదా? పాపము – పాపము – అనుచున్నావు. పాపాత్ములైన దంపతులు పలికిన మాటలను తిరస్కరించిన పాపము కలుగునా? మోసపు విధానముతో రాజ్యలక్ష్మిని పోగొట్టిరని తెలిసికొనలేకున్నావు. అయ్యో! ధర్మతత్పరుడా!

ధర్మమును నెపముగా బెట్టుకొనువారు, ధర్మమును ముసుగుగా జేసికొనువారు భూమియందుండరా? తనయందున్న ప్రేమ బలముచేత మాయమాటలను జెప్పి కైక తనయొక్క పుత్రునకు రాజ్యము నడుగగా, శ్రీరామునకు పట్టాభిషేకమునకు ప్రయత్నములను చేయుదును. నీవు వరములను కోరుకొనుమని కైకకు యుక్తి చెప్పినవాడై, నీయందు ప్రేమ యున్నట్లిచ్చుట ఆడంబరముగా ప్రయత్నించి ఆ ముసలి రాజు కైక దగ్గఱకు వెళ్లి నిన్ను మోసము చేసెను. అది నిజము కాదేని యిన్నినాళ్లనుండి కైక వరముల నెందుకు కోరుకొనలేదు? రాజు ఆ కోరికల నెందుకు నివారింపలేదు? ఇది మోసము. ఒకవేళ యిది నిజమే యయినను, జనులందఱు విన్నమాట ముందుగా నెరవేర్పవలదా? ఆమె కోరికలకిదియా తగిన సమయము? లోకము ద్వేషించునట్లుగా ఈ కుట్రలతో నిన్ను గాకుండగా నితరులను ఈ రాజ్యమునకు రాజును చేసినట్లైన నేను చూచుచు నూరకుందునా? నన్ను క్షమింపుము. పొగడదగిన బుద్ధిశాలురలో శ్రేష్ఠుడా! మనస్సులో ఏ ధర్మచింతనముచే నీ బుద్ధిభేదమును బొందెనో ఆ ధర్మమునందు నాకేవగింపు గలిగినది. ఏ పనినైన చేయు శక్తి గలవాడవు. ఏ మోహము నిన్ను గప్పనిచో, తండ్రి కైకేయికి వశపడినవాడై నింద్యము, అధర్మబద్ధము నయిన కాఱుకూతలను ప్రేలగా వాని నంగీకరింతువా? మోసము చేయవలయుననెడు బుద్ధిచేత వరములను కల్పించినను నీవు సాధువర్తనముచే వానినే గొప్పగా జేసెదవుగాని వాటిని నిరాకరింపవు గదా. దానిని గురించియే కలతజెంది దుఃఖించెదనుగాని యింకేమియును గాదు. ఇటువంటి సమయములో కీర్తిని బోగొట్టునట్టి ధర్మమార్గమునందే నడచెదమనుట యెవరికైనను గర్హించదగినది కాదా? అన్నా! తల్లి తండ్రి యని తగని పేరులు పెట్టుకొని కోరికలకు వశమై స్వేచ్ఛాచారులైన శత్రువులు పలికెడు మాటలన్నిటిని నీవు మనస్సునందైనను పాటింపవచ్చునా? వారల కుతంత్రమును నీవు కనిపెట్టవు. నీవు దానిని దైవికముగా వచ్చినదని నీ మనస్సునందు తలంచుటయు, ఉపేక్షించుటయు నీకే తగును గాని నాకది

రుచించుట లేదయ్యెను. అన్నా! బలహీనులు నల్పమైన శౌర్యము గలవారును దైవము బలము గలదియని తలంచెదరు గాని బలవంతులు కీర్తిని గోరువారు కలలో గూడ దైవమును దలంపరుగదా. ఘనుడైనవాడు తన పౌరుష బలముచేత దైవమును దూరముగా నెట్టివేయును. తాను సమర్థుడగుటచే చివఱకు దైవముచే బాధింపబడక తమ పనులను తీర్చికొనును. ఓ వీరశ్రేష్ఠుడా! దైవపు బల మెక్కువయో పురుషుని బలమే యెక్కువయో లోకులిప్పుడే దైవము యొక్కయు పురుషుని యొక్కయు బలముల భేదమును చూచెదరు. దైవముచేత చెడిపోయినట్టి నీ పట్టాభిషేకోత్సవమును నా శ్రేష్ఠమగు పౌరుషముచేత తొందరగా జరిగించిన ధరలో నున్న జనులందఱును దైవము పౌరుషముచేత కూలిపోవుటను చూచి మనస్సులలో దైవముకంటెను పౌరుషమే యెంతయో మేలని యనుకొనునట్లుగా చేసెదను. ఓ అన్నా! యథార్థమైన పరిస్థితిని జూడుము. మదించిన యేనుగు అంకుశము యొక్క పోటులను లెక్కచేయకుండ, కట్టిన గొలుసులను త్రెంచుకొన్నదై విజృంభించి మీద కురికిరాగా మరలించినట్లు దైవమును తీవ్రమును భయంకరమును నగు నా పౌరుషమే సాయముగా మరలింతును. ఓర్పుతో చూడుము. నా యభిప్రాయము నంగీకరింపుము. అన్నా! లోకపాలకు లందరు వచ్చి యెదురు నిల్చినను, జగత్తులలో నుండు వారందఱు వచ్చి తలపడినను, నీ పట్టాభిషేకమునకు విఘ్నము చేయజాలరు. తండ్రి యేమిలెక్క? నిన్ను ఆపదలు పొందింప దలంచువారిని అందఱిని పద్నాలుగేండ్లు అడవులలో వారే యుండునట్లుగా పంపింతును? నీకు రాజ్యాభిషేకము చేయకుండ, కైక కొడుకునకు రాజ్యమును సమకూర్పనున్న నా యొక్క తండ్రికిని, ఆ కైకకును ఆశలను తెగగోయుచు ప్రఖ్యాతముగా వారినెట్లవమానింతునో చూడుము. ఓ రామా! శత్రువులకు నా భయంకరమైన పౌరుషము ఏ ప్రకారముగా దుఃఖము లకు గారణమగునో ఆ ప్రకారముగా వారికి దైవము సుఖములను గలుగ జేయలేదు సుమా! భరతునకీ రాజ్య మేవిధముగ వచ్చును? నీవు వేల యేండ్లు పరిపాలించి యడవులకు వెళ్లినను, నీ పుత్రులీ రాజ్యమును పాలింతురు కదా.

ఆలోచింపగా పూర్వరాజుల చరిత్రములటులనే యున్నవి గదా! జనులను పాలించునట్లుగా తమ సంతతికి చెప్పినవారై పూర్వపురాజులు వనములకు వెళ్లలేదా? చంచలచిత్తుడైన యీ రాజు విరోధమును దలపెట్టినచో నిశ్చింతగా రాజ్యమెట్లు వృద్ధిపొందునని సందేహించి నీవు రాజ్యమును స్వీకరింపకున్నచో, నీకా సందేహము పనిలేదు. నీ గొప్పనైన రాజ్యమునంతను మహాసముద్రమును నిల్పు తీరమువలె రక్షించెదనని ప్రమాణము చేసెదను. దీనిని దప్పినచో నాకు వీరలోకములు నశించుగాక. శుభప్రదముగా అభిషేకమును జేసికొనుటకు ఒప్పుకొనుము. మనస్సున నా మాటలను చొరనిమ్ము. రాజులందఱను నా భుజబలముచేత నేనొక్కడనే చెదరగొట్టెదను సుమా. అన్నా! నా యీ దండములను బోలిన భుజములు రెండును కేవల మందమునకు గాదన్నా! ఈ విల్లు నాకు కేవల మలంకారము గాదు. నా ఖడ్గమూరక నడుమున బంధించు కొనుటకు గాదు. నా బాణము లమ్ములపొది మోయుటకు మాత్రమే కాదు. ఈ నాలుగును యుద్ధమున శత్రుసమూహమును ఖండించి కండలు కండలుగా నరుకుట కుపయోగించునవి సుమా. ఎవడు నాకు పగవాడై నిలుచునో వాని యునికిని గూడ నేను సహింపను. ఆ యింద్రునైనను విద్యుల్లతవలె బ్రకాశించు నా నిశితమైన ఖడ్గముతో సంహరించెదను. నా ఖడ్గముచే ఖండింపబడిన ఏనుగులు, గుఱ్ఱములు సైనికులు మున్నగు వాని యొక్క హస్తములు, తలలు మున్నగువాని సమూహములచే వ్యాపింపబడిన భూమి నడచుటకు శక్యము గానిదై తోచునట్లు చిత్రవిచిత్రములైన పద్ధతులతో విహరించుచు శత్రువులను జీకాకుపరతును. నా వాడియైన క్రూరమైన ఖడ్గపుటంచుచే నరుకబడిన శత్రువుల ఏనుగుల సమూహములు మెరుపులతోడి మేఘములవలెను కొండలవలెను నేలగూలును. అంగుళికవచమును ధరించి నేను విల్లుచేబూని యుద్ధరంగమున నిలువగా నీభూమండలమున నే గుండె గలవాడు నేను శూరుడనని వచ్చి నా కెదురు నిలువగలడు? ఒక్కని ననేక బాణములచేతను, అనేకుల నొక్క బాణముచేతను గ్రుచ్చి వేగముగా శత్రువులను పీనుగుపెంటలుగాజేయనా?

వారి గుఱ్ఱములను ఏనుగులను రథములను నాశనము చేయనా? నా యొక్క ఎక్కువైన మెచ్చదగిన యస్త్రబలముచేత ఇప్పుడే ఈ రాజును దప్పించి ప్రభుత్వమంతయు చిటికెలో నీ కిప్పించెదను. చూడుము. చందనముచేత సుందరముగా నున్నవియును, ప్రశస్తములైన భుజకీర్తులను ధరించినవియును, అధికముగా బంగారమును దానము చేసినవియును, మిత్రజనులను రక్షించుటయం దానందించునవియును, మిక్కిలి యోగ్యము లును నయిన నా భుజదండములు నీ యభిషేకమున కడ్డుపడు వారినిప్పుడే చిందరవందర చేయును. నేను నీ సేవకుడను. ఈ రాజ్యము నీకెట్లు లభించునో చెప్పుము. ఇప్పుడే యా విఘ్నకారి యగు శత్రువును ప్రాణములు పోవునట్లుగా బాధించెదను" అని చెప్పుచున్న తమ్ముని నేత్రముల నుండి యాగక వెడలుచున్న కన్నీటిని మెల్లగా తన చేతితో పోవునట్లుగా తుడిచి, ఆదరముతో గూడిన మాటలతో నోదార్చి "నాయనా! తండ్రి యొక్క మాటననుస రించి నడచుటయే సత్పురుషులు నడచు మార్గము. దానిని విడచిపెట్టలేను. నేను న్యాయముగా దానిని నెరవేర్చుటయే నాకు సమ్మతమని యెఱుగుము."



# ఇరువది నాలుగవ సర్గము

## కౌసల్య శ్రీరాముని నిశ్చయమెఱింగి పరితపించుట :

జనకుని యాజ్ఞను సల్పుటకు నిశ్చయించుకొన్న చిత్తముతో నున్న పుత్రుని జూచి మంచి నడవడి గలదియు, ధర్మమార్గానువర్తినియు నగు కౌసల్య కన్నీళ్లతో నిండిన కనులు గలదియై యిట్లనెను. "ఎన్నడును దుఃఖమనునది యెఱుగని వాడును, ధర్మముతో గూడిన వాడును, సర్వభూతములకును మంచిని చేయువాడును, నాకును దశరథునకును జన్మించినవాడును, పరాక్రమ వంతుడును, కీర్తియే సంపదగా గలవాడునునగు రాముడు వనములలో వెన్నులను గాయ కసరులను ఒకటొక్కటిగా ఏరుకొని తినుచు కష్టముల నెట్లనుభవించునోగదా! ఎవని సేవకులును స్నేహితులును మంజులములైన భక్ష్యభోజ్యముల నిష్టముగా భుజింపుచుండ నా ప్రభువు కందమూల ఫలములను దిని కడుపుమంట నేప్రకారముగా చల్లార్చుకొనునోగదా! దయచూప దగినవానిని, సుగుణములే యాభరణములుగా గలవానిని శ్రీరాము నడవిపాలు చేసిన యా రాజు చరిత్రమును విన్నవారెవ్వరు భయమునొందక యతనిని నమ్మువారు? లోకముల రంజింప జేయు ఓ రామా! ఈ ప్రకారముగా నిన్నడవులపాలు చేయుటచే, చూడగా ఈ లోకమునందు దైవ మొక్కడే దేనినైనను చేయుటకు దగినవాడని తెలియుచున్నది. నాయనా! రామా! శోకమనెడి యగ్ని నా గర్భమునందు పుట్టినదై నీవు కన్పించకపోవుట యనెడు గాలిచే రేగగొట్టబడినదై, దుఃఖమనెడి సమిధలచే ప్రజ్వరిల్ల చేయబడినదై, కన్నీరనెడు హుతముల యాహుతిచే పెరిగినదై చింతయనెడు పొగచేత కప్పబడినదై దీర్ఘనిశ్వాసములతో నన్నాయాసపెట్టు చున్నది. నీవు లేకుండుటచే వేసవిలో ఎండిపోయిన పొదల గుంపును కాల్చు కార్చిచ్చువలె నన్ను బూడిదగా చేయకుండునా? అందువలన

లేగదూడ వెంటనంటివచ్చు ఆవు మాదిరిగా నీవెంట వచ్చెదను. నన్ను దోడ్కొని పొమ్ము కుమారా!" యని పల్కుచు శోకముచే హతాశురాలైన తల్లితో రాముడిట్లనెను.

**భార్యలు భర్తలను విడచి పోగూడదని శ్రీరాముడు కౌసల్యతో జెప్పుట :**

అమ్మా! కకుత్థ్స వంశమున బుట్టిన దశరథుని కైకేయి మోసగించెనుగదా. నేనడవు లకు వెళ్లుచున్నాను గదా. ఓ తల్లీ! నీ వొక్కతెవైనను రాజునొద్ద నిలిచి యుండకున్నచో నా తండ్రి బ్రతికి యెట్లుండును? భర్తను విడచిపెట్టు స్త్రీలు చెడిపోయినవారే గదా! అట్టి ప్రవర్తనమును నీ మనస్సునందైనను తలంప వచ్చునా? పతివ్రతవైన నీకిది తగిన పనియేనా? చెప్పుము. నా జనకుడెంత వఱకు జీవించియుండునో యంతవఱకును నీవానందముతో నతనికి తగిన సేవలను చేయుచుండుము. ఇది పూర్వము నుండి వచ్చుచున్న ధర్మము గదా!

ఆ పుణ్య స్వభావము గల కౌసల్య శుభకృత్యముల నాచరించువాడగు తన కుమారుడు చెప్పుచున్న ఆ ధర్మబద్ధములైన మాటలను విని ప్రేమతో పుత్రుని జూచినదై "ఓ కుమారా! అటులే అగుకావుత" అనెను. ఈ ప్రకారముగా విచారముతో కూడుకొన్నదైన తన తల్లిని చూచి దుఃఖమును శమింపజేయుటకై జానకీపతి వినయముతోను నయముగాను తెల్లమగునట్లుగా నిట్లు చెప్పెను. "మా తండ్రియగు దశరథుడు జాగ్రత్తగా నాలోచింపగా గురువును, భర్తయు, రాజును, జనులకందరకు నధికారియగును గదా! అట్టి వానియొక్క యాజ్ఞను పాటించుట నాకును నీకును గూడ ధర్మమే గదా! అందుచే నేనిదే దండకాటవిలో పదునాల్గు సంవత్సరములు నివసించి తిరిగి వచ్చినవాడనై నీ వాజ్ఞాపించినట్లుగా చేయుచుండెదను" అని రాముడు చెప్పగా విని కౌసల్య కన్నులవెంట నశ్రు వులు కారుచుండగా తన ముద్దుల కుమారుని యందు మోహముతో శోకమున మాటలు తడబడుచుండగా ఎక్కువ దీనత్వమును బొందుచున్నదై యిట్లనెను. "నీ తండ్రి మాట ప్రకారముగా నీవు నీ మనస్సునందు వనవాసము చేయుటకు

నిశ్చయించుకొన్నచో నేను సవతుల మధ్య నెట్లు నిలబడగలను? చెప్పుము. కుమారా! వనములలో సంచరించు ఆడలేడి మాదిరిగా సంతోషముతో అడవులలో నుండెదను. ఓ జనవినుతమైన నడవడి గలవాడా! రామా! దయతో నన్ను నీ వెంట తొందరగా తీసికొనిపొమ్ము. ఈ విధముగా తల్లి దుఃఖముతో బాధజెందుటను జూచి రామచంద్రుడు తన మనస్సు తల్లడిల్లుచుండగా ధర్మమును విడచిపెట్టకుండగా తాననునయమైన మాటలతో నిట్లు పలికెను. "జీవించి యున్నంతవఱకును స్త్రీలకు భర్తయే రాజును, దైవమును కావున నీకును నాకును శాసించువాడు రాజే సుమా! అతడుండగా నీవనాథ వెట్లగుదువు? కాన చిత్తమున శాంతిని బొందుము. కలత జెందుటెందులకు? ఆ భరతుడు గూడ ధర్మము తెలిసినవాడు. దయగలవాడు. ఎవరిని నిందించి యెఱుగడు. గురుభావముతో నీ యొక్క మాటల ననుసరించును గాని మానడు. నీవు సందేహింపవలదు. నేనడవికి వెళ్లగా కడుపు దుఃఖముచేత రాజు, వృద్ధుడౌట చేతను, దారుఢ్యములేని వాడగుటచేతను ప్రాణములు కోల్పోవు నేమోయని నేను భయపడుచున్న వాడను. ఓ పొగడబడిన నడవడిగల తల్లీ! నీవు తండ్రి యొక్క మనస్సున కేవిధముగను బాధకలుగకుండ మెలకువతోను ప్రేమతోను సేవలను చేయుచుండుము. మంచిమనస్సుతో నెల్లప్పుడు పెద్దలకు నమస్కరింప కున్నను, దేవతలను పూజింపకున్నను స్త్రీకి భర్తసేవయే సద్గతులు కలుగజేయును. తల్లీ! స్త్రీ నియమవ్రతముననను భర్తను భక్తితో సేవింపకున్నచో సత్యముగా నరకమును బొందును. ఓ తల్లీ! వేదములందును, స్మృతుల యందును, భూమి యందు పూర్వము నుండియును చెప్పబడుచున్న పూర్వగాథల యందును, స్త్రీ భర్తయొక్క యిష్టము ననుసరించి నడచుచు మంచిబుద్ధితో నతని సేవించుటయే ధర్మమార్గమని చెప్పబడినది. ఓ తల్లీ! విడువని భక్తితో నా కొఱకై నీవు హోమము లను జేయుము. దేవతలను బ్రాహ్మణులను పూజింపుము. ఈ విధముగా జేయుచు నారాకకై యెదురుచూచుచుండుము. మిక్కిలి యాసక్తితో నియమముల జరిగింపుము. నియతముగా భుజింపుము. ప్రేమతో నీ ప్రాణసమానుడగు

భర్తను గౌరవ పూర్వకమగు సేవతో తృప్తిని జెందించుము. నన్నెడబాసితినను చింతను నీ మనస్సునందు విడచిపెట్టుము. ఓ సాధుచరితా! నేను వనవాసము నుండి మరలివచ్చునంత వఱకు నా జనకుడు సుఖముగా జీవించియుండెనేని నీ మనస్సునకు గొప్పదైన సంతోషము కలుగును సుమా!"

## శ్రీరాముని వనవాసమునకు కౌసల్య యొప్పుకొనుట :

ఈ ప్రకారముగా మాటలాడుచున్న తన కుమారుని జూచి కౌసల్య యిట్లనెను. "నేను నీ మనస్సును మరల్పజాలను. రామా! కాలమును దాటుట మనకు శక్యమా? తామర రేకులవంటి కన్నులు గల్గిన రామా! నీవు దీక్షతో వనములకు వెళ్లిరమ్ము. ఓ తండ్రీ నీ కెల్లప్పుడును మేలుకలుగుగాక! అన్నివేళల యందును నీ రాకకై యెదురుచూచుచు నేను చింతలను విడచెదను. తండ్రి యొక్క ఋణమును దీర్చినవాడవై, నీ వనవాస వ్రతమును పూర్తిచేసికొని మఱలిరమ్ము. అప్పుడు నేను సుఖములు పొందెదను. అంతవఱకు నెట్లో ప్రాణములను బిగబట్టికొని యుండెదను. నా మాటలను పెడచెవిని బెట్టునట్లు నీ మనస్సునకీ ప్రకారముగా స్థిరత్వమును దైవమిచ్చినదిగదా. అక్కటా! ఆ మాయ దైవము చేయు చిత్రముల నెవ్వడును తెలియలేడుగదా! ఓ తనయా! ఇప్పుడే వెళ్లుము. సౌఖ్యముగా మరలిరమ్ము. ఒప్పుచున్న మంచి వాక్యముల తియ్యదనముతో నన్ను సంతోషింపజేయుము. నా రామన్నా! నీవు జడలను ధరించి నారబట్టలను నడుమునకు గట్టుకొని అడవి నుండి నీవు తిరిగివచ్చు వేళ యిదియే యయినచో నెంత బాగుండును. అంతటి శుభము నాకు గలుగునా? అడవులకు వెళ్లదలచియున్న కుమారుని యొక్క మనోనిశ్చయమును తెలిసికొన్నదై కోసలరాజపుత్రి తాను గొప్పనైన యాదరముతో దయతో ఆలస్యము చేయకుండ దీవింప దలచెను.



# ఇరువది యయిదవ సర్గము

## కౌసల్య శ్రీరాము నాశీర్వదించుట :

విచారమును విడచిపెట్టినదై మంచి జలములతో నాచమించి సాధ్వి యగు కౌసల్య యిట్లు మంగళకరములైన వాక్యములను పల్కెను. "ఓ నాయనా! ఇంక నిన్నాపుటకు నాకు సాధ్యముగాదు. అందుచే నీవు సుఖముగా వెళ్ళిరమ్ము. ఓ రఘువంశమణీ! ఇప్పుడు నీవాయాసము లేకుండగా తొందరగా వెళ్లిరమ్ము. సుఖముగా మంచిమార్గమున సంచరించి రమ్ము. ఏ ధర్మము నీచేత గొప్పదైన ధైర్యముతోను స్థైర్యముతోను నియమముతోను రక్షింపబడెనో, ఆ ధర్మమే నిన్ను ఎల్లప్పుడును గాపాడుగాక! దేవాలయములందు మఠములందును నీచేత మ్రొక్క బడినట్టి దేవతలందఱును ఋషులతో సహితులై వనములలో సంచరించుటకు వెళ్లుచున్న నిన్ను నిర్మలమైనటువంటి మంచి దయతో కాపాడుదురు గాక! ఓ పుణ్యవర్తనము గలవాడా! ప్రీతితో గాధినందనుడగు విశ్వామిత్రుడు నీ కిచ్చిన శస్త్రాస్త్రములు నియమముతో సద్గుణములు గల్గి పవిత్రుడవైన నిన్ను రక్షించుగాక. జనకునకు సేవచేసిన ఫలితమును, జననికి సల్పిన శుశ్రూషల యొక్క ఫలమును, సత్యము యొక్క ఫలితమును, నీవు వనములలో సంచరించునప్పుడు నీ కాయాసము కలుగకుండునట్లుగా నిన్ను కాపాడుగాక! కుమారా! సమిధలును, దర్భలును, పవిత్రములును, దేవాలయము లును, వింత వింతలై యందములైన ప్రదేశములును, కొండలును, చెట్లును, చిన్నచెట్లును, సింహములును, పక్షులును, సర్పసమూహములును, చెఱువులును స్వచ్ఛమైన దయతో నిన్నెల్లవేళలందును రక్షించుచుండును గాక! కుమారా! ఋషులును, సాధ్యులును, దేవతలును,

విశ్వేదేవతలును నీకు స్వస్తి గలుగజేయుదురు. ఇష్టముతో బ్రహ్మ విష్ణువులును సూర్యచంద్రులును, అగ్నియును, శివుడును, ఇంద్రాది దిశాధిపతులును నీకు స్వస్తి నిచ్చెదరు. ఋతువులు మాసములు పక్షములు సంవత్సరములు రాత్రియు పగలును, ముహూర్తములును నీకు స్వస్తిని కలుగజేయుగాక! ఓ పుత్రరత్నమా! నీ స్మృతియు, ధృతియు, ధర్మమును సుఖకరములై నిన్ను కాపాడును గాక! చంద్రుడును, బృహస్పతియు, కుమారస్వామియు, బ్రహ్మపుత్రుడగు నారదుడును, సప్తర్షులును నీ కెల్లప్పుడును సుఖము కలుగజేయుదురు గాక! దిక్కులును, దిక్కులకు ప్రభువులైన వారును నేను మ్రొక్కినటువంటి మ్రొక్కుల నంగీకరించిన వారై నీవు దిక్కులేక వనమార్గములందు దిరుగువేళలందు నీకు దిక్కై కాపాడెదరుగాక! అడవుల యందు దిరుగు నీకు పర్వతములు, సముద్రము, వరుణుడు, ఆకాశము, భూమి, నదులు, నక్షత్రములు, గ్రహములు, రాత్రులు పవళ్లు, సంధ్యలు గొప్ప రక్షనిచ్చును. కుమారా! మునివేషమును ధరించికానలో దిరుగు నిన్ను, ఆరు ఋతువులును, మాసములును, సంవత్సరములును, కాష్ఠలును, కళలును, దేవతలును, రక్షింతురుగాక! క్రూరకృత్యముల నెల్లప్పుడు చేయుచుండు గొప్ప పిశాచములు మొదలగు వాని వలనను, రాక్షసుల వలనను, భయంకరములైన వన్యమృగముల వలనను వనములందు నీ కేవిధమైన భయమును గలుగకుండుగాక! ఓ సుందరాకారా! కుమారా! నీవడవులందు దిరుగునపుడు క్రోతులచేతను, తేళ్లచేతను, అడవి దోమలచేతను, ఈగ పాము పురుగు మొదలగు వాని వలనను ఎప్పుడైన నీకు ప్రమాదము సోకకుండుగాక! సింహములును, ఎలుగుబంట్లును, ఏనుగులును, కోరలు గల మృగములును, కొమ్ములు గల యడవిదున్నలును నిన్ను బాధించవు. ఆ చెడు మృగములు నిన్ను చేరకుండుగాక! నరులనే యాహారముగా భుజించు మృగముల యొక్క సమూహములు కూడ నెల్లప్పుడు నేను ప్రార్థించుచుండుటచే అడవియందు

నీ దగ్గరకైన రావు. అడవిదారులను బట్టి నీవు వెళ్ళుచోటులందు దారులన్నియును నీకు సౌఖ్యమును కలిగించు నట్లుండును. నీ యొక్క పరాక్రమము గొప్పగా ఫలించును గాక! నాయనా! రామా! నీకు శుభమగును. వెళ్లిరమ్ము. ఆకాశము నీకు మాటిమాటికి శుభము మానక కలిగించు గాక! దేవతల సమూహములును, నీ శత్రువులును, చంద్రుడును, బృహస్పతియు, కుబేరుడును, నీకు శుభము నొసగుదురు గాక! ఘోరారణ్యములందు నీవు స్నానము చేయునపుడు, అగ్నియు, సూర్యుడును, వాయువును, ధూమమును, మంత్రసమూహమును నీకు శుభము గలిగించు గాక! ఓ దివ్యమైన తేజస్సు గలవాడా! సర్వలోకములను పాలించువాడగు బ్రహ్మయు, విష్ణువును, బ్రహ్మర్షులును, తక్కిన దేవతలును వనములందు దిరుగుచున్న నిన్ను బ్రోచుచుందురు." పుణ్యములు చేసిన సాధ్వియైన కౌసల్య యీవిధముగ దేవతల నెల్ల నిర్మలములగు పూలదండలతోను, సాటిలేని గంధములతోను, తగిన నమస్కారములతోను పూజించి, మఱియు పవిత్రులగు బ్రాహ్మణులచేత అగ్నిని ప్రజ్వలింపజేయించి, తన కుమారునకు శుభము గలుగునట్లుగా పువ్వులను, ఏతిని సమిధలను, తెల్లనైన ఆవాలను చక్కగా హోమము చేయించెను. రోగరాహిత్యమునకై గురువులు శాస్త్రముల ననుసరించి శాంతికై హోమముచేసి బయటి ప్రదేశములందు తేనె నెయ్యి యక్షతలు మొదలైనవాటిని బలులేర్పరుపగా వేదపండితులు స్వస్తివచనము పలికిరి. ఆ బ్రాహ్మణుల కందఱకు తగు విధముగా రాముని తల్లియగు కౌసల్య తృప్తి కలుగునట్లుగా దానములిచ్చి ప్రేమతో రామచంద్రుని జూచి మంచిదైన మనసుతో దీవించెను.

**కౌసల్య శ్రీరామునికి మంగళాశాసనము చేసి రక్ష కట్టుట :**

"ఓ రామన్నా! దేవతలందఱిచేత పూజింపదగినవాడగు నింద్రునకు వృత్రాసురుని జంపబోవునప్పుడు యుద్ధమున నే మంగళము కలిగినదో

అటువంటి మంగళము నీకు కలుగుగాక! అమృతమును తెచ్చుటకు బోవునపుడు గరుత్మంతునకతని తల్లియగు వినత యే మంగళము కలుగజేసినదో యా మంగళము నీకు కలుగుగాక! పూర్వము అమృతమును పొందుటకై రాక్షసులతో పోరునప్పుడు ఇంద్రునకదితి యే మంగళమును కోరెనో ఆ మంగళము నీకు కలుగుగాక! వామనావతారమెత్తి లోకములను మూడడుగులతో కొలుచుటకు వృద్ధిపొందునపుడు మధుసూదనుడగు హరికే మంగళము సమకూరినదో ఆ మంగళము నీకు కలుగుగాక! ఋతువులును, సముద్రములును, ద్వీపములును, వేదములును, లోకములును, దిక్కులును, శుభమంగళములును నిన్నెల్లప్పుడును సన్మంగళ యుక్తునిగా జేయుగాక!" అని తన కుమారునకు అక్షతలను శిరసుపైనుంచి, దేవుని పూజింపగా మిగిలిన గంధము నలదినదై, ఫలము కన్పించినవి యగు మూలికలతో విశల్యకరణిని రక్షగా కట్టి, మంత్రములను జపించి ఆ సాధ్వియగు కౌసల్య దుఃఖమును మనస్సునందు పొందుచున్నదైనను, సంతసమును పొందుచున్నదానివలె పైకి కనిపించుచు, రాముని శిరస్సును మూర్కొని ప్రేమతో కౌగలించుకొన్నదై గద్గదములైన మాటలను నాలుక తుదనుంచి యిట్లు చెప్పెను. "ఓ రామచంద్రా! సిద్ధిని పొందిన కోర్కెతో వెళ్లిరమ్ము నా ప్రియపుత్రుడా! సౌఖ్యముగా నీవు వెళ్లిన పనిని తీర్చుకొని తిరిగి యీ యయోధ్యయందు రాజమార్గమున వచ్చుచుండగా చూచెదనుగాక! దుఃఖములు నశింపగా, ఇష్టము లభించుటచే ముఖము ప్రకాశించుచుండగా, వనవాస కష్టము ముగిసి తిరిగివచ్చు నిన్ను ఓ శిష్టజనవినుతుడా! యుదయించుచున్న చంద్రునివలె గాంతునుగాక! వనవాసమును పూర్తిచేసి, యీ రాజు యొక్క మాటను నెరవేర్చి తిరిగివచ్చి భద్ర సింహాసనమున గూర్చుండగా నిన్ను నేనును నా కోడలు చూచెదముగాక! అప్పుడు మేము కోరెడు కోర్కెలను చిరకాలము తీర్చుచుందువుగాక! నేను పూజించు దేవతలును, మునులును, ఆ

యీశ్వరుడును పంచభూతములును, రాక్షసులును, సర్పములును ఓ రామన్నా! నీవు వెడలు వనములందు ఎక్కువైన వాత్సల్యముతో నిన్ను కాపాడు చుండెదరుగాక!" అని కన్నీళ్లు నిండిన కనులు గలదై మంగళాశాసనములు పూర్తిచేసి, విధిపూర్వకముగా పుత్రుని మంగళము కొఱకై ప్రేమతో మంత్రించిన రక్షను చేతియందు కట్టినదై కుమారుని దగ్గరకు తీసికొని కౌసల్య దీవించుచుండగా, రామచంద్రుడు సంతుష్టిని జెందినవాడై మిక్కిలి శ్రద్ధతో తల్లికి ప్రదక్షిణముచేసి వినయముతో పాదములకు మరల మరల నమస్కరించి, సీతాదేవి యొక్క భవనమునకు వెళ్లదలచెను.



# ఇరువది యాఱవ సర్గము

**శ్రీరాముడు సీతను జూడ బోవుట :**

తల్లికి నమస్కరించినవాడై యచటినుండి బయలుదేరి రామచంద్రుడు తన మంచి గుణములచేత మిక్కిలి యాకర్షింపబడిన మనస్సులు గల జనులందఱు తనను చూచుచుండగా సీతాదేవిని చూచుటకు వెడలెను. అక్కడ సీతాదేవి యీ సమాచార మేమియును తెలియని దగుటచేత తన భర్తకు యువరాజ పట్టాభిషేకము జరుగవలెనని మ్రొక్కుచు, ఎక్కువైన కోరికతో తగిన విధముగా దైవపూజలు చేసి, భక్తితో గంధము పువ్వులు మొదలైన వన్నియు తన భర్తయొక్క పూజకై సమకూర్చెను. రాజ్యధర్మముల నెఱిగిన సీతాదేవి తెల్లగొడుగు మొదలైన రాజలాంఛనములతో గూడి తన భర్త యెప్పుడు వచ్చునా యని యెదురుచూచు చుండెను. అందముగా నలంకరింపబడినదియు, గొప్పదైన సంతోషముతో నిండియున్న జనులు గలదియు నగు తన సౌధమును బ్రవేశించి, సిగ్గునొంది, వేగముగా తలను వంచుకొన్నవాడైన శ్రీరాముని యొక్క ఆకారమును జూచి శరీరము వణకుచుండగా, సీతాదేవి తొందరగా లేచి నిలబడగా రఘురాముడు దుఃఖమును భరింపలేనివాడై తూలుచుండెను. వెలవెలపోవుచున్న ముఖమును, చెమటచే తడిసిన శరీరమును, గొప్పనైన దుఃఖభారమును చూచి ఆ పద్మముల వంటి కన్నులుగల సీత శోకముతో కలతజెందినదై "ఓ ప్రాణనాథా! యిట్టి సమయమున నీవు సంతోషములేక యుండుటకు కారణమేమియో చెప్పుము. గురుదైవతమైన పుష్యమి నక్షత్రము మంగళకర మైనది నేడే యని బ్రాహ్మణులు చెప్పిరి. నీ వెందుకిట్లు మనసు చెడినవాడవై యున్నావు. సుకుమారమై విశాలమై

వంద శలాకలు గలదియై నీటి నురువువలె తెల్లనై ప్రకాశించు తెల్లగొడుగు నీడలో నెందులకు రావైతివి? చంద్రునివలె, హంసము వలె ప్రకాశించు చామరములతో నీ ముఖపద్మమునకు విసరుట లేదెందుచేత? ఓ పుణ్యశీలుడా! వాగ్మిలైన వందిజనులు మిక్కిలి సంతోషముతో నిన్ను పొగడుచు రారెందుచేత? సూతులు మాగధులు మంగళములు పల్కుచు నీవెంట నేలరారు? వేదముల యందు ప్రజ్ఞ గలిగిన బ్రాహ్మణులు నభిషేకమునకై నీ శిరమున పెరుగును దేనెయును ఉంచరేమి? మంత్రులు నీ వెంట నంటి రారేల? పురజనులు నీవెంట ఏల రాలేదు? బంగారు భూషణములచే నలంకరింప బడిన, వేగముగా పరుగెత్తగల గుఱ్ఱములను నాల్గింటిని పూన్చిన రథము నీ ముందురాదేమి? నల్లనైన మేఘపు గొండవంటి శుభలక్ష్మణములు గల గజరాజు నీ ముందు నడవదేమి? బంగారు భద్రసింహాసనము నీ ముందు గనబడదేమి? ఇంతకు మున్నెప్పుడు చూడనటు వంటి రంగును బొందినదై నీ ముఖము పట్టాభిషేకవేళ సమీపించినను సంతోషమును విడచియుండు టెందులకు? కారణము చెప్పుము.”

**శ్రీరాముడు సీతతో తానరణ్యమునకు వెళ్లు వార్త చెప్పుట :**

అని శోకముతో విలపించుచున్న భార్యను జూచి రాముడిట్లనెను. “ఓ పద్మముల వంటి నేత్రములు కలిగిన సీతా! నన్ను తండ్రిగారు వనములకు వెళ్లుమని యాజ్ఞాపించిరి సుమా! ఓ జానకీ! నీవు గొప్పదైన వంశమునందు బుట్టితివి. ధర్మములు తెలిసినదానవు. ధర్మముల నెప్పుడును తప్పి నడచినదానవు గావు. గట్టిదైన మనస్సుతో వినుము. జరిగిన విషయములను చెప్పెదను. సత్యవాదియును, రాజును నయిన నా తండ్రి మునుపెప్పుడో నా తల్లియైన కైకకు సమ్మతితో రెండు వరముల నిచ్చెను. ఆమెయు వానిని మనసునం దుంచుకొని నేడు నా పట్టాభిషేక ప్రయత్నములు జరుగుచుండగా జూచి,

యా రెండు వరములను దీర్చమని ధర్మమార్గమున రాజునడిగెను. జానకీ! నేను పదునాలుగేండ్లు దండకారణ్యములలో సంచరించుటకు వెళ్లుటయును, ఈ రాజ్యభారమును భరతుడు వహించునట్లును, ఈ మాదిరిగా రెండు వరములను బొందెను. ఓ సతీరత్నమా! సీతా! దట్టమైన యరణ్యములలో విహారకేళి సల్పుటకు వెళ్లుచు నేనిప్పుడు నిన్ను చూచుటకు చేరవచ్చితిని.

**శ్రీరాముడు సీతకు నీతులు చెప్పుట :**

భరతుని యెదుట నన్నెప్పుడు పొగడుచు మాటాడకుము. అభివృద్ధి యందున్న పురుషులు ఇతర పురుష స్తుతులను సహింతురా? అందువలన భరతుడు నీకు నమస్కరింప వచ్చినపుడు, ఓ తరుణీ! అతనితో నన్ను గురించి వర్ణించి మాటాడకుండుట మంచిది కదా! లోకములో పదిమందిలో పదునొకండవ దానివై యుండుము. అందరకు అనుకూలముగా నుండి కాలమును వెళ్లబుచ్చుట మంచిది. కైక యొక్క కుమారుడైన భరతునకు మన రాజు యౌవరాజ్యమును ప్రసాదించుటచేత అతడిప్పటి నుండి రాజగుటచే నీవు గౌరవముగా చూడుము. తండ్రి యొక్క ప్రతిజ్ఞను దీర్చుటకై నేనడవులకు వెళ్లెదను. ఇప్పుడు నీవు ధైర్యముగా నుండుము. నేనడవులలో నుండగా ఇక్కడ నీవు వ్రతములతోను, ఉపవాసములతోను కాలము గడపుట యుక్తము. ఓ పాపరహితురాలా! ప్రొద్దుననే లేచి, దేవతలకు మ్రొక్కి, యథావిధిగా పూజలుచేసి, ఓ ముద్దరాలా! నా యొక్క తండ్రికి నమస్కరింపుము. ధర్మమొక్కటే చేయూతగా, మిక్కిలి వృద్ధురాలును దుఃఖభారముచేత తపించుచున్నదియు నయిన నా తల్లిని నీవు భక్తితో వినయముతో సేవలు చేయుచు పూజింపుచుండుము. కీర్తిగలదానా! తక్కిన తల్లులుగూడ నీకెప్పుడును పూజింపదగినవారు. నాకు తల్లులందఱును సమానులే. ప్రేమతోను, మంచి హృదయముతోను తోడబుట్టినవారి వలెను పుత్రుల మాదిరిగాను కైక యొక్క కుమారుని, లక్ష్మణుని తమ్ముడగు శత్రుఘ్నుని

నెక్కువగా చూడుము. వారు ప్రాణములు సుమా. కులమునకు, దేశమునకు రాజు, ప్రభువు భరతుడే కనుక ఓ జలజాక్షీ! యెప్పుడైనను కోపముతో అతని కప్రియములు చేయకుము. ఓ భూపుత్రీ! రాజులు లోకులచే, శీలముచేత ప్రయత్నముచేత కొలువబడిన వారై సంతోషమును బొందుదురు. దానికి విరుద్ధములైన గుణములతో నెవరైనను ప్రవర్తించిన సమ్మతింపరుగదా! తన కడుపున పుట్టిన బిడ్డలయినను తొందరపాటుతో తన కపకారమును దలపెట్టినచో రాజులు వారిని వదలిపెట్టెదరు. కార్యసాధకులయినచో ఇతరులనయినను స్వీకరింతురు. కాన నీవిందే సుఖముగా నుండుము. రాజు యొక్క యిష్టమున కనుకూలమైన భావమును, స్వంత ధర్మమును, సత్యనియమమును వీడకుము. ఓ ప్రేయసీ! యితరుల నెవ్వరిని నొప్పింపకుము. నా మాటలను గౌరవింపుము. ఓ సీతా నేనడవులకు వెళ్లెదను."



# ఇరువది యేడవ సర్గము

## సీత శ్రీరామునితో అరణ్యమునకు దాను వచ్చెదనని చెప్పుట :

సుకుమారియు, ప్రియములు పలుకదగినదియు, సద్గుణవంతురాలును, ప్రియములు పలుకునదియు నగు సీత మిక్కిలి యప్రియములగు మాటలను తనను గూర్చి భర్త పలుకగా ప్రేమతో గూడిన కోపముతో భర్తతో నిట్లనెను. “ఓ రామా! ఓ రాజకుమారా! ఏమిది? ఇట్టి నీరసమైన మాటలను పలికెదవు? నీ మాటలు విన్నంత మాత్రముననే నాకు ఆపలేని నవ్వు వచ్చుచున్నది. ఎల్లరు తమ తమ పుణ్యపాపములు తామనుభవించుచు తమ తమ పనులు నెరవేర్చుచుందురు. వారు సోదరుడు, తల్లి, తండ్రి, కోడలు, కుమారుడు అనువారు. కాని భార్య యొక్కతియే భర్త భాగ్యమును తప్పక పొందును. కాన నిన్నడవులకు వెళ్ళుమనినచో నన్ను గూడ నీవెంట వెళ్లుమన్నట్టులే కదా! తండ్రిగాని, తల్లిగాని, పుత్రుడు గాని, స్నేహితురాండ్రుగాని స్త్రీకి గతి కాజాలరు. స్త్రీకి ఎల్లప్పుడును ఇహమందును పరమందును భర్త యొక్కడే గతియగును గదా ప్రాణేశా! నీవడవులకు వెళ్లుచో ముందుగా నేను నడచుచు ఆ అడవి మార్గమునందు దర్భముండ్లు తొలగించుచు మెత్తదనము కలుగజేయుచుందును. ఇతరులు త్రాగగా మిగిలిన నీటిని వదలినట్లు నీ మదిలో నాపై నీర్ష్యా రోషములు వదలివేయుము. ఓ అభిమానధనుడైన వీరశ్రేష్ఠుడా! ఈ బాలికను ఒంటరిదానిని అడవులకు తోడ్కొని వెళ్లగా ఎట్లగునో యను సందియమును మానుము. ఎట్లైనను నన్ను వీడక తోడ్కొనిపొమ్ము. నిన్ను విడచియు ప్రాణములతో నేనిచ్చట యుండునంత పాపము నేమియు చేయలేదుగదా రామచంద్రా! సాటిలేని

మేడలపై హాయిగా సంచరించుటకంటెను, దేవతల విమానములయందు దిరుగుటకంటెను, ఆకాశ మార్గముల విహరించుటకంటెను, కష్టముల ననుభవించుచున్నను, ఏ పరిస్థితులయందైనను స్త్రీకి భర్త పాదసేవయే యుత్తమముగదా. ఓ ఆర్యశ్రేష్ఠుడా! మునుపే నా తల్లియును తండ్రియును అనేక విధముల భర్తను సేవింపవలసిన సర్వపద్ధతులను నాకు నేర్పిపంపిరి. ఇప్పుడు క్రొత్తగా నేర్చుకొనవలసినది లేదు. ఓ హృదయేశ్వరా! మనుష్యులు సంచరించనిదియు, చొరరానిదియు, పులలచేతను, ఎలుగుబంట్లచేతను, తోడేళ్లచేతను భయంకరమైనదియునగు నరణ్యమునకు నేనును సంతోషముగా వచ్చెదను. నాథా! నా పుట్టినయింటి యందున్నట్లుగానే అడవులమధ్యలో హాయిగా నుండెదను. ముల్లోకము లెట్లైపోయినను నా మదికి చింత కలుగదు. పతివ్రతాతత్త్వమునే కోరుచుందును. ఘుమ్మని పువ్వుదేనెల కమ్మనైన వాసనలు వ్యాపించిన యా యరణ్యములందు ధైర్యము ప్రకాశింపగా నెల్లప్పుడు బ్రహ్మచర్యవ్రతమును అనుష్ఠింపుచు నీ యొక్క పదములనే భజించుచు, నీతో గలిసి సంతోషముగా సంచరించెదను. ఓ శౌర్యధనుడా! దీనిని సమ్మతింపుము. ఏ మనుష్యులనైనను వనములలో పొరపాటులేక నీవు రక్షింపగలవు. ఇంక నా విషయమును చెప్పవలెనా? నాయందు పరిపూర్ణమైన దయను చూపింపుము. ఓ రాజచంద్రా! కొంచెమైనను సందేహము లేదు. నేను నీవెంట వచ్చెదను. ఇది నా మనస్సు యొక్క నిశ్చయము. దీనిని మరల్చుట నీకు కష్టము సుమా. నాథా! నీకేవిషయమునందును కష్టమును గలిగింపను. ఫలములను కందమూలముల భుజింపుచు మనసునందు విచారింపక నీతోగలిసి సంతోషమును పొందెదను. నన్ను నమ్ముము. ఓ ప్రాణనాథా! వన వీథులందు ఏరుల, సెలయేరుల గట్టులందును గుహలయందును నిను గూడి విహరింప గోరుచున్నాను. ధీరులలో నుత్తమమైనవాడా! హంసలు, కొంగలు మొదలగు

జలపక్షుల మనోహరనాదములతో గూడినవియు పద్మములతో నిండినవియునగు కొలనులందును, నదులందును నీతో గలిసి జలకేళి సల్ప గోరుచున్నాను. సంతోషమును బొందుచు నీచెంత వెయ్యి వేల సంవత్సరములైన నడవులలో నిశ్చింతగా నుండెదను. నాథా! స్వర్గమైన నీవు లేకున్నచో నాకు సంతోషమును గలిగింపదు. కాన పులులు సింహములు, ఏనుగులు గలిగి వెలుగు అడవులకు నీవెంట వచ్చెదను. తండ్రియొక్క యింటియందువలెనే సౌఖ్యముగా వసించెదను. ఎల్లప్పుడు నీ సేవ చేయుచుందును. ఇతర విషయములందు మనస్సు లేనిదానను స్థిరముగా నీయందే యనురాగము గలదానను అయిన నన్ను వదలినచో నేను నిజముగా శరీరమును భరింపజాలను. ఓ అనఘా! నన్ను నీ వెంట తోడ్కొనిపొమ్ము. నా కోర్కె నెరవేర్పుము. నీ యంతటివానికిది యొక పెద్ద భారమైన పనియా?"



# ఇరువది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు సీత కరణ్యములందలి కష్టములను చెప్పుట :

అని పలికిన సీతను జూచి ధర్మనిరతుడైన శ్రీరాముడు ఆమెను తనవెంట తీసికొని వెళ్లుటకు ఇష్టములేనివాడై సీతతో అడవులలోనుండు కష్టములనిట్లు చెప్ప దొడగెను. "వనములలోనుండు కష్టముల నాలోచించి యా ఘనుడు కన్నులవెంట బాష్పములు కార్చుచున్న తన సతిని చనువుతో నోదార్చుచు మంచిమాటలతో వనవాసోద్యమమును మాన్పుటకై ఆమెతోనిట్లనెను. 'నీవు గొప్పదైన వంశమునందు బుట్టితిని. ధర్మము తప్పకుండ నడచుకొనుదానవు. మనసులో తోచినదంతయు మార్గమనుకొని యిష్టము వచ్చినట్లు నడచు కొనకుము. నీవిచ్చటనే యుండుము. మంచివైన ధర్మముల నాచరింపుము. నేను చెప్పినట్లుగా నడచుకొనుటే యిప్పుడు నీకు కర్తవ్యము సుమా! అడవులకు వెళ్లవలయునను కోరికను విడచిపెట్టుము. అడవులు బహు దుఃఖముల కాటపట్టైనవి. నీయందున్న ప్రేమ చేత యింతగా జెప్పుచున్నాను. ఓ సీతా! అడవులలో సుఖమన్నది యెఱుగము. ఓ మంచి నడవడి గలదానా! కొండ గుహలయందు నివసించెడు సింహముల యొక్కయు ఖడ్గమృగముల యొక్కయు గొప్పవైన ధ్వనులును సెలయేళ్ల యొక్క ధ్వనులును చెవులకు వినుటకు కఠోరముగా నుండును సుమా! కావున అరణ్యములు దుఃఖకరములైనవి. నిర్జన వనములందు మదించి భయంకరముగా సంచరించు మృగసమూహములు మీద మీదకు వచ్చునుగాన అరణ్యము దుఃఖకరమైనది సుమా! ఓ సీతా! ఎచ్చట చూచినను బురదతో గూడినదియు, మొసళ్ల సమూహము గలదియు,

మదించిన యేనుగులు కలదియు నగు నదుల సమూహమే యుండును కాన అరణ్యము దుఃఖకరమైనది సుమా! ఓ భామా! అడవులు ముండ్లతో నున్న పొదలును, ముండ్లచెట్లు గలిగియుండును. అడవికోళ్ల అరుపులు కఠినములై యుండును. కొన్నిచోట్ల నీరు లభింపదు. ప్రవేశింపరానిదైయుండును. కాన అడవి దుఃఖకరమైనది. పగలంతయు నెన్నియో కష్టముల ననుభవించి నరుడు రాత్రివేళ తమంత తాము రాలిన ఆకుల సమూహముపై బడి నిద్రింపవలయును. కావున అరణ్యము మిక్కిలి దుఃఖకరమైనది. తమంత తాము రాలిన పండ్లను నియమముతో రాత్రియందు పగటియందు తాను తిని సంతోషమును పొంద వలెను గాన అరణ్యము దుఃఖకరమైనది. ఓ జానకీ! జడలను ధరింపవలెను. ఎల్లప్పుడు నారబట్టలే కట్టుకొనవలెను. ఓపికతో అప్పుడప్పు డుపవాసములు చేయుచుండవలెను. వచ్చిన యతిథి జనులను పరిచర్యలతో నెల్లప్పుడు తృప్తులను జేయుచుండవలయును. యథావిధిగా దైవములను పూజించుచుండ వలెను. ఓ అభిమానవతీ! ప్రతి దినము మూడువేళలందు నీమముతో సరస్సు లందు మునుగుచుండవలెను. ఇటువంటి నియమములను పాటింపవలెను గాన కాననవాసము దుఃఖకరము. ఓ లతాంగీ! స్వయముగా పువ్వులను కోసి తెచ్చి నియమయుక్తముగా శ్రద్ధతో వేదికయందు బలికై యుంచవలయును. కాన నరణ్యము బహు దుఃఖకరమైనది. ఓ పద్మాక్షీ! ఏ దినమున నెంతమాత్రము దొరకునో అంతియే భుజించుచు కడుపునింపుకొని తృప్తిని జెందవలయును. కాన అరణ్యము దుఃఖమును గలుగజేయును సుమా! తీరని యాకలి, హోరుమని మానకుండ వీచుగాలులు, భయంకరమైన చీకటి యుండును గాన అడవులు బహు దుఃఖకరములు సుమా! అనేక విధములైన రూపములతో కొండపాములు గొప్పగా బుసలుకొట్టుచు నరణ్యములందు స్వేచ్ఛగా తిరుగుచుండును కావున లతాంగీ! అరణ్యము బహుదుఃఖకరమైనది. ఓ జానకీ! నదులయందు నివసించు

సర్పములు అప్పుడప్పుడు దారులకడ్డముగా కనిపించుచుండును గాన నరణ్యము దుఃఖకరము సుమా! ఓ సీతా! ఈగలును దోమలును, భయము కలిగించు తేళ్లును, పురుగులును, శరీరము నందు ముసిరి కరచుచుండును గాన నరణ్యము దుఃఖకరము. ఓ సీతా! ముండ్లచెట్లును దర్భలును ఱెల్లుగడ్డియు క్రిందకు వంగి యున్న చెట్ల యొక్క కొమ్మల కొనలును అటునిటు కొట్టుకొనుచుండును గాన అరణ్యము బహుదుఃఖకరమైనది. అడవులలో నివసించువారలకు ఎప్పుడు ననేక విధములైన శరీర కష్టములును, ఎన్నలేనటువంటి బాధలును, మనస్సునకు భయమును వదలిపెట్టవు. కనుక అరణ్యము బహు దుఃఖకరము. మనస్సునందు క్రోధ లోభములకు స్థానమీయరాదు. తపము చేయవలెను. దేనికిని భయపడరాదు. కనుక అరణ్యము దుఃఖకరము. వనమునకు వచ్చుట తగదు. మానుము. అచటి కష్టములను పడలేవు. ఎన్నియో దోషములు కనిపించెను గదా! అనగా ...



# ఇరువది తొమ్మిదవ సర్గము

## సీత శ్రీరామునితో తానడవికి వచ్చుటకు కారణములను చెప్పుట :

సీతాదేవి రాముడు తనను అరణ్య భూములకు తోడ్కొని వెళ్లుట కిష్టపడ కుండుటను తెలిసికొన్నదై శోకముతో విడువకుండ కన్నీరు ధారలుగా కారుచుండ 'ఓ గొప్ప తేజస్సు గలవాడా! నీవు చెప్పిన వనవాస దుఃఖములు నా మనస్సునకు తెలిసినవి. నీయందు నాకున్న ప్రేమచే నవియును నాకు మంచిగానే తోచుచున్నవి. నా మాటను నమ్ముము. పులులును, సింహములును, ఏనుగులును, ఖడ్గమృగములును, పక్షులును ఎప్పుడును చూడనట్టి నీ యొక్క రూపమును జూచి మొగములు వెనుకకు త్రిప్పుకొని తిరిగి చూడకుండగా వెఱచి పరువెత్తును గదా! రాజు యొక్క యాజ్ఞచేత నీవెంట అడవులకు వచ్చుటగాని, లేకున్నచో మరణించుటగాని చేయుదును. ఇంతకంటె వేఱొక మార్గమున్నదా? ఓ మంచి కీర్తి గలవాడా! నీ దగ్గఱ నేనుండగా, ఇంద్రుడైన నన్ను కన్నెత్తి చూడగలడా? శత్రువులను జయించినవాడా! నాకామాత్రము తెలియదా? భర్తనెడబాసిన సాధ్వి భూమి యందు బ్రదుకజాలదని మంచి మనసుతో పూర్వము మీరు చెప్పియుండలేదా? హితమైన యా ధర్మమునకు ఇప్పుడే విధముగా మార్పు వచ్చినది? ఇదియే కాక నేను నా తండ్రియింట నున్నప్పుడు బాగుగా తెలిసిన సిద్ధాంతులు నా కడవులలో నివసించు యోగమున్న దని చెప్పుచుండగా వింటిని. అటువంటి లక్షణజ్ఞులైన పండితులు మునుపు చెప్పిన మాటలు తప్పుట యెట్లు జరుగును? మహాత్ములు చెప్పు మాట లబద్ధములా? రామా! సాముద్రిక శాస్త్రవేత్తలు నేనడవులలో సంచరించుటకు

వెళ్లెదనని చెప్పగా, ఆ ప్రకారముగా నెప్పుడు వెళ్లుదునా యని మనసునం దువ్విళులూరు చున్నదానను. వారందఱును చెప్పినట్లుగానే ఇప్పుడరణ్యవాసము సంభవించినది. నేను బ్రాహ్మణులు చెప్పిన ప్రకారముగా నడచుట అర్హమైన పనియేగదా! సత్యముగా వారు చెప్పినట్లుగా నీ వెంట వచ్చెదను. వేరొకటి లేదు. ఇదియే తగిన సమయము. ఓ ధీరా! వారు చెప్పిన మాటలు నిజమగుగాక. ఓ వీరుడా! అసమర్థులైనవారికి మిక్కుటమైన వనవాస కష్టములు కష్టములుగాని మనబోంట్ల కవి కష్టములగునా? సుకరములే యగును. ఇది నిజము సుమా! చిన్నతనమునందు నేను కన్యగా పుట్టినింట నుండగా పొగడబడిన శీలము గల యొక యోగినీమణి ముందు జరుగబోవునది యీ ప్రకారముగా జెప్పెను. 'ఈ చిన్నది భర్తతో గూడ అరణ్యములలో సంచరించుటకు కోరుకొనును. ఇష్టముతో ఈమెను ఈమె భర్తయు వెంటబెట్టుకొని వెళ్ళును. ఓ హృదయేశ్వరా! ఇచ్చటనే నేను కోరిక కలదాననై నిన్నెన్నియోమారులు నీతో గలిసి వనములలో విహరించవలెనని కోరుకొనలేదా? ఓ శౌర్యవంతుడా! వెనుకంజ వేయక నీతో అడవులకు వచ్చినదాననై నీకు నిరంతరము సేవలు చేయుటకు మనస్సున వేడుక కలుగుచున్నది. నా మనవి వినుము. ఓ పవిత్రమైన చరిత్ర గలవాడా! దయకు కట్టుబడి యుండునట్టి భర్తవైన నిన్ను సేవించి పవిత్రురాలి నయ్యెదను. ఇది నిజము. వేయి మాటలేల? నా బుద్ధికి నా భర్తయే నాకు దైవము సుమా! ఓ పవిత్రుడా! ఈ లోకమునందే కాదు. ఆ లోకమునందునైన నీతో గలిసి విలాసముగ నుండుటయే నాకు సర్వలాభములు సర్వశుభములును. ఇన్ని మాటలెందులకు? స్త్రీ తన తండ్రిచేత ధారాయుక్తముగా నెవ్వనికి ఒసగబడినదో ఆ పతియే ఆ సచ్చరిత్రురాలగు స్త్రీకి పరలోకముననను పతియగును అని వేదములీ ప్రకారముగా ఘోషించుచుండుట నీవు వినలేదా? ఓ మంచి బుద్ధిగలవాడా! ఈ విధముగా ప్రమాణ పద్ధతులుండగా, నీ భార్యను, మంచి నడవడి గలదానిని,

మంచి శీలము గలదానిని, పతియే దైవముగా భావించుదానిని, వినయ వంతురాలిని, నీ యందు భక్తి గలదానిని, చింతచే బాధపడుచున్నదానిని, సుఖ దుఃఖములయందు సమముగా వర్తించుదానిని, ఓ నా ప్రాణనాథా! నీవేల తోడ్కొని పోవుట కిష్టపడవు? ఇది నీ బోటివానికి మంచిపనియేనా? ఓ రామచంద్రా! నన్నిక్కడ దుఃఖ సముద్రములో ముంచి యడవులకు నీవు వెళ్లినచో నేను, అగ్నిచేతగాని, విషముచేతగాని, నీటియందుగాని ఈ శరీరమును వదలివైచెదను. ఇది సత్యము సుమా. ఇన్ని విధములుగా తాను చెప్పినను తానడవులకు వచ్చుట కతడు సమ్మతింపకపోవుటచే కన్నులవెంట కన్నీరు కారుచున్న సీతాకాంతను జూచి రామచంద్రుడు ప్రేమతో ఆమె విచారమును దొలగించెను.



# ముప్పదియవ సర్గము

## సీత శ్రీరాముని నిష్ఠురము లాడుట :

పురుషులలో నుత్తముడైన తన భర్త తన్నూరడించుచు నిట్లు మాటలు చెప్పుచుండగా, నతనిని జూచి సీత తాను భయంకరములైన యడవులలో దిరుగ దలంచినదై మనస్సు భయముతో కొట్టుకొనుచుండగా వణకిపోవుచున్నదై ఎక్కువైన కోపముతో, గొప్ప పరాక్రమ వంతుడైన భర్త నట్లే చూచుచు మరల నిట్లు న్యాయ నిష్ఠురములాడెను. "ఓ రామచంద్రా! నా తండ్రి, మిథిలానాథుడు అయిన వైదేహు డీ విషయమును విన్నచో నిప్పుడు నిన్నేమని తలంచును? రామా! నా యల్లుడు పురుషరూపము ధరించియున్న స్త్రీయని మనస్సునందు తలంపడా? ఖరకరుడైన సూర్యునియందువలె గొప్ప తేజస్సు శ్రీరామునియందు లేదని జ్ఞానములేని లోకులనుచుండగా అక్కటా ఆ యసత్యమును విని యెట్లు సహింపగలను? ఈ ప్రకారముగా ఎందుకు విషాదమును బొందితివి? నీవిట్లు భయమును పొందుటకు గారణమేమి? నిన్నే నమ్మియున్నదానిని భార్యను నన్ను ప్రేమలేక వదలివెళ్లుటకు మనసున నెందుకు తలచితివి? కులమును చెడగొట్టుదానివలె గాక నేను నిన్ను తప్ప ఇతరులను నా మనస్సునందు తలంపని దానిని గదా. ఓ శ్రేష్ఠమయిన పొగడబడిన శీలము గలవాడా! నీ వశమున నుండి నడచుకొను నన్ను పూర్వము సత్యవంతునకు సావిత్రి యెట్టిదో అట్టిదానినిగా దలపుము. నీ భార్యను, పడుచుదనములో నున్న దానను, అందగత్తెను, పతివ్రతను, చిరకాలము నీతో గలసియున్నదానను. ఇట్టి నన్ను వేశ్యాభర్తవలె అయ్యారే! పరులకివ్వదలచితివా యేమి? ఎవరికిష్టమును కలుగజేయుటకై నేను వచ్చుటకు నిరాకరించుచున్నావో వారికి నీవే యిష్టముతో

లొంగియున్నవాడవై విధేయతతో సంచరింపుము. నన్ను నీ వెంట అడవులకు గొనిపోకుండ వెళ్లుట నీకు తగిన పనిగాదు. నాకు అడవియైనను, తపస్సైనను, స్వర్గమైనను నీతోడిదే లోకము. దారిలో నే నలసిపోను సుమా. ఉద్యానవనములో విహరించినట్లు నిన్ను వెన్నంటి వచ్చెదను. నీకు మిక్కిలి సంతోషమును గలిగింతును. నీవెంట వచ్చునపుడు దర్భల యొక్క కొనలను, పల్లేరు కాయలను కూడా జింక చర్మమువలెను దూదిపింజలవలెను తలంచెదను. ఇక కష్టమేది? అడవులయందలి సుడిగాలుల వలన రేగి ధూళి నన్ను చుట్టుకొన్నను దానిని నేను గంధపు పొడుల వలె దలంచెదను సుమా! లేత పచ్చిక బయళ్లయందు నీతో కలసి శయనించిన సుఖము లభింపగా నింక పట్టు కంబళములపై పవళించుట కెందుకాశపడవలెను. ఇంతకంటె ఆ సుఖము లెక్కువా? ఆకులుగానీ అలములుగానీ, పండ్లుగానీ, కొంచెమో గొప్పయో ఇంపుగా నీవే సమకూర్చి నీ చేతులతో నాకు పెట్టినచో నా కదియే అమృతపానముతో సమానమగును. నేను నా తల్లినిగాని తండ్రినిగాని తోడబుట్టినవారిని గాని తలపెట్టను. ఇల్లు వాకిలి తలపను. నీ యిష్టము ప్రకారము నీవే ప్రేమతో నా చేతిలో నుంచు పండ్లుగాని కాయలుగాని తినెదను. ఒక్క కష్టము గూడ నీకు గలుగనీయను. నీ కొక్క కష్టము కూడ కలుగదు నమ్ముము. ఓ రాఘవా! నీతో నున్నచో నాకదియే స్వర్గము. నీ వెంట లేకున్నచో నాకదే నరకము. ఇది నా యుద్దేశమని తలంపుము. నేను నీ వెంట వచ్చెదను. నన్ను మాన్పింపకుము. ఓ ప్రాణనాథా! నన్ను తగదని నీవెంట తోడ్కొని పోకున్నచో, దుఃఖించుచున్న నన్ను ఇచ్చట వదలివెళ్లినచో తప్పక విషమునైనను త్రాగి మరణించెదనుగాని పగవారి చేతులలో చిక్కుపడి కష్టమును పొందలేను సుమా! ఒంటరిగా నన్ను విడచిపెట్టి నీ వడవులకు వెళ్లెదవేని నిన్నెడబాసిన బాధచేత నా ప్రాణములు నీ వెంటనే వచ్చును సుమా! వినుము. నీవు వెళ్లిన తరువాత చచ్చుటకంటెను నీ కనుల యెదురుగా నీ పాదపద్మముల మీదపడి చచ్చిపోవుట యుత్తమము గదా! పదునాల్గు వత్సరములీ దుఃఖసముద్రము నందు మునిగియుండగలనా? ఒక్క నిమిషము

కూడ నిన్ను వదలి బ్రతికియుండజాలను సుమా! ఓ నాథా! నా మాటను వినుము." అని రామచంద్రుని బట్టుకొని హాయని యార్తితో విలపించెను. అరణి నిప్పుకణములు విడుచునట్లు ఆ మృగాక్షి చాలసేపటి నుండి నిలిపిన కన్నీటి బిందువులు కనుల నుండి రాల్చెను. విషమునింపిన బాణములచే పొడువబడిన ఆడయేనుగువలె భర్తయొక్క మాటల నెడు బాణములచే కొట్టబడినదై మిక్కిలి బాధనొందెను. పద్మముల నుండి కారుచున్న నీరమువలె నేత్రపద్మముల నుండి కన్నీరు అధికముగా స్రవించుచుండగా నామె సంతాప భారముచే తెల్లబారిన ముఖము గలదియయ్యెను. ఆ మహానుభావురాలయిన సీత యొక్క చంద్రసమానమైన ముఖము విడువక స్రవించు బాష్పముల వేడిమిచేత నీటినుండి వేరుచేసిన తామరపువ్వువలె మిక్కిలి వాడిపోయెను.

**శ్రీరాముడు సీత వనమునకు వచ్చుట కనుమతించుట :**

దుఃఖపరవశయై యేడ్చుచున్న జానకిని శ్రీరాముడు ఎక్కువైన ప్రేమతో చేతులతో దగ్గఱకు తీసికొని కౌగలించుకొని యూరడిల్లునట్లు మాటాడి నమ్మికలు కలుగునట్లుగా యిట్లనెను. "ఓ జానకీ! నీకు వ్యథను గలిగించునదైన స్వర్గమైనను నాకు నిల్వనిష్టము కాదు సుమా! స్వయంభువునకు వలె నాకు కొంచెమైనను, ఎందైనను భయము లేదు. నీ మనసు తెలియని కారణమున నిన్ను రక్షించు శక్తి గలిగియుండియును అరణ్యములకు నిన్ను తీసికొని వెళ్లుటకు అడ్డంకులను గొన్నిటిని చెప్పితిని గాని వేరుకాదు. దీనిని నీ మనస్సులో సహింపుము. నాతో గూడి యరణ్యావాసము ప్రేమతో జేయుటకే బ్రహ్మ నిన్ను సృష్టించెను. ఆత్మజ్ఞానము కలవాడు ఖ్యాతిని వలె నేను నిన్ను విడుతునా? నీవు కళవళపడకుము. ఓ సుందరీ! మహాత్ములైనవారు మునుపీ మాదిరిగా చేసియున్నారు. భార్యను వెంట నిడుకొని యడవులకు వెళ్లుటయే యుత్తమధర్మము. ఆ ధర్మమార్గమునందే నేనును నడచుకొనువాడను. సూర్యుని వెంటనంటు సువర్చలాదేవివలె సంతోషముగా నావెంట రమ్ము.

## శ్రీరాముడు సీతతో నరునకు పితృపూజ యవశ్యకర్తవ్యమని చెప్పుట :

నేనడవులకు వెళ్ళననరాదు. కైకకు రాజు చేసిన ప్రమాణములే నన్నడవుల కీడ్చుచున్నవి. ఓ జానకీ! తల్లిదండ్రులు చెప్పినదానినిబట్టి నడచుట ఎంతైనను మానకూడ నటువంటి ధర్మము సుమా! మానివేసి నేనెట్లు మనగలవాడను? తన స్వాధీనములోనున్న దేవతలైన తల్లిదండ్రులను ఆచార్యులను వదలివేసినవాడై మానవుడు తన స్వాధీనములో లేనటువంటి దైవము నెట్లు పూజించును? ఆ ముగ్గురిని పూజించిన నరుడు మూడు లోకములను సాధింపగలడు. దానితో సమానమైన పవిత్రత మఱియొకటి భూమియందు దొరకదు సుమా! దానముగాని, మానముగాని, సత్యముగాని, దక్షిణలతో గూడిన యజ్ఞము గాని ఓ జానకీ! యే మానవులకైనను నియమముతో పితృసేవ చేయు ఫలమును పరలోకమున నీయజాలవు సుమా! స్వర్గలోకమో, ధాన్యమో, నిండు సుఖమో, ధనమో, కుమారులో, భాగ్యమో, విద్యయో, పెద్దల సేవ వలన సాధింపరాని ఫలము ఓ తరుణీ లోకమున గలదా? తల్లిదండ్రుల యొక్క సేవయందాసక్తులైన మహానుభావులు శ్రమ లేకుండగనే, గోలోకమును పితామహలోకమును సుర గంధర్వాది లోకములను పొందుటకు సమర్థులు సుమా! సత్యమును ధర్మమును పాటించు మనస్సు గలవాడగు నా తండ్రి యేది చెప్పెనో, దానినే నెరవేర్చుటకు నేను మనసులో తలచినాడను. సనాతన ధర్మ మార్గము కూడ యిదియే సుమా! నీ యభిప్రాయము తెలియకపోవుట చేత నా విధముగా రావలదంటిని. నిశ్చయముగా అడవులకు వచ్చెదనంటివి. ఓ యువతీ! నిన్ను విడచి యెట్లు నేనడవులకు వెళ్ళశక్తుడనౌదును? లోపరహితమైన మేను గలదానా! నిన్నరణ్యవాసము చేయుటకే బ్రహ్మ సృజించెను. ఓ పద్మాక్షీ! దీనికై వగచెదవెందులకు? రమ్ము. ప్రయాణము కమ్ము. లెమ్ము. ఇంక లేశమైనను సందేహమును నీ మనస్సునందు పొందనవసరము లేదు. సహధర్మచారిణివై నా వెనువెంట రమ్ము. నీ వంశమునకు నా వంశ కీర్తికి కదు యోగ్యమైన

రీతిగా నిశ్చయము చేసితివి. ఇది మెచ్చదగినట్లుగా నున్నది గాని యిందు దోషమేమున్నది?

**శ్రీరాముడు సీతను దానముసేయ నియోగించుట :**

అని పల్కి రాముడు “ఓ జానకీ అరణ్యయాత్రకు యోగ్యమైన కార్యములు చేయుటకు ప్రారంభింపుము. పరస్పర ప్రీతి లేనిచో నేను స్వర్గమును గూడ మనస్సులో గోరను. బ్రాహ్మణులకు ధనములిమ్ము. భిక్షువులకు తనివిజెందు నట్లుగా సాటిలేని యాహారముతో తృప్తి కలిగింపుము. నీవు ప్రయాణమునకు సిద్ధముకమ్ము. ఇంకను ఆలస్యమేల? బ్రాహ్మణుల కిచ్చిన తరువాత వస్త్రములు, నగలు, పాన్పులు, వాహనములు, బంగారపు బొమ్మలు మొదలగు విలాస వస్తువులన్నియు సేవకుల కందజేయుము” అని రాముడు ప్రీతినొందిన చిత్తముతో తన ననుమతింపగా సంతోషముతో పొంగిపోయి భూపుత్రి భర్త చెప్పినట్లు తన ధనమును దానము చేయుటకు తొందరగా ప్రారంభించెను.



# ముప్పది యొకటవ సర్గము

**లక్ష్మణుడు తాను వనమునకు వచ్చెదనని శ్రీరాముని ప్రార్థించుట :**

రాముడు చెప్పిన దంతయును మునుపే రఘురామునితో వచ్చి ఆ ప్రదేశమునందే నిలిచియున్న చిన్న తమ్ముడైన లక్ష్మణుడు విని తన మనసులో "అయ్యో! రామునితో వెళ్లుటకు ఈ సీతాదేవికే యింత కష్టసాధ్యమయినదే! నన్నే ప్రకారముగా ఇష్టపడునో?" యను దుఃఖమును సహించుకొనలేనివాడై కన్నీటితో కలుషితమైన మొగము గలవాడై తన అన్నగారైన రాముని యొక్క పాదములమీద వ్రాలి మహాభక్తితో గట్టిగా పట్టుకొని స్త్రీల యందెన్నదగినదగు సీతాదేవిని ముందుగా ప్రార్థించి, గొప్ప నియమవంతుడైన అన్నగారితో నిట్లనెను. "ఓ దీనవత్సలుడా! నీవు వనసీమలకు వెళ్ళునట్లైన నిన్ను సేవించుచు నేనునువత్తును. నాపై కరుణ చూపుము. నేను చేతియందు విల్లు ధరించి మృగములతో నిండియున్న గొప్ప యరణ్యములో దారిచేయుచు ముందుగా వెళ్లుచుండగా మీరు వనములందవలీలగా సంచరింపవచ్చును. వివిధ జంతువులు మృగములు గల మహారణ్యముల నెన్నిటినైన ఓ అన్నా! నేను వెంట వచ్చినచో మీరవలీలగా దిరుగవచ్చును సుమా! ఓ మహానుభావ! దేవలోకములో ప్రవేశించుటకైనను, దేవత్వమునైనను, అన్ని లోకముల యందుండు నైశ్వర్యములనయినను నీవు లేనిచోట నేను కోరను." లక్ష్మణు డిట్లు చెప్పగా రాముడనేకములైన నివారణోక్తులను చెప్పి మంచిమాటలతో నోదార్చిన మరల సుమిత్రానందను డిట్లనెను. మునుపు నే నెచ్చటికైనను నీవెంట వచ్చుట కంగీకరించెడివాడవు. ఇప్పుడీ ప్రకారముగా వద్దని వారించెదవు. ఇట్లు నివారించుటకు కారణమేమియో చెప్పుము. నా సంగతినే విడచిపెట్టితివి.

దీనివలన నాకు సందేహము కలుగుచున్నది” అని చేతులు జోడించి తనకంటె ముందుగా వెళ్లుటకు సిద్ధముగా నుండి తన్ను బ్రతిమాలుచున్న తమ్ముని జూచి..

## శ్రీరాముడు లక్ష్మణుని నయోధ్యయందుండుమని చెప్పుట :

శ్రీరాముడిట్లనెను. “నా తమ్ముడవు. ప్రాణముతో సమానమైనవాడవు. నా కనుకూల మైనవాడవు. ధర్మమును వదలనివాడవు. మంచి గుణములు గలవాడవు. మిత్రుడవు. బలము గలవాడవు. ఎల్లప్పుడు నాకు హితమును గోరువాడవు గదా! నీవు నావెంట అడవులకు వచ్చినచో నెవ్వరయ్యా! నా తల్లిని, నీ జననిని చక్కగా చూచువారలు? భూమి కంతకు సువృష్టివలె ఘనముగా సుఖము గలుగజేయ గల నాథుడగు తండ్రి కామపాశముల చేత బంధింపబడి యున్నాడు గదా. నీ వెఱుగవా? కైకేయి యీ రాజ్యమును వశపరచు కొనుటచే తాను దుస్సహమైన బాధలచే కలిగియున్న తన సవతులకు మేలు కలుగజేయదు సుమా! భరతుడు తన తల్లిని మంచిగా గౌరవించును గాని సవతి తల్లులను మనస్సు నందైనను తలంపడు సుమా! ఓ లక్ష్మణా! నీవైన వారల దుఃఖమును మాన్పుటకిచ్చట నుండుము. సౌమిత్రీ! నీవు స్వయముగా గాని, లేక రాజు యొక్క యనుగ్రహము చేతగాని ఇచ్చట నా తల్లి బాధ్యతను వహింపుము. వినయము గలవాడవై నా మాట ననుసరించి యిచ్చట నిలువుము. నా యెడబాటు మూలముగా వెతజెందుచున్న నా తల్లి నీవైన నిచ్చట నున్నచో ముదము జెందును. నీవిచ్చటనున్నచో నాయందు నీకున్న భక్తి స్ఫుట మగును. పెద్దలను భక్తితో సేవించుటచే ధర్మము నాచరించినట్లగును. పాపము తొలగును. ఓ లక్ష్మణా! నీవిట్లు చేసినచో నాకు సమ్మతమగును సుమా! రఘుకులమను సముద్రమునకు చంద్రుని వంటివాడా! సౌమిత్రీ! నా మాట వినవయ్యా! మనమిద్దఱమును లేకున్నచో మన తల్లులు ఇక్కడ ఏవిధముగా సుఖము పొందుదురో చెప్పవయ్యా!” అని యీ ప్రకారముగా నీతియుక్తముగా

రఘురాముడు చెప్పిన తీవ్రమైన వాక్యములను విని లక్ష్మణుడు ఇట్లు పల్కెను. “ఓ వివేకధనా! భరతుడు నీ తల్లిని నా తల్లిని తన తల్లివలెనే యకల్మష చిత్తమున భరించును. నీ యొక్క ప్రతాపమును దెలియనివాడా? ఎన్నడును అట్లు చేయడు. ఆర్యామణియైన కౌసల్యా జననిని నాబోటివాడా భరించునది. ఆమెయే వేలకొలది మందిని తనను సేవించువారిని అనేక విధములైన దానములచేతను భక్ష్య భోజ్యములచేతను ఔదార్యముతో ప్రేమతో తృప్తినొందించెను గదా! వేలకు వేలు గ్రామము లను ఇచ్చెను గదా! ఆమె నితరులు భరింపవలసిన పనియేమి? కౌసల్య తనను తాను రక్షించుకొనగలుగు విధముగానే నా తల్లి కూడ తనను తాను రక్షించుకొనగలదు. జీవించుట కనేకములైన గ్రామములున్నవి. కనుక ఆమెయే నా వంటి వారినెందఱినో రక్షింపగలదు. నన్ను నీ సేవకునిగా నేలుకొనుము. ఇందువలన ధర్మభంగమేమియు గలుగదు. నేను కృతార్థుడనై మనగల్గుదును. దీనిచే నీకు గూడ ప్రయోజనము కలుగును. ఒకచేతితో గంపను గడ్డపాఱను పుచ్చుకొని, వేరొకచేత విల్లు బాణములు ధరించి నీకంటె ముందుగా నడచుచు దారిని తిన్నగాజేసి నీకు శ్రమలేకుండ జేయుదును. పండ్లను, దుంపలను, వనవాసు లాహారముగా భుజించునవి యింకనితరములైన వేవైనను తెచ్చియిచ్చెదను. నీవును జానకీదేవియు గలిసి కొండల చరియలందు నిదురించుచున్నను మేలుకొని యున్నను, కోదండము ధరించినవాడనై మెలకువతో నుండి ఎల్లప్పుడును కాచుకొని యుండెదను.” (దీనివలన సీతారాము లిరువురును సేవింపదగిన వారనియును, యుగళ పూజయే శ్రేష్ఠమనియును, ఎంతటి గొప్పవానికైనను రామసేవయందు నీచకార్య మనునది లేదనియును భావము.)

**లక్ష్మణుడరణ్యములకు వచ్చుటకు శ్రీరాముడు సమ్మతించుట :**

అని లక్ష్మణుడు చెప్పగా ప్రీతిజెందిన మనస్సు గలవాడై యన్నయగు రామచంద్రు డిట్లనెను. “ఓ లక్ష్మణా! నీవు వెంటనే వెళ్లి నీ మిత్రులకీ విషయము

దెల్పుము. మామగారు యజ్ఞము చేయునప్పుడు వరుణదేవుడు స్వయముగా, చూడభయము గలిగించునవి యగు రెండు విండ్లను, సూర్యునివలె వెల్గుచు బంగారముచే నలంకరింపబడిన రెండు ఖడ్గములను, బాణములు తరుగని అమ్ములపొదులను, అందమై భేదింపరాని రెండు కవచములను ఇచ్చెను. వాటిని ప్రతి దినమును పూజించుటకై మన గురువైన వసిష్ఠుల యింటి యందుంచితిని. వనసీమలయందు మనకవియన్నియు నుపయోగపడును గాన నీవు వానిని తొందరగా నిచ్చుటకు తీసికొనిరమ్ము" అని చెప్పగా లక్ష్మణుడు వెళ్లి స్నేహితుల కందఱకును తన ప్రయాణమును గురించి తెలియజెప్పి, గురువుగారి యింటికి వెళ్లి అక్కడ నుండి కావలసిన సాధనముల నన్నిటిని తీసికొని వెంటనే తెచ్చి రామునకు జూపెను. రాముడు సంతసించుచు కార్యపద్ధతి తెలిసినవాడవై ఇట్లు తొందరగా అనుకున్నంతలో వచ్చితివి అని మెచ్చికొని, నాకు గలిగిన యర్థములను నీతో గలిసి వేగముగా, బ్రాహ్మణులకు, తపస్వులకు, గురువులకు నన్ను సేవించువారలకు దానముచేసి తృప్తి గలిగించెదను. నీవు వెళ్లి వసిష్ఠుని, సుయజ్ఞుడు మొదలగు తక్కిన శ్రేష్ఠజనులందఱను పిలుచుకొని రమ్ము.



# ముప్పది రెండవ సర్గము

## శ్రీరాముడు తన పదార్థములను దానముచేయుట :

అని శుభమును ప్రియమును నయిన రాముని మాటను విని లక్ష్మణుడు సుయజ్ఞు నింటికి వెళ్లి హోమశాల యందున్న యతనిని చూచి నమస్కరించి రాముడు చేయు కార్యములను జెప్పి రామునింటికి రమ్మని పిలువగా, ఆ సుయజ్ఞుడు మాధ్యాహ్నికములను తీర్చికొని లక్ష్మణునితో గూడి శ్రీలు విలసిల్లుచున్న శ్రీరాముని మందిరమును ప్రవేశించెను. ఆ వచ్చుచున్న పుణ్యమూర్తిని, రాముడు చూచి వేదవిదుడైన ఆ సుయజ్ఞునకెదురువెళ్లి నమస్కరించి తీసికొనివచ్చి యథావిధిగా తన వస్తువుల నొసగెను. బంగారు భుజకీర్తులను, ప్రకాశించు కుండలములను, బంగారు హారములను, అందముగానున్న చేతికడియము లను, రత్నములు పొదిగిన కిరీటమును, బంగరు దండకడియములను, ఇతరములైన భూషణములను, అనేకములైన రత్నములను, ఇవియన్నియు నిచ్చి సీతాదేవి చెప్పుటచే మఱియు నిట్లు పలికెను. "హారమును, బంగారు త్రాడును, భుజకీర్తులను, దండకడియములను, నీయొక్క భార్య కొరకై సీత యిచ్చుచున్నది తీసికొనుము. మంచములును, మణిమయము లైన యితరాసనములును, మేము వనములకు వెళ్లుటకు నిశ్చయించుకొన్న వారము గాన, సీతాదేవి నీ భార్యకుగాను వీనిని ఇచ్చుచున్నది. తీసికొనుము. మా మేనమామ యిచ్చిన శత్రుంజయమను గొప్ప యేనుగుతో కూడ వేయి యేనుగుల నిచ్చెదను స్వీకరించు"మని వేఱువేఱుగా నీయగా రాముని వాక్యము ననుసరించి సుయజ్ఞుడు వాని నన్నిటిని గైకొని ప్రేమతో రాముని, లక్ష్మణుని సీతను దీవించి తన యింటికి వెళ్లగా రాముడు తన సోదరునితో నిట్లనెను. "అగస్త్యుని కుమారుని, విశ్వామిత్ర పుత్రుని పూజించి పైరుకు నీరు పెట్టు

మాదిరిగా వారలకు వేల యావులను, వెండిని, బంగారమును, అనేక విధములైన రత్నములను నిమ్ము. కౌసల్య భక్తితో కోరికతో ఆశ్రయించిన తైత్తిరీయ గురువునకు తృప్తినందునంతదాక రథములను, దాసీ సమూహమును, పట్టుబట్టలను పశు సమూహమును, వేయి ఆవులను, రత్నములను ధనములను, అంబరములను ఒసగుము. చాలకాలము నుండి నాతో నున్న చిత్రరథుడను సూతునకు ప్రీతితో ధనములను, వస్త్రములను, అనేకములగు రత్నములను సంతోషమును బొంది చాలు చాలు ననుదాక ఇమ్ము. నిష్ఠతో నుండి కఠ కలాప శాఖల నిరంతరముగా నధ్యయనము చేయు బ్రహ్మచారులు మరియొక పని యేదియు చేయనివారు వాచవిగ దినగోరువారు. అంతేగాక వారు గొప్పవారల మెప్పు పొందినవారు గాన వారికి ఎనుబది ఒంటెలను, అవి మోయ గలిగిన రత్నములతో నిమ్ము. పాలు పెరుగు నెయ్యి లభించునట్లు వేయి గోవులనిమ్ము. వ్యవసాయమునకు బనికివచ్చు వృషభములను రెండు నూరులిమ్ము. మఱియు వడ్లు వేయి సంచులను అవి మోయునట్టి యెడ్లను ఓ తమ్ముడా! వేగముగా వారికిచ్చి పంపించుము. కౌసల్యాదేవి భవనమున బ్రహ్మచారుల యొక్క సమూహము గలదు. వారి కొక్కొక్కరికి కోరిక తీరునట్లు వేయి వేయి యావుల చొప్పున నిమ్ము. నేను దానము చేయు పద్ధతిని నా తల్లి మెచ్చవలయును. తక్కిన బ్రాహ్మణుల కందఱకు తగిన విధముగా ప్రీతితో మిగిలిన ధనమునంతయు నిమ్ము." అనగా సౌమిత్రి రాముని యాజ్ఞ ననుసరించి కుబేరుని మాదిరిగా సమస్తమును దానము చేసెను. కన్నుల నీరు జాలువారు చుండగా దుఃఖముతో నిల్చియున్న, ఎల్లప్పుడు తన నాశ్రయించియున్న తన సేవకులకు చాల ధనములు వేరువేరుగా ప్రీతిపూర్వకముగా నిచ్చి "నా యొక్క గృహమును తమ్ముని యొక్క యింటిని మునుపెట్లు చూచువారో అట్లే మేము మరలి వచ్చునంతవఱకు కాపాడుచుండుడు" అని వారితో చెప్పి కోశాధిపతిని జూచి నా ధనమంతయు దీసికొని రమ్మని పల్కగా నతడు వెంటనే వెళ్లి మరలిరాగా ఆ ధనమును నిర్ధనులైన బాలవృద్ధులకు సద్బ్రాహ్మణ సమూహములకు జనులచే నుతింపబడిన కీర్తి గలవాడగు రామచంద్రుడు లక్ష్మణునితో గలిసి పంచిపెట్టెను.

**త్రిజటుడను బ్రాహ్మణుని వృత్తాంతము :**

నాగటికఱ్ఱును, గుద్దలియును, నాగలియును పుచ్చుకొని ఉంఛవృత్తితో ప్రతి దినము అడవులలో దిరుగుచు దారిద్ర్యముచే నెక్కువగా బాధజెందుచు ముసలితనముచే తూలిపడుచు భార్యను బిడ్డలను అతి కష్టముతో పోషించుచున్న గర్గవంశీయుడగు త్రిజటుడను వాడు దైవవశమున నా సమయమున పట్టణము నందుండగా ఆ పింగళ వర్ణుడగు తన భర్తను జూచి పావనియగు నతని భార్య, "స్వామీ! నీ పాఱను గుద్దలిని అవతల పారవేయుము. నా మాట విని రామచంద్రుని చూచుటకు వెళ్లుము. మమ్ము రక్షించుట కాధర్మసంపన్నుడైన రాముడు కొంచెమైనను దయచేయడా? ఆలస్యమెందులకు?" అని చెప్పగా ఆ త్రిజటుడు తన కట్టుబట్టకున్న చినుగులన్నియు రామచంద్రునకు కన్పింపకుండ దాగియుండునట్లు చుట్టుకొనుచు, అట్లు వీలుపడకపోవుటచే నట్లే రాముని యొద్దకు వెళ్లెను. మనసులో కొంచెమైనను సంకోచము లేనివాడై అంగిరసుడు భృగువు మొదలగు వారివంటి తేజస్సు గలిగిన త్రిజటుడు వెడలుచుండగ – శ్రీరామాజ్ఞ యట్లుండుటచే నైదవ కక్ష్యవరకును నతని నెవ్వరు వారింపరైరి. త్రిజటుడు రాజసుతుడైన రాముని దగ్గరగా వెళ్లి యిట్లనెను. "ఓ రాఘవా! నిఱుపేదను. దయ చూపుము. నేను వనమునందు ఉంఛవృత్తితో బ్రతుకుచున్నవాడను. చాలమంది పుత్రులు గలవాడను" అని చెప్పగా మందహాసముతో గూడిన ముఖాంబుజము గలవాడై రఘురాముడిట్లు పల్కెను. "ఓ పవిత్ర చరిత్రుడా! నా ఆవులలో నొక వేయి మాత్రమే మిగిలి యున్నవి. అందుచే నీవొక కఱ్ఱను చేతితో విసరుము. అది యెంత దూరమున బడునో అంతవఱకున్న ఆవులను నీకిచ్చెదను. నీ భుజశక్తి చూపింపుము" అనగా.. త్రిజటుడు కట్టుపంచెను పైకి దోపి, పైనున్న యుత్తరీయమును నడుమునకు చక్కగా చుట్టి బిగించి, ఆపై కఱ్ఱను కుడిచేత పట్టుకొని కాళ్లను ముందున కొకటియు వెనుక కొకటియు నుంచి, ప్రాణములను బిగబట్టి సంతోషముతో కఱ్ఱను విసరి

ఆవులలోనికి వేయగా, సరయూ తీరమున నున్న వేవేల యావుల వృషభముల యొద్ద బ్రాహ్మణుని చేతినుండి వెడలిన దండము పడగా రాముడు చూచినవాడై మిక్కుటమైన ప్రేమతో ఆ బ్రాహ్మణుని కౌగిట జేర్చుకొని ఆ సరయూ తీరమున గుమిగూడి యున్న యావులనన్నిటిని ఆ ముని ఆశ్రమమునకు తోలుకొని పొందని కాపరుల కాజ్ఞాపించెను. తరువాత జానకీపతి అతనితో "ఓ ద్విజవర్యా నిన్ను చూచి వేళాకోళము చేసితిని. నన్ను మన్నింపుము. నాపై కోపమును పొందకుము. ఎన్నరాని నీ తేజమును తెలిసికొనదలచి వేడుకగా అట్లు యాటాడితిని. ఇంక ధనము కొలదిగానే కలదు. నీకది యిష్టమేని కోరుకొనుము. ఇచ్చెదను. నా మాట నిజము. నా ధనము బ్రాహ్మణకోటి నిమిత్తమే సుమా! నీ బోటి మహాత్ములకు ధనమంతయు నిచ్చుటచే చెరగని కీర్తియు, గొప్పనైన తృప్తియు కలుగును" అని పల్కగా నతడామాటలచే సంతుష్టుడై నీకు యశమును, బలమును, సాటిలేని సౌఖ్యమును, వృద్ధియగునని దీవించి తన భార్యా పుత్రులతోను, పొందిన ఆవులతోను తన యాశ్రమమునకు వెళ్లెను. అప్పుడు రామవిభుడు సాటిలేని సత్యపరాక్రమముచేత సంపాదించిన ధనమును, ఆప్తులకు గౌరవ పూర్వకముగా, మనస్సంతుష్టిగా నిచ్చి బ్రాహ్మణులకు, స్నేహితులకు, సేవక సంఘమునకు, దరిద్రులకు భిక్షమెత్తి జీవించు వారలకు అందఱకును యథావిధిగా పూజించి కొల్లలుగా దానము చేసెను.



# ముప్పది మూడవ సర్గము

**సీతారామ లక్ష్మణులు తండ్రి యొద్దకు పోవగా చూచి ప్రజలు దుఃఖించుట:**

దానములచే నెల్లవారలను సంతుష్టులను చేసి రామ లక్ష్మణులు భూపుత్రియైన సీతాదేవితో తండ్రిని జూచుటకై బయలుదేరి శోభాకరములు చందన చర్చితములునైన సాధనములు భుజముల వ్రేలుచుండగా వెడలుచుండగా చూచి పురములోనున్న జనులు దుఃఖమును బొందినవారైరి. జనసమూహము గుంపులు గూడుటచే నిరకటమై యుండుటచేత మిద్దెలను మేడలను మేడల పైభాగములను ఎక్కి చూచుచుండిరి. గొడుగు పట్టుటకు సేవకుడొక్కడునులేక నడచుచున్న రాముని జూచి విచారించువారును, కట కటా యెంత దురవస్థ సంభవించెను రామునకని దుఃఖించువారును, లక్షణమైన చతురంగ బలములు వెన్నంటిరాగా వేంచేయునట్టి రామవిభుడు నేడు కాలినడకనే తమ్ముడు భార్యయు వెంటరాగా వెళ్లుచున్నాడేయని వెతజెందువారును సంపదల రుచినెఱిగియు, కోరికలు కోరువారికి ముదముగూర్చు రాముడు ధర్మముమీది గౌరవముచేత తన తండ్రి మాటను తీసివేయలేడయ్యెను. ఆకాశవీధులందు సంచరించు దేవతలైనను చూడరానటువంటి ఈ రాజకన్యయైన సీతను దారివెంటవెళ్లు సమస్త జనులును ఇప్పుడు చూచుచున్నారు గదా! హరిచందనము మేనియందు వెలుగుచుండగా మిక్కిలి ప్రకాశించుచున్న సీతను చూచి పురజనులు వెచ్చని చల్లని కన్నీటిని బొటబొట గార్చిరి.

**పౌరులు కైకేయీ దశరథులను నిందించుట :**

దశరథుని నేదో దయ్యమావేశించి యిప్పుడీ రీతిగా బలుకుచున్నది. ఇది

నిజము. ఎక్కడైన రాజు తన ప్రియపుత్రుని దుర్మార్గముగా నడవులకు బంపునా? ఒకవేళ కొడుకు గుణహీనుడైనను ఇట్లు పంపించవచ్చునా? లోకములను తన నడవడిచే గెలిచిన ఘనుడైన పుత్రు నీ ప్రకారముగా విడచునట్టి పురుష లెవ్వరైన నుందురా? ఎవ్వరికిని నొప్పి గలిగింపకుండుట, ప్రశస్తమైన దయ, శాస్త్ర చింతనానురక్తి, సత్స్వభావము, తొలగని యింద్రియ నిగ్రహము, నిండైనటువంటి చిత్తశాంతి, అను నీ యాఱును రఘురామునకు పెట్టనటువంటి సొమ్ములు గదా! అటువంటి పురుషోత్తముని, సుగుణములే భూషణములుగా గలవానిని విడిచిపెట్టు వారుందురా?" నీళ్లలో బ్రతుకునటువంటి జీవులు నీళ్లిగిరిపోయిన వేసవియందు నశించు విధముగా ఇట్టి ధన్యుడైన శ్రీరాముడు దూరముగా వెళ్లుటకు పూనుకొనగా జనులెల్లరు దురపిల్లిరి. "జగముల కధీశ్వరుడైన రాముడు విచారమును బొంద జగములెల్ల వగపొందునుగదా! కొండలమీద నుండు చెట్లకు వేరులు తెగిపోయినచో పువ్వులు పండ్లును గూడ నాశనము జెందును గదా. ధర్మము ప్రకారముగా నడచువాడును, గొప్పదైన తేజము గలవాడును నగు రాముడు వేరు. ప్రజలందఱు ఆకులు పుష్పములు కొమ్మలు పండ్లు గదా. రఘువంశ శ్రేష్ఠుడైన రాముని విడచియుండుట శక్యమా? ఈ తోటలును, ఇండ్లు, మడులు, దొడ్లు మనకేల? వీనినన్నిటిని విడచి లక్ష్మణుని వలె ముఖ్యులైన చుట్టములను భార్యలను వెంటబెట్టుకొని ఏ పూట రాముడెచ్చట నిలిచి యుండునో అచ్చటనే ఆర్తియందు సుఖమునందు ఒక్కటియై మనము నుండుదమా? మనము దాచుకొన్న నిక్షేపముల నన్నిటిని పెల్లగించినవారమై భవనములను ఇండ్లను పాడుపెట్టిన వారమై ధనమును ధాన్యమును మనవెంట తీసికొని మనమందఱము వెళ్లగా మన కులదేవతలు వీనిని విడచిపెట్టగా, చిమ్మువారలు లేకపోవుటచే దుమ్ములురేగుచు తీగెలు పాదులను ఇండ్ల గోడలను బ్రాకుచుండగా, పందికొక్కులు త్రవ్విన మట్టికుప్పలు నిండియుండగా, నెలుకలు తమ యిష్టమువచ్చినట్లుగా పరువెత్తుచుండగా, మంత్రములు గాని జపములుగాని హోమములుగానిలేక పాతపెంకులతో నిండి వన్నె తరిగినట్టి

మనచే విడువబడినట్టి యిండ్లలో మనసుదీరునట్లుగా కైక యింక తలగొట్టు కొనునుగాక! శ్రీరాము డుండు అడవియే శుభప్రదమైన పట్టణము. సీతాపతి లేకపోవుటచేతను మనము కూడ వదలిపెట్టుటచేతను ఇదియే గొప్పనైన యరణ్యము. ఇది నిశ్చయము. ఒక్కపట్టున నింతమందిమి వెళ్లిపోవుటచే వనములలోను గుహలలోను నివసించు ఏనుగులు సింహములు, పుట్టలలో నుండు పాములును, చెట్లయందు బొరియల యందును దిరుగు పక్షులును భయముజెందినవై పారిపోయి దూరమున పాడుపడియున్న యీ పట్టణము నందలి యిండ్లలో ఏ అపాయములేనివై సుఖముగా నివసించునుగాక! రాముని వెంట మనమెల్లరము నరణ్యమున కేగగా, తరువాత ఆ మాయల కైక తన గారాబు పుత్రుడును బంధువులును ఎల్లప్పుడు తనను సేవించుచుండగా మాంసము, గడ్డి, కాయలు భుజించు పశుపక్ష్యాదులపై కరువుదీరునట్లధికారము నెఱపుగాక.” శోకాధిక్యముచే నిట్లు పలుకుచున్న చూపరుల వాక్యములను వినుచు కొంచెమైనను వికారము చెందక దూరమున వెండికొండ వలెనున్న తన తండ్రి యొక్క సుందర మందిరమును జూచి సీతాపతి దానిని సమీపించి అక్కడనున్న వీరపురుషులను జూచి వారల బాధచే వికృతినొందనివాడై మందహాసముతో సుందరమైన వదనము గలవాడై సమీపమునందు మిక్కిలి దైన్యముతో నిలచియున్న సుమంత్రుని ఎక్కువైన అనురక్తితో బిలిచి, తండ్రిని జూచి యాజ్ఞనుగొని ప్రయాణము చేయదలచినవాడై యిట్లనెను.



# ముప్పది నాలుగవ సర్గము

## శ్రీరాముడు తమ రాకను తండ్రికి చెప్పిపంపుట :

"ఓ పవిత్రుడా! నీవు వెళ్లి నా రాకనుగూర్చి రాజునకు దెల్పుము" అనగా ఆ సుమంత్రుడు బాధతో కన్నులనీరు గారుచుండగా లోనికి వెళ్లి గ్రహణము పట్టిన సూర్యుని వలెను, బూడిద గప్పిన నిప్పువలెను, జలరహితమైన చెఱువువలెను నుండి దుఃఖ భారముచేత నివ్వెఱపోయి తన కుమారుడైన రామచంద్రుని పలుమారు తలచుచు విలపించు చున్న రాజును చూచి తానచంచలమైన భక్తితో నమస్కరించి తొలుత జయోక్తులతో ప్రస్తుతించుచు, ఈ వార్తనేమని చెప్పుదును? అని భయపడుచున్నవాడై ఏడ్పుచేత గొంతు జీరవోవగా మెల్లగా నిట్లు చెప్పెను. "ఓ రాజా! రామచంద్రుడిదిగో ద్వారము నందున్నాడు. బ్రాహ్మణులకును, సేవక సమూహములకును, పేదలకును సమస్త ధనములను ఇచ్చివేసి స్నేహితులకును బంధువులకును చెప్పి సెలవంది నీ యాజ్ఞనుగొని యడవులకు వెళ్లగోరిన వాడై వచ్చియున్నవాడు. ప్రేమతో మిమ్ములను దర్శించి యిక వనములకు వెళ్లును కాన కిరణములతో సూర్యునివలె, రాజగుణములతో తేజరిల్లుచు కొడుకును చూడవయ్యా!" అని చెప్పగా సముద్రమువలె గంభీరుడును, జనులచే మెచ్చదగిన ధర్మమార్గమందాసక్తి గలవాడును, ఆకాశమువలె నిర్మలుడును, సత్యమునే తలంచువాడును నయిన రాజు మంత్రిశ్రేష్ఠునితో నిట్లనెను. "ఓ సుమంత్రా! నా భార్యలనందఱను ఇచ్చటకు తోడుకొని రమ్ము. నేను భార్యలతో గలసియున్నవాడనై ధర్మమునందు స్థిరబుద్ధి కలిగిన శ్రీరాముని జూడగోరుచున్నాను. అనగా ఆ యాజ్ఞ ననుసరించి రాణివాసములకు వెళ్లి "ఆర్యలారా! రాజు మిమ్మందఱను వేగముగా దనయొద్దకు

రమ్మని చెప్పినా"దని తెల్పగా, ఆ రాజుపత్నులైన మూడువందల యేబది మందియు, నెఱ్ఱవాఱిన కన్నులతో విచారపడుచు, కౌసల్యతో గలసి దశరథుని యొద్దకు వచ్చిరి. అంతట రాజు సుమంత్రునితో రాముని పిలువు మనెను. సుమంత్రుడా మాటను రామునితో జెప్పగా లక్ష్మణుడును సీతయు దనవెంట రాగా రాముడు చేతులు జోడించుకొని రాజు నొద్దకు వచ్చెను. అట్లు వచ్చుచున్న సీతాకాంతుని ..

**దశరథుడు సీతారామ లక్ష్మణుల జూచుట :**

అంతంత దూరమునుండియే చూచి రాజు దుఃఖముచే నిండిన మనస్సు గలవాడై ఆసనము నుండి కడువేగముగా తన కాంతలతో పాటుగా రాముని దగ్గఱకు వెళ్లుటకై లేచెను. అట్లు లేచి రాముని యొద్దకు పరుగున వెళ్లబోయి వెళ్లలేక రాజు సగము దూరముననే దుఃఖాతిశయముచేత అధికముగా వచ్చిన కన్నీళ్లచే కనులు కనిపించనివాడై భూమిపై పడిపోయెను. నివారింపరాని యార్తితో భూమిమీద పడినట్టి రాజును చేరబోయిన వారై రామలక్ష్మణులు చేతులతో నెత్తగా "హా రామా! రామా! రామా!" యను స్త్రీల యొక్క హాహాకారములతోను వారి భూషణముల ధ్వనులతోను గూడినదై ఆ రాజభవనము నందు మహాధ్వని కలిగెను. రాముడును లక్ష్మణుడును రాజును తమ చేతులతో పొదివి పట్టుకొని సీతతో గూడ నేడ్చుచు మంచముమీద నెమ్మదిగా కూర్చుండబెట్టిరి. ఒక ముహూర్తము సేపూరకుండి రాజు మూర్ఛనుండి తేరుకొనగా చేతులు జోడించి తండ్రిని జూచి రఘురాముడు ఇట్లనెను. "ఓ తండ్రీ! మాకందఱకు రాజువు గదా! నీవీ ప్రకారముగా ధైర్యమును కోలుపోదగునా? నేను దండకాటవిని చేరబోయెదను. మా కనుజ్ఞను దయచేయు చల్లని చూపులతో చూడుము.

**శ్రీరాముడు సీతా లక్ష్మణులతో వనమునకు బోవ ననుజ్ఞ వేడుట :**

సీతయును లక్ష్మణుడును నాతో వచ్చుచున్నవారలు. మంచి మార్గమున నెంతెంతో తగిన కారణములతో నాచేతనయినంత వఱకు నిలువుడని చెప్పితిని.

నేనెంత చెప్పినను  తప్పక నాతో రావలెనని నిశ్చయించుకొన్నవారై యిచ్చట నిలుచుట కిష్టపడరైరి. కాన వారడవులకు వచ్చుటకు నేనంగీకరించితిని. నాయనా! నీవు దుఃఖమును వీడుము. నాకును, జానకికిని, లక్ష్మణునకును తొందరగా సెలవిప్పింపుము” అనగా రాజు కుమారునితో నిట్లు పలికెను. “ముందు తెలిసికొనలేక వరములిచ్చుటచేతను, కైక యొక్క మాయల వలలలో చిక్కుకొనుటచేతను ఇంతవఱకు వచ్చినది. ఓ తండ్రీ! రామా! ఇప్పుడే నా మాటను నిరాకరించినవాడవై యీ భూమిని సమస్తమును చేకొనుము. ఇది యథార్థము. నా మాట నాదరింపుము.” అనగా రాజును చూచి జనకాత్మజా హృదయేశు డిట్లనెను. “ఓ అనఘా! వెయ్యి యేండ్లు నీవు హాయిగా ఈ దేశము నేలుము. సుకృతములు చేసినవాడా! నా కొఱకై నీవబద్ధమును జెప్పనేల? అక్కటా! నేనే దండకావనములకు వెళ్లి సౌఖ్యముగా అచ్చటనే యుండెదను. తొమ్మిదియు నైదు సంవత్సరములు వనములందు సంచరించు చుండి ప్రతిజ్ఞ తీరిన తరువాత మరల వచ్చి ఓ తండ్రీ నీ పాదములను సేవించువాడను. ఇది యథార్థము సుమా! అనగా సత్యవాక్యములనెడు పాశములచేత బంధింపబడిన వాడై ఏకాంతమున భార్యచేత ప్రేరేపింపబడుటచేత దుఃఖమున మునిగినవాడై నిజతనయుడైన రామచంద్రుని జూచి రాజిట్లు పల్కెను.

## శ్రీరాముదరణ్యమునకు బోవ దశరథుడు సమ్మతించుట :

“ఓ కుమారా! ఇహలోకమున గొప్పదనమును, పరలోకమున నభ్యుదయమును ఇక భయములేని మార్గమున శుభములు గలుగునట్లుగా వెళ్లి మరల తొందరగా తిరిగిరమ్ము! ప్రఖ్యాతినందిన ధర్మశీలుడవు. గొప్పనైన సత్యమున నడచువాడవు. అట్టి నిన్ను మరల్చుట నాకు శక్యమగునా? రఘునందనా! నా కొక కోరిక కలదు. దానిని నీవు తీర్పుము. ఈ రాత్రి నాయొద్ద నుండుము. కానకిప్పుడే వెళ్లకుము. నీతో గలసియుండి ఒక్క పూట యయినను హాయిగా గడపెదను. నీ తల్లిని చూడుము. నీ తండ్రినగు నన్ను జూడుము. పుత్రా! మాకై మా మనసు రంజిల్లునట్లుగా మా ఆశ దీరునట్లుగా

ఒక్క దినమిట నిలువుము. నీకు సమస్తము నొసగి చూచి తృప్తిని బొందుదుము. నీ ప్రతిజ్ఞ చెల్లునట్లుగా వేకువనే నీ యిచ్చవచ్చినట్లుగా ప్రయాణము చేయుము. ఎంతో యిష్టములైన వానినెల్ల వదలి నీవడవులకు బోవ నిష్టపడితివి. ఓ సీతాపతీ! నా ప్రీతికై యెంతటి చేయశక్యముగాని పనికి పూనుకొంటివి నాయనా! నేను శపథము చేసి చెప్పుచున్నాను. నిజమునకు నేనొక్క పాపము నెఱుగను. నన్ను మోసము చేసి ఆ కుటిలురాలు మసికప్పిన యగ్నివంటిది, దోషముల రాశి, వంశ గుణములకు మచ్చ తెచ్చునది యగు కైక మోహముతో నింతపని చేసినది. అయ్యో! నీవు కూడ ఆ కైక యొక్క మాటనే నిలబెట్టనెంచితివి. ఏమి చేయుదును. ఇది యెంత గొప్ప పని? బుధులచే మెప్పు పొందినవాడా! నీవు పెద్దకొడుకువై యుండి ఎంత కష్టమైనను నాకసత్యదోషము కలుగనిత్తువా?" యనగా..

## శ్రీరాముడు తన మనోనిశ్చయము తండ్రికి జెప్పుట :

జనకుని ఆర్తాలాపములను విని తనువు తపించిపోవుచుండగా దీనుడై రాముడు తమ్మునితో గూడి తండ్రితో నిట్లనెను. "ఓ భూపాలా! నీవంటి వానికిట్లు సంతాపమును బొందుట తగునా? నేడు నీవిచ్చెడు శ్రేష్ఠమైన పదార్థములను రేపు నాకెవ్వరిత్తురు? అందువలన నేను వానిని కోరను సుమా. ఇంతకు మునుపు నీవు నాకొసగిన పదార్థములకు మాఱుగా తగినట్లుగా నేను నీవు చేసిన శపథమును వ్యర్థము చేయక యెట్లైనను సార్థకము చేయనిమ్ము. వనమున కరిగెదను. పంపించుము. ఓ అనఘా! నేను వనవాసము చేయుటకు అంగీకరించితిని. నా నిశ్చయము తప్పదు. ఈ జగత్తులో నున్న ధనధాన్యములతో గూడుకొన్న యైశ్వర్యమునంతను నీవు కైకకు చెప్పినట్లుగా భరతున కందజేయుము. నీ వాదేశించినట్లుగా నేను పదునాలుగేండ్లు వనవాసమున నుండెదను. ఓ రాజా! నేను సౌఖ్యముల కొఱకై ఈ రాజ్యమునకు రాజుకావలెనని కోరలేదు. నీవే అట్లు చేయుట తగునని యాదేశింపగా అట్లేయని యియ్యకొంటిని నీ యాజ్ఞ నెరవేర్చుటకే రాజ్యము నంగీకరించితిని. విచారమును మానుము. ఈ ధరణీమండల మెల్లను కైక కుమారున కిచ్చివేయుము. రాజ్యమునుగాని

భోగములనుగాని సౌఖ్యములనుగాని నే నొల్లను. నా యాజ్ఞను తీర్చెదను. హృదయమున దుఃఖమును మానుము. కన్నీరు నింపకుము. సముద్రు డెన్నడైనను కలతజెందునా? సత్యముగా నీయెదుట నే నొట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. నీ వెట్టులైనను సత్యవాది వగుటయే నేను మనసున గోరెదను. రాజ్యమాదిగా గల సౌఖ్యములను గోరను. ప్రియకాంతయైన సీతనైనను ఒల్లను. ఎట్టెట్టి కోరికలను గూడ నొల్లను. స్వర్గమును గూడ నొల్లను. ప్రాణములనైన నొల్లను. ఓ తండ్రీ! ఒక్క నిమిషమైనను నేనిచ్చట ఆలస్యము నింక చేయరాదు. నీ కన్నులతో జూచి దుఃఖమును బొందకుము. నా మాట నిజము. వేఱు విధముగా జరుగదు. కైకేయి నన్ను పండ్రెండును మఱి రెండు సంవత్సరములు ఘోరమైన యడవులలో నుండునట్లు మొదట గోరినది. అందుకు నే నొప్పుకున్నాను. ఆ సత్యమును నెరవేర్చెదను. అనేకములైన పక్షులచేతను మృగముల సమూహములచేతను నిండియున్న యరణ్య భూములందు నివాసము గావింతును. జనకా! ఎందులకు వగచెదవు? ఓ తండ్రీ! దేవతలకైనను తండ్రియే దైవమనుచు చెప్పగా విని యుండుటచే నీవు నాదైవమని తలచి నీ వాక్యము చేయదలచినవాడను. ఏల బాధ నొందెదవు? తండ్రీ పదునాల్గు సంవత్సరము లడవులలో గడపివచ్చిన తరువాత నీవు నన్ను జూడవచ్చును. నన్ను కృతార్థుని జేయుటకు నీవు శోకమును వీడి నన్నిప్పటికి వదలిపెట్టుము. నీవు వగపును జెందుట చూచిన వారై నా తల్లులు మున్నగు సర్వజనులును కనులవెంట నీరు గారుచుండగా కనుబొమలు ముడిచి వికృతములైన ముఖములతో బాధను చెందుచున్నవారలు. వారినింక ఊరడింపవలసినది నీవేకదయ్యా! ఇట్లు నీవే వగపు నొందిన నింక ఎవరూరడించువారు? నేను వెళ్లివచ్చెదను. ప్రీతితో భరతుని రాజుగా జేయుము. నేను వెళ్లినంతనే పట్టణములు పర్వతములు వనములు గల భూమినంతను – బారులుతీరి పౌరులందఱు తనను భక్తితో సేవించుచుండగా నేయాటంకము లేకుండగా నేలుకొనుగాక. నేను నీ మాటను నీ కోర్కెను తీర్చెదను. నా కోసమై యింత కఠినముగా బాధనొందెద వెందులకు?

ఇక నన్ను పయనింపనిమ్ము. బుద్ధిమంతు లందఱును మెచ్చు నట్లుగా దేవర యొక్క యానతిని నియమముతో దీర్చుటకై నేను కోరినట్లు, ఈ మేలైన భోగములను కోరను సుమా. ఓ రాజా! నాకై నీవిట్లు బాధను బొందనేల? నిన్నబద్ధము లాడించినవాడనై నేను రాజ్యమును సౌఖ్యమును ప్రాణములను కోరుదునా? అక్కటా సీతయైన నాకేల? నీ సత్యవ్రతమే ఎచ్చటనైనను నిలుచుగాక. తండ్రీ! ఇంక పలుమాట లెందులకు? ఫలములు కందమూలములు చెట్ల యాకులు ముఖ్యమైన యాహారముగా కొండలను నదుల యొక్క అందమును చూచుచు దండక యని ప్రఖ్యాతి జెందిన యడవిని బ్రవేశించి కల్పవృక్షముల వంటి వృక్షముల నీడలలో సౌఖ్యమును బొందుచు నుందును. ఇక్కడ నీకును సౌఖ్యము కలుగుగాక!" అని చెప్పగా, శోకము చేతను, తాపము చేతను కలతజెంది దశరథుడు తన కన్నకుమారుని నాలింగనము చేసికొని ప్రాణములు లేనివాని మాదిరిగా చేష్టలుడిగి భూమిపై బడెను. హాహాకారములు చేయుచు రాజుయొక్క ప్రియపత్నియైన కైక తప్ప తక్కిన భార్యలందఱు దుఃఖములో మునుగగా, సుమంత్రుడు గూడ విపరీతమైన వ్యామోహముతో మూర్ఛనందెను. ఇతర స్త్రీలందఱును వారింపరాని వ్యథను జెంది హాహాకారములు చేయుచుండగా మూర్ఛదేరిన సుమంత్రుడు గొప్పదైన కోపమును పొందినవాడై యిట్లనెను.



# ముప్పది యైదవ సర్గము

**సుమంత్రుడు కైకను దూషించుట :**

పటపట పండ్లు గీటి విసురుగా చేతులను విదల్చుచు, కన్నుల నుండి బొటబొట నిప్పులు రాలుచుండగా, శరీరము సొంపు చెడగా, వేడి నిట్టూర్పులు విడచుచు, చిటపట లాడుచు, రాజు యొక్క మనసు తెలిసినవాడు గాన కైకేయికి పటపట గుండెలు బ్రద్దలగు నట్లుగా, మాటలనెడు బాణములచేత హృదయము బ్రద్దలగునట్లుగా, మాటల పోటులచే మర్మములు తెగునట్లుగా దుర్గర్వపు నడవడిగల కైకతో నిట్లనెను. "ప్రాణవిభుని, జగత్తున కంతటికిని ప్రభువును, దయకు నిలయమైన వానిని, అజపుత్రుని విడచిపెట్టగలిగిన దానవు. నీకు ఈ భూమియందింక చేయశక్యముగాని కష్టపుపని యొక్కటియైన నుండునా? నీవేమి యాడుదానవు? రాజు పర్వతమువలె చలింపనివాడు. ఇంద్రునివలె ఎవరును గెలువలేనటువంటి దుర్జయుడు. సముద్రము వలె కలతజెందనివాడు. అట్టి యీ బలవంతుని నీ యొక్క కుత్సితములైన చేష్టలచే భంగపరచితివి. నీవెంత జాణవే. నేను నిన్ను భర్తను చంపుదానవని భావించుచున్నాను. ఓ చెడుదానా! అంతేకాదు కులమునే నాశనము చేయుదానవు గదా! కోటిమంది కొడుకులున్నను స్త్రీకి భర్త ననుసరించుటయే శుభకరము. నీ మగడు నీయందు ప్రేమగలవాడు. ఓ యువిదా! అట్టివానిని నీవు విడువ కుండగా ఈ ప్రకారముగా బాధించుట తగునా? రాజు గనుక చనిపోయినచో వయసులో పెద్దవాడైన కొడుకు రాజ్యముచేయుట ధర్మము. అటువంటిది ఈ రాజు బ్రతికియుండగనే ఆ ధర్మమును పాడుచేయుటకు నేడు చూచుచున్నావు. నీ కొడుకే ఈ ధరణిని తీసికొననీ. ప్రభుత్వమును పొందనీ. నిశ్చయముగా లోకులమందఱము

రామచంద్రుడిష్టముతో నెక్కడ సంచరించునో అచ్చేటనే ఆనందమే సంపదగా కలవారమై సంచరించెదము. సజ్జనులును, ఆర్యులును, బుద్ధిమంతులును ధర్మమును దప్పిన ఈ రాజ్యములో ఏ విధముగా నివసింపనేర్తురు? ఇట్టి నీ యొక్క చరిత్రకు రెండుగా భూమి ఎందుచేత చీలకున్నదో! గొప్పవారైన మునులందఱును రాజు యొక్క కుమారుని నిక్కట్టుల బెట్టు నిన్ను ఛీ! ఛీ! యని తిట్టకుండెదరా! గొడ్డలిచేత మామిడి చెట్టును నరికివేసి వేమును పాతి పాలుపోసి పెంచినను తీపుగానుండునా? నీ తల్లివలెనే నీవును ప్రవర్తించు చున్నావు. ఓ వనితా! వేము నుండి తేనెలు స్రవించునా? నీ కన్నతల్లి యొక్క అవగుణములను పూర్వము విని యున్నారము. ఇప్పుడు నీయందు చూచినారము. ఓ కైకా! స్వభావగుణముల నెట్లు దాచగలము. నీ తల్లి యొక్క కథ యెఱుగమా? ఎవ్వడో యొక సిద్ధుడు నీ యొక్క తండ్రికి మృగములు మాటాడు భాష తెలియు నేర్పు గలుగునట్లుగా వరము నీయగా, ఆ వరము మహిమచే నతడు మృగభాషల నెఱుగుచుండి యొకనాటి రాత్రి పాన్పుపై శయనించి యుండగా బంగారు చాయ కలిగి ప్రకాశించు చీమ యొక్క మాటకు గొల్లున నవ్వెనట. అంతట నీ తల్లి కోపముతో నతనిని జూచి యెందులకు నవ్వితివో చెప్పుమనగా "ఓ దేవీ! నేనా మాటలు చెప్పరాదు. చెప్పిన వెంటనే నేను మరణము పొందువాడ"నని నీ తండ్రి చెప్పెను. అతని మాటలను విని నీ తల్లి "నన్ను వేళాకోళము చేయుదువా? ఏల నీకింతటి పరిహాసము. చావుము.. బ్రతుకుము.. లేక యేమైనను గమ్ము. చెప్పక విడువను" అని నీ తల్లి పలుకగా అతడు తనకు వరమునిచ్చిన ఆ సిద్ధున కీ విషయమును దెల్పగా ఆ సిద్ధుడు "రాజా! ఆ పడతి పాడైనను చచ్చినను సరియేగాని నీవీ విషయమును చెప్పకు" మని చెప్పగా నీ తండ్రి యా దుష్టురాలిని వదలివేసి హాయిగా కుబేరుని వలె నుండెను. ఎల్లప్పుడును చెడ్డచేయుటలో నీ తల్లి యంతటిదానవు నీవు మాత్రము కావా? దుర్మార్గులు నడచు దారిలో చెడు విషయమున ఓ పాపురాలా! నీవు ఇప్పుడు రాజును బాధించుచున్న దానవు. తల్లి పోలిక కుమార్తెకును, తండ్రి

పోలిక పుత్రునకును సంభవించునని చెప్పు సామెతలు సత్యమే సుమా! జనులు వినునట్లుగా ఈ రాజు పల్కిన మాటలను సాగనిమ్ము. నీ తల్లివలె చరింపకుము. భర్తకు సమ్మతముగా నడువుము. పౌర సంఘమున కంతటికి సంతోషము కలుగునట్లుగా శరణమగుము. అధర్మమును చేయించి, యింద్ర సమానుడును లోకాధీశుడునయిన నీ భర్తను బాధపెట్టవద్దు. వరములు వ్యర్థములైపోవునని తలపవద్దు. ఓ వారిజనేత్రా! ఈ రాజు నీకింతకంటె గొప్పవైన సంపదలను సమకూర్చును. అద్భుతమైన బలము గలవాడును, పెద్దవాడుగా పుట్టినవాడును, జనులను రక్షించువాడును, స్వధర్మ రక్షకుడును, మిక్కిలి యుదారుడును నయిన రామచంద్రుని పట్టము గట్టుకొన నిమ్ము. ఓ కైకేయీ! నీ మనసు నందాలోచించి చూడుము. రాముడు తండ్రిని విడచి యడవులకు వెళ్లినచో స్థిరముగా నీకీ యపవాదము జగత్తునందు నిలిచియుండును సుమా! ఓ భామినీ! రాము దరణ్యములకు వెళ్లినచో నీ పట్టణమున నంతటివాడు ఉండబోడు. కనుక రామునే ఈ రాజ్యమును పాలింపనిమ్ము. రాముడు యువరాజయి ప్రకాశించినచో రాజు పూర్వ రాజుల చరిత్రలను మనస్సునందు తలంచి స్వేచ్ఛగా తపస్సు చేసికొనుటకు వనములకు వెళ్లగలడు!" ఈ విధముగా న్యాయయుక్తము గాను, కఠినముగాను, మనస్సు కలతజెందు నట్లుగాను, చేతులు జోడించియు, గొప్పవాడైన సుమంత్రుడు పల్కినను, కైక కలతజెందదు. కొంచెము కూడ మనస్సున నొచ్చుకొనదు. ముఖమునందు వికాసమును కోల్పోవదు. కోపమును కొంచెము కూడ విడచిపెట్టదు. ఆమె గయ్యాళియై తన కోరికనే నెరవేర్చుకొన దలచెను.



# ముప్పది యాఱవ సర్గము

## దశరథుడు శ్రీరామునితో సైన్యాదులు పంప సుమంత్రునితో జెప్పుట :

కైక యొక్క ముఖము ప్రసన్నముగా నుండకపోవుటను జూచి రాజు కనుల వెంట నశ్రుధార లొలుకుచుండగా పైకే చాలగా వెలువడుచున్న నిట్టూర్పులతో తాను ఇచ్చిన వరములను తలంచినవాడై సుమంత్రునితో నిట్లనెను. "ఓ సూతా! సీతాపతితో పాటుగా వెళ్లుటకు తొందరగా రత్నములతోను, శస్త్రాస్త్ర సమూహములతోను గూడిన చతుర్విధములైన సేనా సమూహములను సిద్ధము చేయింపుము. జాణలైన వేశ్యలను, రాముని సేనలకు కావలసిన వస్తువుల సముదాయములను సమకూర్చునట్టి ధనవంతులగు వర్తకులను రామునితో వెళ్లుటకు సిద్ధము చేయింపుము. రాముని నాశ్రయించుకొని యున్నవారిని, సాముగరిడీలతో రామచంద్రుని మెప్పును బొందిన మనుష్యులను – వారి వారికి ఇష్టము వచ్చినన్ని బంగారము మొదలగు వస్తువలనిచ్చి రామునితో బంపించుము. ప్రఖ్యాతముగా ఆయుధములతో జీవించువారిని, బండ్లను పౌరులను, వనములలో సంచరించు బోయలను చెంచులను రామవీరుని వెంట బంపుము. ఏనుగులను, మృగములను బట్టి చంపుచు, అనేకములైన నదులలో స్నానము చేయుచు, కమ్మనైన తేనెలను త్రాగుచు, గొప్పనైన రాజ్యమును మరచిపోయి అచ్చట నా పుత్రుడు నివసించును. మనుష్యులు సంచరింపని యా వనములలో సంచరించు రామచంద్రునితో నాకున్న ధన ధాన్యములనెల్ల నా కొడుకు సుఖించుటకై పంపించుము. మంచివైన స్థలములయందు యథావిధిగా అనేక యజ్ఞములను జేయుచు మునులకు బ్రాహ్మణులకు

ఎల్లవారలకు గొప్ప దక్షిణలనిచ్చి సంతోషమును గలుగజేయుచు దివ్యులైన మహర్షులతో ప్రసంగించుచు ఏ కీడును నించుకైనను బొందకుండ వనములలో హాయిగా సంచరించుగాక! భరతుడీ ధరణీరాజ్యము నీ పట్టణమునందే యుండి సకల విధములైన భోగములతో మిక్కిలి సంతోషముతో నేలుచుండుగాక! రామచంద్రుడు వనములకు వెళ్లుటకుగాను తొందరగా సిద్ధపరచుము" అని భూపతి చెప్పగా కైకేయి భయముచేత కలతజెందినదై మొగమంతయు వాడిపోగా, కోపముతోను, విషాదముతోను కంఠము గద్గదముకాగా, నాల్క తొట్రుపడు చుండగా రాజు ముఖమునట్లే చూచుచు, "ఓ సజ్జనుడా! సారముగ్రోలగా మిగిలిన మద్యము వంటిదగు పాడుపడిన రాజ్యము జనులు లేనిది నా కుమారున కెందులకు?" అని సిగ్గును విడచిపెట్టి క్రూరత్వమును మనస్సున నింపుకొని మాటాడుచున్న కైకను జూచి "ఓసీ! యెగ్గులమారీ! ఎత్తరాని మోపు నెత్తిమీద కెత్తియు మరల నీ విధముగా బాధపెట్టెద వటే! ఓ చెనటీ! మునుపివి యడిగినావా? ఎక్కువైన ఈర్ష్యతో మంకుపట్టు పట్టి యిప్పుడీ మాదిరిగా నడిగెదవా?" అని బాధతో పల్కుచున్న రాజును చూచుచు కైక రెండింతలగుచున్న కోపముతో నిట్లనెను. "ఓ రాజా! నీ వంశమునందు బుట్టిన సగరుడు తన పెద్దకొడుకగు నసమంజసుడను వానిని పంపించివేసి మంచి కీర్తిని పొందెను. ఆ ప్రకారముగా రామచంద్రుడు కూడను వట్టి చేతులతో వెళ్లుటయే నాకిష్టము." అని రాజు ఛీఛీ యనుటను గాని, విన్నవారలు అయ్యారే! యని సిగ్గుతో తలలు వంచుకొనుటనుగాని కైకేయి లెక్కింప దయ్యేను.

**సిద్ధార్థుడు కైకకు బుద్ధి చెప్పుట :**

ఆ సమయమున రాజు యొక్క మన్నన గలవాడును, పుణ్యశీలుడును నయిన సిద్ధార్థుడను వృద్ధమంత్రి యిట్లనెను. "ఓ కైకేయీ! తెలిసినదానివలె నెందులకు మాటాడెదవు? ఆ యసమంజసుడెందులకు వెడలగొట్టబడెనో ఆ

విధమును చెప్పెదను వినుము. ఆ యసమంజసుడీ పట్టణమున పిల్లలాటలాడు కొనుచున్నప్పుడు వారిని సమీపించి వారిని గట్టిగా పట్టుకొని గోలపెట్టుచుండగా సరయూ జలములలో పడవైచి యా పసికూనలు మునుగుచు తేలుచు కొట్టుకొనుచుండగా ఓహో! యని కేకలు వేయుచు వేడుకపడుచు బుగ్గలు పైకి లేచునట్లు సంతోషించెడువాడు. దుష్టుడైన యతనిని జూచి నగరమున నున్న జనులెల్లరు గోపమును పొంది ఆ రాజును జూచి 'ప్రజలను గాని నీ కుమారుని గాని యీ పట్టనమునుండి పంపివేయుము' అని పల్కగా వారిని జూచి రాజు 'మీరిట్లు పల్కుటకు కారణమేమియో వివరింపు'డని యడిగెను. వారును 'ఓ రాజశ్రేష్ఠుడా! ఏమి చెప్పమందువు? వికటముగా విరుద్ధముగా ప్రవర్తించు నీ కుమారుడు ఆడుకొనుచున్న ఊరివారి పిల్లలను గిలగిల కొట్టుకొనుచుండగా తీసికొనిపోయి వేగముగా సరయూనది జలములలో బడవేసి వారు మరణించుచుండగా వేడుకతో చూచుచుండెను' అని విన్నవింపగా రాజు ఆ ప్రజలను సంతుష్టిపరచుటకై తన కుమారుని నతని భార్యతో సహ అడవులకు బంపించెను. అతడును చచ్చిపోయెడుదాక ఒక కఱ్ఱను గంపను తీసికొని ఘోరమైనటువంటి యడవులలో దిక్కుదిక్కున సంచరించుచు కందమూలములు ఆకులు భుజించుచు జీవితము గడపెను. ధర్మాత్ముడైన సగర చక్రవర్తి పాపియైన తన కుమారుని విడచెను. ఓ కైకా! చెప్పుము. ఈ విధముగా నడవులలోనికి నెట్టుటకు రామభద్రుని యందేమి పాపమును గనిపెట్టితివి. ఓ భామినీ! శత్రురహితుడైన రామునియందు మే మొక్క దోషమునైన నెఱుగము. చంద్రుని యందు బురదయంటునా? రామునియందే దోషమునైన నీవు చూచియున్నచో చెప్పుము. ఇప్పుడే రాముని భయంకరములైన యడవులకు బంపించవచ్చును. ఊరక యింత పెంకెతన మెందులకు? ఓ వక్రగమనురాలా! సాధువైన వానిని, సన్మార్గమున చరించువానిని నిష్కారణముగా ఆపదలపాలు చేయుటచే తప్పక

ధర్మహాని కలుగును. అది ఇంద్రుతేజమునైనను తెగకాల్చివేయును. కావున ఈ రాజ్యలక్ష్మిని రాముడు పొందుచుండగా విఘాతమును చేయకుము. ఇంక ఈర్ష్యను మానుము. నిష్కారణముగా ఏల యాపద కొనితెచ్చెదవు. ఓ రాజపత్నీ! రాజ పద్ధతికి భంగము రానీయకుము. అపనిందను బాపుకొనుము" అని చెప్పగా విని కైకను జూచి రాజు మిక్కిలి ఆర్తిని పొందినవాడై యిట్లు పల్కెను. "ఓసి పాపిష్ఠురాలా! ఈ మాటలెల్ల నీకు రుచింపవుగదా. నాకును, నీకును మేలగు పద్ధతిని ఆలోచింపలేవు గదా. లోభము గలదానవై దుర్మార్గములగు దారులను త్రొక్కెదవే! నీచపు చేతలను మానవుగదా! దుర్మార్గమును బూని అందఱను బాధపెట్టెదవేల? నీవును నీ కుమారుడును శాశ్వతముగా ఈ రాజ్యాధిపత్యమును నెత్తిన గొట్టుకొనుడు. ఓసి దురాత్మురాలా! సుఖమును, విత్తమును, రాజ్యాధిపత్యము దిగవిడచి రాముని వెంట అడవులకు వెళ్లెదను. నీ యొక్క ఈ వికటమైన ఆధిపత్యమును ఒక్కపూటయైనను చూడగల్గుదునటే?"



# ముప్పది యేడవ సర్గము

## కైక సీతారామ లక్ష్మణులకు నారచీర లిచ్చుట :

మంత్రియును, తన జనకుడును పలికిన వాక్యములను విన్నవాడై గొప్ప వినయము గలవాడును, చలింపని ధైర్యము గలవాడును అయిన రామచంద్రుడు ప్రకాశించెడు భక్తితో తండ్రిని జూచి యిట్లనెను. "సర్వసుఖములను విడచిపెట్టి సర్వసంగములను వదలి దండకాడవులలో సంచరించుచు వేరులు వెల్లకులు తినుచు కాలము గడుపుకొననున్న నాకు మీరందఱు వెంట వచ్చుటవలన నేమి ప్రయోజనము? నీ కెందులకిట్టి భ్రాంతి? ఏనుగును దానముచేసి త్రాడు కోరుట తగిన పనియా? నావెంట నీవు సైన్యములను పంపనేల? కైకేయి యానందించునట్లుగా నేనే వాటిని భరతునకు జేర్చెదను. తండ్రీ! అవి యన్నియును నా కెందులకు? వేగముగా నారచీరలను, గంపను, గడ్డపాఱను తెప్పింపుము. నేను సొంపుగా పదునాలుగేండ్లు అడవులలో నుండెదను." రాముడిట్లు పల్కగానే విని యెక్కువైన సంతోషముతో కైకేయి సిగ్గును బిడియమును మనసున బొందక తానే నారచీరలను తీసికొనివచ్చి వీనిని గట్టుకొనుమని రామున కందించెను. ఈ ప్రకారముగా కైక తన చేతులతో నిచ్చిన నారచీరలను తీసికొని పట్టువస్త్రములను విడచి సంతుష్టితో నారచీరలను రాముడు ధరింపగా తరువాత లక్ష్మణుడును తండ్రి చూచు చుండగా చివాలున వానిని గైకొని మనసునందు కలత తీరునట్లుగా తానును ధరించెను. పట్టుచీరలు ధరించియున్న జనకరాజు కుమార్తెకు కైకేయి యీ బట్టలను ధరింపుమని యీయగా ఆ పూబోడి సిగ్గును, బాధయు వ్యాపింపగా ఆడుజింక వలను చూచినట్లై వానిని దానట్లే చూచుచు భీతిని పొందినదయ్యెను. తరువాత ఆ ధర్మజ్ఞురాలు వానిని తీసికొని చింతతో ఏమి చేయవలెనో తెలియక తాను

మదిలో చింతను పొంది బాష్పములతో నిండిన కనులు గలదై గంధర్వ రాజునుబోలిన హృదయేశ్వరుని జూచి మునిజనులు వనములలో నెట్లు కట్టుకొనెదరో ఈ నారచీరలను అని వానిని అటు నిటు త్రిప్పి – ఎట్లును కట్టుకొనలేక భ్రాంతినందెను. మఱియును ఒక చీరను తన మెడయందు వేసికొని మఱియొక దానిని చేతబట్టుకొని యేమియు జేయలేక సిగ్గుతో నిలువగా చూచి రామచంద్రుడా నారచీరను తాను తీసికొని ఆమె కట్టియున్న పట్టుచీరపైనే తగిన విధముగా నారచీరను ధరింపజేసెను.

**సీతను దోడ్కొనిపోవలదని రాజకాంతలు శ్రీరాముని ప్రార్థించుట :**

రాముడు తనంతట తన ప్రియభార్యకు చీరలను కట్టగా చూచి అచ్చట స్త్రీలు చిడిముడిపడుచు తమ కన్నులలో నీళ్లునిండినవారైరి. "ఓ రామా! ఎవ్వరు సీతాదేవిని అడవులకు వెళ్ళమని చెప్పిరి. ఎందులకీ జానకిని తీసికొనివెళ్ళెదవు? మా మాటలు వినవయ్యా! ఆమెను తీసికొనివెళ్ళ వలదయ్యా! జనకుని యొక్క నిర్బంధముచేత వనములకు నీవు వెళ్ళగా, నాయనా! నీకుమారుగా ఎల్లప్పుడు నీ సీతనైనను మేము చూచి యూరడిల్లు నట్లు చేయవయ్యా! తమ్ముడును నీవును తోడుగా వనములలో దిరుగుటకు వెళ్లుడు. సుకుమారియు, బాలిక యును, ముగ్ధయును, మృదువైన శరీరము గలదియునగు నీమె వనములలో మునులవలె ఎట్లు కష్టపడగలదయ్యా పుత్రా! ఓ తండ్రీ! వినవయ్యా! మా మాటలను. జానకినిచ్చట విడచి వెళ్ళుము. నీవు గూడ ప్రేమతోనిచ్చట నిల్చుమను మా మాటను ధర్మబుద్ధితో నీవు స్వీకరింపవుగదా!" అని అచ్చటనున్న రాజకాంతల యొక్క మాటలను వినుచు వారి మాటలను లెక్కచెయ్యకుండగా నారచీరలను తన సమానమైన నడవడిగల సీతకు కట్టెను.

**సీత నారచీరలు కట్టగూడదని వసిష్ఠుడు నిషేధించుట :**

అట్లు నారచీరలు కట్టుకొనుచున్న సీత నాపి వసిష్ఠ మహర్షి ఆ క్రూరమైన నడవడి కలిగిన కైకను జూచి కోపముతో నిట్లనెను. "వంశమును నాశనము

చేయుదానా! చెడు నడవడి గలదానా! ఓ దుష్టురాలా! మోసగత్తెవలె రాజును మోసము చేసి నీవు మాట నిలుపుకొనకున్నావేల? రాముని భార్యయైన సీత రామునివెంట అడవులకు వెళ్లుటకు వీలులేదు. పట్టపుదేవిగా భర్త యొక్క సింహాసనము నెక్కుగాక. గృహస్థాశ్రమము నాశ్రయించి యున్నవారికి భార్యయే ఆత్మయగును గదా. కావున రామునకు మారుగా సీతయే ఈ భూతలము నంతయు నేలుచుండుగాక. అట్లుకాదని జానకీదేవి పట్టుపట్టి భర్తవెంట వెళ్లినచో మేమందరమును తోడ వెళ్లువారమే. పట్టణమంతయు రామభద్రునితో వెడలును. రాఘవుడు భార్యతో గలిసి వెళ్ళెడుచోటికే దండనాయకులందఱును తమ ధనములతో దాస జనముతో బండ్లు మొదలగు వాహనములతో బయలుదేరి వెళ్ళుదురు. తన యగ్రజు డెక్కడ నుండునో యా వనమునకే నీ కుమారుడగు భరతుడు తమ్మునితో గూడి జింక చర్మమును నారచీరలు ధరించి మౌనివేషము దాలిచి వెళ్ళును. అంతట రాజ్యము పాడగును. లోకమునకహితము నప్రియము నొనరించుదానా! ఆ పిమ్మట సమస్తమును స్వీకరించి నీ యధికారమునంతయు నిశ్చింతముగా చెట్టు చేమలమీద చూపింపుము. ఓ కామినీ! రాముడు పాలింపకున్నచో నది రాజ్యము కానేరదు. శ్రీరాముడు నిలిచినచో వనమైనను స్థిరముగా శ్రీలు విలసిల్లు రాష్ట్రమగును. ఇది యథార్థము. తనకు ప్రేమపూర్వకముగా తండ్రి యీయని రాజ్యమునకు భరతుడెట్లర్హుడగును? ఆ మాట యట్లుండనిమ్ము. నీ కుమారుడు ఈ రాజునకు గనుక పుట్టినవాడైన నిన్ను తన తల్లిగా తలప నంగీకరించునా? నా మాటను తెలిసికొనుము. నేల నుండి ఆకాశమునకు నీవెంతగా మిడిసిపడినను, భరతుడు తండ్రి కులాచార ధర్మము తెలిసినవాడు ఓ మిటుకులాడీ! ముప్పుదెచ్చు విధముగా ధర్మము నేల తప్పి నడచును? కొడుకునందుండు ప్రేమచేత వానికి ఇడుములను గొని తెచ్చితివి. ఇది నీకు తెలియదా? భూమిపై రాముని సేవింపని జడుడు ఒక్కడైనను లేడు సుమా. ఓ కైకా! యిది నిజము. ఓ కైకా! నీవిపుడే చూచెదవుగాక.

భూమియందు గల గొడ్లును జనులును, పాములును పక్షి సంతతులును పట్టణమును వీడి రఘురాముని వెంబడి వెళ్లును. చెట్లును పండ్లతో, చివురులతో, పుష్పములతో కూడ రాముడు వెళ్ళు మార్గమునకు అభిముఖములగును. ఓ కైకా! భూషణములనిమ్ము. కోడలి నుండి నారచీర లను తీసికొనుము" అని యా మునిశ్రేష్ఠుడు నారచీరలును గట్టనీయక కైకతో మరల నిట్లనెను. "రాముని నొక్కనినే గదా నీవు వనవాసము చేయగోరితివి! ఈ సీతతో నేమి పని? పాపచింతనము కలదానా! స్త్రీలలో నుత్తమురాలైన సీత తన నాథునితో నెప్పటి మాదిరిగా అలంకారములతో శ్రీ విలసిల్లుచు అందము తరుగక అన్నిటితోగూడి వెడలుగాక! రథములును, అందమైన వస్త్రములును, అలంకారములును, దాసీజనములును, ఇంకను తక్కిన వైభవములును కూడిరాగా సీత తన భర్తతో వెళ్ళును. వరములిచ్చు సమయమున నీ కాంతారత్నమగు సీత నారచీరలు ధరించవలెనని ఓ తరుణీ! నీ వడుగలేదు గదా! ఈ విధముగా త్వరత్వరగా ఈ సీతకు నారచీరల నెందుల కిచ్చితివి?" అని ఈ ప్రకారముగా గురువును బ్రాహ్మణ ముఖ్యుడును అగు వసిష్ఠుడనుచున్న మాటలను మనసున నుంచక సీతాదేవి తన భర్త వెళ్లెడి మార్గమునే యనుసరింపదలచిన దగుటచే నారచీరలను సంతోషముతో ధరించెను.



# ముప్పది యెనిమిదవ సర్గము

## సీతకు నారచీరలిచ్చుటకు దశరథుడు కైకను నిందించుట :

ఆ చీరలను సీతాదేవి మంచిబుద్ధితో ధరింపగా ఎల్లజనులును పరుషములైన వాక్యము లతో ఛీఛీ యని దశరథుని దూషించుచు ఏడ్చుచుండగా, ఆ ధ్వని భరింపరానిదయ్యెను. దానిని దశరథుడు విని శరీరముపైనను కీర్తిపైనను ధర్మమునందును శ్రద్ధను మాని మిక్కిలి దుఃఖముతో గైకను జూచి “సీత యీ నారచీరలను ధరించి వనములకు వెళ్లరాదు. ఇది యథార్థము సుమా! ఈ సీత చిన్న పిందె వయసుది. పాపమెంతో సుకుమారియు నగుటచే వనమునకు వెళ్లనోపదనియు, వెళ్లిన మిక్కిలి పాపమనియు వసిష్ఠుడు నిజమునే పలికెను. ఓ కైకా రాజచంద్రుడగు జనకునకు కుమార్తెయై భూమియందు జన్మించినది. మంచి నడవడి గలది. పాపమేమియు నెఱుగనిది. బాలిక, శోభావంతురాలు. అట్టి సీత యెవ్వరికే పాపము చేసినదే ఈ ప్రకారముగా నారచీరలు గట్టుకొని అందఱు చూచు చుండగా తాపసివలె సభలో నిలిచియుండుటకు? సీత నారచీరలతో వనవాసమున కేగునని నేను నీకు బాస చేసితినా? ఇట్లు నిర్బంధపెట్టెదవేలనే? నారచీరలు కట్టుకొనకుండ తాను సర్వరత్నములతోను అలంకారములతోను వెళ్ళును. ఏమిటికి కష్టపడవలెను? వల్లకాటికి బోవు కాలము సమీపించుటచే దుష్టుడనై ధర్మము తప్పి నీచబుద్ధితో క్రూరమైన బాస చేసితిని. నా మాటయే నన్ను వెదురుగడను దాని పువ్వువలె కాల్చుచున్నది. పాపులగు స్త్రీల మాటలను అనుసరించినచో దుఃఖములు రాకమానునా? ఆ ప్రకారముగా వరములను పుచ్చుకొని ఈ ప్రకారముగా పేరును పెంపును

ఇహమునందును పరమునందును నాశనము చేయునట్టి వరములను చిన్నపిల్ల మాదిరిగా కోరుకొని వదరుచున్నావేల? మాటవరుసకైనను ఒకమాటైనను రఘురాముని యందు పాపమున్నదని చెప్పగలవా? ఓసీ! దురాత్మురాలా! చెప్పుము విందము. ఆ సీతయందు ఒక్క దోషమునైన చూపగలవా? నీ మాయలను మానవు. పతివ్రతవైనచో నిది నీకు తగినదా? లేడివంటి కనులు గలది. సుకుమారమైనది చిన్నవయసుది. ఉత్తమ తపస్విని. రాజపుత్రిక ఎక్కువ దయగలది యయిన భూపుత్రి యందు నీవేపాపమును చూచితివే యింత పరుషముగా ప్రవర్తించుటకు? ఓసీ! కైకా! రామునడవులకు వెడలగొట్టించుట యను పాపమే జీవితాంతమున నిన్ను బాధపెట్టి నరకమునందు బడద్రోయును. మరల నీ సీతాదేవిని లోభబుద్ధితో నీవిట్లు దుఃఖపెట్టుటవలన గలుగు దోషములు ఎంతయు భయంకరములై నిన్నేమి చేయనున్నవో గదా! రాము డభిషేకమునకై నీ మేడకు రాగా అతనితో రామా! వనమునకు బొమ్మని పల్కితివి. నేనా మాటయే వింటిని. నీవు ఇతరమైన మాట చెప్పలేదు గదా. ఓ కైకా! వినుము. రాము వనవాసము నొక్కటే నీవు కోరగా నొప్పుకొన్నాను గాని, నీవు అనఘురాలగు సీతను పంపునట్లు వరములలో కోరలేదు. నేను బాస చేయలేదు. ఆ మేరను దాటి నీవు స్త్రీలలో నుత్తమురాలైన సీతను నారచీరలు ధరించి నిలువగా చూడ గోరితివి. దీనిచే నీ వే దుర్గతులలో బడచూచుచున్నావు? నిన్ను యముడైనను క్షమించునా?" అని విలపించుచు, ఎక్కువైన బాధతో దుఃఖించుచు దశరథుడు భూమిమీద పడగా జూచి శ్రీరామచంద్రుడు మిక్కిలి వినయముతో తండ్రితో నిట్లనెను.

**శ్రీరాముడు తన తల్లిని గాపాడుమని తండ్రిని వేడుకొనుట :**

"ఓ జనకా! నా తల్లియైన కౌసల్య, గుణములే యాభరణములుగా గలది, గొప్ప తపస్విని. సత్యమును దప్పక నడచునది. ఇదివఱకెప్పుడును మనసున

దుఃఖము నెఱుగనిది. నేను దూరమగుటచేత నేటి నుండి పుత్రశోకముతో బాధపడుచుండును. ముదుసలిదియు నగుటచే నా గురించిన దుఃఖముచే నీమె మరణమును పొందకుండగా కాపాడుచుండుము. ఓ మహాత్మా! నిన్నెన్నడును మనసులో కూడ నిందించి యెఱుగదు. ఓ రాజచంద్రమా! ఈమె నన్ను తలచుచు తలచుచు చిక్కిపోయినదై యమలోకమునకు వెళ్ళకుండగా కాపాడవయ్యా! నా ప్రార్థనను మన్నింపుము. అడవులలో దిరుగుచు నేను కష్టపడుచుందునని తలంచుచు నెంతో బాధను పొందుచు కృశించుచు దుఃఖించును. మరణమును పొందకుండ నా తల్లిని చూచుచుండుము."



# ముప్పది తొమ్మిదవ సర్గము

## ముని వేషధారుడైన శ్రీరాముని జూచి దశరథుడు దుఃఖించుట :

అను రాముని యొక్క మాటలను విని మునివేషముతోనున్న రాముని ముఖమును చూడలేకను, మాటాడలేకను భార్యలతో దానును దశరథుడు భూమియందుబడి మూర్ఛిల్లెను. కొంచెము తెలివిని పొంది జానకీపతిని గూర్చి రాజిట్లు ప్రలాపించెను. “అయ్యో! పూర్వము చేసికొన్న పాపము నన్ను బాధింపక పోవునా? నేను చిన్నతనమునందు ఎన్నింటికో ఆపద కల్గునట్లు ఆవుల నుండి దూడల నెడబాపితినో గదా! ఆలోచింపక యెన్ని ప్రాణులకు హింస కలుగ జేసితినో గదా! తేజస్సుతో అగ్నిహోత్రుడనునట్లు ప్రకాశించునట్టి నా పుత్రుడిట్లు నలుగురు చూచుచుండగా నాయెదుటనే నారచీరలు కట్టుకొనగా చూచి భరించి యుండితిని. ఈ కైక బారినిబడి కూడ మరణమును పొందను. ఇంతకంటె పెద్ద దుఃఖ మింకొకటి యుండునా? దేహులకు కాలము తీరకుండగా మరణము సంభవింపదుగదా! నన్ను వంచించి స్వార్థపూరితురాలై ఈ కైక అక్కటకటా! ఇచ్చట నున్న ప్రజలందఱను బాధించుచున్నది గదా!” అనుచు ‘రామ రామా’ యనుచు కన్నులనీరు నించెను. ఒక్కమాటు ‘రామా!’ యని ఆపై మాటాడలేక ఏడ్చుచు సుమంత్రునితో రాజిట్లనెను. “సుమంత్రా రాముడెక్కుటకు రథము నొకదానినిటకు దెమ్ము. దానియందీ మహానుభావుడగు రాముని తీసికొనివెళ్లి జనపదములు దాటించి యచట విడచిరమ్ము” అనగా సుమంత్రుడు రథమును తీసికొనివచ్చుటకు వెళ్లగా, మరల రాజిట్లు పలికెను. “వీరుడైన రాముని నోరులేని వానిని తల్లి తండ్రి యిట్లు వనములకు బంపించుట చూడగా సాధువుల యొక్క మంచి గుణముల ఫలమిట్టిది సుమా యని తలచుచున్నవాడను.” నేర్పరి

యగు సారథి యగుటచేతను, తొందర తొందరగా పనులు చేయువాడగుట చేతను సుమంత్రుడు వేగముగా గుఱ్ఱములను గట్టి రథమును ఆ రాజుండు నింటి వాకిట నిలువబెట్టెను. "బంగారు అలంకారములు గలదియును, మిక్కిలి వేగవంతములయిన గుఱ్ఱములు పూన్చినదియును అగు రథమును రాముని కొఱకు తీసికొనివచ్చితి"నని సుమంత్రుడు చెప్పగా ఆ రాజు, కోశాధ్యక్షుని దేశ కాలములు తెలిసిన ప్రాజ్ఞుని పిలిచి "ఓ ప్రజ్ఞానిధీ! వెలగల యాభరణములు, పట్టుబట్టలు పదునాల్గేండ్లకును సరిపోవునట్లుగా ఈ సీతాదేవికిచ్చుటకు తీసికొనిరమ్ము"నగా అతడు వెళ్లి అన్నియును తీసికొనివచ్చి రాజున కప్పగింపగా రాజు కోడలి కవియన్నియు నిచ్చెను. ఇవ్వగా సీత పుచ్చుకొని వానిలో మేలైనవానిని గొన్నిటిని శరీరమున ధరించి మెఱుగుదీగకు మెఱుగు పెట్టినట్లుగా ప్రకాశించెను. ఆ కాంతిచే గృహమంతయు, బాలసూర్యునిచే ఆకాశము వెలుగునట్లు ప్రకాశించెను.

## కౌసల్య సీతకు ధర్మోపదేశము చేయుట :

మనస్సునం దెటువంటి చింతలును లేకుండ నిలుచున్న కోడలిని సీతను కౌసల్య తన దగ్గరకు తీసికొని తన సందిటబట్టి కౌగలించుకొని ఆమెతో నిట్లనెను. "ఓ సీతా! ధనమును సౌఖ్యములను భర్త యిష్టముగా అన్నియును సమకూర్చు చున్నప్పుడు గొప్పగా సంతోషించుచు, ఆ సిరులు తొలగినచో భర్తను దూషించు గుణహీనలయిన స్త్రీలు కులటలు గదా! ముందు సుఖముల ననుభవించియు, ఓ సీతా! భర్తకేదైన కష్టము సంభవించుటచే తమకు సుఖములు లేకపోవుటచే భర్తను నిందించుటయును విడచిపెట్టుటయును స్త్రీ యొక్క స్వభావము సుమా! అబద్ధములకు పుట్టినిండ్లవంటి వారై తమ భర్తను వేళాకోళముగా వెక్కించువారై దుర్మార్గపు బనులు చేయుటకు జడియక ఎవ్వరికి దెలియని మనస్సులు గలవారై పెంకెతనముచేత యౌవన మదముచేత పొంగినవారై కొందఱు స్త్రీలు నిమిషములో ప్రాణముతో సమానముగా తమను జూచు భర్తకు ఏవగింపు

కలగింతురు. ఓ పద్మపురేకుల వంటి కన్నులు గలదానా! సీతా! కొందఱు చంచలమైన మనస్సు గల దుష్టురాండ్రగు యువతులు తమ కులము యొక్క గొప్పదనమును చూడరు. భర్త తమయందెక్కువైన ప్రేమతో జేయుచున్న పనులనైన మనసులో తలంపరు. తమ భర్తల యొక్క పాండిత్యమును మెచ్చుకొనరు. తమను అగ్నిసాక్షిగా పెండ్లియాడుటనుగాని యిచ్చిన ధనాదులను గాని స్మరింపరు. భర్తకిష్టమైనదై శీలమును, చదువును, సత్యమును, శాంతియు, సొంపును గల పతివ్రతయగు భార్యకు భర్త యొక్కడే స్వర్గమును మోక్షమును. అతడే సుమా! అక్కటా! నా యొక్క పుత్రుడు దిక్కులేకుండగా వనములందు నివసించువాడగుటను దెప్పిపొడువకు మమ్మా! ఓ సీతా! సంపదయున్నను లేమి కలిగినను నీకు దైవమతడే సుమా!" అని యీ ప్రకారముగా తన అత్తయగు కౌసల్య చెప్పిన మాటలను మనస్సునందు నిల్పుకొన్నదై సీత చేతులను జోడించి అత్తగారివంక నిదానముగా జూచుచు మంచిగా ఇట్లు పలికెను. "అత్తా! మునుపు నా తండ్రి యింటిదగ్గర నున్నప్పుడు భక్తితో భర్తను సేవించునట్టి పద్ధతులనన్నిటిని వినియున్నాను. మీరు చెప్పినట్లు వదలనటువంటి ప్రీతితో భర్తను సేవించెదను. అనార్యలగు స్త్రీలతో నన్ను సరిచేయబోకుడు. నేను ధర్మమును వదలుదునా? వెన్నెల చంద్రుని వదలియుండునా? తీగలు లేకున్న వీణమ్రోగదు గదా! చక్రము నూడదీసినచో బండి నడవదు గదా. స్త్రీకి నూరుగురు పుత్రులున్నను ప్రాణ సమానమైన భర్త లేనిచో సౌఖ్యము లభింపబోదు గదా! తండ్రి మితముగా నిచ్చును. తల్లియును మితముగనే యిచ్చును. కుమారుడు గూడ మితముగనే యిచ్చును. మితియను నది లేకుండగా సుఖములనిచ్చు భర్త నేస్త్రీయైనను పరమ పవిత్రముగా నెవతె సేవింప కుండును? పెద్దలవలన వినియుంటిని. సద్ధర్మములను దెలిసికొని నడచుచుంటిని. మఱి భర్తయైన శ్రీరామచంద్రు నేల యెకసక్కెములాడుదును? స్త్రీకి దైవము భర్తయే గదా!" అని సీత చెప్పగా విని కౌసల్య దుఃఖము సంతోషము మనస్సున పెనవేసికొనగా కన్నుల నీరు

రాల్చుచుండగా చూచి సవతి తల్లులలో నున్న తల్లికి ప్రదక్షిణము చేసి రామచంద్రు డిట్లనెను.

**శ్రీరాముడు కౌసల్య మొదలగు తల్లుల యొద్ద సెలవు గొనుట :**

"ఓ తల్లీ దుఃఖింపకుము. నా తండ్రినాదరముతో చూచుచుండుమమ్మా! నేనడవులలో పదియు నాలుగు సంవత్సరములు నీవు నిద్రించి లేచినంతలో గడపివత్తును. వేగముగా మరలివచ్చి మిత్రులతోను, హితులతోను గలసి నిన్ను చూచెదను" అని వగను తొలగించునట్లుగా పలికి తన తల్లివలెనే యేడ్చుచున్న మూడునూర్ల యేబదిమంది తల్లులకును చేతులను జోడించి నమస్కరించి ధృతిమంతుడగు రాముడు ధర్మయుక్తముగా ఒప్పుగా వారందరిని జూచుచు నిట్లు చెప్పెను. "జ్ఞానము లేకపోవుటచేతనో, చనువుచేతనో నీతితప్పి మిమ్ముల నేమైన ననియున్నచో నా నేరములను క్షమించుచు నాకు కరుణతో సెలవు నిప్పింపుడు" అని రాముడు పలికిన మాటలను విన్నవారై ఆ స్త్రీలందఱును గొప్పనైన యార్తితో, హాహాకారములతో గొప్ప ధ్వనితో క్రౌంచపక్షుల వలె అరవగా, మునుపు మంగళవాద్య ధ్వనులతో విరాజిల్లిన ఆ రాజేంద్రుని భవనము మహా కోలాహలముతో స్త్రీల యొక్క ఆర్తధ్వనులతో నిండి సొంపు దొఱగినదయ్యెను.



# నలువదియవ సర్గము

**సుమిత్ర లక్ష్మణునకు శ్రీరాముని వెంటబోవ ననుజ్ఞ నిచ్చుట :**

రాముడును, సీతయు, సౌమిత్రియు కృతాంజలులై దైన్యము దుఃఖము సంతాపము గలవారై రాజునకు ప్రదక్షిణముచేసి శ్రద్ధతో పాదములపై వ్రాలి లేచి తగు విధముగా తరువాత జనకరాజ పుత్రిని లక్ష్మణుని తన తల్లికి మ్రొక్కుటకై పంపించి తానును దైన్యమును పొందినవాడై వినయముతో వెలదులలో శ్రేష్ఠురాలైన కౌసల్యకు నమస్కరించెను. అన్న వెంటనే లక్ష్మణుడును గొప్పదైన భక్తితో కౌసల్యకు సాగిలపడి మ్రొక్కి వెంటనే తన తల్లియైన సుమిత్రకు భక్తిచే వివశత్వమును బొంది వినయముతో నమస్కరించెను. వందనము చేయుచున్న పుత్రుని జూచి శిరము మూర్కొని స్త్రీలలో శ్రేష్ఠమైన సుమిత్ర పుత్రుని శ్రేయస్సును కోరినదై యిట్లనెను. "సర్వమిత్రుల యందు తప్పని యనురాగముతో రామునితో గలసి యరణ్యములకు వెళ్లుటకై జన్మించితివి. నేననుజ్ఞ నిచ్చెదను వెళ్లుము. రాముడు వనములలో వెళ్లుచుండగ నెప్పుడైనను నీ మనసునందైనను ఏమఱకుండవలెను సుమా! అతడు వ్యసనము పొందుచున్నను, సంతోషముతో నున్నను అతడే నీకు గతి సుమా! జ్యేష్ఠుని ననుసరించి వర్తించుటయే ఎల్లయెడల ధర్మము సుమా! ఓ పుత్రా! ఈ వంశమునందు పూర్వము నుండియును వచ్చుచున్న పుణ్యధర్మము, దానము చేయుటయును, యజ్ఞదీక్షయం దుండుటయును, యుద్ధమున వీరమరణమందుటయును అనునదే" అని బోధించి "పోయిరమ్ము" అని మఱల "ఓ లక్ష్మణా! తెలిసికొనుము నిజముగా నీకు రాముడే దశరథుడు సుమా! నన్నుగానే తలంపుము జనకరాజ పుత్రిని. నీ మనసునం దడవినే యయోధ్యగా తలంపుము. తండ్రీ! యథాసుఖముగ

పోయిరమ్మ!” అని సుమిత్ర ఈ ప్రకారముగ పుత్రుని యొక్క మనస్సునకు స్థిరత్వము కలిగించుటకై బోధ చేయగా అంత నా మనుష్యులలో శ్రేష్ఠుడైన రాముని తో సుమంత్రుడు ఇంద్రుని తో మాతలి వలె వినయముతో “అదిగో రథము మీరెచ్చటికి వెళ్లవలెనని యాజ్ఞ యిచ్చిన అచ్చటికి నేనే రథము తోలుదును. తొందరగరండు. ఆలస్యమెందులకు?

**సీతారామ లక్ష్మణులు తేరెక్కి వనములకై పోవుట :**

వనములలో పదునాల్గు వర్షములుండుటకై మీరిప్పుడే వెళ్లవలెనని కైక చెప్పెను. రాఘవా! అది నేడు మొదలుగా సాగు గాక!” అని సుమంత్రుడనగానే సూర్యసంకాశమై యనేక మణులతో నలంకరింపబడిన రథమును జనకరాజ పుత్రి భూషణములతో బ్రకాశించుచున్నదై ముందుగా నెక్కెను. అగ్నివలె ప్రకాశించుచున్న కనకమయమైన రథమును కౌసల్యానందనుడును సుమిత్రా సుతుడును అత్యంతమైన యుత్సాహముతో అనుమానము లేకుండ నెక్కిరి. వనవాసమునకుగాను భర్తతో వెళ్లుచున్న సీతాదేవికి మామగారైన రాజు ఇచ్చిన యెన్నరానట్టి యాభరణములును, గొప్ప ధనములును, రామలక్ష్మణుల యొక్క కవచములును, ఆయుధములును, చర్మముచే గప్పబడిన గుద్దలియును, తొందరగా రథము నందుంచిరి. అది చూచి సారథి రథమును తోలెను. వాయు వేగముతో సుమంత్రుడు రథమును దోలగా నయ్యయ్యోయని పౌరులందఱును, జూడవచ్చిన జనులును చాలసేపు మూర్ఛనందిరి. క్రోధించిన మదపుటేనుగుల యొక్కయు గుఱ్ఱముల యొక్కయు ధ్వనులు సంకులమైన యా పట్టణమున బిక్కటిల్లెను.

**శ్రీరాముని పోకకు ప్రజలు దుఃఖించుట :**

కొంత తేరుకొని ప్రజలు రామునివెంట ఎండలో బాధ నందినవారు నీటికై పరువెత్తి నట్లు ముసలివారును బాలురును గూడ విడువక పరువులెత్తిరి. అశ్రు వులు గారు ముఖముల తోను, ఆర్తితో చేయు నాదములతోడను, ముఖములను పైకెత్తి కొందఱు రథము వెళ్లిన దారినిబట్టి వెళ్లిరి. కొందఱు రాముని రథమును

పట్టుకొని ప్రక్కలను వెనుకను వ్రేలాడిరి. ఈ విధముగా వెంటవెళ్లుచు భరింపరాని దుఃఖముతో గూడినవారై సత్తువలేనివారై సూతునితో ఈ విధముగా కేకలు వేయుచు చెప్పిరి. “ఓ సుమంత్రా! నీకు పుణ్యముండును మెల్లగా రథమును తోలవయ్యా! ఇంత తొందర యెందుకయ్యా! మఱల ఎప్పుడు చూడగలమో ఈ రాముని యొక్క ముఖమును? అందుచే రథమును మెల్లగా తోలవయ్యా! పగ్గములనుబట్టి ఆపవయ్యా! సన్నుతికెక్కిన శ్రీరాముని యొక్క అందమైన ముఖారవిందమును ఒక్క మారయినను ఇప్పుడే చూచెదము. ఈ రాముని యొక్క తల్లియైన కౌసల్య యొక్క గుండె రాయియో యినుమో యయియుండ వలెను. కాకున్నచో దేవతలతో సమానుడు పద్మనేత్రుడునగు రాముడు వనములకు వెళ్లుచుండగా పగిలిపోకుండునా? బంగరుకొండను సూర్యకాంతి వీడని విధముగా తన యొక్క భర్తతో నీడవలె పట్టుదలతో వెంటనంటి వెళ్లుచున్న యీమెయే ఈ జగతియందు ధన్యాత్మురాలనగా, ఔరా! లక్ష్మణా! ఈ భూమియందు నీవే కృతార్థుడవు సుమా! ఎల్లప్పుడును ప్రియములు పల్కువాడును, ప్రియమైన యగ్రజుడును, దేవసమానుడును నగు రాముని నిర్మలమైన మనస్సుతో సేవించుటకు వెళ్లుచున్నావు. ఆహా! అది నీ యొక్క భాగ్యము గదా! రామునితో నీవు వెళ్లుటయే నీకు పరము సిద్ధించుటకు కారణము. ఇదియే కల్యాణములకు మూలహేతు వయిన బీజము. నీవు స్వర్గమును బొందుటకు కూడ నిదియే సుమా దారి” అని దుఃఖముతో విడచిపెట్టకుండ కనులవెంట బొటబొట పెద్దపెట్టున వర్షముగా బాష్పజలములు గురియుచున్నను తుడుచుకొనలేక రామునివెంట పౌరులందఱును గొప్ప దుఃఖముతో వెళ్లిరి.

**దశరథుడు శ్రీరాముని జూడవచ్చుట :**

రాముడు వెళ్లుట చూచెదనని భార్యలతో గూడ నిల్లువీడి వచ్చి ఇంద్ర సమానుడగు దశరథుడు తనయొద్ద బంధింపబడిన గజరాజు కొఱకై గోలచేయు ఆడ యేనుగల అరపుల వలె ఆ స్త్రీల యొక్క అధికమైన ఆర్తనాదములు విజృంభింపగా గ్రహణముపట్టిన చంద్రుని వలె కాంతిహీనుడయ్యెను. అట్లు

వచ్చుచున్న తండ్రిని కనుగొని స్థిరమైన మనస్సు గల రాముడు గుఱ్ఱములను తొందరగా నడపుమని సూతుని తొందరపెట్టగా నతడట్లే చేసెను. “ఓ సూతా! రథమును తొందరగా తోలుము తోలు”మని రామచంద్రుడును, “ఓ సూతా! తాళుము తాళుము” అని జనులును పలుకగా నేమిచేయుటకును తోచక సూతుడిరుకున బడెను. గుఱ్ఱముల గిట్టల తాకిడిచేతను, జనులు పరువులు పెట్టుటచేతను ఎగసిన ధూళి జనులు భరింపరాని శోకముచే విడచుచున్న కన్నీళ్ల నదులలో నడగిపోయి భూమి యంతయు బురదగా నయ్యెను. హాహాకారములతో నిండిన యయోధ్యాపురమునందు, సీతానాథుని ప్రయాణమై వెళ్లు సమయమున ప్రజాసమూహమంతయు మిక్కిలి బాధనొందిన దయ్యెను. ఆ స్త్రీలందఱును చేపలచే కలతపెట్టబడిన పద్మసమూహమువలె మహాశోక వ్యధచేత కనులనీరు గార్చిరి. ఒకే మనస్సుతోనున్న జనులందఱను జూచి రాజు శోకముచే వ్యధచెందిన మనస్సు గలవాడై మొదలంట నరుకబడిన చెట్టువలె తెలివిదప్పి పడిపోవగా చూచిన వారందఱును హో! యని యేడ్వ సాగిరి. అధికమైన దుఃఖమును పొంది రాజు సొమ్మసిల్లి పడియుండగా అచ్చటి స్త్రీలలో కొందఱు కౌసల్యా అనియు, మఱికొందఱు రామ రామా! యనియు దుఃఖితురాండ్రై కలతతో నేడ్చిరి. భ్రాంతితో గూడిన మనస్సు గలవాడైన దశరథుడును కౌసల్యయును వెనుక వచ్చుచుండగా, జానకీ నాథుడు పాశములతో బంధింపబడిన గుఱ్ఱముపిల్ల తన తల్లిని జూచునట్లు తాను ధర్మమనెడు పాశములచే బంధింపబడినవాడు గాన కంటి కొసలతో చూచియు అంతగా జూడదలపక పోవుటచే చూడడయ్యెను. వాహనములపై వచ్చుటకు యోగ్యులయ్యును వట్టికాళ్లతో నడచి వచ్చుచున్నవారును, సుఖము గలిగి యుండియు శోకించుచున్నవారును నయిన వారిని జూచి రాముడు “సూతా! తోలుము తోలు”మని తొందరచేసెను. అంకుశము పోటు నోర్చుకొనజాలని యేనుగువలె పద్మనేత్రుడగు రాముడు దయాళుడుగాన తల్లియు తండ్రియు పడుచున్న దుఃఖమును చూడజాలడయ్యెను. కట్టివేయబడియున్న దూడ

కోసమయి కాంక్షతో పరువెత్తుచున్న ఆవువలె ఆ పట్టపురాణియైన కౌసల్య తేరువెంట పరువెత్తుచు "ఓ తనయా! రఘువరా! పుత్రా! కుమారా! లక్ష్మణా! దయగలవాడా! అయ్యయ్యో తల్లీ జానకీ! ఈ బాధనెట్లు సహింతునురా?" యని యేడ్చుచుండగా రాముడు పలుమారు చూచెను. వెనుక 'ఆపుము రథము నాపుము' అని రాజు కేకలు వేయుచుండగా, 'పదపద'మని రాముడు పలుకు చుండగా సుమంత్రుని మనస్సు బండిచక్రముల జంట మధ్య బడినవాని వలె నలిగిపోయినదయ్యెను. అప్పుడు రఘురాముడు సుమంత్రునితో "నీవు మఱలి వెళ్లినప్పుడు ఒకవేళ రాజు నిన్ను జూచి ఏల రథము నాపవైతివి? నా మాట నెందుకు లెక్కచేయవైతివి? అని యడిగినచో నీ యొక్క మాటలను నేను వినలేదని చెప్పవచ్చును లెమ్ము. ఏలనగా రాజునకు ఈ దుఃఖమధికమగునేని భరింప శక్యముగాదు గదా!" అని చెప్పగా రథముతో వచ్చుచున్నవారందరను మంచిగా నిలువుడని చెప్పి వేగముగా వెళ్లుచున్న గుఱ్ఱములను సూతుడు మరింత వేగముగా తోలెను. రాజు యొక్క భార్యలందఱు బాధతో రామచంద్రునకు ప్రదక్షిణము చేసి నిలిచిరి. వారి మనఃపద్మములు కన్నీళ్లతో కందిపోయినవి. అతి వేగముగా వెళ్లుచున్న రాజపుత్రుని రథముతో ప్రక్కల ప్రజలు కన్నుల నిండిన నీటితో గ్రుడ్డివారై పరువెత్తిరి. మరలెడిమాటనే తలపరైరి. "ఓ రాజా! త్వరగా మఱలి రాగోరువారితో దూరము వెళ్లరాదు సుమా" యని మంత్రులు చెప్పగా, అధికమైన సుగుణములు గల వారి యొక్క మాటల ననుసరించి భార్యలతో గూడ విషణ్ణమైన రూపముతో, అలసటచే శరీరమున చెమటలు గారుచుండగా రాజు రాముని జూచుచు అక్కడనే నిలువబడెను.



# నలువది యొకటవ సర్గము

## శ్రీరామునకై అంతఃపుర స్త్రీలు దుఃఖించుట :

ఆ ప్రకారముగా శ్రీరాముడు తల్లికిని తండ్రికిని నమస్కరించి వెళ్లిన తరువాత ఒక్కసారిగా అంతఃపురమున నాకసమంటునట్లుగా ఆర్తనాదములు వెడలెను. ఆ స్త్రీ లందఱు నిట్లు విలపించిరి. "ఎవ్వడనాథులకు గతియో, దుర్బలులకు, తపస్వులకు ఎవ్వడు గతియో ఆ శరణ్యుడగు పతి గతిలేనివాడై అక్కటా! ఎక్కడకు వెళ్లునో గదా. ఓ అమ్మలారా! తన మీద నెవరైనను దెబ్బలాడినను కోపమును పొందదుగదా! ఏ పని చేసిన నెవరి మనసు నొచ్చునోయని జంకుచుండువాడు గదా! ఎవరైనను కోపముతో చిన్నపోయినచో వారల నూరడించువాడు గదా! ఓ వనితలారా! యితరుల సుఖదుఃఖములను తన సుఖదుఃఖము లనునట్లుగా భావించువాడు గదా! తన కన్నతల్లియైన కౌసల్యను జూచిన విధముగనే మనల నందఱను చూచువాడు గదా! అటువంటి పుణ్యాత్ముడు అటువంటి అనఘమైన నడవడి గలవాడు కటకటా! యెచ్చట నున్నాడో ఎక్కడకు బోవుచున్నాడో గదా! రాజు తనను మెచ్చి సమీపింపగా, కైక మాత్సర్యము గలదై వేధింపగా రాజు మతిచెడినవాడై మంచి నడవడి గలవాడును లోకరక్షకుడును నయిన రాముని విడచెను. ఎచ్చటికి వెళ్లు చున్నాడో గదా! ఇక నేమి గతియో గదా! ఎంతటి బుద్ధిలేనివాడో కదా ఈ రాజు? జాలి లేనివాడై సత్యము తప్పనివానిని, జగత్తంతయును ప్రేమించువానిని ధర్మమే మూర్తీభవించినవానిని ఎన్నరాని పరాక్రమము గలవానిని రాముని నరణ్యములలో పడియుండుమని పంపెను గదా!" యని అంతఃపురకాంత లందఱును భరింపరాని వ్యథచేత 'హా' యని విలపించిరి. లేగల నెడబాసిన ఆవులవలె ఆ స్త్రీలందఱును బిగ్గరగా ఆర్తిని పొందినవారై మొదలుపెట్టగా విని రాజు భూమిపై కన్నులరమోడ్చి పడియుండెను. గృహస్థు లెవ్వరును తమ యిండ్లలో వంటలను వండరైరి. బ్రాహ్మణులెవ్వరును అగ్నిహోత్రములలో హోమము చేయరైరి. ఒక్క మనుష్యుడయినను పనికి

వెళ్లడయ్యెను. సూర్యుడు కూడ చాటునకు వెళ్లెను. ఏనుగులు తిండి తినకుండ కనులవెంట నీరుగార్చుచుండెను. ఆవులు దూడలను పాలు త్రావనిచ్చుట లేదు. తొలి కాన్పునందే మగబిడ్డ కలిగినను తల్లి కొంచెమైనను సంతోషింప దయ్యెను. దారుణముగా గురుడు, బుధుడు, అంగారకుడు త్రిశంకుడు చంద్రు నాక్రమించిరి. చుక్కలు గ్రహములు కాంతి తొరగినవయ్యెను. ఆకాశమున విశాఖా నక్షత్రము పొగక్రమ్మినదయ్యెను. ప్రళయకాల వాయువేగముచే కళవళపడు సముద్రమువలె పట్టణమంతయును సంచలనము నందెను. దిక్కులన్నిట చీకటులావరించెను. ఆకాశమునం దొక్క చుక్కయైనను గ్రహమైనను వెలుగుటలేదయ్యెను. ఆ నగరమునందలి పురుషులును స్త్రీలును దారుణమైన దైన్యమును పొందినవారై మనస్సులలో ఆహార విహారములయందు కోరికనయిన చేయరైరి. వేడి నిట్టూర్పులు విడచుచు సంతోషమును వీడినవారై విచారముతో తపించినవారై అయోధ్యా జనులెల్లరును కాటువేసినను నెత్తురుచుక్క లేని వదనములు గలవారై దుఃఖముతో విలపించిరి. వాయుదేవుడు చల్లగా వీచుట మానెను. అగ్ని చల్లబడిపోయెను. సూర్యుడు తాపము కలుగజేయలేని వాడయ్యెను. చంద్రుడు తన ప్రకాశమును సౌమ్యతను వీడెను. పిల్లలు తల్లులను జూచి కూడ పాలకై యేడ్వరయిరి. తల్లులు పిల్లలును, తమ్ములన్నలును, భార్యలు భర్తలును, చుట్టపక్కములును ఎక్కువగా రామచంద్రునియందే మనస్సులు నిల్పినవారై తూలుచు శోకాధిక్యముచే ఒకళ్ల నొకరు విడిపోయి యెచ్చటకో వెళ్లుచుండిరి. రాముని స్నేహితులందఱును భరింపరాని శోకముతో దిగ్భ్రాంతి నొంది తమ యిండ్లయందే దొరలుచు శయ్యలనుండి లేవరైరి. ఇంద్రునకు వెరచి వణకుచున్న పర్వతములతో గూడిన భూమియో యనునట్లు అయోధ్యా పట్టణము శ్రీరాముడు లేకపోవుటచే ఎక్కువైన భయమును, ఆర్తియు తనను ముంచివేయగా వణకెను.



# నలువది రెండవ సర్గము

## దశరథుడు మఱలి తన గృహమునకు పోవుట :

రాముని యొక్క రథము వెళ్ళునప్పుడు రేగిన ధూళి కనిపించునంత వఱకు ఆ భూభర్త, పుత్రుడు వెళ్ళుచున్నవైపు ఱెప్పవ్రాల్పక చూచెను. పుత్రుడు పోవుటను రాజు చూచుచున్నంతవఱకు, ఈ రాజు బాధనొందకుండుగాక యనియో ఏమో ధూళి యధికముగా రేగెను. ఆ ధూళి కూడ తగ్గిపోగానే రాజు ధైర్యము కోల్పోయి భూమిపై పడిపోయెను. అట్లు పడిపోయిన రాజును కౌసల్య కుడి ప్రక్కను కైకేయి యెడవ ప్రక్కను చేతులతో పట్టుకొని లేవనెత్తగా కొంచెము తెప్పరిల్లి లేచి రాజు ఆ దుష్టురాలైన కైకను జూచి మనస్సు వ్యధలనెడు అగ్నులచే మండిపోవుచుండగా నిట్లు పలికెను. “ఓసీ! దురాత్మురాలా! నన్ను ముట్టుకొన కుము. వెళ్ళిపొమ్ము. నీ ముఖమును చూచుటకు కూడ అసహ్యమగుచున్నది. నీవు నాకిక బంధువవుగావు. భార్యవునుగావు. నీ విచ్చటనుండుటే సహింప లేకున్నాను. వినుము. ఈ భూమియందు నీ ప్రాణములున్నంతవఱకు నిన్ను ముట్టినవారు నాకు శత్రువులు. నేను కూడ వారలకంతే సుమా! నీవు కేవల మర్థపరురాలవు. ధర్మమును వీడినదానవు. కనుక అగ్నిసాక్షిగా పుచ్చుకొన్న నీ చేతిని ఇహలోకమునందు పరలోకమునందవి నాకు చెందకుండపోవుగాక!” అని పలుకుచు ధూళిలో మునిగియున్న రాజును, రాముని యొక్క తల్లి తన కన్నులవెంట వెడలు నశ్రువులు కాలువలు గట్టుచుండగా కన్నులు మూతలు పడుచుండగా తుడుచుకొనుచు రాజును తీసికొని వెళ్ళుచుండెను. అప్పుడు రాజు పుత్రుని తలచుకొని చేతితో నిప్పును ముట్టినట్లుగా, సద్బ్రాహ్మణుని జంపినట్లుగానయి సోలిపోయెను. మరలి మరలి రథము వెళ్లిన మార్గమును జూచును. గ్రహణము పట్టిన సూర్యునివలె రూపము మార్పును జెందగా

పుత్రుడు కోట దాటి వెళ్లుట తెలిసి మఱల మఱల పలవించెను. 'కొడుకును దీసికొనివెళ్లుచున్న ఉత్తమములైన గుఱ్ఱముల అడుగులివిగో భూమియందు గనబడుచున్నవి. కాని నా కొడుకే కనిపించుటలేదే. ఆ పుణ్యాత్ముని విడచి భూమిమీద నెట్లు బ్రతుకుదునో గదా! సుఖముగా చందనమును అలదుకొని మహా అందమైన స్త్రీలు వింజామరలు వీచుచుండగా మంగళకరమైన విశాలమైన శయ్యయందు సుఖముగా నిద్రించెడు నా కొడుకు ఎక్కడనో యే చెట్టు మొదటనో ఏ విధముగా దిక్కులేనివాడై కఱ్ఱనో చేతినో రాతినో తలదిండుగా పెట్టుకొని భూమిపై పడియుండునో గదా! వందిమాగధుల యొక్క నుతులతోను మంగళవాద్యముల ధ్వనులతోను మేలుకొను రాముడు దీనుడై దుమ్మును దులుపుకొనుచు సెలయేళ్ల సమీప ప్రదేశములందు కరిణీనాథునివలె నిద్రలేచును గదా! మూడు లోకములకును ఏలికైన వాడును, పొడవైన చేతులు గలవాడును నగు నా కుమారుడు దిక్కులేనివానిని బోలి అడవుల వెంట నడచి వెళ్లుచుండగా వనములలో సంచరించు జనులందఱు కన్నులారగా చూడనున్నారు గదా! జనులచే నమస్కరింపబడినదగు జనకరాజ పుత్రి వలదన్నను మానదయ్యెను. ఆ సీత ఎల్లప్పుడును సుఖములు పొందదగినది. ముండ్లతో గూడిన వనభూములలో ఎట్లు వెళ్లుచున్నదో! ఆమె అరణ్య మెట్లుండునో యెరుగదు గదా! నక్కల యరపులకు భయమునొంది నిశ్చేష్టురాలగును. హుంకారములకు కంపితురాలగును గదా! ఓ విధవా! ఈ రాజ్యమును నీవే నీ యిష్టమువచ్చినట్లు తలను గొట్టుకొనుము. వనజనేత్రుడయిన నా సుతుని విడుచుటచే ఒక్క గడియసేపైనను జీవింపజాలను సుమా! ఓ కైకా" అని పలవరించుచురాజు జనసమూహము తనవెంట రాగా శ్రేష్ఠనగరమగు నయోధ్య యందు దుఃఖముతో మృతస్నానము చేసినవానివలె వశముతప్పి ప్రవేశించెను. జనులు లేని యిండ్లును, కొద్దిగా విన్పించుచున్న రోదనములు గల చావడులును, మూతలు పడిన దేవాలయములును, అంగళ్లును, ఎక్కడో ఒక్క మనుష్యుడు అరుదుగా గన్పించు రాజమార్గములును చూచుచు రాజు తన మందిరములోనికి ఏడ్చుచు వెళ్లెను. గరుడునిచేత తనయందలి సర్పము లపహరింపబడగా నిశ్చలముగానున్న

చెఱువులోనికి ప్రవేశించినట్లును, సూర్యుడు మబ్బుచాటుకు వెళ్లినట్లును కుమారులు, సీతలేక సందడిలేని యా యింటిని ప్రవేశించి రాజు గద్గదస్వరముతో రాజచంద్రుడు మెల్లనైన మృదువైన మాటలతో నీరసించిన స్వరముతో తనతో నున్నవారితో నిట్లు పలికెను.

**దశరథుడు కౌసల్యా గృహమునకు బోవుట :**

"నాకిచ్చట నుండుటకు మనస్సు ఇష్టపడుటలేదు. నన్ను కౌసల్య యొక్క గృహమునకు తీసికొనివెళ్లుడు. ఇంకొకచోట నా హృదయమున కూరట యుండదు. రాముని తల్లియే నన్ను మిక్కిలి విశ్వాసముతో జూచును" అని చెప్పగా మార్గదర్శకులు ఎంతో వినయముతో రామచంద్రుని తల్లియైన కౌసల్య యింటికి రాజును తీసికొనివెళ్లిరి. అచ్చట శయ్యపైబడి కల్లోలితమైన మనస్సుతో విచారించుచు రాజు కోడలును కొడుకు లిద్దఱును విడచిపెట్టిన ఆ యింటిని చంద్రుడులేని ఆకసమువలె భావించి చేతులను పైకెత్తుచు "రామా! నన్ను విడచితివా?" యనుచు బిగ్గరగా నేడ్చెను. క్షేమముగా తిరిగివచ్చిన రాముని జూచి కౌగలించుకొని సంతసము కలుగుచుండగా ఈ భూమిమీద నంతవఱకు బ్రతికియున్న మహాత్ములేగదా ధన్యులైనవారు" అనుచు పొర్లిపొర్లి మిగుల బాధపడుచుండగా ఆ రాజునెడల కాళరాత్రియో యనునట్లుగా రాత్రి వచ్చెను. అంత అర్ధరాత్రియైనప్పుడు రాజు కౌసల్యతో నిట్లనెను. "ఓ కౌసల్యా! వినుము. రామచంద్రుని వెనువెంటనే వెళ్లినటువంటి నా చూపులు ఆ ఘనుడైన రాముని విడచి యిప్పటికి కూడ తిరిగి రావయ్యెను. అందుచేత నేను నిన్ను చూడజాల కున్నాను. ఓ కాంతా! నా దగ్గరగా వచ్చి నీచేతితో నన్ను బాగుగా ముట్టుకొనుము" అనగా దుఃఖించుచు కౌసల్య భర్త దగ్గరగా వచ్చెను.



# నలువది మూడవ సర్గము

## కౌసల్య శ్రీరాముని దలచి దశరథునితో జెప్పికొని యేడ్చుట :

దశరథుని సమీపించి కౌసల్య యతనిని జూచి కడుపు దుఃఖముతో నిట్లు పలికెను. “ఓ రాజా! కుబుసము విడచిన యాడుసర్పమువలె కైక శ్రీరామభద్రుని మీద తన కుటిలత్వ మనెడు విషమును గ్రక్కి సంతోషమునందెను. రాముని నడవులకు బంపుటచేతను, తన కోరిక నెరవేర్చుకొన్న దగుటచేతను ఆ కామినియగు కైక యింటియందున్న నాగుబామునుబోలి నన్నెక్కువగా భయపెట్టు చున్నది రాజా! అక్కటా! బిచ్చమెత్తుకొని తినియైనను ఆ సవతి తల్లికి దాసుడై నా కుమారు డింటిలో నొకచోట బడియుండనిచ్చినను మేలు గదా! నీవా కైక కటువంటి వరమునైన నిచ్చియుండరాదా? రాజ్యము దక్కకపోయినను బాధలేదు గాని గుణధన్యుడైన రాముడడవులకేల వెళ్లవలయును? అక్కటా! ఆ హితాగ్నియైన వాడు అమావాస్యలందును పూర్ణిమలయందును ప్రఖ్యాతిగా దేవతలకు జెందవలసిన హవిస్సును రాక్షస సంఘమునకు బుచ్చుకొమ్మని యిచ్చినట్లు నీవు నీ యిష్టము వచ్చినట్లుగా ధన సంపన్నమైన రాజ్యమును ఇప్పుడు కైక కొసగి నీ జ్యేష్ఠపుత్రుని గుణవంతుని వెడలగొట్టితివి గదా! చేత విల్లు ధరించి భార్యయును తమ్ముడును తనవెంట వచ్చుచుండగా అడవి మార్గమందు గజరాజువలె సీతానాథుడీ పాటికి ప్రవేశించి యుండును. వనవాసములో నిట్టి దుఃఖముండునని ఎఱుగనివారగు ఆ పవిత్రులను కైక యొక్క ఆజ్ఞ ప్రకారముగా నీ వడవులకు పంపించితివి. వారలక్కడ ఏ విధముగా నున్నారో తెలియదుగదా! చిన్నవయసువారలను సుఖముల ననుభవించు కాలమునందు అయ్యో! అడవులకు వెడలగొట్టితివి గదా! అనాథలై ఫలములను దుంపలను ఆకులను తినుచు నేవిధముగా జీవించగలరో చెప్పుము. ఆ రామచంద్రుడిప్పుడే యిచ్చటకు భార్యతోడను తమ్మునితోడను వచ్చివేయరాదా? నా దుఃఖము నశింపజేయు శుభ సమయమిది కారాదా? నిదుర మేల్కొన్న వారివలె ఈ యయోధ్యాపురమున కెప్పుడు వత్తురోగదా! అన్నిచోట్లను సంతుష్టులైన జనులు తోరణములను

ధ్వజముల నెప్పుడెత్తెదరో గదా! ఈ పురమంతయు పున్నమినాటి సముద్రునివలె నెన్నడు పొంగునో? ఎప్పుడు నా కుమారుడు సీతతో గూడ రథమునెక్కి ఆవువెంట వచ్చు కోడెవలె నెప్పుడు వచ్చునో? నా యొక్క విచారము పోవునట్లుగా రాజ మార్గములవెంట నీ పురము ప్రవేశించుచున్న నా కుమారులపై వేనవేలమంది జనులు పేలాలు చల్లుచుండగా కనులు చల్లగా నే నెప్పుడు చూచెదనో? అందమైన కుండలములు ధరించి భయంకరములగు ఖడ్గమును చాపమును చేతబట్టి శిఖరములతో వెలుగొందు పర్వతములవలె పురమునకు వచ్చుచున్న సుతులను చూచునట్టి పుణ్యము నాకెప్పుడు గలుగునో గదా! బ్రాహ్మణ కన్యకలు పుష్పములను ఫలములను చేతులలో ధరించి సంతోషముతో కోరిక తీరునట్లుగా పురమునకు ప్రదక్షిణములు చేయుట నేనెప్పుడు చూచెదనో గదా! పరిపక్వమైన బుద్ధి గలవాడును, ప్రాయముచే ఇంద్రునివంటి వాడును (అతనికిప్పుడిరువది యైదేండ్లు) మెత్తని మాటలాడు సౌమ్యుడును అయిన వాని ముఖపద్మమును జూచుట నా కెట్లబ్బునో గదా! మూడేండ్ల ముద్దుల బాలునివలె అందము చిందుచు రాముడు నాముందర కనిపించగా నేనేనాడు కన్నులార చూచెదనోగదా! ఏడీ రాముడు? ఏడీ నా కుమారుడు? సందేహము లేదు. పూర్వజన్మమునందు ఆనందముతో తల్లులు తమ బిడ్డలకు పాలిచ్చుచుండగా క్రూరురాలనై కండలు గల్గిన గర్వముతో ఆ పసిబిడ్డల నోటనున్న ఔమ్ములను కోసివేసితిని. ఎక్కువైన ఆ పాపమే ఈ ప్రకారముగా భయంకరమైన రీతిగా నన్ను మ్రింగుచున్నది. సింహముచేత హింసింపబడిన దూడగల గోవు దూడ లేనిదయినట్లు పుత్ర వాత్సల్యముగల నేనును కైకేయిచే పుత్రహీనురాలనయితిని. ఇకనేమని యనుకొన్నను లాభము లేదుగదా! అట్టి సద్గుణవంతుని, సర్వశాస్త్రజ్ఞుని, ఒకే ఒక్క కుమారుని వీడి నేనెట్లు కష్టపడుదును? ఎట్లు బ్రదుకుదును. నా యిష్టపుత్రుని జూడక యెట్లు జీవింపగలను? మండు వేసవిలో సూర్యుడే ప్రకారముగా భూమి జనులను తన మిక్కిలి తీక్ష్ణమైన కిరణములతో బాధించుచుండునో ఆ ప్రకారముగా నా శరీరమును పుత్రశోకమను అగ్ని కాల్చివేయుచున్నది.

# నలువది నాలుగవ సర్గము

## సుమిత్ర కౌసల్యకు శోకోపశమనంబు సేయుట :

అని యిట్లు దుఃఖించుచున్న కౌసల్యాదేవిని చూచి ధర్మమార్గమున నడచు సుమిత్ర ధర్మయుక్తముగా నీతియుక్తముగా నిట్లనెను. “ఓ కౌసల్యా! ఆర్యురాలా! నీవేల యిట్లు సంతాపమును బొందెదవు? సాటిలేని సద్గుణములు గలవాడు, జయింపరానివాడు, పురుషులలో నుత్తముడు నీ యొక్క కుమారుడు. వాని కోసమా యిట్లు నీవు దైన్యముతో విలపించెదవు? అతడు తానడవులకు వెళ్లుటంతయు రాజగు తన తండ్రిని సత్యవాదిగా జేయుటకే గదా! ఓ ధర్మమైన మనస్సు గలదానా! దానికై విచారించుట న్యాయముగా నున్నదా? చెప్పుము. పెద్దవారు మోక్షమును పొందుట కొఱకై ఎక్కువగా నడచుచుండునట్టి ధర్మ మార్గమున నీ ముద్దుల సుతుడు కూడ నడచెను. దీనియందు దోషమేమున్నది? వగచుట యెందులకు? ఏమరుపాటులేని వాడును, సమస్త ప్రాణులయందు దయ గలవాడును నయిన లక్ష్మణుడు అన్న యొక్క సేవయనెడు ఉత్తమమైన పద్ధతి యందున్నాడు. ఆ మహా పురుషునకదియే లాభమును గలుగజేయును. వనవాసములోనున్న అలజడులను సీత తెలియక సుఖముగా నుండునని వెళ్లినదని తలపకుము సుమా! ధర్మాత్ముడైన నీ కుమారుని పూజించు కోరికతో వెంట వెళ్లినది. శ్రీరాముడు జగత్తునందంతట కీర్తిపతాకము నెగురవేయగలడు. ప్రభువగును. ప్రకాశించు నాకృతి గలవాడును, నియమములు సత్యము ధర్మము ధనములుగా గలవాడును అయిన అతనికి కొదువ లెందుకు గలుగును? ఆ రామచంద్రుని శుచిత్వము యొక్క మహత్వము లెక్కువగా తెలియబడుట వలన సూర్యుడు తన కిరణములతో తాపమును గలిగింపడు. వారికి అడవులందు సరిపోవునంతగా వేడియు శీతమును కలుగునట్లుగా కమ్మగా మెల్లగా సుఖముగా

నుండునట్లు వాయువు వీచుచుండును. శయనించియున్న ఆ యనఘునిపై తండ్రివలె చంద్రుడు కిరణముల చేత ముట్టుకొని యెక్కువైన సంతోషమును గలిగించును. శంబరాసురుని పుత్రుని సంహరించినందులకు మెచ్చి బ్రహ్మ యిచ్చిన దివ్యాస్త్రములు గలవాడగు పరాక్రమశాలి రాముడడవులందు సుఖముగా ఇంటియందున్నట్లుగానే యుండును. ఎవని బాణములు మార్గమున వచ్చుచుండగా చూచిన శత్రువులు సమూలముగా నశింతురో అట్టి పరాక్రమ శాలి నీ కుమారుడు. అట్టి వాని యాజ్ఞ సమస్తమైన భూమియందు చెల్లక యెట్లుండును? బలమును, శౌర్యమును, ప్రకాశ సంపదయును నెవ్వనియం దెల్లప్పుడును ప్రకాశించునో అట్టి ఆ వీరశ్రేష్ఠుడు తొందరగా అడవుల నుండి తిరిగి వచ్చి యీ వసుధనంతటిని పరిపాలింపగలడు. సూర్యునకు సూర్యుని వంటివాడు. అగ్నికి అగ్ని. అన్ని సిరులకు సిరియైనవాడు. రాజులకు రాజు. కీర్తికి కీర్తి. దేవులకు దేవుడు. క్షమకు క్షమ. భూతములకు ఉత్తమ భూతము. అట్టి శ్రీరామునకు పట్టణమందైనను అడవులయందైనను లోపమనునది యుండునా? ఓ శీలవతులలో శ్రేష్ఠురాలా! నీ సుతుడు వేగముగా మరలివచ్చి భూమితోను, సీతతోడను, సిరితోడను ముప్వురితోగూడి పట్టాభిషేకము చేసికొను చుండగా లోకములో నుండు వారందరును ఆనందబాష్పములు కనులవెంట ప్రవహింపగా శోకమును విడచిన వారై సంతోషముతో చూచెదరు. గొప్ప కాంతి గలవాడును, పరాజయములేని వాడును, నారవస్త్రములు ధరించిన వాడును నగు తన భర్తను లక్ష్మియో యనునట్లు సీతాదేవి యనుసరించి వెళ్లినది. అట్టి రామునకు ఎందైనను లభించనిదుండునా? భయంకరమైన విల్లును ధరించినవాడును, ఖడ్గమును, బాణమును ధరించినవాడును నయి లక్ష్మణుడా రామునకు ముందుగా నడచుచుండగా ఆ రామునకు దుర్లభమైనది యెందైనను గలదా? ఒట్టుపెట్టి చెప్పుచున్నాను. శపథము చేసెదను. నీ పుత్రుడరణ్యముల నుండి తిరిగి వచ్చుటను సంతోషముతో నీవు చూచెదవు. అధికమైన శోకమోహములను విడువుము. ఓ అభిమానవతీ! కౌసల్యా! ఈ నీ పాదములపై బడి నీ కుమారుడే నమస్కరించుచుండగా నుదయించుచున్న

చంద్రునివలె అతనిని జూచి సంతోషింపగలవు. ఏల బాధనొందెదవు. ఓ మంచి శీలము గలదానా! తిరిగి పట్టణమునకు వచ్చినవాడై సుఖముగా పట్టాభిషిక్తుడైన ప్రియపుత్రుని మనసునందు సంతోషమును పొంది ఆనందాశ్రువులు గారుచుండగా కన్నులార చూడగలవు. అమ్మా! శోకింపకుము. ఇట్లు దుఃఖముచే కలతజెందకుము. నీ పుత్రునకెట్టి కీడును గలుగదు. లక్ష్మణ సీతాసహితుడైన రామచంద్రుని వేగముగనే యిచ్చటనే కాంచగలవు. ఓ కోమలీ! ఉన్నవారందరను నీవే ఓదార్చవలసినదానవు గదా! నీవే దుఃఖము నొందగా నిన్నూరడింపగలవారిం దెవరున్నారు? ఇట్లేడ్చెదవేమి? ఓ గుణములకు నిలయమైనదానా! రాముని తల్లివై యుండియు నీవీ ప్రకారముగా దుఃఖించుట తగునా? చెప్పుము. ఈ భూమియందు రామునికంటెను సన్మార్గమున నడచువాడెక్కడను లేడు గదా! ఎక్కడనున్నాడు? మిత్రులతో గూడివచ్చి నీకు నమస్కరించుచున్న నీ ప్రియ పుత్రుని కన్నులార చూచి వానకాలమున వర్షించు మేఘమువలె నానంద బాష్పములను విడువగలవు. వేగముగా మరలివచ్చి నీ తనయుడు తన మెత్తని చేతులతో నీ పాద కమలముల నొత్తుచుండగా అతని శిరస్సుపై నీవు కొండమీద కురియు నల్లని మబ్బువలె నశ్రువులను కురియగలవు. ఇట్లు జాలిచెంది విచారింపవలసిన పని యేమున్నది?" అని ఈ ప్రకారముగా సుమిత్ర అనేక విధములుగా ఆశ్వాసింపగా ఆ కౌసల్య శోకము నంతయును విడచిపెట్టి శరత్కాలములో నీరు తక్కువగా గల మేఘమువలె నుండెను.



# నలువది యైదవ సర్గము

## శ్రీరాముడు పౌరులను మరలిపోవ ప్రార్థించుట :

అక్కడ శ్రీరాము డడవిమార్గమును బట్టి రథములో వెళ్ళుచుండగా రాముని యందుండు అనురాగముతో జనులందఱును రథము వెనుక వెళ్ళుచుండగా, శ్రీరాముడును మంత్రులును వద్దని వారించుచున్నను వినకుండిరి (బంధుప్రేమకు వీరి భక్తికి ఎంత భేదమున్నదో చూడుడు. ఈ భక్తియే వీరికి ముక్తి కారణమయ్యెను.) పురమున నున్నవారికి, తన సత్కీర్తిచే పూర్ణచంద్రునివలె నానందకరుడైనవాడగు శ్రీరాముడు తనను పౌరులు 'వెళ్లవలదు – వెళ్లవలదు మరలుము' అని వేడుచున్నను మరలడయ్యెను. తన తండ్రిని సత్యవాదిగా జేయుటకై అట్లు వెళ్లుచు తనవెంట నంటివచ్చు పౌరుల నందఱను తన కన్న సంతానమును వలె స్నేహముతో జూచుచు రఘురాము డిట్లనెను." మంచి గుణములు గల ప్రజలారా! నా యందున్న మీ ప్రేమను, గౌరవమును మీరు భరతునియందు చూపింపుడు. నాకదియే యెక్కువ యిష్టము సుండీ! ఓ పౌరులారా! అతడు కైక యొక్క కుమారుడు. మంచి గుణములు గలవాడు. మీరు కోరునవియును మీ కిష్టమగునవియును మీకు మేలగునవియును అన్నియును మీకు సమకూర్చును. మనసులో బాధను విడచిపెట్టుడు. మీరలందఱు మీమీ గృహములకు వెళ్లుడు. ఇంకను వినుడు. అతడు వయస్సుచేత బాలుడయ్యును జ్ఞానముచేత వృద్ధుడు సుమా! మెత్తనైన గుణములు గలవాడు, గొప్పనైన పరాక్రమము గలవాడు. అతడు మీకు తగిన రాజగును. మీకింక భయమేల కలుగును? రాజునకు కావలసిన లక్ష్మణములు గలవాడగు

భరతుడు మీకు యువరాజుగా నియమింపబడినవాడు కాన నాకును, మీకును ఇతర జనులకును రాజు యొక్క ఆజ్ఞ పాలించుటయే విధి గదా! ఆలోచింపుడు. నాకు మీరలిష్టమగునట్లు చేయదలచితిరేని ఓ ప్రజలారా! నేనరణ్యములలో సంచరించు సమయమున నా తండ్రి కెప్పుడును కొంచెమైనను దుఃఖములేని విధముగా జూచుకొనుడని చెప్పగా చెప్పగా వారందఱు ధర్మమును తప్పనివాడగు రామునే తమ రాజుగా కోరిరి. ఎంతెంతగా రాముడు స్థిరనిశ్చయుడై ధర్మము నుండి కదలడో అంతంతగా పౌరులును తమకు రాజుగా రామచంద్రునే మనస్సులందు కాంక్షించిరి. కన్నులందు బాష్పములు వెడలుచుండగా, విన్ననైన మొగములతో వచ్చుచున్న సర్వజనులను తన యొక్క సద్గుణములచే లక్ష్మణ సహితుడగు రాముడు గట్టిగా ఆకర్షించెను. జ్ఞానముచేతను, వయస్సుచేతను, తేజస్సుచేతను మిక్కిలి వృద్ధులయి యెల్లప్పుడు తల వణకుచున్నవారగు పౌరులు కొందఱు వెనుకబడి కంఠమెత్తి బాధతో నిట్లనిరి. "రఘురాముని మోసికొని వెళ్లుచున్న ఓ జాతిగుఱ్ఱములారా! ఈ ప్రకారముగా రాముని నరణ్యవాసిగా జేయుటకై తీసికొని వెళ్లుచున్నారా? క్రూరమైన యీ వేగమును మాని మరలుడు, ఇక బోవలదు వృద్ధుల మాటలను సీతానాథుడెప్పుడును దాటడు. మీరిట్లు దాటి వెళ్లుట తగునా? చెవులు గలిగిన మృగములందు గుఱ్ఱములే శ్రేష్ఠము లయినవి గదా. కోరికతో ఎన్నడును, ఎవ్వరిని వేడని మేము మిమ్ములను ప్రార్థించుచున్నాము. వేగముగా వెనుకకు మరలుడు. వీరుడును, ధర్మమునే యాచరించువాడును పవిత్రుడును అయిన రామచంద్రుని మీరలు పురమునకు తీసికొనిరాకుండ అరణ్యములలో విడుచుటకు వెళ్లెదరేల?"

**పౌరవృద్ధులు శ్రీరాముని పురికి రమ్మని ప్రార్థించుట :**

అని ప్రలాపించుచున్న ఆ సద్బ్రాహ్మణుల యార్తనాదములను శ్రీరామచంద్రు డాలకించినవాడై వేగముగా రథముదిగి తన భార్యయు తమ్ముడును తన్ననుస

రించి వచ్చుచుండగా కాలినడకతో వారియొద్దకు వెళ్లెను. రథముచుట్టును మూగియున్న జనుల కావలనున్న ఆ వృద్ధులను తాను రథము మీద నుండి వారించుటకు శక్యముగాక ఆ విధముగా దిగవలసివచ్చినది. ఆ ప్రకారముగా రథము దిగి కాలినడకతో తమను జేరవచ్చిన ఆ కృపాకరుడగు రాముని దగ్గరకు జేరి ఆ బ్రాహ్మణులిట్లనిరి. “ఓ శ్రీరామా! నీవిట్లు చేయదగునా? బ్రహ్మణ్యుడవగు నిన్ను బ్రాహ్మణులందఱు అనుసరించి వచ్చుచున్నారు. చూడుము. ఆ బ్రాహ్మణుల భుజములపై అరణులలో ప్రజ్వలింపజేయబడిన యగ్నిహోత్రములు వచ్చుచున్నవి. వాజపేయములు మొదలగు యజ్ఞముల యందు లభించిన గొడుగులు శరత్కాలమునందలి మేఘముల వలె వచ్చుచున్న విధమును జూడుము. గొడుగు లేకుండగా నీ వెండచే తాపమును బొందనేల? ఓ దివ్యసుందర శరీరా! వాజపేయములలో మేము సంపాదించుకొన్న గొడుగులు నీకు పట్టెదమయ్యా! వాని నీడలో రమ్ము. వేదముల ననుసరించునట్టి మా బుద్ధి యడవులలో నీతో తిరుగవలెనని కోరుచున్నది. పాతివ్రత్యముచేత సురక్షితలై యుండు స్త్రీలు ఇండ్లలో నిలిచియుందురు. పవిత్రములైన వేదములు మా మనస్సులయందు నిలిచియుండును. నీవు తలచిన మార్గమును మానివేయుము. మేము నిన్ను మరల్చుటకే నిశ్చయించుకొంటిమి. మా మనవిని నీవు వినకుండగా ఉపేక్షచేసి దీనికంటె మేలైన ధర్మమును దేనిని చేయదలచిన వాడవు? నీవే యిట్లు చేసినచో నింక భూమియందు బ్రాహ్మణ వాక్యమునింక వినువారలెవ్వ రుండెదరు? తలలు వణకుచుండగా తెల్లని గువ్వలవలె నెరసిన వెండ్రుకలు గలవారమగు మేము ఓ నిర్మలమైన మనస్సుగల రామా! ఈ దుమ్ములో సాష్టాంగపడి వేడెదము. తేరును మరల్పుము. ఇచ్చటకు వచ్చిన బ్రాహ్మణులలో నెందఱో యజ్ఞములు చేయదలచినవారు. సమస్తము సిద్ధమైనది. ఓ పుణ్యచరిత్రుడా! అవి సమాప్తినొందుట నీ వశమునందున్నది సుమా.

స్థావరములు జంగమములనైన సమస్త భూతములును నీయందు భక్తితో నిండియున్నవి సుమా. ఇట్లు వేడుకొన కరుణ చూపింపుము. చెట్లన్నియును తమ వేరులు నేలలో పాతికొనియుండుటచేత నీవెంట వచ్చుటకు సమర్థతలేనివై పౌరులవలెనే నిన్ను 'జూచుచు ఓ రఘురామా! మమ్ము విడచి వెళ్లెదవా?'యని ఊరక గాలివేగముచేత హోరని యేడ్చుచున్నవిగదా. అక్కటా! సర్వభూతముల యందును దయగలవాడవగుటచే కదలలేక ఆహారమునందిష్టములేక చెట్లకొమ్మల యందు నిశ్చేష్టితములై పక్షులన్నియును, నిన్ను నిలువుమని యాచించుచున్నవి. అదిగో చూచితివా?"



# నలువది యాఱవ సర్గము

## శ్రీరాముడు తమసా నదీ తీరమును జేరుట :

అని సకలజనులును రామచంద్రుని మరలుమని ప్రార్థింపగా తాను కూడ రాముని నడ్డగింప వచ్చినదా యనునట్లుగా తమసా నది వారు వెళ్లుమార్గమున కడ్డముగా వచ్చెను. అంతట సుమంత్రుడు ఆ నదీతీరమున రథమును నిలిపి రథమునుండి గుఱ్ఱములను విప్పి మార్గమందయిన యలసట పోవునట్లుగా నీరు త్రావించి మేతవేసి వాని శరీర మంతయును తోమి కొంతసేపటునిటు త్రిప్పుచుండగా శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణులను చూచుచునిట్లనెను. "మనము వనములలో గడపుటకు వెళ్లు వ్రతదినములలో మొదటిదగు దినము వెళ్లుచున్నది. ఓ అనఘా! లక్ష్మణా! అడవులలో ప్రవేశించితిమి. వనములలో నెట్లుండెదమో యని విచారింపకుము. తమ తమ నెలవులకు వెళ్లుచున్న వన్యమృగములు పక్షులు మొదలగునవి వెళ్లిపోగా శూన్యములైయున్న ఈ మార్గములు ఏడ్చుచున్నట్లున్నవి చూచితివా? లక్ష్మణా! అక్కటా! నా తండ్రి యొక్క సాటిలేని రాజధానిలో జనులు స్త్రీలును పురుషులును మిక్కిలి ప్రేమతో మనలను దలంచుచు ఎక్కువగా విచారించుచుందురు. ఎందువలనననగా మన ప్రజలందఱు నెల్లప్పుడును, భరతుని, చిన్నతమ్ముడగు శత్రుఘ్నుని, నిన్ను నన్ను, దశరథ మహారాజును ఎక్కువైన దయతో ప్రేమించుచుందురు గదా! తండ్రిని తలంచినచో దుఃఖము కలుగును. సాధ్వియు, కీర్తి గలదియు, వృద్ధురాలును నయిన నా తల్లిని తలచినచో గుండెలు ఝల్లుమనుచున్నవి సుమా! అంతకంతకు నదేపనిగా నేడ్చియేడ్చి ఘోరముగా కనులు వాచగా నా తల్లిదండ్రులు గ్రుడ్డివారగుదురేమో గదా! యని సందేహము కల్గుచున్నది. లక్ష్మణా! తల్లిని తండ్రిని విచారించకుండునట్లుగా ఆదరముతో ఊరడించుటకు బుద్ధిమంతుడగు కేకేయి కుమారుడు భరతుడున్నాడు గదా! భరతుని యొక్క ధర్మపరత్వమును, దయార్ద్రమైన బుద్ధిని మఱల మఱల తలచి తల్లిదండ్రులను

గుఱించి నేను మనస్సునందు కొంచెమైనను భయపడుట లేదు. నీ విట్లిష్టముతో నావెంట వచ్చి యీ యరణ్యములలో సీతను కాపాడుకొనుటకు సహాయముగా నుండుటచే నాకు మేలొనరించితివి సుమా! ఈ రాత్రి యిందేయుండి ఇచ్చట పండ్లు దుంపలు ననేకముగా నున్నను నీరు మాత్రమే త్రావి యుపవాస ముండెదను. అట్లు చేయవలెనని కోరిక కలిగినది.” అని పలికి సుమంత్రుని జూచి “అనఘా! గుఱ్ఱములను జాగ్రత్తగా జూడుము” అని చెప్పెను. సుమంత్రుడు వెళ్లి ప్రొద్దుక్రుంకుచుండగా గుఱ్ఱములకు కొదువలేకుండగా నీరును, మేపును బెట్టి ఆ తరువాత సంధ్యావందనము చేసి తరువాత లక్ష్మణునితో గూడి ఆ నదీ తీరమునందు ఆకులతో శయ్యను సిద్ధపరుపగా ప్రీతితో రఘూద్వహుడు సీతతో చిన్న తమ్మునితో అందు శయనించెను. అన్నయు వదినెయు నిదురించినంత వారిని చూపి లక్ష్మణుడు సుమంత్రునితో నిట్లు పలికెను. “సుమంత్రా! చూచితివా తామర రేకుల వంటి కన్నులు గలవారును, సౌఖ్యములను పొంద దగినవారును అగు వీరిరువురు నిట్లు పడియున్నారు.” అని యీ విధముగా రఘురాముని యెన్నరాని సుగుణములను రెప్పవేయ కుండగా ఎన్నిటినో చెప్పుచు మాటలాడుచుండగనే సూర్యోదయమగు సమయమయ్యెను. ఆ విధముగా ఆలమందలతో నిండిన తీరప్రదేశములు గల తమసా నది తీరమునందే సుగుణాకరుడగు రాముడు భార్యయు తమ్ముడు తనను సేవించుచుండగా, పౌరజనపదులతో గలసి ఆ రాత్రి నివసించెను.

**శ్రీరాముడు పౌరులను మోసగించి పోవుట :**

అంతట రాముడు మేలుకొన్నవాడై అక్కడక్కడ గుంపులుగా మార్గశ్రమముతో నిద్రించి యున్న జనుల సమూహములను చూచి, “చూచితివా లక్ష్మణా! ఎంత వింతలు పుట్టెనో. వీరందఱు ఇండ్లమీద ఆశను విడచిపెట్టి మనమీది ప్రేమచే ఈ మిట్టపల్లములయందు చెట్ల మొదళ్లయందు పడి నిద్రించుచున్నారు గదా. ‘మూర్ఖత్వము వలదు. నేను పట్టణమునకు వచ్చువాడను గాను. పొండు’ అని యెంత చెప్పినను వినక వెంటబడిరి. గట్టిగా జెప్పినచో ప్రాణములనే విడుతురు. ఇది నిక్కము. కనుక ప్రజలందఱు నిద్రలో నుండగనే మెల్లగా రథమునెక్కి

వనభూమియందు నిర్భయమైన మార్గముల వెంట వెళ్లుదము. ఇప్పుడు వీరందఱు నాదమరచి నిద్రించియున్నారు. ఇకపైన నిట్లు మరల నిద్రింపరు. ప్రజలు తమంత తాము కొనితెచ్చుకొన్న దుఃఖములను రాజు పోగొట్ట వలయును. అట్టిది నాకయి వీరలు కష్టములు పడుట యెందులకు? త్వరగా వెళ్లుట మంచిది గదా!" అనగా తమ్ముడా మాటకంగీకరింపగా సుమంత్రుని జూచి రాముడిట్లనెను. "సుమంత్రా ఈ ప్రజలందఱు మేలుకొని అల్లరి చేయకముందే రథమునకు గుఱ్ఱములను గట్టుము. అవలీలగా దాటివెళ్లుదము లెమ్మ"నగా సుమంత్రు డట్లే చేసి "ఓ రామచంద్రా! రథము సిద్ధమైనది. నీవు లక్ష్మణునితోడను భార్యతోడను గూడి ఎక్కుము" అని పల్కెను. వారు రథమునెక్కగనే అత్యంతమైన వేగముతో సారథి రథమును తోలి నదిని దాటించెను. అంత రాముడు ఒక పెద్ద కాలిమార్గమును జూచి అచ్చట ప్రవేశించి పౌరుల మోసగింప దలచి సుమంత్రునితో నిట్లు పలికెను. "సుమంత్రా! నీ వొక్కడవే రథమునుత్తర దిక్కుగా కొంత దూరము తోలుకొనిపోయి అక్కడ నుండి మారుదారులవెంట నెట్లైన మరలిరమ్ము. మేమిక్కడనుండి కాలినడకతో నేగుచుండెదము. ఎట్లైనను ఈ పౌరులు మమ్ము చూడకుండునట్లు చేయుము" అని చెప్పగా సుమంత్రుడట్లే చేసి తిరిగి రఘురాముని చేరెను. అంత వారు మువ్వురు రథము నెక్కగా సారథి శుభప్రయాణమున శకునమునకై రథమును ముందుగా ఉత్తరదిక్కుగా నడపి తరువాత అడవులకు వెళ్లు మార్గమున పరువెత్తునట్లుగా వేగముగా గుఱ్ఱములను దోలెను.



# నలువది యేడవ సర్గము

## పౌరులు శ్రీరాముని గానక దుఃఖించుట :

తెలతెలవారుచుండగా జనులందఱు లేచినవారై రాముడు కనిపించక పోవుటచే ఆర్తితో దుఃఖమునొంది మూర్ఛలను పొందుచు కనులవెంట నీరు కారుచుండగా, ఇచ్చట నచ్చటను వెదకి ఎందును వారి జాడ కనలేక దుఃఖముతో గూడిన మనస్సులు గలవారై "ఓ రఘువరా!" అని అరుచుచు వెచ్చని యూర్పులను విడుచుచు, "ఈ నిద్ర పాడుగాను, ఇది నెత్తినెక్కి యిట్లు చేసినది గదా. అయ్యయ్యో! బుద్ధి పొరపాటైనది. ఎక్కడకు వెళ్లుదుము? ఎచ్చటను కనిపించుటలేదే. తన భక్తుల నందఱను వీడి అడవులకు వెళ్లెను గదా! ఎప్పుడును ఎవ్వరిని వంచించి ఎఱుగడు. నేడిట్లెందులకు చేసెనో గదా. (న చ ప్రమాదాత్ అను శ్రుతి యీ యపాయమునే సూచించుచున్నది. భగవద్విషయమున నేమాత్రము ప్రమాదమైనను హానికరమే. సీతయు నిట్లే మోసపోయెను.) విశాలమైన ఎద గలవాడును, మహాభుజుడును ఎట్టి పనినైనను పట్టుదలతో నెరవేర్చువాడును రాజపుత్రుడునగు రాముని మరల నెట్లు చూడగల్గుదుమో? తన కన్నబిడ్డలను తండ్రి సంరక్షించునట్లుగా మనల నెల్లప్పుడును రక్షించువాడు. సాహసమును పొంది యిప్పు డిందఱిని విడిచిపెట్టి యెందులకు వెళ్లెనో? రామచంద్రుడు లేకున్నచో మన ప్రాణములున్న నేమి? పోయిననేమి? అట్లు గావున నిచ్చటనే మన ప్రాణములను విడుచుట మంచిది గదా! లేదా యిక మృత్యుముఖమున కభిముఖముగా ఉత్తర దిశగా పోవుటయే మనకు తగియుండును. ఈ రెండింటిలో నేది చేయుట యుత్తమమో చెప్పవయ్యా! ఇచ్చట నెండుకట్టెలు దండిగా నున్నవి. వీనినన్నింటిని ప్రోగుచేసి చితిగా పేర్చి

మండించి దానిలో పడినవారమై యముని చూడ నేగుట మనకు తగియుండును. ఆ ప్రేమయును, ఆ ప్రీతియును, ఆ నీతియును, ఆ ఈర్ష్యలేనితనమును, ఆ మృదువైన మాటలును, ఆ సాటిలేని గుణసంపదయు నే మనుష్యులయందు చూడగలము? ఇక నేమనుకొన్నను లాభమున్నదా? మనము తిరిగి యిండ్లకు వెళ్లగనే వృద్ధులును, ఓపలేనివారును, స్త్రీలును, బాలురును, అయ్యలారా రాముడేడి? మీవెంట మరలివచ్చెనా? అనగా వారందఱకు రాము నడవులలోనికి సాగనంపి వచ్చుచున్నామని చెప్పవలెనా? లేక మఱేమని చెప్పుటకు వీలగును? రామునితో కూడ వచ్చియును, రాముని తీసికొనకుండ వెళ్లినచో స్త్రీలు బాలురు వృద్ధులు గల పట్టణమంతయు ఎక్కువైన యార్తితో దుఃఖింపదా? రాముని యందున్న ప్రేమచేత నింతదూరము రామునితో గూడివచ్చినారము. తిరిగి యే ముఖములతో పట్టణమున ప్రవేశించువారము?" అని చింతతో, దూడలకు దూరమైన ఆవులవలె తమ చేతులను పైకెత్తి అనేక విధములైన ఏడ్పుతో గూడిన విలాపములతో జనులెల్లరు నేమి చేయుటకు తోచనివారై వాపోయిరి. రథము వెళ్లిన జాడలను పట్టి కొంత దూరము వెళ్లి ఆ తరువాత దాని జాడ కూడ తెలియకపోవుటచే ఆవేదనను జెందుచు పౌరులు నిర్భాగ్యులమని ఊరక తమను తాము తిట్టుకొనుచు విలపించిరి. "అయ్యో యిది యేమి? ఇకనేమి గతి యున్నది? ఇకనేమి చేయవచ్చును? ఇందఱను దైవమే యీ విధముగా మోసగించెను గదా!" అనుకొనుచు నేడ్చుచు పట్టణమునకు వెళ్లిరి.



# నలువది యెనిమిదవ సర్గము

## పౌరు లయోధ్య మరల జేరుట :

అట్లు పురమును ప్రవేశించి పౌరులు తమలో తామిట్లనుకొనుచుండిరి. "అయ్యో! రాముడు లేకుండుటచే పట్టణమంతయు పాడుపడినట్లున్నది గదా! ఈ పురమున నశుభము జరిగినట్లున్నది గదా! గరుత్మంతుడు వెంటాడి సర్పమును వెడలగొట్టగా కళావిహీనమై యున్న సరస్సువలెను, చంద్రుడులేని యాకాశమో యనునట్లును, నీళ్లులేని సముద్రమో యనునట్లును చింతచే ఈ పట్టణము వన్నె తరిగి యున్నది గదా!" తమ కన్నులు వాచునట్లుగా నేడ్చుచు సమీపించి తమను తమవారును, పైవారును చూచుచుండగా వారిని కన్నుల నీరునిండి యుండుటచే చూడలేక గుర్తింపలేకపోయిరి. రామునివెంట వెళ్లి యీ ప్రకారముగా తిరిగివచ్చి పీనుగులవంటివారై తమ యిండ్లలో ప్రవేశించి తమ భార్యాపుత్రులు చుట్టునుచేరి దీనత్వముతో ముఖములందు చేతులను కప్పుకొని చావుగోరుచున్నవారై "ఇంకేమి గతి మనకు? ఎక్కడకు వెళ్లుదము?" అనుచు 'హా'యని బిగ్గరగా నేడ్చిరి. ఆ గృహములందుండు యజమానులెవ్వరును క్రొత్తగా వచ్చిన స్నేహితులను జూచి సంతోషమును పొందరు. క్రొత్తవైన వస్తువులను జూచియు నానందింపకుండిరి. కోమటు లెవ్వరును అంగళ్లను దెరువరు. క్రొత్త కోండంద్రు అత్తవారిండ్లకు వచ్చినను సంతసింపరు. పట్టణములోని పౌరులెవ్వరును వంటలకై దుఃఖాతిశయముచేత ప్రొయ్యికూడ రాజజేయరు. ఎక్కువయిన ధనములు లభించినను సంతోషింపరు. పూర్వము కోలుపోయిన ధనము లభించినను మురిసిపోరు. ఆ పట్టణము నందు తొలిచూలునందే పుత్రుని పొందిన తల్లిదండ్రులు కూడ మనస్సున సంతోషింపరు.

**పౌరులయోధ్యకు వెళ్లగా స్త్రీలు వారిని నిందించుట :**

ప్రతి యింటియందును నేడ్చుచుండిన స్త్రీలు తమ భర్తలు తిరిగి యిండ్లకు వచ్చుటను జూచి ఆర్తితో వాడిమాటలతో - ఏనుగుల నంకుశములతో బొడిచినట్లు ఎకసక్కెములాడి బాధించిరి. (ఆనాటికి నీనాటికి స్త్రీలయందే యెక్కువ భక్తిశ్రద్ధలు కానవచ్చుచున్నవి. మన మతమిప్పుడు వారినే యాశ్రయించి జీవించియున్నది.) మీరందఱు నా రామచంద్రునితో వెళ్లియును ఆ రాజును తోడి తేలేక యిండ్లకేముఖములతో తిరిగి వచ్చినారలు? మీకీ యిండ్లెందులకు? భార్యాబిడ్డలు ఎందులకు? సుఖములును సంపదలు నెందులకు? ఆ శ్రీరామచంద్రుని కన్నులార చూడజాలని సుకృతులుగాని మీకివియన్నియు నెందులకు? ఈ జగత్తునందు లక్ష్మణుడొక్కడే సుజనులలో నుత్తముడు. ఎక్కువైన భక్తితోడను, ప్రేమతోడను సీతాసమేతుడయిన రాముని సేవించుటకై చక్కగా అడవుల కేగినవాడు. ఆ అడవిలోని సుందరములైన నదులు, సరోవరములు రామచంద్రుడు తమలో స్నానము చేయుటకు అవి యెంత పుణ్యమును చేసికొన్నవో గదా! అడవులలోనుండు మృగములును, పక్షులును, అందమైన ప్రదేశములును, నదులును, నదీతీరములును, పెద్దవైన కొండలును గుహలును శ్రీరాము నెంతగానో అలరించును. అడవులును పర్వతములును తమకిష్టుడైన అతిథివలె వచ్చిన సీతానాథుని పూజింపకుండగా నెట్లుండ గలవు. తుమ్మెదల గుంపులతో గూడి పుష్పములు దట్టముగా గల గుత్తులతో ప్రకాశించుచు వనవృక్షములు రాముని దర్శించి, ధన్యములగును గదా! తగిన కాలము కాకున్నను పర్వతములు తమయొద్దకు వచ్చిన సీతానాథుడగు రామచంద్రునకు ఎక్కువైన భక్తితో పువ్వులను పండ్లను సాదరముగా నొసగునుగదా! పురుషులలో శ్రేష్ఠుడైన రాముడు తమ తమ పొలిమేరలను చేరరాగానే గొప్ప పర్వతములు భక్తిశ్రద్ధలతో సెలయేళ్ళ నిర్మల జలములను చిత్రచిత్రముగా వారి యొద్దకు ప్రవహింపజేయును. ఎండలకు వారు అలసిపోయి తమ సమీపమున తమ కాళ్ల నొప్పులను దొలగించుకొనుటకు కూర్చున్నప్పుడు వృక్షములు తమ కొమ్మలను వీచుచు చల్లని గాలితో వారిని సంతోషపెట్టును గదా!

**పురస్త్రీలు శ్రీరాముని దలంచి దుఃఖించుట :**

మంచి గుణగణములచేత ప్రకాశించు శ్రీరామచంద్రు డెచ్చట నుండునో అచ్చట భయముండదు, పరాభవమునుండదు. ఆ సచ్చరితుడైన రాముడు వేగముగా దూరమునకు వెళ్లకముందే పదండి మనము కూడ వెళ్లి ప్రేమతో అచ్చటనే నివసింతము. అతడే జీవకోటుల కన్నిటికి నాధారమును, ప్రాప్యమును గాన ఆ మహాత్ముని భక్తితో అన్యథాగతి లేనియట్లుగా పదసేవ చేయగా మనస్సులు సంతోషమునందును. మేము సీతను భక్తితో గొల్చెదము. మీరు ఆ సూర్యనిభతేజుని ప్రీతితో భజింపుడు. లెండు త్వరగా వెళ్లుదము. మీ యోగ క్షేమములను ఆ యనఘుడగురాముడు చూచుచుండును. మా యోగక్షేమము లను సీతాదేవి చూచును. వారినే సేవించుచున్నచో మనకెట్టి భయములు నుండవు. ప్రశస్తము గాక సౌందర్యహీనమై అవలక్షణములు గలిగినదై, ఆత్మనాశనకరమై మిక్కిలి శోకమును బెంచుచున్న ఈ యింటిపై నెవ్వనికి ప్రేమ గలదు? ఈ కైక రాజ్యమును పరిపాలించినచో నింక నీ నగరము ధర్మము నశించినదై దిక్కులేని దగునుగదా! ఇక్కడ నింక బ్రతుకుట యెక్కడిది? ఎక్కడి బిడ్డలు? ఎక్కడి ధనములు? ఇవేటి మాటలు? సంపదనార్జించుటకై పుత్రునే విడచినది. భర్తకు దూరమైనది. అట్టి దుర్మార్గురాలు వంశమునకు పాపమును గలిగించినది యగు కైక యింక నెవ్వరినైన నేమైన జేయగలదు. మనమేమి చేయగలము? ఈ కైకేయి బ్రతికియుండగా ఆమెయొద్ద కూలి వాండ్రమై బ్రతుకుటకు మా మనస్సులు ఒప్పుకొనుటలేదు. ఇది నిజము. మా బిడ్డల మీద ప్రమాణము చేసి చెప్పుచున్నాము. రాజపుత్రుడైన రామచంద్రుని కనికరమనునది కొంచెమైనను లేకుండ దుర్మార్గమైన తలంపుతో వనసమూహము లందు కష్టపడుట కంపిన దుష్టబుద్ధి గలది. దుష్టశీలము గలది. అయ్యో! యిట్టి మాయలాడిని సేవించి యెవడయినను సుఖమును పొందగలడా? అనాథయై జనసంచారము లేనిదై యికపైన ఈ పట్టణమంతయు పాడుపడి పోవును గదా? ఈ రాముడు వనములకు బోవుటచే ఈ రాజు చచ్చుట తప్పదు. ఆపై ఈ భూమి మీద ఏడుపే మిగులును. ఓ పుణ్యహీనులారా! మీరందఱు

నిది తెలిసికొని విషమును త్రావుటయో లేక రాము ననుసరించి వెళ్లుటయో, కాకున్న ఈ నగరము పేరైనను వినిపించని దూరప్రదేశములకు వెళ్లుటయో నిశ్చయించుకొనుడు. తెలిసికొనలేక మోసపోయినవాడై దశరథ మహారాజు రాముని తమ్మునితోడను, జానకితోడను అడవులకు సాగనంపినవాడై దయలేని వాడై వెనుదీయక మిమ్మును, మమ్మును, దిక్కులేని వారిని కసాయివానికి పశు వులమంద నొసగినట్లుగా కైక కుమారున కప్పగించెను. నిండైన చంద్రుని వంటి ముఖము గలవాడు, శత్రువులకు యముని వంటివాడు. కనిపింపని సంధి యెముకలు గలవాడు, ఉత్తమములైన ఆజానుబాహువులు గలవాడు. తామరలను బోలిన కన్నులు గలవాడు. ఎందరితోనైనను తానే ముందుగా మాటాడువాడు. మంచి మాటలను ప్రేమతో పలుకువాడు. తిరుగులేనటువంటి పరాక్రమము గలవాడు. నెమ్మదియైనవాడు. మఱియు జగత్తునకంతకు చంద్రునివలె ప్రియమైనవాడు. పురుషులలో శ్రేష్ఠుడు. అట్టి పుణ్యమూర్తియగు రాముడు ఘోరములైన యడవులను శోభింపజేయ కుండునా? ఆ శ్రీరాముడు సత్యమునే వచించువాడు. దానముచే ప్రకాశించు ఏనుగువంటి నడక గలవాడు. ఆ మహానుభావుడు తన శరీరకాంతిచేత ఆ వనమునంతయును ప్రకాశింప జేయును గదా!” ఈ ప్రకారముగా ఆ పురమున నున్న స్త్రీలందఱు అత్యధికముగా మృత్యుభయము నందినవారివలె బాధనందుచుండగా అంతలో సూర్యుడస్త మించెను. బ్రాహ్మణులెవ్వరును అగ్నులందు హోమములు చేయుటలేదు. వేదములను పురాణములను మంచి కథలను ఇష్టముతో నెవ్వరును పఠింపరైరి. చీకటులు దట్టముగా వ్యాపింపగా దైన్యమున మునిగి, దిక్కులేక, కొంచెమైనను సంతోషములేక శూన్యముగా నున్న వీథులు గలదై గ్రహములు, నక్షత్రములులేని యాకాశము విధముగా ఆ సమయమున నయోధ్యా పట్టణముండెను. ఆ పురమున నున్న స్త్రీలందఱును తమ ముద్దుబిడ్డలనో తమ్ములనో అన్నలనో యెడబాసినట్లుగా ప్రియమైన రామునికై అంగలార్చుచుండగా, శాంతికరములగు గీతములుగాని నృత్యములుగాని ఉత్సవములుగాని లేనిదై కెరటములులేని సముద్రము వలె అప్పుడా యయోధ్యాపట్టణము కనుపట్టెను.

# నలువది తొమ్మిదవ సర్గము

## శ్రీరాముడు కోసల దేశము దాటిపోవుట :

అక్కడ శ్రీరామచంద్రుడా మిగిలిన రాత్రియందు చాల దూరము వెళ్లి తెల్లవారగనే సంధ్యావందనాదికము నొనర్చి మఱల బయలుదేరి ఆదేశమునంతను దాటుచు దూరమున నున్న యూళ్లను, సుందరముగా నున్న తోటలను, విత్తనములు వేయుచున్న దున్నిన మడులను జూచుచు తొందరగా వెళ్లుచుండియును మెల్లగా వెళ్లుచున్నట్లు కన్పించుచు వెడలెను. అప్పుడాయా గ్రామములందలి జనులు వారిని జూచి "ఛీ ఛీ! దశరథుడు కామమునకు వశుడై ఆడుది చెప్పిన మాటలకు చెవియొగ్గెను. అయ్యో! ఆ కైక యెంత పాపాత్మురాలు! పాపములచే చెడిపోయినది గదా! ఆమె ఎంతటి అభిమాన హీనురాలు? ఎంత దుష్టురాలు! ఎంతటి పాప దుశ్చింతనలు గలదియో! ఈ పవిత్రుని, దయగలవానిని, ఎక్కువైన శాంతము గలవానిని ఇంద్రియములను జయించినవానిని చిన్ని బాలకుడగు రాముని వనములకు సాగనంపెను. మహానుభావురాలైన యీ విదేహరాజపుత్రి కారడవులలో నెట్టి దుఃఖముల ననుభవించునో గదా! అయ్యయ్యో! దశరథుడెంతటి ప్రేమలేనివాడో గదా! ఈ పవిత్రుని, లోకులకు మేలుగూర్చువానిని తన పుత్రుని ఘోరాటవులలో బడి కష్టపడునట్లుగా వదలెనుగదా!" ఈ రీతిగా వారు చెప్పుకొనుచుండగా ఆలకించుచు వీరుడైన రఘురాముడు ఆ కోసల దేశమును తొందరగా గడచిన వాడై వేదశ్రుతియను పేరుగల యొక నదినిజేరి అక్కడనుండి దక్షిణాభిముఖముగా బయలుదేరి వెళ్లుచు గోమతీనదిని సాదరముగా జూచి తొందరగా దానిని దాటెను. అటనుండి గదలి చిలుకలు గోరువంకలు, మత్తమయూరికలు,

కలహంసలు మొదలగు పక్షుల కలకలముతో మనోహరమైన స్యందికానది తీరమును దాటి రామచంద్రుడు జానకితో నిట్లు పలికెను. “ఓ కమలములవంటి కనులు గలదానా! ఈ నదియే యెల్లగా నున్న రాజ్యమును మనువు ఇక్ష్వాకు మహారాజున కొసగెను. తక్కిన రాజ్యములను ఇతర రాజులు పన్ను చెల్లించుచు సంప్రీతితో నేలుకొనుచుందురు.” అని చెప్పి తన రథసారథిని జూచి “ఓ సుమంత్రా! అనఘా! హంసలయొక్క కలస్వరములతో మనోహరముగా నుండు సరయూనదీ తీరమున అందమైన తోటలయందు తల్లియు, తండ్రియును తోడురాగా సంతోషముతో మృగయా వినోదమున చరించు పుణ్యము లెన్నటికబ్బునో గదా! భూమియందు రాజర్షులు వేడుకకై వేటాడుదురు. సజ్జనులు పితృకార్య వేళలందు వేటాడుదురు. విలుకాండ్రు గుఱి నభ్యసించుటకై వేటాడుదురు. కాని నాకట్టి కోరిక లేదు.” కోసలాధిపతియైన శ్రీరాముడిట్లు రాజుల గుణములను స్మరణమొనర్చుచు సుమంత్రునితో సంతోషముగా ముచ్చటగా చెప్పుచు కోసల దేశపుటెల్లను దాటివెళ్లెను.



# ఏబదవ సర్గము

ఇదివరకు పురజనుల యొక్క సమ్మర్దముచేత నమస్కరించుట కుదురక పద్మాక్షుడగు రాముడు పురము దిక్కుగా ముఖమునుపెట్టి మ్రొక్కి అయోధ్యా పట్టణమును వినయోక్తులతో నిట్లు వేడెను. “రఘువంశరాజుల చేత పరిపాలింప బడిన ఓ పురోత్తమమా! తండ్రి యాజ్ఞను నెరవేర్చి అడవులలో దిరిగి మరలివచ్చి నా తల్లిదండ్రులను ప్రేమతో కలిసినవాడనై నిన్నును గ్రామదేవతలను నీయందు వెలసియున్న దేవతల నందఱను దర్శించుకొందును. నాయందు దయ యుంచుము” అని యీ ప్రకారముగా పలికి యెఱ్ఱనైన కన్నుల నుండి కన్నీరు గురియుచుండగా కుడిచేతిని పైకెత్తి అచట గుంపుగూడిన పల్లె ప్రజలను చూచి వారితో నిట్లనెను. “ఓ అనఘాత్ములారా! మీరందఱును నాయందింత మిక్కిలిగా ప్రేమను దయను తగిన విధముగా నుంచినందులకు మీకిట్లు పాపఫలమైన చిరకాల దుఃఖము సంభవించినది. దీనిని తొలగించుట శక్యమా? మీమీ పనులను చేసికొనుటకు వెళ్లుడు. నేనును నా కర్తవ్యమును నెరవేర్చుటకు వెళ్లెదను” అని రాముడు పలుకగా వారు మహాత్ముడైన రామునకు ప్రదక్షిణముచేసి ఏడ్చుచు వెడలి, అచ్చటచ్చట నిలిచి జలజముల వంటి నేత్రములు గల రాముని చూచుచు తృప్తినందనివారై పోవుచుండిరి. రాముడు వారి కందఱకు రాత్రియందు సూర్యునివలె కనుమరుగై వెడలిపోయెను. ఈ ప్రకారముగా వెళ్లుచు కౌసల్యా కుమారుడు ధనధాన్యములతో నిండినదియు, దానధర్మములు తెలిసిన జనులతో గూడినదియు, అందమైన భోగభాగ్యములతో నొప్పుచున్నదియు, ఎక్కడ నుండియు భయములేనిదియును, మిక్కిలి అందమైనదియును దైవ

మందిరములతోను యాగయూపస్తంభములతో గూడినదియు, గున్నమామిడి తోటల యందములు గలదియు, జలములతో నిండియున్న సరోవరములు గలదియు, సంతుష్టితోను, సంపదలతోను నిండియున్న పట్టణములు గలదియు, ఆలమందలు వేలకువేలు గలిగి యొప్పుచున్నదియు, బ్రాహ్మణుల యొక్క వేదఘోషములతో పవిత్రమైనదియు, శుభకరమును, చక్రవర్తులచే చూడదగి నదియునగు కోసల దేశమును చూచుచు, మధ్య మధ్య కనిపించు ఉద్యాన వనములను దాటుచు ధీరోత్తముడగు రాముడు రాజులనుభవింపదగిన రాజ్యమును వీడివెళ్లెను.

**శ్రీరాముడు గంగానదిని గాంచుట :**

ఆ విధముగా వెళ్లుచు సూర్యవంశ శ్రేష్ఠుడగు రాముడు సంతోషముగా, నిరంతరము లగు తరంగములతో నుప్పొంగుచున్నదియు, మంగళకరమగు జలముతో గూడినదియు, మహర్షులచే సేవింపబడినదియు, పరిసరములందు ఋష్యాశ్రమములు గలదియు, అప్సర స్త్రీలచేత సేవింపబడిన, సుందరజల పక్షుల కలరవములతో ప్రకాశించెడు జలాశయములు గలదియు, నరుల యొక్క పాపములను సంసార భయమును నశింపజేయునదియు, శుభములను గలిగించునదియునగు గంగానదిని జూచెను. ఆ నది లీలగా విహరించుచున్న దేవకాంతలు గల పర్వతములతోను, ఉద్యానవనములతోను ప్రకాశించు చుండెను. నీటి యొక్క ఒరవడి శబ్దములనెడు అట్టహాసము గలదియై, ప్రకాశమైన నురువనెడి నవ్వు గలదియై, ఒక్కచోట ప్రవాహమై, ఒక్కచోట సుడులు గలిగి, ఇంకొక్కచోట గంభీరముగా కదలిక లేనిదై వేఱొక్కచోట అతివేగముగా ప్రవహించుచు, ఒక్కొక్కచోట గొప్పదైన ఘోషము గలదై దేవతల సమూహములతో నిండినదై, ఒక్కొక్కచోట నిర్మలములైన కమలములు గలదియై వేరొకచోట వికసించిన కలువలు గలదై ఒక్కొక్కచోట విశాలమైన తెల్లయిసుక

తిన్నెలు గలదై, ఒక్కొక్కచోట దివ్యములైన హంసల, బెగ్గురుల, చక్రవాకముల కలధ్వనులు గలదై ప్రకాశించుచుండెను. ఇంకను ఆ నది ఒక్కొక్కచోట గట్లమీద గల చెట్ల వరుసలు సుకుమారములైన హారలతలు కాగా, ఒక్కచోట క్రొత్తగా వికసించిన నల్లకలువలతో గప్పబడినదై వేఱొకచోట తెల్లకలువలతో ప్రకాశించు నదై మఱియొకచోట అనేక విధములైన పుష్పముల యొక్క పరాగములతో నిండినదై, ఒక్కొక్కచోట నిర్మలమైన అద్దమువలె నిగనిగ లాడుచున్నదై, ఒక్కొక్కచోట దిగ్గజములును, అడవి యేనుగులును, దేవతల వాహనములును శబ్దించుచున్న అడవులతో గూడి రత్నభూషణములను ధరించిన స్త్రీయనునట్లుగా నొప్పుచు కన్నుల పండువు చేయుచుండెను. మఱియు ఎన్నరాని ఫలపుష్పముల తోను, చిగురులతోను కూడియున్న పొదలయందలి పక్షుల రొదలు గలదియు, నీటికోతులతోను, పాములతోను గూడినదియు, విష్ణుపాదమునుండి జారి వచ్చినదియు, పాపరహితురాలును, పాపములను బోగొట్టునదియు, శివుని యొక్క జటాజూటము నుండి విడువబడినదియు, గాంభీర్యము గలిగి సముద్రము నందు కలియుచున్నదియు, సముద్రుని యొక్క పట్టమహిషి యైనదియు, బెగ్గురులు, క్రౌంచపక్షులు, తెల్లకొంగలు మొదలగు జలపక్షుల నినాదములచే నందమైనదియునగు గంగానదిని కన్నులార దగ్గఱకు వెళ్లి చూచి అచ్చట నున్న శృంగిబేరపురమును చేరునట్లుగా శ్రీరాముడు తొందరగా వెళ్లెను.

**శ్రీరాముడు గంగా తీరంబు చేరుట :**

"ఓ సుమంత్రా! అందమైన తరంగములతో నిండుగానున్న గంగానదిని జూచితివా? సూతా! యిప్పుడు మనమిచ్చట నిలుచుట యనుకూలముగ నుండునుగాన వీలైనచోట రథమును నిలుపుము. అదిగో చూచితివా దగ్గరలోనే వికసించిన పువ్వులు గల కొమ్మలతో నొప్పుచున్న గారచెట్టు. ఇక నెమ్మదిగా అచటికి తేరు నడపుము. అచ్చట నుందము. దేవతలచేతను, దానవులచేతను,

మానవులచేతను సేవింపబడునదియు, మచ్చికతో దిరుగు మృగములచేతను, పక్షులచేతను ఒప్పుచున్నదియు నగు గంగ నక్కడనుండి బాగుగా చూడవచ్చును అని శ్రీరాముడు చెప్పగా లక్ష్మణుడును ఒప్పుకొనగా సూతుడు రథమును తొందరగా ఆ యింగుపీ వృక్షము చేరునట్లుగా తోలెను. అక్కడ ముప్వురు దిగిరి. తరువాత సుమంత్రుడును రథము నుండి గుఱ్ఱములను విప్పి వానికి నీరును మేతయును బెట్టి, ఆ చెట్టు యొక్క దట్టమైన నీడను విశ్రమించియున్న రాముని యొద్దకు చేతులు జోడించుకొని వెళ్లి నిలిచెను. అప్పుడు రామచంద్రునకు ప్రాణస్నేహితుడును, నిసాద కులమున పుట్టిన వాడును, గొప్ప బలగము గలవాడును, మొక్కవోని పరాక్రమము గలవాడును, బోయల నాయకుడును అగు గుహుడు ఈ విధముగా రాముడు చెట్టునీడనుండుట విన్నవాడై వృద్ధులును, హితులును అగు మంత్రులు మొదలగు వారితోడను బంధువులతోడను కూడినవాడై వచ్చుచుండెను.

**గుహుడు శ్రీరాముని దర్శించుట :**

వచ్చుచున్న ఆ గుహుని దూరమునుండియే చూచి సంతోషముతో పొంగిపోవుచు శ్రీరాముడు సీతతోడను లక్ష్మణునితోడను గూడ అతనిని సమీపించగా రాముని యొక్క వేషమును జూచి యతడు మిక్కిలి దుఃఖమును పొందినవాడై చేతులతో గ్రుచ్చి కౌగలించుకొని ప్రేమతో యిట్లనెను. (గుహుడు స్నేహాసక్తి – హనుమంతుడు దాస్యాసక్తి – సీత కాంతాసక్తి యను భక్తి భేదములు గలవారు) "ఓ రామచంద్రా! అయోధ్య యెట్టిదో యీ పట్టణము కూడ నీకు అట్టిదే యని మనసులో తలంచుము. నన్నేమి చేయుమందువో చెప్పుము. ఓ సచ్చరితా! ఇట్టి ప్రియుడైన మనస్సునకు నచ్చిన అతిథి లభించుట శక్యమా? నేనెట్టి పుణ్యములు చేసితినో గదా!" అని పలికి అనేక విధములైన యన్నములను మంచి రుచి గలిగిన పానకములను అర్ఘ్యములను తీసికొని వచ్చి అక్కడ నుంచి

వినయముతో శిరసును వంచి మఱల నిట్లనెను. "ఓ శ్రీరామచంద్రా! నీకు స్వాగతము. దేవా! ఈ సమస్త భూమండలము నీదే సుమా. మేము నీ భృత్యులము. ఓ నిర్మలాత్మా! మమ్మందఱను నీ సేవకు వినియోగించుకొని ఈ రాజ్యము నేలుకొనుము. ఇవియే భక్ష్యములును, భోజ్యములును, లేహ్యములును, పానీయములును, ఇవియే శయ్యలు. గుఱ్ఱములకు మేత యిదిగో. కావలసినవన్నియు నన్ననుగ్రహించి వేగముగా స్వీకరింపుము." స్వచ్ఛమైన భక్తితో గుహుడు చెప్పిన ఆ మాటలను విని రాముడిట్లనెను. "ఓ మిత్రమా! నీవు రాజువై యుండికూడను కాల్నడకతో వచ్చుటచేతను, ప్రేమతో మాటలాడుటచేతను సంతుష్టుడ నైతిని. నీవు చేసిన సపర్యలన్నియు నాకు చెందినట్లే. వినుము. ఇంత యెందులకు? ఏమియు వెలితి లేదు సుమా!" యని తన బలసిన బాహువులతో అతనిని బిగ్గరగా కౌగిలించుకొని యిట్లు పలికెను. నా భాగ్యముచేత బంధువులతో గూడియున్న నిన్ను ఆరోగ్యవంతుని నేడు చూచుట సంభవించినది. ఓ చెలికాడా! మన స్నేహితులందఱును సుఖముగా నున్నారా? నీ ధనములును రాజ్యమును భద్రముగ నున్నవిగదా! ఈ సమస్తమును నా కొఱకై సమకూర్చితివని యెఱుగుదును. మిత్రమా! యెంతయో సంతసించితిని. ఇది కాఠిన్యముగా నీ మనస్సునందు తలంపకుము. ఇందులో నొకటైనను తీసికొనుట భావ్యముగాదు సుమా! సుఖములన్నిటిని విడిచి వనములకు వెళ్లుచున్న నాకివన్నియు నెందులకో చెప్పుము? మిత్రమా! నారచీరలును కృష్ణాజినమును నెల్లప్పుడు ధరించుచు ఫలములను దుంపలను ఆహారముగా గొనుచు మౌనిగా వనములందు సంచరించుటకై వెళ్లుచున్నాను సుమా! మిత్రమా! గుఱ్ఱముల మేతయగు గడ్డి యొక్కటియే కావలయును. పరమ పవిత్రుడా! నీవు దానిని సమకూర్చుటచేత వేయి విధములుగా నన్ను గౌరవించినట్లు తలంతును సుమా! ఈ అశ్వములు దశరథ మహారాజునకు మిక్కిలి యిష్టమైనవి గాన నీవీ గుఱ్ఱములను తృప్తిపరచుటచేత నన్ను

పూజించినట్లుగానే మోదమును పొందెదను సుమా! మిత్రమా!" అని చెప్పగానే గుహుడు తగినవారలను బంపి, అశ్వములకు నీరు మేతయును సరిగా పెట్టించి, రాత్రి బాగుగా చూచుకొన జేయగా అంత రాముడు సంధ్యవార్చి, లక్ష్మణుడు జాహ్నవీ నది నుంచి మంచి తీర్థమును తేగా సీతాదేవియును దానును ఆ నీటిని త్రావి హాయిగా నేలపై పరుండెను. అప్పుడు అన్నకు పాదములు గడిగి తడియొత్తి వెళ్లి లక్ష్మణుడు చెట్టుమొదట కూర్చుండగా, ఆ గుహుడును సుమంత్రునితో గూడి వచ్చి రాముని యొక్క సద్గుణముల యున్నతిని గూర్చి ముచ్చటించుకొనుచు ప్రేమాతిశయముతో ధనుస్సునందు బాణమును సంధించి పట్టుకొని ఱెప్పవేయకుండగా ఆ రాత్రియందు రామచంద్రుని కాచుకొని యుండెను. ధీమంతుడును కీర్తి గలవాడును దయయే యలంకారముగా గలవాడును, మహాత్ముడును, కష్టముల నెఱుగనివాడుననగు ఆ రాజకుమారుడు భూమిపై శయనించియుండగా ఆ రాత్రి మెల్లగా గడచెను.



# ఏబది యొకటవ సర్గము

**అ**న్నగారికొఱకై యథార్థమైన విచారముతో యథార్థముగా మేలుకొని యున్నవాడును, సన్నుతింపదగిన నడవడి గలవాడును అగు లక్ష్మణుని జూచి యెక్కువైన శోకముతో గుహుడు "అన్నా! లక్ష్మణా! నీ కొఱకై శయ్య కల్పింపబడి యున్నది. దానిపై సుఖముగా శ్రమపోవునట్లు నిద్రపొమ్ము. నీ విట్లు మేలుకొని యుండనేటికి? గౌరవింపదగిన రాజపుత్రుడా! నీవు సుకుమారుడవు. ఇక్కడనున్న వారందఱు నడవులలో దిరుగునట్టి కఠినమైన శరీరము గలవారు. కాన మేము జానకితో గూడియున్న శ్రీరాముని అప్రమత్తులమై జాగరూకతతో ఈ రాత్రియందు కాపలా కాయుచుండెదము. వెళ్లి యథాసుఖముగా నిద్రపొమ్ము. నేనెందులకిట్లు చెప్పెదననగా నాకు రామునికంటె ప్రియమైనవాడు ఈ భూమండలమున నెవ్వడును ఎచ్చటను లేడు. ఇది సత్యము సుమా! అనుమానము లేదు. సత్యము మీద శపథము చేసి చెప్పెదను. ఈ మహామహుని యొక్క మంచి దయచేత గదా నేను గొప్పనైన కీర్తిని, సమస్త సంపదను, మంచి ధర్మమును పొందుచున్నాను సుమా! నాయనా! నేనును, నా యొక్క బంధువులును నాల్గు దిక్కులందు ఎక్కుపెట్టిన విండ్లు గలవారమై సంతోషముగా నిదురించుచున్న నా ప్రియమిత్రుని, భార్యతో గూడియున్న వానిని అప్రమత్తతతో కాచుచుండెదము. చతురంగ బలములు వచ్చి యెదిరించినను లెక్కచేయను. ప్రఖ్యాతిగా నాకు తెలియనిదీవనములో నొక్కటియు లేదు. అన్నా! భయము చెందకుము" అని పలుకగా, లక్ష్మణుడు జాలితో నిట్లనెను. "ఓ గుహా! ధర్మబుద్ధి గల నీవు కాచుచుండగా భయముకాని యనుమానముగాని లేదు సుమా! సర్వవిధముల నీవు సమర్థుడవే కాని తామరలవంటి నేత్రములు గలిగిన రఘురాముడును సీతాదేవియు నీ కటికినేలపై కొంకులేక శయనింపగా నిద్రను జెందుట నాకు ఎట్లు సాధ్యము కాగలదు?

**శ్రీరామ వనవాస నిమిత్తకమైన దుఃఖమును లక్ష్మణుడు గుహునితో చెప్పుట:**

ఓ ప్రియమైన స్నేహితుడా! రాక్షసుల సమూహమును గాని, దేవతల సమూహమును గాని యవలీలగా గెలువగలిగినట్టి మహాత్ముడగు శ్రీరాముడు భార్యతో గూడ నిచ్చట నలిగిపోయిన గడ్డిపరకల పక్కపై శయనించియుండగా, నా కన్నులకు నిద్ర వచ్చునా? ఈ బ్రతుకు సుఖము గలిగించునా? సుఖ భోగములు మనస్సునకు నచ్చునా? మిత్రమా! తపస్సులచేతను అనేకమైన కష్టములచేతను పొందిన కుమారుని తనయంతటివానిని, అంతులేని ప్రతాపము గలవానిని ఒంటరిగా నడవులకు పంపి ఆ దశరథుడు దీనుడై పెద్దకాలము భూమి మీద నిలిచి యుండుట అబద్ధము సుమా! ఈ భూమి యనాథయై వేగముగా చెడిపోవును. ఇది సత్యము. చూచుచుండుము. హాయని యేడ్చి యేడ్చి స్త్రీలెల్లరు నలసిపోయి సొమ్మసిల్లి భూమిపై పడియుండుటచే ఆ రాజు పట్టణమంతయు నేడుపు ధ్వనిలేనిదై నిశ్శబ్దముగా నుండునుసుమా. స్త్రీలలో శ్రేష్ఠురాలైన కౌసల్యయు, రాజశ్రేష్ఠుడగు దశరథుడును, నా తల్లియగు సుమిత్రయును, ఈ రాత్రియైన అందఱును జీవించియుందురా యని నా మనస్సు శంకించుచున్నది. నా తల్లియైన సుమిత్ర శత్రుఘ్నునిపై మనసు నిల్పుకొని జీవించినను జీవింపవచ్చునుగాని, జనులచే నుతింపబడినదియు, వీరమాతయు నగు రాముని తల్లి మాత్రము క్షణమైనను జీవింపజాలదని విచారించుచున్నాను సుమా! అనురక్తులైన జనులతో నిండినదియు, పవిత్రులగు జనుల కన్నులకు ఆనందము నొసగునదియు నయిన ఆ గొప్ప పట్టణము రాజును గూర్చి వ్యసనమును పొందినదై చెడిపోవును సుమా! తన పెద్దకొడుకును, జనులచేత పొగడబడిన నడవడి గలవాడును, తన కిష్టుడును, మహానుభావుడును, మంచి గుణములు గలవాడును, సుకుమారుడును నగు రాముని జూడకుండగా రాజు శరీరముతో నెట్లుండగలడు? రాజైన భర్త గతించుటను జూచి పతివ్రతయగు కౌసల్య మరణించును. ఆమె గతిని జూచినదై నాయొక్క తల్లియు భర్తతోడిదే లోకమని తలచినదై ప్రాణములను విడుచును సుమా!

మించెను అంతయు మించిపోయెను. అయ్యో! రాజీరాముని రాజుగా చేయవలెనని తలంచెను. చేయకముందే చనిపోవును. ఆ సమయమున మేమున్నారమని కృతార్థులై ఈ కుమారు లాయన మరణ సమయమున చేరి సేవించి పితృకార్యముల నన్నింటిని పూర్తి చేసెదరు. అక్కటా! భరత శత్రుఘ్నులు తండ్రికి నౌర్ధ్వదైహికములను తొందరగా యథావిధిగ చేసినవారై రమ్యములైన మార్గముల కూడలులతోడను, అందమైన రాజమార్గములతోడను, ప్రాసాదములు హర్మ్యములు మొదలగు వివిధ భవనములతోడను, వేశ్యాసమూహములతోడను, రథగజ తురగములతోడను, నృత్యగీత వాద్యముల తోడను, పుష్టి తుష్టి గలిగిన ప్రజా సమూహముల తోడను, సర్వవిధముల మంగళములతోడను తోటలతోను ఉద్యానవనములతోడను, నిత్యమును జరుగు నుత్సవములతోడను ప్రకాశించెడు నా తండ్రి యొక్క రాజధాని యందు భరత శత్రుఘ్నులు సంతసముతో సంచరించెదరు. అంతవరకు దశరథుడు జీవించియున్నచో మేము నిశ్చింతగా అరణ్యవాసమును చేసి ప్రతిజ్ఞను దీర్చినవారమై ఆ తరువాత అయోధ్యను చూచెదమా? మఱియు ప్రియమైన మా తండ్రి యొక్క పాదపద్మము లను దర్శింతుమా? మిత్రమా! యని లక్ష్మణుడు చెప్పుచుండగా ఆ రాత్రి గడచిపోయినది. (ఊరు విడచిన రెండవ రాత్రి) లక్ష్మణు డీ విధముగా గొప్పదైన శోకముతో బాధనొందు చుండగా గొప్పనైన మైత్రితో గుహుడు కూడ మిక్కిలి బాధనొందినవాడై జ్వరముచేత పీడింపబడుచున్న యేనుగు వలె కన్నీరు గార్చెను.



# ఏబది రెండవ సర్గము

## శ్రీరాముడు గంగను దాట ప్రయత్నించుట :

అప్పుడు (మూడవనాటి యుదయము) లలితమైన అంగసౌష్ఠవము గలిగిన శ్రీరాముడు మేల్కాంచినవాడై శుభలక్షణములు గల లక్ష్మణుని జూచి "ఓ తమ్ముడా! చల్లగా రాత్రి గతించినది. అరుణోదయవేళ కావచ్చుచున్నది. వినుచున్నావా? మంచివైన స్వరములతో కోకిలలు చిలుకలు నెమళ్లు మొదలగు పక్షులన్నియు మేలుకొలుపుచున్నవి. వడిగా ప్రవహించుచున్న జాహ్నవీ నదిని తొందరగా దాటుదమా?" అని చెప్పగానే లక్ష్మణుడు గుహునితోడను సుమంత్రునితోడను "మీరును అనఘుడైన అన్నగారు చెప్పెడు వాక్యములను విన్నారు కదా!" అని పలికి అన్నయొద్దకు వచ్చి నిలువగా, గుహుడు వెంటనే తన మంత్రులను బిలిచి మీరలు దృఢమైనదియును, అందమైనదియును, తగు సాధనములు గలదియును నగు మంచి నావను నావికునితో గూడ వేగముగా సిద్ధము చేయుడు అని ఆజ్ఞాపించెను. వారును అన్నియును సమకూర్చి తమ రాజైన గుహునకు దెల్పగా గుహుడు రఘువీరునకు వినయముతో నమస్కరించి "నావను సిద్ధపరచుటైనది. తరువాత చేయవలసిన పని యేమిటో సెలవిండు. ఇక గంగానదినీ నావమీద దాటవచ్చును" అని విన్నవింపగా నెంతయో సంతసించినవాడై రఘురాముడు "ఓ స్నేహితుడా! నా కోరికను తీర్చిన వాడవైతివి. ఈ వస్తుసముదాయములను ముందుగా నావపై నెక్కింపుమనగా గుహుడట్లు చేయింపగా రాముడును లక్ష్మణుడును ఖడ్గములను బాణములను విండ్లను ధరించి ప్రకాశించుచు సీతాదేవితో గూడి గంగను సమీపించుటను

చూచి సుమంత్రుడు ప్రేమతో “ఓ రామచంద్రా! నాకేమి సెలవిచ్చెదవో చెప్పుమనగా అతనిని ప్రేమతో జూచుచు శ్రీరాముడు తన కుడిచేతితో నాతని శరీరమును స్పృశించుచు “సుమంత్రా! ఇంక త్వరితముగా రాజునొద్దకు వెడలుము. ఆలస్యమును జేయకు సుమా! మేము రథమును వదలి కాల్నడకలతో నరణ్యములకు వెళ్ళెదము. నన్నెడబాసి కడునార్తితో కృశించుచున్న తండ్రిని స్థిరమైన భక్తితో కాచుకొనియుండుము. మమ్ములను ఇంత దూరము రథము మీద ప్రేమతో తీసికొని వచ్చి చాల మేలు చేసితివి. ఎక్కువగా ఆనందమును పొందితిని సుమా! ఇక రథమును తీసికొని జాగ్రత్తగా పురమునకు వెళ్లుము!”

**సుమంత్రుడు తన్నరణ్యమునకు తోడ్కొనిపోవ రాముని వేడుట :**

అని రాముడు చెప్పగా సుమంత్రుడిట్లనెను. “రామచంద్రా! నీవు వనములలో నివసించుటను లోకములో నేయొక్కడైన మనస్సులో సమ్మతింపడు గదా! బ్రహ్మచర్యమును, మృదుత్వమును, ఋజుత్వమును వేదపాఠమును, నీ వడవులకు వెళ్లినచో వ్యర్థములయ్యెనని నేను మనస్సునందు భావింతును. సామాన్య జనులవలె అడవులందీ ప్రకారముగా నీవు భార్యతోడను, తమ్మునితోడను దుఃఖములు పొందియుడుటచేత భూమిమీద నింకెవ్వడు వ్యాకులత లేకుండగా బ్రతుకగలవాడు? తమ్ముడును భార్యయును నిన్ను సేవించుచుండగా దండకాటవిలో నివసించుచు నీవు మూడు లోకములను గెలిచినంత కీర్తిని పొందెదవు సుమా! కాని మహాత్మా! నీవు మమ్ముల నీ పాపమున బడవైచితివి గదా. దురాత్మురాలును, పాపములకు నిలయమైన కైక వశమునందు దుఃఖమందుచు నెట్లుందుము?” అని సుమంత్రుడు తనకు ప్రాణసమానుడైన ఆ మహానుభావుని గూర్చి బిగ్గరగా ‘హా’ యని రోదనము చేయుచు కన్నుల నుండి ధారలుగా అశ్రువులు జారగా నేడ్చి కొంతసేపటికి నిబ్బరమును పొంది నీళ్లచేత ముఖమును గడిగికొనుచున్న యనఘుడైన సుమంత్రుని జూచి రామచంద్రుడు స్నేహముతో నిట్లనెను.

**శ్రీరాముడు సుమంత్రుని సమాధానపరచుట :**

"అయ్యా! సుమంత్రా! రఘువంశ్యులయినవారికి నిన్నుబోలిన స్నేహితుడు ఎచ్చటనైన గలడా? నా తండ్రి యే ప్రకారముగా విచారింపకయుండునో ఆ ప్రకారముగా చూచుకొనుట నీకు తప్ప నితరులకు చేతగాదు గాన నీవే చూచుకొనవలెను సుమా! మా తండ్రి వృద్ధుడును, నన్ను విడుచుటచేత దుఃఖించిన మనస్సు గలవాడును, కామముచేత మనస్సు చలించిన వాడును నగుటచే నీ కింతగా చెప్పవలసి వచ్చినది. ఆ మహారాజు కైకేయి యొక్క ప్రీతికై యేది చెప్పినను దానిని కొంచెమైనను తిరస్కరింపకుండ ప్రియముతో చేయుచుండెదవు గాక! ఇందుకొఱకే గదా రాజులు రాజ్యపరిపాలనము ప్రేమతో జేయుచుండుట. ఏ పని యందైననుతాము పట్టిన పట్టునే ప్రకారముగానైనను సాధింప జూచెదరు సుమా! ఓ పవిత్రమైన శీలము గలవాడా! యెట్లైనను సరే నా తండ్రికి అప్రియముగాని బాధగాని కలుగకుండ పొరపాటు లేకుండగా నీవు కనుపెట్టి చూచుచుండుము. ఇదియే సుమా నేను కోరునది. మిక్కిలి వృద్ధుడును, పవిత్రమైన శీలము గలవాడును, దుఃఖము నెఱుగని వాడును, జితేంద్రియుడును అయిన ఆ రాజునకు శ్రద్ధగా నామాఱుగా సాష్టాంగ నమస్కారములు చేసి నా మాటగా నిట్లనుము. ఓ భూమీశ్వరా! అయోధ్యకు రాజగుట మాని వనములందు నివసింపవలసి వచ్చెననియు, బాధలుపడవలసి వచ్చెననియును నేను చింతించుటలేదు. లక్ష్మణుడు మనస్సులోనైన నార్తిని బొందుటలేదు. భూపుత్రియైన రత్నమువంటి సీత దుఃఖమును పొందదు. ఇది యథార్థము సుమా! తండ్రీ! ఈ పదునాల్గేండ్లును వనములందు సంచరించి వేగముగా తిరిగివచ్చిన నన్నును, లక్ష్మణుని జానకిని ప్రేమతో మఱల చూడగలవు" అని నా యొక్క జనకునకు చెప్పుము. ఓ అనఘా! మా తల్లికిని, కైకకును, తక్కిన తల్లులకును నేనందఱను మఱల మఱల క్షేమమడిగినానని చెప్పుము. తరువాత నేనును, సీతయును, ఆర్యుడైన లక్ష్మణుడును నా తల్లియొక్క పాదములపై వ్రాలి మ్రొక్కినామనియు, మంచి మాటలతో కుశలము నడిగినార మనియు నొక్కి చెప్పుము. కైక యొక్క కుమారుని తొందరగా బిలిపించి

యథావిధిగా యౌవ రాజ్యమున వానిని నిలుపుము. మిత్రమా! ప్రేమతో అతనిని కౌగిటజేర్చి రాజ్యపట్టాభిషిక్తుని జేయగా నాకు కలిగిన గొప్పనైన యార్తి తొలగునని నా తండ్రికి ప్రీతికలుగునట్లు ప్రేమతో చెప్పుము. భరతు డయోధ్యకు వచ్చిన వెంటనే నా మాటగా నతనితో నిట్లు చెప్పుము. తండ్రియందు నీవే ప్రకారముగా ప్రవర్తించెదవో తల్లులయందు కూడ అదేవిధముగా ప్రవర్తింపుము. నీ తల్లియైన కైకేయి కంటె ఎక్కువగా సుమిత్రాదేవిని చూడుమని చెప్పుము. నా తల్లియైన కౌసల్యాదేవిని ఇంకను విశేషముగా చూడుమని చెప్పవయ్యా! సుమంత్రా! తండ్రి చెప్పినట్లు నీవు యౌవరాజ్యమును పూనుమనియు, రెండు లోకములందుండునట్టి వారికి సౌఖ్యమును గలిగింపగలవనియు, అందువలన న్యాయముగా రాజ్యము నేలుమనియు చెప్పుము. పొమ్ము" అని రాముడు సుమంత్రుని మరలించెను.

**సుమంత్రుడు శ్రీరాముని విడిచి పోలేక పరితపించుట :**

రఘుపుంగవుని ఆ మాటలను విని దుఃఖముతో సుమంత్రుడిట్లు పల్కెను. "ఓ యనఘా! ముఖప్రీతికై చెప్పెడు మాటగాదు. దేవా! స్నేహముతో నిర్భయముగా చెప్పుచున్నాను. నా భక్తుడేకదా యను స్నేహముతో నన్ను క్షమింపుము. ఓ దయాకరా! నా మనవిని చేకొనుము. నిన్ను విడిచన బాధచేత నయోధ్యాపట్టణము కడుపు దుఃఖము పొందిన స్త్రీవలె తత్తరపడుచుండగా నిన్నిచ్చట విడిచిపెట్టి నేనే ప్రకారముగా వెళ్లువాడను తండ్రీ! పూర్వము రామునితో గూడియున్న రథమును చూచిన యయోధ్య ఇప్పుడు నీవులేని రథమును జూచినచో దీనముగా నున్న ముఖముతో భరింపరాని దుఃఖములో మునుగును గదా మహాత్మా! సూతులు మాత్రమే మిగిలి, యోధులు మరణించిన సైన్యమును వలె నీవులేని రథమును చూచినవారై పౌరులు మిగుల దుఃఖపరవశులగుదురు. దూరమునందు నివసించు నిన్ను తలంచినవారై లోకులందఱును తమ యందు గలిగిన ప్రేమచేత తల్లడిల్లినవారై అన్నమును నీరును వదలి తమ భావములందు నిన్నేగతిగా భావించుచు నీ శుభమైన యాకారమును తమ కన్నులకు గట్టినట్లుగా

చూచుచుందురు. ఓ అనిందితశీలా! రాఘవా! నీవు చూచితివి గదా నీవు వనములకు వచ్చుచున్న సమయమున లోకుల శోకమును, వారు విలపించిన విధమును. ఇప్పుడు నన్నును, నా వట్టి రథమును జూచి వారలు మరల వేయిరెట్లుగా నేడ్చెదరు గదా! దానిని జూచి నా బోటివాడు సహింపగలడా? అక్కటా! నీ తల్లియగు కౌసల్యాదేవి అయ్యా! నా పుత్రుడేడీ యని యడిగిన నేనేమని చెప్పువాడను? ఓ తల్లీ! అతని మేనమామ యింటికి తోడ్కొనివెళ్లి విడిచివచ్చితిని, నీవింక దుఃఖింపవలదని చెప్పుదునా? అన్నియును తెలిసిన నేను అబద్ధమునెట్లు చెప్పువాడను? అబద్ధమేల చెప్పవలెయందువా? నేనెట్లు పాపపుసత్యమును పలుకువాడను? మంచి గుణములు గలిగిన రామచంద్రా! నిన్నును, ఈ సీతను, లక్ష్మణుని మోసికొనివెళ్లు నీ గుఱ్ఱములు నేడు మీరు రాకుండ అవి నా యాజ్ఞననుసరించి తామెట్లు మరలును? మీరు లేకుండ అయోధ్యకు మరలిపోవుట నాకు సాధ్యముగాదు. నాకు నీవు సేవింపదగిన వాడవు కనుక నాయందు దయాదృష్టిని ప్రసరింపజేసి నీతో వచ్చుటకు అనుజ్ఞనిమ్ము. వచ్చెదను. కాదు కూడదని నా ప్రార్థనను దయారహితుడవై వ్యర్థము చేసినచో నేను ఈ రథముతో గూడ ప్రజ్వలించు అగ్నికి ఈ శరీరము నాహుతి చేసెదను సుమా. ఇది నిజము. అడవులలో క్రూరమైన మృగములు నీ తపస్సునకు విఘ్నమును కలిగింపగలవు. పనిబూని ఈ రథమెక్కిన వాడనై వాని నన్నిటిని చంపివేయుచుందును. మనస్సున నాలోచింపుము. నీకు రథమును దోలు సౌఖ్యమును పొందు నదృష్టము నాకు లేదు గదా! కోమలమైన శరీరము గలవాడా! రామా! ఘోరమైన అరణ్యములకు నీతో వచ్చినచో సుఖమును పొందుదును. నన్ను వెళ్లిపొమ్మనకుము తండ్రీ! ఈ భయంకరములైన అరణ్యములలో ఇష్టముతో నీ దగ్గర నుండవలెనని ఆశ పుట్టుచున్నది సుమా! అలాగే రమ్మని ఒక్కమాటను చెప్పుము. ఓ రామచంద్రా! మెఱకల యందును పల్లములయందును ఈ గుఱ్ఱములు నిన్నెక్కించుకొని తీసికొని వెళ్లుచు నీకేమాత్రము శ్రమ కలుగకుండునట్లుగా సేవించుచు శ్రేష్ఠమైన గతిని పొంద గలవు. విడిచిపెట్టకుండగా నీకుపచారములను శ్రద్ధగా జేయుచు దండకాటవిలో

నీతోగూడ నివసించియున్నచో నింక అయోధ్యా పట్టణమేమిటికి? దేవలోకమైన నెందులకు? పాపము చేసినవారలు స్వర్గమును చేరనేరనియట్లు నేను నిన్ను విడిచిపెట్టి ఒంటరిగా అయోధ్యాపురమును ప్రవేశింప నెట్లు నేర్తును? నా హృదయ మొక క్రొత్త కోరికతో నుర్రూతలూగుచున్నది. ఎట్లన, నీ గుఱ్ఱములను రథమునకు బూన్చి నేను సారథినై నీవు చిఱ్ఱున చీదకుండ అడవిలో పదునాలు గేండ్లును గడపి భూమి బీటలు వారునంత వేగముగా మిమ్ము తోడ్కొని మన యూరికి బోవలెనని కోరుచున్నాను. నీదగ్గర నున్నచో పదునాల్గేండ్లును ఒక్క నిమిషముగా గడచిపోవును. నిన్ను విడిచియున్నచో ఒక్క ముహూర్తకాలమైనను ఒక్క కల్పమా యనునట్లుగా తోచును సుమా! నీ భక్తుడను, సేవకుడను, నీయందు ప్రేమ గలవాడను నా రాజు యొక్క పుత్రుడవైన నీ పాదములను సేవింపగోరినవాడను, దృఢమైన శక్తి గలవాడను. భక్తుల రక్షించు శీలము గలవాడా! నన్ను విడిచిపెట్టుట తగునా?" ఈ విధమయిన దీనమయిన మాటలతో మరల మరల ధైర్యము గోల్పోయి తనను ప్రార్థించుచున్న తన సారథితో భృత్యులయందు దయగలవాడగు సీతాపతి యిట్లనెను. "భూపతి యందు ప్రేమ గలవాడా! నీవు పరమభక్తుడవు. నేను నిజము తెలియనివాడనా? నిన్నెందులకు పురమునకు వెళ్లుమనుచుంటినో చెప్పెదను వినుమయ్యా! నీవు పురమునకు వెళ్లుట చూచినదై కైకేయి రాముడు వనములకు పోయెను పో యని నేను వనములకు వెళ్లుట కానందమును పొంది ధర్మజ్ఞుడగు నా తండ్రి అబద్ధములాడువాడని తలపకుండును. కైకేయి ఆ భరతుడు రాజ్యము నేలుచుండగా జూడవలెనని నా ముఖ్యమైన సంకల్పము సుమా! రాజునకును నాకును ప్రీతి కలుగునట్లుగా రథమును తోలుకొని పురమునకు వెళ్లి నేను మున్ను చెప్పిన మాటలు వారికి చెప్పుము."

**శ్రీరామ లక్ష్మణులు జడలు ధరించుట :**

అని యూరడింపుగా జెప్పి గుహునితో నిట్లనెను. "ఓ మిత్రమా! గుహా! ఇచ్చట జనులు నివసించెదరు గాన మేమిచ్చట నిలువరాదు. ఆశ్రమముల

నివసించు మునులకు తగిన విధముగా నియమవర్తినై నా తండ్రికి మేలు కలుగునట్లుగా జడలుదాల్చి చరింప వలయును. సీతకు సౌమిత్రికి మంచిని చేకూర్చువాడనై నేను జడలు ధరింతును. త్వరగా మఱ్ఱిపాలను తీసికొని రమ్ము! అని చెప్పగా నతడట్లే చేయగా సౌందర్య నిధియైన రాముడు వానితో తనకును తమ్మునకును జడలు గావించెను. దీర్ఘములైన బాహువులు గలవాడును, గుణములకు నిధియైనవాడును, దేవసమానుడునునైన రాముడీ ప్రకారముగా జటిలు డయ్యెను. నారవస్త్రములును నేలమీద జీరాడెడు పొడవైన జడలును అందము నిడుచుండగా శ్రీరామలక్ష్మణులు సాక్షాత్తుగా మౌనులవలె ప్రకాశించిరి. తరువాత వానప్రస్థుడై రాముడు లక్ష్మణునితో గూడి ప్రీతి ముంచెత్తుచుండగా గుహుని జూచి యిట్లనెను. “మిత్రమా! సైన్యము, ధనాగారము, దుర్గము, జనపదములు అను వీని విషయమునను, నీవారి పట్లను ఏమఱుపాటులేక జాగ్రత్తగా నుండుము. ఆలోచింపగా రాజ్యమును రక్షించుకొనుటయే మిక్కిలి కష్టమగు కార్యము” అని చెప్పి నరులలో శ్రేష్ఠుడైన రాముడు సీతాలక్ష్మణ సహితుడై తొందరగా గంగానది తీరమున నున్న నావను చూచి నదిని తొందరగా దాటదలచినవాడై “అన్నా! లక్ష్మణా! నీవు ముందుగా నావను కదలకుండ బట్టుకొని ఈ యభిమానవతిని మెల్లగా నావనెక్కించి వెనువెంటనే నీవు నెక్కుము. పొమ్ము” అని చెప్పగా ఆత్మవంతుడైన లక్ష్మణుడట్లే సీతను ముందుగా నెక్కించి తాను నెక్కి యుండగా చూచి రాముడు తాను కూడ నావనెక్కెను. అపుడు నిషాదరాజు తన వారలను జూచి “యిక నావను నడపు”డనెను. అంత రామచంద్రుడు బ్రాహ్మణులకు క్షత్రియులకు యోగ్యమైన శ్రేష్ఠమైన మంత్రమును తన మేలునకై జపించి సీతా లక్ష్మణులతో గూడి నాచమనము చేసి సంతుష్టుడై తన బలగముతో గూడి యున్న నిషాదరాజగు గుహుని, సారథి శ్రేష్ఠుడగు నా సుమంత్రుని అధికమైన దయతో “ఇక నిల్వు”దని యనుజ్ఞ నిచ్చినవాడై నావ నడపు శబరులను తొందరపెట్టగా ఆ కర్ణధారులు వేగముగా నడపుచుండగా అందముగా ఓడ తెడ్లతో త్రోయబుడుచున్న నీరు గలదై వేగముగా సాగెను.

## సీతాదేవి గంగను ప్రార్థించుట :

అట్లు నావ యేటియొక్క మధ్యకు వెళ్లగానే యచట సీతాదేవి తన చేతులను జోడించి నమస్కరించి భాగీరథీదేవి వైపు చూచినదై భక్తిపూర్వకముగా నిట్లు ప్రార్థించెను. "అమ్మా! భాగీరథీ! సముద్రుని పత్నీ! ప్రేమతో ఈ రాముని వనవాసమును చక్కగా నెరవేర్చునట్లు రక్షింపుము. చంద్రశేఖరుని భార్యవైన ఓ గంగానదీ! పదునాల్గు సంవత్సరములు వనములలో నివసించి రాముడు తమ్మునితోడను నాతోడను సుఖముగా మఱల నిన్ను చూడ వచ్చునట్లుగా చూడుము. తల్లీ! మేము క్షేమముగా తిరిగి వచ్చినప్పుడు సమస్తమైన కోరికలు తీరునట్లుగా నియమముతో భక్తితో పూజించి నిన్ను సంతోషపెట్టుదును. ఓ ఆకాశగంగా! నీవనగా కేవలమొక నదివా? త్రిపథగ యను పేరుతో ప్రఖ్యాతిని గాంచితివి. తొలుత బ్రహ్మలోకమున నుండి ఈ లోకమున బ్రవహించి సముద్రుని యిల్లాలివై, పాపములు తొలగునట్లుగా నీయందు స్నానము చేసినవారి ననుగ్రహించుచున్నావు. అటువంటి నిన్నెట్లు నేను స్తోత్రము చేయగలుగుదును? చేతులను మోడ్చి నమస్కరించెదను. శ్రీరాముడు తిరిగి రాజ్యమును పొందినచో నీవు ప్రీతినొందునట్లుగా నూరువేల గోవులను మంచి యన్నమును వస్త్రములను బ్రాహ్మణుల కిచ్చెదను. ఓ గంగాభవానీ! నీకు వేయి సురాభాండములను సమర్పించెదను. కరుణతో మమ్ము లెస్సగా జూడుము. పాపములను పోగొట్టు గంగా! నీయొక్క తీరములనున్న తీర్థములను, పుణ్యక్షేత్రములను, దేవతలను నియమముతో పూజించెదను. మమ్ములను ప్రేమతో జూడుము. తన తమ్ముని తోడను, నాతోడను గూడి అనఘుడైన రాముడు మోదముతో కుశలముగా తిరిగి వచ్చునట్లు అనుగ్రహింపుము" అని జానకీదేవి వేడుచుండగానే ఆ నావ వేగముగా గంగానది యొక్క దక్షిణ తీరమును జేరగా అచ్చట అందఱు నావనుండి దిగిరి. అప్పుడు శ్రీరాముడు తన తమ్మునితో నిట్లనెను. "ఓ సౌమిత్రీ! రక్షించుటయం దేమరుపాటేమాత్రము నింక తగదు సుమా. నిర్జనమైనను, మనుష్యులతో గూడినదైనను ఈ వనమున ముందుగా నీవు మార్గమును జూచికొనుచు వెళ్లుము. నీ వెనుక భూపుత్రి వచ్చును. నేను మీ యిద్దఱను

కాపాడుచు జానకి వెనుక వచ్చెదను. మనమెన్నడును చూడని నిర్జనమైన వనమిది. కాన మనము కడు మెళుకువగా మెలగుచు విడువకుండగా ఒకరినొకరు రక్షించుకొనుటయే సమంజసము సుమా. చెడిపోయిన పని చక్కచేయుటనునది యరుదుగదా. కనుక ముందే జాగరూకులమై అశ్రద్ధ చేయకుండ రక్షించుకొనుచుండవలెను. ఇచ్చట నుండి యిక నీ యడవి జనసమ్మర్దముగాని, అందమైన తోటలుగాని, సుందరములైన పంటపొలములు గాని ఏమియును లేకుండగా గోతులును, రాతిబండలును, ముండ్లును గలదియై భయము కలిగించుచున్నది. ఇక్కడ నుండి సీతాదేవికి వనవాసము నందున్న శ్రమ తెలియును" అనగా అంత లక్ష్మణుడు ముందుగా వెళ్లుచుండగా, అతని వెనుక భూపుత్రియును, తరువాత సన్నుతింపదగిన పరాక్రమముగల రాముడు వారిని రక్షించుచును వేగముగా వెళ్లుచుండెను. అట్లు గంగానది యొక్క దక్షిణ తీరముననుసరించి వారు వెళ్లుచుండగా చాలాదూరము వెళ్లునంతవఱకు చూచి సుమంత్రుడు కన్నుల నీరుగార్చుచు తరుగని దుఃఖమును పొందెను. లోక పాలురతో సమానులైన వారలు అందమైన సస్యములుగల భూములను దాటుచుండ సూర్యుడు క్షీణించిన కాంతిగల వాడయ్యెను. ఆ సాయంకాలమున తామరరేకుల వంటి నేత్రములు గలిగిన వారలొక చెట్టునీడను ప్రవేశించిరి. అంతట మహాపరాక్రమవంతులైన రామలక్ష్మణులు వరాహమును, దుప్పిని, యనుబోతును, చారల దుప్పిని సంహరించిరి. ఆకలిగొనియుండుటచే నందఱు భుజించిరి. సూర్యుడస్తమించిన తరువాత సాయంసంధ్యా కృత్యముల నొనర్చిరి. (మూడవ రాత్రి)



# ఏబది మూడవ సర్గము

## శ్రీరాముడు తల్లిదండ్రుల దలచి దుఃఖించుట :

అంత రామచంద్రుడు లక్ష్మణుని జూచి, "మనము పల్లెలను వదలి బయలుగానున్న పొలమునందు, ఆ సుమంత్రుడు కూడ వదలివెళ్లగా నివసించుట యిది మొదటిరాత్రి కదా! అందుచేత నీవు గడచిన దానిని గుఱించి విచారించుచుండకుము. నిద్దురను విడచి ఇద్దఱము నీ రాత్రి మొదలుకొని జాగరూకతతో మెలగుచు రాత్రలందీ సీతాదేవిని రక్షించుచుండవలెను. ఈమె యొక్క క్షేమము మనయందే యున్నదిగదా! మనము తీసికొని వచ్చిన యాకులను భూమిపై పరచుకొని యేదోయొక రాతిని దిండుగా జేసికొని యామె పండుకొనదగును." అని చెప్పి సుఖకరములైన శయ్యలమీద శయనింపవలసిన వాడును, అనఘుడునునగు రాముడు నేలపై గూర్చుండి తన తమ్మునకు వినుటికింపుగా నుండు మంచి కథలను స్నేహముతో చెప్పుచు ప్రసంగవశమున "అన్నా! లక్ష్మణా! ఇది నిజము సుమా. ఆ దశరథ మహారాజు నా సుతుడడవులకు వెళ్లెనుగదా! యని యేడ్చుచు పడియుండును. కైక తన కోర్కె పూర్తిగా తీరినదిగదా యని సంతుష్టిని పొందుచుండును గదా! ఆ కైక తన ప్రియపుత్రుడు మఱలిరాగానే రాజ్యము కారణముగా ఆ మహారాజు ప్రాణములను తీయదుగదా? నా తండ్రి యేమి చేయగలవాడు? వృద్ధుడు, కైక యొక్క వలపులనెడు త్రాళ్లచేత కట్టుపడ్డవాడు, దిక్కులేనివాడు. నేనీ ప్రకారముగా దూరముగా వచ్చివేసిన కారణమున నే మార్గమును తోచక యేమి బాధలను పొందునో కదా? తమ్ముడా! యిప్పుడు నేనేమి చేయగలవాడను? మనకు గొప్పతనము నశించునట్లుగా నిట్టి వ్యసనము సంభవించుటయు,

రాజునకు మతి చలించుటయు చూడగా ఓ ధర్మజ్ఞుడా! ధర్మార్థముల కంటె కామమే బలమైనదిగా తలంచుచున్నాను. లక్ష్మణా! కాకున్నచో నెటువంటి మూఢు డైనను ప్రేమపాత్రుడును తన మనస్సును కనిపెట్టి నడచువాడును, నగు పుత్రుని వయస్సులో నున్న భార్య యొక్క మాటనుబట్టి నన్ను మా తండ్రి వదలిపెట్టినట్లు తిరస్కారముతో వదలిపెట్టునా? మన్మథుని యొక్క బాణములచేత కొట్టబడిన వాడెక్కడనైన నేది చూడగలడు? ఆ కైక యొక్క కుమారుడొక్కడే భార్యతోగూడ సుఖముగా కోసలులేలెడు నీ విశాల భూభాగమున కధిపతియై నుండగలడు. అవురా ఎంత యాశ్చర్యము! తండ్రి ముసలివాడుగదా? నేను దారుణమైన యడవులందిట్లు శ్రమజెందుచున్నాను గదా! ఇంక కైకేయి యొక్క పుత్రుడొక్కడే ఏకముగా నీ రాజ్యమునంతయు ఏలువాడుగదా? సార్థకములైన ధర్మమును అర్థమును విడచి యేవ్యర్థుడు కామము ననుసరించునో ఆతడు దశరథుని వలె ననర్థముల ననుభవించునుగదా! తన భర్తను వధించుటకును, నన్నీప్రకారముగా నడవులయందవస్థలు పడజేయుటకును, తన కుమారునకు రాజ్యమునంతయును సమకూర్చుటకును నీ కైకేయి మనకు దాపురించినది గదా! సాటిలేని సౌభాగ్యగర్వముచే మోహింపబడినదై ఆ పాపబుద్ధి గల కైక నాపైగల కోపముచేత న్యాయమును విడిచినదై శాంతముగల నా తల్లిని నీ తల్లిని ఎంతగా బాధించునో గదా? నా కోసమై నీ తల్లియగు సుమిత్రాదేవి కూడ అవస్థల నెందులకు పడవలెను? తొందరగా ఇక్కడనుండియే నీవు మఱలి యయోధ్యకు ఆమెను చూచుటకై వెళ్లుము. తండ్రీ! దిక్కులేని ఆ కౌసల్యకు కూడ నీవే దిక్కగుము. ధైర్యముగా నేనొక్కడనే ఈ కమలాక్షియగు సీతను తోడ్కొని యడవుల కేగుదును. లక్ష్మణా! ఇంక ఆలస్య మెందులకు? కోపముతో గూడినదై పగతో కైకేయి క్షుద్రములగు క్రియలతో పరాభవమును, ఆపదను కలిగించును. నా తల్లిని జాగ్రత్తగా జూడుమని భరతునితో చెప్పుము. నా తల్లి పూర్వజన్మమున నేతల్లిని కుమారుని నెడబాయ జేసినదో యా కారణముచేతనే

సుమా యిప్పుడా పుణ్యచరిత్రయైన నా తల్లికిటువంటి దుఃఖములు ప్రాప్తించినవి. ఛీఛీ! నేనెటువంటి కొడుకును? నన్ను కని పెంచి పెద్దచేసినది. బహు కష్టములుపడుచు ఆ తల్లి నన్ను రక్షించినది. నేను పెద్దవాడనై ఆమె శ్రమ ఫలించువేళకు ఆమెను విడిచితినిగదా! కన్నతల్లికి భరింపరాని దుఃఖమును కలుగజేసితిని చూచితివా? నేనెటువంటి కొడుకునయ్యా! భూమియం దే తల్లియైనను నావంటి పుత్రుని కనకుండుగాక! లక్ష్మణా! అయ్యో! ఏమని చెప్పను? నా పుట్టుటంతయును కొరగానిదయ్యెను గదా! అయోధ్యయందు పంజరమున నున్న గోరువంక చిలుకను జూచి, అదిగో ఆ శత్రుపాదమున వెంటనే కాటువేయుము అని పల్కుటచేనైన నా తల్లికి సంతోషము కలుగజేయు చుండును. కటకటా నేను మానవుడనై యుండి అంతమాత్రముకూడ చేయలేక పోయితినిగదా! నన్ను పుత్రునిగా కని నా తల్లి యేమి సౌఖ్యముల ననుభ వించినది? సుఖములను పొందకపోయిన మానె. అయ్యయ్యో! నానిమిత్తముగ నెటువంటి దుఃఖములను పడుచున్నది! భూమిపై నావంటి పుత్రుడు పుట్టినను ప్రయోజన మేమున్నది? ఇంతకు జూడగా నా తల్లి యదృష్టవిహీనగా తోచు చున్నది. దుఃఖించుచున్నదియు, మందభాగ్యురాలును, గొడ్రాలివలె నున్నదియు నిర్మలమైన బుద్ధిగలదియునగు నా తల్లికి నేను కొడుకుగా పుట్టి చేసిన మేలేమియున్నదో నీవే చెప్పవయ్యా లక్ష్మణా! నన్ను గర్భమున ధరించి కనిన కౌసల్య నిర్భాగ్యురాలు కదా! భరింపరాని దుఃఖముతో తపించుచు నలగిపోవు చుండును గదా! నేనొక్కడనే ఈ భూమినంతటిని ఈయయోధ్యను వాడియైన బాణముల సమూహములచే చీల్చి చెండాడజాలనా? కారణము లేకుండ నేను పరాక్రమము చూపదగునా? రాజ్యపట్టాభిషేకము చేసికొనుట నా కసాధ్యమా? కాని నన్ను పరలోక భయము, ధర్మహాని కలుగునను భయము అట్టి పని నుండి మాన్పించినవి సుమా!" అని యనేక విధములుగా కనులనీరు నిండినవాడై యనఘుడైన శ్రీరామచంద్రుడు విలపించి ఆ రాత్రియందు మౌనివలె నున్న

సమయమున, అలలులేని సముద్రమువలెను, మంటలు చల్లారిన యగ్నిహోత్రుని వలెను విలాపములను వీడి నిశ్చలుడైయున్న శ్రీరామునితో మంచి మాటలతో లక్ష్మణుడిట్లు పలికెను.

**లక్ష్మణుడు శ్రీరాము నూరార్చుట :**

"రామచంద్రా! ఇది నిజము సుమా. నీవు వదలివచ్చుటచేత దిక్కులేనిదై ఆ యయోధ్య తేజోవిహీనమై చంద్రుడులేని రాత్రివలెనుండును. బాధనొందిన బుద్ధితో నీవిట్లు కష్టపడదగునా? ఇట్టి నిన్ను విడిచి నేనుగాని భూసుతగాని యొక్క నిమిషమైనను భూమి మీద బ్రతుకగలమా! నీటిని వీడిన చేపల వలె నశింపమా? అన్నా! నిన్ను వీడినచో నిక తల్లిదండ్రు లెందుకు? తమ్ముడెందుకు? స్వర్గమైన నెందులకు? రాఘవా! యిది నిజము సుమా! అని మునుపు తామున్న చెట్టునీడయందు శయ్యను సిద్ధముచేయ నందఱు దానిపై గూర్చుండిరి. తమ్ముని మాటలకు రాముడు సంతోషమునందెను. కొండ చరియల యందున్న రెండు సింహములవలె గొప్ప పరాక్రమము గల రామసౌమిత్రులు మనసునందు భయమును తొందరపాటును వీడినవారై జన సంచారములేని యా వనమున నారాత్రిని గడపిరి.



# ఏబది నాలుగవ సర్గము

## శ్రీరాముడు భరద్వాజాశ్రమమునకు బోవుట :

అంతట నిర్మలమైన సూర్యబింబ ముదయింపగా (ఊరు విడిచిన నాల్గవనాడు) భయంకరములగు నడవులు గల గంగా యమునా నదుల సమీప ప్రదేశమును, అంతకు మున్నెప్పుడును చూడని మనోహర విషయములను జూచుచు, వివిధములగు చెట్ల సమూహములను గాంచుచు క్షేమముగా వెళ్లుచు ఆనాటి మధ్యాహ్న సమయమున లక్ష్మణుని జూచి రామచంద్రుడిట్లనెను. "అదిగో. చూడుము. ఈ ప్రయాగ చుట్టును ఎక్కువగా అగ్నిదేవుని కేతనమువలె పొగ ఆనందకరముగా నొప్పుచున్నది. అచ్చట నెవ్వరో ముని నివాసముగా నుండవలయును సుమా. లక్ష్మణా! వినుచున్నావా? మనము గంగా యమునా నదుల సంగమ స్థలమునకు వచ్చితిమి. నిజము సుమా. ఆ రెండు నదుల అలలు పరస్పరము తాకుటచే పొంగుచున్న శబ్దమిక్కడకు వినవచ్చుచున్నది. అడవులలో లభించు పదార్థములను భుజించుచు జీవితములను గడపువారు చెట్లనుండి కొట్టిన కట్టెలను, చెట్లను ఈ భరద్వాజాశ్రమము నందు చూచితివా తమ్ముడా!'' అనెను. అంతట పడమటి కొండ సమీపమున ఎఱ్ఱనైన సూర్యబింబము కనబడుచుండగా ఆ విలుకాండ్రు యమున గంగ కలియుచోట నున్న భరద్వాజాశ్రమ భూమిని చేరగా, అచ్చటనున్న మృగములును పక్షులును బెదరుచుండగా పరాక్రమశాలురగు రామలక్ష్మణులు సీతాదేవితో సంతోషముతో మెల్లగా ఆశ్రమ సమీపమునకు వెళ్లిరి. అట్లు చేరి జానకీ సహితులై మునిని దర్శింపదలచి సమయమునకై వేచి దూరమున నిలుచున్నవారై వారి శిష్యులచేత తాము వచ్చిన వార్తను పంపించి అనుజ్ఞ పొంది లోపలికి వెళ్లి సత్రవ్రవర్తన గల

శిష్యులచే సేవింపబడుచున్న వాడును, వ్రతనిష్ఠ యందున్నవాడును, శ్రేష్ఠమైన చరిత్ర గలవాడును, ఏకాగ్రత కలిగిన చిత్తము గలవాడును, గొప్పనైన తపస్సుచే లభించిన జ్ఞాననేత్రము గలవాడును మహాత్ముడును నగు భరద్వాజుని చూచిరి. అగ్నిలో హోమము చేయుట పొంతము కాగానే మెల్లగా సీతాలక్ష్మణ సహితుడై తామరరేకుల వంటి కన్నులు గల రాముడు తన పేరును చెప్పుచు నమస్కరించి తిరిగి యిట్లు చెప్పెను. “ఓ ఋషిచంద్రమా! మేము దశరథుని యొక్క పుత్రులము. శ్రీరాముడు లక్ష్మణుడు అను నామములు గలవారము. ఈమె నా భార్య జనకరాజు యొక్క కుమార్తె నిర్మలమైన పతివ్రత గాన నీ శుభలక్షణయగు సీత నా వెంట వచ్చినది. స్థిరచిత్తము గలవాడు గాన ఈ చిన్నతమ్ముడు నావెంట వచ్చెను. నా తండ్రి నన్నడవులలో మునివృత్తితో నుండుమని యాజ్ఞాపింపగా ఆ యాజ్ఞను తలదాల్చిన వారలమై వనములకు వచ్చితిమి. కాయలును కూరలును ఆహారముగా గొనుచు ధర్మమార్గమున సంచరించెదము.” అనగా వారల హితమును గోరు భరద్వాజుడు వారల కర్ఘ్యమును, మంచి తీర్థమును, అన్నరసములను పండ్లను సంతోషముగ నొసగెను. మునులతో మృగములతో పక్షులతో కూడియున్న ఘనుడైన భరద్వాజుడు అనఘుడైన శ్రీరామచంద్రుని పూజించి తరువాత అతని యోగక్షేమముల నడుగగా ముదముజెంది రాముడు వారిచ్చిన యర్చనలను గైకొని సుఖముగా కూర్చొనగా ప్రేమతో భరద్వాజుడు ధర్మయుక్తమగు మాటలను రామునితో నిట్లు చెప్పెను. “ఓ రామచంద్రా! ఎన్ని దినములకు నిన్నిచ్చట చూచితినయ్యా! నీ యీ యాపదయును, తండ్రి నిన్నిట్లు పంపుటయును, నీవు వనములకు వచ్చుటయును మునుపే వినియున్నాను. పుణ్యభూమియు, సందడి లేనిదియు, గొప్పనదులు గలదియు నగు అందమైన ప్రదేశమిది. ఇచ్చట నెమ్మదిగా నివాసముగ నుండుము.” అని భరద్వాజుడు చెప్పగా విని అతనిని జూచి శ్రీరాముడిట్లనెను. “ఓ మునివరేణ్యా! మిక్కిలి సులభముగా చూడదగియున్నానని సమీపముననున్న పౌరులును జనపదులును,

నన్నును, మా జానకిని పలుమారులు చూడవత్తురు. కనుక నిచ్చట నివసించుట కిష్టపడను. సుకుమారురాలైన యీ జానకి సుఖముగా మెలగదగిన ఏకాంత ప్రదేశమునొకటి సెలవిండు. మేమచ్చటకు వెళ్లెద"మనగా భరద్వాజుడు "రామా! ఇచ్చటికి పది క్రోసుల దూరమున గంధమాదనమును బోలినదియు, నెలుగు బంట్లతోను, కోతులతోను గూడినదియు చూచుటకింపైనదియునగు చిత్రకూట మను పేరు గల పర్వతము గలదు. ఓ రామా! ఆ చిత్రకూటము యొక్క శిఖర సమూహము లెంతవఱకు గన్పించునో యంతవఱకున్న భూమియందు గల ప్రాణికోటులన్నిటి మనస్సులయందును కల్మషములుండవు. పుణ్యమునే చేసెదరు. వేనోళ్ల జగములన్నియు పొగడుచుండగా, ఘనులైన ఋషులనేకులు నూర్లకొలది సంవత్సరములు ఘోరమైన తపస్సులను జేసి సశరీరముగా స్వర్గమును బొందిరి. అది జనసంచారము లేనిదగుటచేత మీకు సంతసము గలిగించునని నేను తలంచుచున్నాను. నీ యిష్టము చొప్పున అచ్చటనైనను, నాతోగూడ నిచ్చటనైనను నీవు నివసింపవచ్చును" అని చెప్పి భరద్వాజుడు ఆ యనఘుడైన యతిథిని భార్యా సోదరులతో గూడ తగునుపచారములతో సంతుష్టులను జేసెను. తరువాత రాముడెవ్వియో కథలు చెప్పుచుండగా పశ్చిమ దిక్కున సంధ్యారాగము లావరించెను. అంత రాముడా రాత్రి తమ్మునితోడను, సీతతోడను గలిసి సమ్మతితో ఆ ఆశ్రమమున వసించి వ్యథలు తొలగి సౌఖ్యముగ నుండెను. తెల్లవారుచుండగా మేలుకాంచి (ఊరువిడచిన ఐదవనాడు) తపస్సంపన్నుడైన మునిని జూచి, "నీదైన యీ పుణ్యస్థలమున ఈ రేయి హాయిగా గడపితిమి. ఇక నెక్కువైన దయతో మాకు వెళ్లుటకు సెలవిచ్చెదరా?" అనగా భరద్వాజు డారఘూత్తమునితో నిట్లనెను. "ఓ పుణ్యమైన ప్రభావము గలవాడా! పోయిరమ్ము. ఆ చిత్రకూటము పవిత్రమైనది. మధురమైన దుంపలును, ఫలములును తేనెలును గలది. మఱియు ననేకమైన కొండలు గలది. కిన్నరులును, ఉరగులును నివసించుచోటు. నెమళ్ల ధ్వనులు గలది. గజరాజులచే

సేవింపబడినది. ఎంతయో పుణ్యమగుచోటు. సుందరముగా నుండును గాన నచ్చటికి పొమ్ము. పద్మముల వంటి కన్నులు గలవాడా! అది నిక్కముగా నీకు నివసింపదగినచోటు. అచ్చట ఏనుగుల గుంపులను లేళ్లయొక్క సమూహము లను క్రీడించుచున్న వానిని చూడగలవు. అచ్చటి సెలయేళ్లును, కొండచరియ లందు దిరుగు ఏనుగులును, దేవతలును, గుహల సమూహములును, వృక్షములును, చిలుకలును కోకిలలును శబ్దములు చేయుచున్న చెట్లును నీ భార్యకు సంతోషమును గలిగించును.” అనగా..



# ఏబది యైదవ సర్గము

**భరద్వాజ ముని శ్రీరామునకు చిత్రకూట మార్గము దెలుపుట :**

తెల్లగా తెల్లవారగనే రాజకుమారులు నిండైన భక్తితో మౌనికి నమస్కరించి చిత్రకూట పర్వత సమీపమునకు వెళ్లుటకు సిద్ధపడగా మంచి వాక్యములతో మౌని వారలకు స్వస్త్యయనము ఘటించి సత్యవాక్ప్రియుడైన యా ఋషి కుమారులతో వెళ్లుచున్న తండ్రివలె వారల వెంట వెళ్లుచు రామునితో నిట్లనెను. "గంగా యమునా సంగమమునుజేరి ఆ తరువాత పడమటి దిక్కుగా ప్రవహించు చున్న యమునానది గట్టువెంట వెళ్లి, వెళ్లి యా నది వేగముగా ప్రవహించుచోట రాకపోకలకు మిక్కిలిగా వాడబడుచున్న బాటను పూర్తిగా దెలిసికొని అచ్చట తెప్పను గట్టుకొని మీరు నేర్పుతో యమునను దాటుడు. అక్కడ బహు కాలము నుండి యున్నదియు, బహువృక్షములతో గూడియున్నదియు సిద్ధులచేత సేవింప బడినదియునగు పెద్ద మఱ్ఱిచెట్టు ఉండును. దానిని సమీపించి యీ సీతచే మంచి దీవనలిచ్చునట్లుగా మ్రొక్కింపుము. ఉండవలెననిపించినచో అచ్చట కొంతసేపు విశ్రమింపుడు. వెళ్లవలెననుకొన్నచో ఆవలకేగుడు. అక్కడి కొక్క క్రోసు దూరమున నీలవనమను వనమున్నది. అందు రేగుచెట్లును, వెదురు పొదలును చాల సుందరముగా నుండును. నేను చాలసారులు వెళ్లినవాడను. ఈ అందమైన మార్గము మెత్తనిది. అగ్ని భయము లేనిది. సుందరమైనది." అని మార్గమును చెప్పి మౌని "అనఘా! యిక నేను నిలుతునా?" యనగా రామచంద్రుడును వినయముతో "మంచి" దనగా ఆయన మఱలి వెళ్లెను. అప్పుడు రాముడు లక్ష్మణుని జూచి "తమ్ముడా! మౌని దయకు పాత్రుల మగుటకు మనమెంత పుణ్యము చేసితిమో కదా!" యని పలుకుచు కొంత

దూరము వెళ్లి యమునా నది వేగముగా ప్రవహించుచోటును చూచి యీ నది నెట్లు దాటెదమని" వారు చింత పొందినవారైరి. అట్లు చింతించి వారొక కట్టెలమోపు దెచ్చి వానిని తెప్పగా కట్టిరి. ఆపైన నెండిన వెదుళ్లను గట్టి, వట్టివేళ్లను పరచి, ఆ మీద ప్రబ్బలితీవెలను నేరేడు కొమ్మలను పేర్చి సీతాదేవి కూర్చొనుటకు సుఖముగా నుండునట్లు లక్ష్మణుడు సుఖాసనమును సిద్ధము చేసెను. లక్ష్మీదేవి వలె సౌందర్యవతియై, కొంచెము సిగ్గుతో నున్న సీతను ముందుగా తెప్పయం దెక్కించి రాముడు తరువాత ఆమె ప్రక్కనే ఆమె యొక్క యాభరణములను, వస్త్రములను, తమయొక్క ఆయుధములను ఆ గొప్పనైన తెప్పయందెక్కించెను. కదలకుండునట్లుగా తెప్పను బట్టుకొని వారలాసీతాదేవి నెక్కించి ఆ కాళందీ నదిని నిర్భయముగా దాటుచు మధ్య భాగమును జేరగా ధరణీ తనూజ చేతులు జోడించి ఆ నదీమతల్లి నిట్లు ప్రార్థించెను. "ఓ దేవీ! నిన్ను దాటుచున్నాము. నా భర్త వనవాసవ్రతమును సాంతము జేసినవాడై సౌఖ్యముగా మఱలి వచ్చునట్లుగా దయతో జూడుము. మఱలి పురమునకు వెళ్లినప్పుడు నీకు వేయి గోవులను, వంద కల్లు కుండలను నీవు మెచ్చునట్లుగా సమర్పించెదను." అట్లామె మ్రొక్కుచుండగానే తెప్ప మంచి వృక్షములతో నలరారుచున్న దక్షిణ తీరమును జేరెను. అంతట వారలు తెప్పనొడ్డునకు లాగి జానకిని దింపి ఆ తెప్ప నచ్చట వదలివేసి వేగముగా..

**సీతారామ లక్ష్మణులు శ్యామవటమును జేరుట :**

(ఊరు విడచిన యైదవనాడు) ఆ యమునా తీరమున గల వనములను క్రమముగా చూచుచు వెళ్లి అందమైన పచ్చని యాకులతో నున్న మిక్కిలి చల్లనైన శ్యామమను పేరు గల వటవృక్షము నా వీరులు సమీపించిరి. ఆ మఱ్ఱిచెట్టును జూచి జానకి భక్తితో నిట్లనెను. "ఓ వృక్షరాజమా! నా నమస్కారములను చేకొనుము. నా భర్త నియమముతో వనవాసమును చక్కగా పూర్తి చేయునట్లుగా చేయుము. ఎన్నరాని సచ్చరిత్ర గలిగిన నా యత్తగారైన

కౌసల్యాదేవిని స్తోత్రము చేయదగిన గుణములు గల సుమిత్రాదేవిని మఱల నెక్కువైన ముదముతో చూచునట్లుగా నన్ను దయ చూడుము. నా నమస్కారమును స్వీకరింపుము" అని ప్రదక్షిణము చేసి నమస్కరించిన జానకిని జూచి రామచంద్రుడు లక్ష్మణునితో నీవు ముందును సీత వెనుకను ముందు నడువుడు. నే నాయుధములను ధరించి మీవెంటనే వెనుకగా వచ్చెదను. అట్లు వెళ్లుచుండగా సీతాదేవి అందమైన పుష్పమును గాని, ఫలములను గాని కోరినచో నీవు వానిని దెచ్చి వెంటనే యిమ్ము అనగా లక్ష్మణుడట్లే కానిమ్మని వెళ్లుచుండగా మదించిన యేనుగుల జంట మధ్యన వెళ్లుచున్న ఆడ యేనుగువలె రామ లక్ష్మణుల మధ్యలో సంతసముతో జానకీదేవి వింతలను జూచుచు వెళ్లుచుండెను. అచ్చట మునుపెన్నడును జూడనటువంటి వింతగా నున్న పెద్దవైన వృక్షములు గాని, క్రొత్త పుష్పము గాని, పువ్వులతో నున్న లతలనైనను చూచినచో ఆ సీతాదేవి "ఓ రఘుశేఖరా! వీటి పేర్లేమి" యని ప్రేమతో తన భర్తయైన రామచంద్రుని ప్రశ్నించుచుండెను. "అల్లదిగో ఎంత వింతగా నున్న వీ యాకులు. ఈ పువ్వుల యొక్క యందమేమని చెప్పను? అహో ఈ చిగుళ్లు మనస్సు నాకట్టుచున్నవి. బాపురే! యేమి ఈ లేత చెట్టు లీవి?" అనుచుండగా ఆ లలన యొక్క మనస్సును దెలిసికొని అంత నా పదార్థములను చాల అవలీలగా దెచ్చి భక్తితో సుమిత్రా సుతుడిచ్చుచుండెను. వింతైన యిసుకతోను, మనోహరమైన జలముతోను చెవికింపైన హంసల బెగ్గురు పక్షుల కలకలములతోను నొప్పు చున్న యమునా నది వెంట ఒక క్రోసు దూరము వెళ్లి యచ్చట లేడి మాంసముతో నా రాజపుత్రులు ఆ పూట గడిపిరి.



# ఏబది యాఱవ సర్గము

## శ్రీరాముడు సీతకు చిత్రకూటమునందలి చిత్రముల జూపుట :

నెమళ్ల కూతలు, కోతుల కిచకిచలు, ఏనుగుల ఘీంకారములు గల ఆ యమునా నదీతీర వనమునందు సీత కిష్టమయినచోట నా మహాబలవంతులు ఆ రాత్రి గడపిరి. ఆ రాత్రి యంతయు నచ్చట గడపి వేకువనే రాముడు నిదురలేచి నిద్రించియున్న తమ్మునిని మెల్లగా మేలుకొలిపి యిట్లనెను. "ఓ లక్ష్మణా! విన్నావా? చిలుకలు, కోకిలలు, గోరువంకలు అందముగా రొద చేయుచున్నవి. ప్రయాణము చేయు సమయమైనది." అనగా నతడు నిద్ర మత్తును అలసటను ప్రక్కకునెట్టి లేచెను. ఇట్లందఱును లేచి యా నది యందు స్నానములుచేసి నిత్యవిధులను దీర్చికొని ముని చెప్పిన మార్గమున చిత్రకూటము నకు బోవుచుండగా రామచంద్రుడు జానకీదేవిని జూచి అచ్చటి వింతల నామెకు జెప్పుచు వెళ్లుచుండెను. "అల్లదిగో జానకీ! చూచితివా. మోదుగుచెట్ల వనమును. వికసించిన పువ్వులతో నిండినవై అందముగా వరుసలుగా దీపములు వెలిగించినట్లు ప్రకాశించు చున్నవి. ఎల్లయెడల నందముగా వరుసలైన పువ్వులతో మాలికలను ధరించినట్లున్నది సుమా! జానకీ చూడుము పుష్పించిన జీడిచెట్లు మనుష్యులను తమ దరికి జేరనీయకుండగా ఫలములతోను, ఆకులతోను, పువ్వులతోను వంగియున్నవి సుమా! ఇట్టి వృక్షములుండుటచే నేను బ్రదికితిని. తేనెటీగలు తెచ్చిన తేనెలొక్కొక్క దానియందు రెండు తూములు గల తేనెపట్టులు చెట్ల కొసలందు వ్రేలాడుచున్నవి. ప్రతి కొండలోను ఉన్నవి ఓ తమ్ముడా! వానిని జూడుము. అల్లదిగో అందమైన వనప్రదేశములందు

చివురుల పువ్వుల తల్పము లందు వానకోయిలలు కూయగా నెమళులు ప్రతిగా కూయుచున్నవి. ఏనుగుల సమూహములతో నొప్పుచున్నదియును మనోహరములగు పక్షుల కలకలా రావములతో నిండియున్నదియు నగు చిత్రకూట పర్వతమును చూచితివా? తమ్ముడా! ఆ పర్వతము నందు అందమై సమతలమైయున్న చోటును, చుట్టును సారవంతమైన వృక్షములు గలిగి యొప్పుచున్న పుణ్యప్రదేశమునందు ఓ లక్ష్మణా మనము నివసించుదము" అని చెప్పి గొప్ప సంతోషముతో తమ్ముడును సీతయు దనవెంట రాగా, అనేక పక్షుల కలకలము గలదియు, అనేక విధములగు పండ్లు కందమూలములు గలదియు, మంచి నీళ్లు గలదియు, అందమైనదియు, కోమలములైన లతలచే నల్లుకొనబడిన వృక్షములు గలదియు, అనేకులగు తపస్వులకు నివాసమైనదియు నగు చిత్రకూట పర్వతమును జేరెను. అచ్చట "ఓ లక్ష్మణా! ఇది రుచ్యములైన అనేక ఫలములు గలది. బహువిధములైన పుష్పముల తీగెలతో చెట్లతో నొప్పుచున్నది. మనోహరమైయున్నది. మనకిచ్చట సంతోషము, సుఖజీవనము కలుగును. ఎక్కువైన తపస్సుచే నొప్పుచున్న మునులీ పర్వతమునందు సుఖముగా నివసించుచున్నారు. తొలగని ప్రీతితో మనము కూడ నీ పర్వతమునందు నివసింపవచ్చును."

**శ్రీరాముడు వాల్మీకి మహర్షిని సందర్శించుట :**

అనుచు రాముడు సీతయును లక్ష్మణుడును వినయముతో దనవెంటరాగా వాల్మీకి మహర్షిని జూచుటకై వెళ్లెను. అచ్చట మునిని జూచి వారు భక్తితో నభివాదము చేసిరి. (తక్కిన ఋషులందఱకు రాముడు ముందు నమస్కరింప తరువాత సీత మ్రొక్కినది. కాని వాల్మీకికి మాత్రము సీతయే ముందు మ్రొక్కినది. కారణము స్పష్టము. ఇది ఊరు విడచిన యాఱవ దినము) ఆ యనఘుడైన వాల్మీకి సంతసముతో వారికి తగు విధముగా నర్ఘ్యపాద్యములనిచ్చి విచ్చేయుడని

స్వాగతము చెప్పి క్షేమమును ప్రశ్నింపగా ఆ రాముడును న్యాయము తప్పకుండగా తమ యొక్క పేర్లను తామచ్చటికి వచ్చిన కారణమును అతి భక్తితో చెప్పి ఆ ముని యొక్క ఆజ్ఞను పొంది తమ్మునితో నిట్లనెను. "గట్టివైన కఱ్ఱలతో గట్టిగాను, అందముగాను నొకపర్ణశాలను గట్టుము" అనగా నా లక్ష్మణుడును వృక్షముల కొమ్మలతో నొక కుటీరమును గట్టెను.

**శ్రీరామ లక్ష్మణులు చిత్రకూటమున పర్ణశాల నిర్మించుట :**

గాలి వలనను వానవలనను చలింపనిదానిగాను, బయటి ఆవరణములు బాగుగా గట్టుటచే భద్రమైనదానిగాను, ఒప్పుచున్న పర్ణశాలను జూచి, ఏకాగ్రతతో సేవ చేయుచున్న లక్ష్మణుని జూచి శ్రీరాముడు "లక్ష్మణా! జింక యొక్క మాంసమును సంపాదింపుము. పర్ణశాలకు పూజ చేయవలయును. చాల దినములు భూమిమీద జీవింపదలచిన వారు వాస్తుశాంతి విధులను తప్పకుండ చేయవలయును. కనుక చేయవలసిన విధానమును తలచినవాడవై లక్ష్మణా! అడవిలో నొక్కహరిణమును జంపి తీసికొని రమ్ము." అనగానే యతడా ప్రకారముగా చేయగా మరల రాముడు "లక్ష్మణా! ఆ లేడి మాంసమును వెంటనే యుడకబెట్టుము. ఇది శుభదినము. ఇది స్థిర ముహూర్తము." అని చెప్పగానే లక్ష్మణుడు కృష్ణమృగము యొక్క మాంసమును నెత్తురుపోవుదాక బాగుగా అగ్నిలో నుడికించి రామునితో నిట్లనెను. "అన్ని అంగములతో పరిపూర్ణముగా పక్వమగుటచే ఈ లేడి పూర్వమున్నటులే యున్నది చూచితివా రామచంద్రా! ఇక లేచి చేయవలసిన కార్యమును జరిగింపుము." అని చెప్పగా శ్రీరాముడు నీటిలో స్నానము చేసి నియమముతో జపము చేసి నిఖిలమైన విధానములను పూర్తిచేసి దేవగణములను తృప్తిని పొందునట్లుగా పూజించెను. అంత అందఱును కుటీరములోనికి వెళ్ళిరి. ముదముతో వైశ్వదేవబలియును, రౌద్రవైష్ణవములను, వాస్తుదోషము పోవునట్లుగా పుణ్యాహవాచనమును, శాంతి

జపములను జరిగించి ఇంకను అటువంటి మంగళకరములైన విధులను నాచరించి ఆ దేవనదియందు తరువాత స్నానముచేసి క్రూరమైన భూతముల శాంతి కొఱకు శ్రీరామచంద్రుడు శాస్త్ర సమ్మతముగా ప్రశస్తముగా బలుల నొసగెను. ఆశ్రమమునకు దగిన విధముగా హోమ వేదికయును, అరుగులను, దేవాలయములను నిర్మించి, దర్భలచేతను, సమిధలచేతను, అడవులనుండు పండ్లచేతను పచనము చేయబడిన మాంసముచేతను, నీటిచేతను, చక్కగా వేదములందు జెప్పబడిన ప్రకారముగా హోమములు చేసి యథావిధిగా జానకీ సహితుడై పావనమైన పర్ణశాలా ప్రవేశము చేసి శ్రీరామచంద్రుడు దేవసభలో ప్రవేశించిన ఇంద్రుని వలె ప్రకాశించెను. అనేక విధములైన మృగములచేతను పక్షులచేతను, పుష్పములతో మనోహరములైన వృక్షములచేతను, ప్రకాశించుచు ఏనుగులు మొదలగు మృగముల ధ్వనులు గలదైన మాల్యవతీ తీరమునందు జానకీ రాఘవులు అడవులలోనుండు కష్టములను మరచిపోవునట్లుగా ఆనందముతో విహరించిరి.



# ఏబది యేడవ సర్గము

## సుమంత్రుడు మఱల నయోధ్యకు బోవుట :

అట్లు శ్రీరాముడు నావనెక్కగా సుమంత్రుడును గుహుడును రామచంద్రుడు కన్నులకు గనిపించునంతదాకను చూచుచు ఆ రాముని చరిత్రలనే ముచ్చటలుగా చెప్పుకొనుచుండి తరువాత వారందఱు గుహుని యింటికి వెళ్లినవారైరి. నిషాదరాజు యొక్క చారుల వలన సీతారామ లక్ష్మణులు ప్రయాగయందు మునియైన భరద్వాజుని యొక్క ఆశ్రమమునందు సంతోషముతో నుండుటయు, చిత్రకూట పర్వతమున కేగుటయు చక్కగా తెలిసికొని, అంత గుహునిచే ననుజ్ఞ తీసికొని సుమంత్రుడయోధ్యాపురమునకు వెడలుటకై రథమును తోలుకొని దుఃఖముతో బయలుదేరెను. దారియందు అడవులను, నదులను, పట్టణములను, పల్లెలను చూచుచు మూడవరోజు (రాముని విడచిన మూడవనాడు) సాయంత్రమునకు సంతోషములేని దౌటచేత సందడిలేక శూన్యముగా గనిపించుచున్న పురమును కన్నీటితో ప్రవేశించెను. మనస్సునందు దుఃఖము కలుగగా నెచ్చటను, గుఱ్ఱములుగాని, ఏనుగులు గాని, ప్రజలుగాని, రాజులు గాని కనిపించక సీతాపతి యొక్క వియోగ దుఃఖమనెడు అగ్నిచే తగుల బెట్టబడినట్లున్న పురంబున బ్రవేశించి వేగముగా లోనికేగుచుండగా సుమంత్రుని చూచి ఆర్తితో ప్రజలందఱును రఘుపుంగవుడేడీ! యని వాపోవుచు దుఃఖముతో వాచియున్న ముఖములు గలవారై అడ్డగించిరి. అప్పుడు సుమంత్రుడు గంగానది తీరముననే రాముడు నన్ను వెనుకకు వెళ్లుమని యాజ్ఞాపింపగా తిరిగి వచ్చితిని.

వారు ముువ్వురును గంగానదిని దాటి వెళ్లిరి. అనగానే ఆ జనులందఱును హా రామా! యనుచు దుఃఖమును పొందినవారైరి.

**సుమంత్రుని రథమును జూచి పౌరులు దుఃఖించుట :**

హా యనువారును, రాజపుత్రా! యనువారును, ఇస్సీ! ఇంకేటికీ బ్రతుకులు అనువారునునై పౌరులందఱును గుంపులుగా గూడి 'ఇక మనము చచ్చినవారి లోనే లెక్క గదా. ఇకనేమి చేయగలవారము. దానములుగాని యజ్ఞములుగాని పుణ్యమైన సమావేశము లందుగాని వివాహములు చేయు సమయము లందుగాని యింక అనఘుడైన ఆ రాముని జూచుట యెట్లు సంభవించును?" అనుచున్నవారైరి. "ఓ అనఘులారా! ఆ శ్రీరామచంద్రుని యొక్క ముఖమును జూడకున్న మనకు సుఖమనునది యెచ్చట నుండును? ఓ ఆర్యులారా! లోకహితుడైన శ్రీరాముని మోమును చూచుటకంటె హితమైన దేమియున్నది? ఓ పుణ్యాత్ములారా! తామరరేకులవంటి కన్నులు గల రాముని దరిచేరుట లేకున్నచో ఇంక సుఖకరమైన దేమున్నది? మన తండ్రివలె జూచుచు కాపాడు రాముడు మనల నెడబాసినచో ఇక మనకు దిక్కేమున్నదయ్యా! ఓ దీనులారా! ఆలోచింపగా మనమెంత నిర్భాగ్యులమో గదా! అట్టి ధర్మాత్ముడును, అటువంటి పుణ్యాత్ముడును, అటువంటి హృదయము గలవాడును, అటువంటి దయామూర్తియు విడచిపోగా బ్రతికి యుండి యిట్లు దుఃఖించు చున్నాము. ఆ సీతావల్లభుడు మనలను తండ్రివలె మనకేది సుఖమును గలుగజేయునో, ఏది జనులకెల్ల హితమును ప్రియమును గలుగజేయునో చూచి ఆ విధముగా రక్షించు చుండెను గదా!" అని ఆ పురమున నున్న స్త్రీలందఱును అంగడుల మార్గములందు కిటికీల నుండి రథమును జూచుచు సీతానాథుని యొక్క శోకముతో తాపమును జెందినవారై విలపించిరి. అప్పుడు సారథియైన

సుమంత్రుడు ముఖమును చాటుచేసికొన్నవాడై వేగముగా రాజు యొక్క సౌధమునకు రథమును తోలుకొని వెళ్లెను. అక్కడ తొందరగా రథము దిగి సర్వప్రజలతో నిండి సందడిగా నున్న దృఢముగా గట్టబడిన యేడు ప్రాకారములు దాటి వెళ్లుచుండగా, మందిరము యొక్క పై అంతస్థులందును మేడల పైనను నిలిచియున్న స్త్రీలందఱు ఆ రాముడు లేని రథమును చూచినవారై విపరీతమైన హాహాకారములతోను, వికారమైన స్వరములతోను మనస్సులు ఝల్లన నొకరి నొకరు చూచి పెద్దవైన తమ కన్నుల నుండి కన్నీరు కాలువలుగా దుఃఖించుచు విలపించుచుండ, ప్రాసాదమునం దచ్చటచ్చట నిలిచియున్న దశరథుని భార్య లందఱును రాజు యొక్క సన్నిధిని జేరి మెల్లమెల్లగా నేడ్చుచు మొగములు వాచిపోవుచుండగా, 'ఈ సుమంత్రుడు రామునితో కూడ వెళ్లి రాముని నడవులపాలు చేసి వచ్చి తానేమని యితడు కౌసల్యకు చెప్పునో గదా. ఇక మనమే విధముగా బ్రతుకగలవారము. రాముని వీడి ఆ కౌసల్య యెట్లు బ్రతుకునో? భరింపరాని తాపము నెట్లు భరించునో గదా!"

**సుమంత్రుడు దశరథుని జూచుట :**

అనుచున్న రాజు భార్యల మాటలను విని, విపరీతమైన శోకమను నగ్నిచే కాల్చబడుచున్నదా యనునట్లున్న యెనిమిదవ కక్షను, దీనమైన మనస్సుతో, ఆతురతతో పుత్ర వ్యధచేతను మ్లానమైన ముఖముగల మహారాజును తెల్లని సౌధమధ్యమందు చూచి సుమంత్రుడు నమస్కారము చేసి వరుసగా శ్రీరాముడు చెప్పిన వాక్యములన్నియును జెప్పగా రాజు మౌనముగా విని విభ్రాంతిని పొందినవాడై నేలమీద పడి మూర్ఛనందెను. స్త్రీలందఱును చేతులను పైకెత్తి హాయని సహింపరాని విధముగా రోదించిరి. అప్పుడు కౌసల్య సుమిత్ర ఆసరాతో భర్తను లేవనెత్తి యిట్లనెను. "ఓ రాజా! యితడఘటన ఘటనా సమర్థుడగు

రాముని దూత. భయంకరమైన యడవుల నుండి వచ్చినాడు. ఇంతటి యన్యాయమును జేసితినిగదా యని నీవు లజ్జ నిప్పుడు పొందుచున్నావు. లే లెమ్ము. నీకు చాల పుణ్యముండును. ఏడ్చినందువలన ఫలితమేమున్నది? ఏ స్త్రీకి జడిసి నీవు సీతానాథుని యొక్క వార్తనైన నడుగలేకున్నావో అట్టి నీ ప్రాణములకు యమదూతయైన కైక యిచ్చుట లేదు సుమా. ఇది సత్యము. కనుక నీవింక ధైర్యమును దెచ్చుకొని యితనితో మాటాడవచ్చును." అని పలికి కౌసల్య భరింపరాని దుఃఖముచేత మూర్ఛనందినదై నేలపై బడిపోయెను. అట్లు పడిపోవుట నంతఃపుర స్త్రీలందఱును చూచి హాహారవములతో నేడ్చుటను జూచి చుట్టుపట్ల నున్న స్త్రీలును, వృద్ధులును, యువతులును విలపింపగా పురమంతయు నల్లకల్లోలమయ్యెను.



# ఏబది యెనిమిదవ సర్గము

## దశరథుడు సుమంత్రుని రామలక్ష్మణుల వృత్తాంత మడుగుట :

అంతట దశరథుడు మూర్ఛనుండి తేరుకొని తనయొక్క ఉత్తములైన సుతుల యొక్క వృత్తాంతమును తెలిసికొన దలచెను. అత్యధికమైన విషాదము నొందినవాడును, తపించి పోవుచున్నవాడును, క్రొత్తగా పట్టువడిన ఏనుగువలె నున్నవాడును నగు రాజును చేరనేగి సుమంత్రుడు చేతులు జోడించి నిలువగా అంత రాజు, దుమ్ము గొట్టుకొనియున్న శరీరముతోడను, కాలువలుగా కారుచున్న కన్నీటితోను, ముందే వాలియున్న శిరస్సు తోడను, దుఃఖముతో తూలుచున్న ముఖముతోడను దీనముగా నున్న సూతునితో నిట్లనెను. "ఓ సూతా! హెచ్చైన సుఖముల ననుభవించుచునుండిన ధర్మాత్ముడైన రాముడు నేడే చెట్ల మొదళ్లయందు నివసించెనయ్యా! రాజపుత్రుడై మంచి శయ్యపై పవ్వళింపవలసిన వాడు, సుకుమారమైన వాడే నేలపై పవ్వళించెనో గదా! ఎవ్వని వెంట నేనుగులు రథములు భటులు వెళ్లుచుందురో అటువంటి వాడే వనములందు దుఃఖించుచున్నాడయ్యా! సర్పములు, మృగములు నివసించు వనములందు చిన్నవారెట్టి యవస్థలు పడుచున్నారో గదా! చిన్నపిల్లయు, ముగ్ధయు, పరమ పతివ్రతయు, అన్నెము పున్నెము నెఱుగనట్టిదియు నగు సీత వెంటనడవగా నా పుత్రు లొంటరిగా రథముదిగి కాల్నడకతో నెట్లు వెళ్లిరి? సుమంత్రా! నీవు కన్నులార చూచినవాడవు. నా కుమారులిర్వురు మందర పర్వతమున నశ్వినీదేవతలు ప్రవేశించినట్లు వనమున ప్రవేశింపగా చూచిన నీవే ధన్యుడవు సుమా! సుమంత్రా! రామచంద్రుడేమనెను? మఱి సుమిత్రా సుతుడేమన్నాడు? నిన్ను పొమ్మను సమయమున భూమి సుతయేమనెను? చెప్పుమా! ఆ మహనీయుడైన రాముడుండు చోటేది? అతడు వేనిని భుజించుచున్నవాడు? ఆ విషయములను వినియైన సాధువులలో, బడిన యయాతి వలె నీ శరీరమును ధరించువాడను! అని రాజడుగగా విని సుమంత్రుడు కంఠము నిలువరించుకొన్న కన్నీటిచే గద్గద స్వరము నందగా

దుఃఖించుచు మాటలు తడబడుచుండగా రఘువంశ శ్రేష్ఠునితో నిట్లనెను.

**సుమంత్రుడు దశరథునకు శ్రీరామ వాక్యములను దెలుపుట :**

"ఓ రాజా! శ్రీరామచంద్రుడు సూతా! నామారుగా నీవు నా తండ్రి యొక్క పాదముల మీద వ్రాలి మ్రొక్కమని మొట్టమొదటి మాటను చెప్పెను. శుద్ధాంతమున నున్న తల్లులంద రికిని నా మారుగా నభివాదనము చేసి వారివారిని తగిన విధముగా మీయందఱకును సుఖమే కదా! యని నా మాటగా చెప్పుమనెను. నా తల్లియైన కౌసల్యను తరువాత చూచి కుశలమడిగి నమస్కరించి యిట్లు చెప్పుమనెను. "అన్ని పనుల యందును ఏమరుపాటు లేకుండ మసలుము. ఎప్పుడును ధర్మమును తప్పకుము. తగిన సమయమున అగ్ని గృహ కార్యములందు పరాకు వహింపకుము. దేవుని పూజించునట్లుగా భర్త యొక్క పాదములను గొలువుము. అభిమానము జోలికి వెళ్లకుండగా నభిమానమును దూరము చేసికొని, రాజు యొక్కయు, కైక యొక్కయు మనసు నొవ్వకుండ నట్లు నడచుకొనుము. కైక యొక్క కుమారు నీ భూమికి రాజుగా దలంపుము. రాజు ధనముచే గొప్పవాడను రాజధర్మమును తెలిసి వర్తింపుము." భరతుడు రాగానే నా మాటగా అతని క్షేమ సమాచారములను దెలిసికొనుము. అందఱు తల్లులయందును న్యాయమైన విధముగా ప్రవర్తింపుము. రాజుననెడు భావముతో ముసలివాడైన తండ్రిని చిక్కుల బెట్టకుము. రాజ్య సుఖములను తండ్రి చెప్పిన విధముగా అనుభవింపుము అని చెప్పుమని పలికి కన్నులనీరు కారుచుండగా మఱలనిట్లనెను. తమ్ముడా! నాపై నాశలుపెట్టుకొన్న నా తల్లిని నీ తల్లితో సమానముగా జూచుకొనుము అని చెప్పుమని పల్కి ఎక్కువైన శోకముతో వికసించిన ఎఱ్ఱ కలువ రేకుల వంటి కన్నులు గల యారాముడు మోము వాల్చి కన్నుల నీరు నింపినాడు మహారాజా!" యని వచించెను.

**సుమంత్రుడు దశరథునకు లక్ష్మణు వాక్యములను దెల్పుట :**

ఇక సౌమిత్రి రోషతామ్రాక్షుడై రోజుచు నిట్లనెను. వినుము. రాజపుత్రులలో నుత్తముడైన రామచంద్రుని నే యపరాధము చూచి యా రాజు వనములకు

బంపించెను? తీరి కూర్చొని మాకీ విధముగా బాధ కలుగునట్లు కోరిన యా కైక యొక్క తుచ్ఛమైన శాసనమును పెద్దగా తలచి తలదాల్చి చేయదగని చెడ్డపనిని మీ రాజెట్లు చేసెను? వరదాన నిమిత్తముననో రాజ్యలోభముననో యే కారణముచేత చేసిన నేమి రాముని నిట్లు వడుచుట ప్రాయశ్చిత్తములేని పాపము సుమా! దైవ ప్రేరణమున నిట్లు చేసెనని చెప్పెదవేమో? దైవమునకైనను నొకకారణమనునది యుండవలెను గదా! ఆ ప్రకారముగ నేదైన నున్నచో చెప్పుము వినెదను. ఆలోచన చేయక మతిచెడినవాడై లోకవిరుద్ధమైన పనిని రాజీ విధముగ జేసెనని చెప్పెదవేమో దానివలననే మేమిట్లు జాలిని చెందుచున్నాము. దానివలననే రాజు కూడ నేడ్చుచున్నవాడు గదా! సుమంత్రా! నాకు రాముడే అన్నయు, రాజును. రాముడే ప్రియమైన బంధువు. రాముడే నాకు తండ్రి నాకు రాజు నెడల తండ్రియను తలంపు లేదు సుమా! సర్వలోకములకు మేలు చేయువాడును, సర్వులకు ప్రియుడైన వాడును, పవిత్రుడును, ధర్మమునందాసక్తి గలవాడును, జనుల మనస్సులకు సంతోషమును గలిగించువాడును నగు రాముని విడచి ఈ రాజ్యము నంతను ఎట్లు సంతోషపెట్టుదువని దశరథునితో చెప్పుము. ఇంత లోకవిరుద్ధమైన వింత పనులను జేయు నీవు విశ్వమునకు రాజువెట్లగుదువని సుమంత్రా! నా మాటగా రాజుతో బలుకుము” అని పలికెను. ఇక జానకీదేవి యూర్పులను విడచుచు దయ్యము సోకినట్లుగా దిగ్భ్రమచెంది చూచుచుండెను. కాని దుఃఖమనునది యెఱుగని జానకీదేవి ఏమియును జెప్పక యేడ్చుచుండినది మహారాజా! కన్నులనీరు గార్చుచున్న తన పెనిమిటి యొక్క పద్మము వంటి ముఖమును జూచుచు వాడియున్న ముఖముతో నన్ను జూచుచు ఆమె కన్నీరు గార్చుచుండెను. సౌమిత్రి యొక్క భుజము లూతగాగొని నిలిచి ముఖము కన్నీళ్లతో తడియగా చేతులు జోడించి రాముడు నిలిచియుండెను. సీత రోదించుచు నన్నును రథమును జూచుచు నిలిచియుండెను.

# ఏబది తొమ్మిదవ సర్గము

అనగా విని దశరథుడు సుమంత్రా! తరువాత మిగిలిన విశేషములను చెప్పుమనగా సుమంత్రుడిట్లనెను. "రాజా! రఘువంశ శ్రేష్ఠులగు రామలక్ష్మణులు అంతట జడలు ధరించి వేగముగా నారచీరలను ధరించినవారై గంగా నదిని దాటి ప్రయాగ దిక్కుగా వెడలిరి. సుమిత్రా సుతుడు రఘురామునకు రక్షగా ముందుగా వెళ్లుచుండెను. లక్ష్మణుని వెనుక భూజాతయును, ఆమె వెనుకగా రామచంద్రుడును వెళ్లుచుండగా ఓ రాజా! అది యంతయును జూచినవాడనై దుఃఖసముద్రములో మనసు చిడిముడి పడుచుండగా సీతానాథుడు నావలను వదలుడని చెప్పుచున్న యేర్పాటులను జూచి కనులవెంట వేడి కన్నీరు ఎక్కువగా కారుచుండగా చూచు చూపులు దుఃఖపూర్ణములై యెంతకును మరల వయ్యెను. ఆ యిద్దఱు రాజపుత్రులకు నేను నమస్కరించి విచారమును భరించినవాడనై గుహునితో తిరిగి వచ్చితిని. రఘురాముడేదైనను వార్తనంపునేమో యను నాశచేత చాల రోజులు నేనచ్చటనే నిలిచియుంటిని.

### సుమంత్రుడు తాను వచ్చు మార్గమున చూచిన విశేషములు చెప్పుట :

తిరిగి నేను వచ్చు మార్గమున నందమైన పువ్వులు మొగ్గలు గల లతలు మలమల మాడిపోయి యుండెను. చిన్న నీటిగుంటల యందును, కొలనుల యందును, నదుల యందును జలములు సలసల క్రాగుచుండెను. కొండలయందు చెట్లయాకులెండి గలగల లాడుచుండెను. అవి యన్నియు జూచుచున్న నా మనస్సు విలవిలలాడినది మహారాజా! సర్పములు గదలుటలేదు.

అడవి యేనుగులును, క్రూరమృగములును చలించుట లేదు. ఓ సద్గుణశాలీ! రామచంద్రుని వీడిన దుఃఖముచేత కొంచెమైన ధ్వనులు వినిపించుట లేదు. పద్మపత్రములు నీటిలో మునిగిపోయినవి. చేపలు, జలవిహంగములు సంచరించుట లేదు. పద్మములు తామరతూండ్లు యెండి వాడిపోయినవి. యిట్టి సరస్సులను జూచితిని. అంతకు ముందువలె నీటియందు పుట్టిన పుష్పములు గాని, నేలమీది పుష్పములు గాని, సుగంధములు వెదజల్లుటలేదు. తోటలు శూన్యములైయుండెను. మాన్యచరితా! యెక్కడి పక్షులక్కడనే పడియుండుటచే వనమంతయు పాడువడినట్లుండెను. ఏమని చెప్పుదును. ఈ యూరి యందొక్కడైనను తేటైన ముఖముతో గనిపించుటలేదు. సీతాపతి లేకపోవుటచేత నందఱును నిలువుగుండెతో నిలిచి చూచి నిట్టూర్పులు విడుచువారే.

**సుమంత్రుడు పౌరుల దుఃఖమును దశరథునకు జెప్పుట :**

ఓ రాజా! దుస్సహమైన లోకము యొక్క శోకము నేమని చెప్పువాడను. రామచంద్రుడు లేని రథమును జూచి పౌరులు భరింపరాని వ్యథతో రాజవీధులందు తల్లడపడుచుండిరి. మేడలపై నుండి స్త్రీలందఱును దుఃఖించుచు హా యని యేడ్చుచుండిరి. తమ విశాలమైన కన్నులనిండ నీరు నిండుటచే స్త్రీలందఱు నొకరి నొకరు చూడజాలక నివారింపరాని సంతాపముతో నేడ్చుచుండిరి. వీరు నీ పగవారని వీరు తటస్థులని వీరు నీకు హితులని ఓ రాజా! అందఱు నొకే విధముగా విలపించుచుండుటచే నేను గుర్తింపజాలనైతిని. లోకులందఱును సంతోషములేని వారైరి. సంతాపమునందిన యేనుగులు గుఱ్ఱములు బాధతో నఱచుచున్నవి. ఓ రాజా! ఈ లక్షణములచే అయోధ్యా నగరము ఏడ్చుచున్న కౌసల్యయో యనునట్లున్నది." అని ఈ విధముగా సూతుడు చెప్పగా విని దశరథ మహారాజు ఎక్కువైన వ్యసనముతో తపించుచున్న మనస్సు గలవాడై గద్గద స్వరముతో ఆ మంత్రివరునితో నిట్లనెను.

**సుమంత్రునితో తనను శ్రీరాము డుండు చోటికి తీసికొని పొమ్మని దశరథుడు కోరుట :**

ఓ సుమంత్రా! తన జన్మముతో వచ్చిన పాపభావములచే నీచురాలైన కైకేయి చెప్పిన మాటలను విని యవివేకినై యాలోచన చెప్పుటలో కుశలురైన మంత్రులును, ముసలి వారును, నా మేలు కోరువారును బుద్ధిశాలురగు పౌరులును నింతమంది యుండగా నే నొక్కరితోను ఆలోచింపక స్త్రీయొక్క మోహములో మునిగినవాడనై యేదియో మునిగిపోవు చున్నట్లుగా నిటువంటి సాహసమును జేసినాడను. భవితవ్య మిట్లుండుటచే నిది కుల వినాశమున కేర్పడినది. అనుకొనకుండ నిటువంటి భరింపరాని దుఃఖము కలిగినది. నీకు నే నెప్పుడైన నే కొంచెమైన మేలు చేసియుండినచో నన్ను పుత్రుని యొద్దకు తీసికొని వెళ్లుము. ఇప్పటికిని నా యాజ్ఞ చెల్లుబాటైనచో ముప్పు వచ్చును. ఒక్క ముహూర్తమైన నేను బ్రతుకలేను. ఆ సూర్యవంశ శ్రేష్ఠుడైన రాముడు దూరముగా వెళ్లిపోవునేమో. ఓ సారథీ నా రథమును వెంటనే సిద్ధముచేసి నన్నక్కడకు తీసికొని వెళ్లుము. అందమైన ఆకృతి గలవాడును, స్వచ్ఛమైన గొప్ప కీర్తి గలవాడును, జగత్తులోని జనులందఱి హృదయ పద్మములలోనుండు వాడుననయిన రాముని నేనీ భూమిపై బ్రతికియుండిన జూడగలవాడను. ఆ ముద్దులొలుకు నవ్వుమొగమును, మణులు పొదిగిన బంగారు కుండలములతో ప్రకాశించు ఆ చెవులును, వికసించిన పద్మములవలె విశాలమయిన ఆ కన్నులును, ఆజానుదీర్ఘమైన యా చేతులును, అందములైన యా దంతముల వరుసను చూడకున్నచో ఓ సారథీ నిజముగా నేను యముని పట్టణము జూడ నేగుదును సుమా! ఇంతకంటె దుఃఖమింకేది యుండును? ఇటువంటి దురవస్థలో నున్న నేను కన్నుల కరవు తీరునట్లుగా రామచంద్రుని జూడనేర నైతినేని ఓ సుమంత్రా! ఇక నాకు దిక్కేది? హా! రామా! హా రామానుజా! హా స్త్రీరత్నమైన

ఓ సీతా! దుస్సహమై దాటరాని వ్యథయను గొప్ప సముద్రమున చిక్కుపడి దిక్కుతెలియక చచ్చుచున్న నన్ను మీరు తెలియజాలరా?" అని రాజు దుఃఖసముద్రములో మునిగినవాడై కౌసల్యవంక జూచి యిట్లనెను. "ఓ దేవీ! రాముని గూర్చిన శోకమనెడు వైశాల్యము గలదియు, సీత దూరముగ నేగుట యనెడు దుఃఖమే పారముగా గలదియు, శోకించువారి నిట్టూర్పులే అలలుగా సుడులుగా గలదియు, కన్నీరనెడు నురువులచే భయంకరమైనదియు, దుఃఖముచే చేతులు విదిలించుటలనెడు చేపల కదలికలు గలదియు, ఆక్రందనములనెడు గంభీరధ్వని గలదియు, విడివడి కేశపాశములనెడు నాచు గలదియు, కైకేయి యనెడు బడబాగ్ని గలదియు, నా కన్నీటి వేగము వలన బుట్టినదియు, మందర వాక్యములనెడు భయంకరములైన మొసళ్లు గలదియు, పాపాత్మురాలి వరము లనెడు అంచులు గలదియు నగు రామవనవాస మనెడు ఈ మహాసముద్రము నందు ఓ అబలా! రామచంద్రుడు సహాయపడకుండినచో నేను మునిగి పోవుదును. ఈ దుఃఖసముద్రమును నేను దాటజాలను. ఓ దేవీ! సోదర సహితుండైన రామచంద్రుని జూడవలెనను ఆశ యున్నను జూడలేకున్నాను గదా! అయ్యో! కౌసల్యా! ఇంతకంటె ఎక్కువైన పాపమున్నదా? అనుచు మూర్ఛనందగా, కుమారుని కొఱకును, భర్తను గూర్చియు దుఃఖము రెండింతలు కాగా ఆ కౌసల్య వదలని భయముతో వణకిపోయెను.



# అఱువదవ సర్గము

**ఆ** విధముగా భయముతో వణకుచు ఆ రాముని తల్లి భూతము పట్టినదాని వలెను ప్రాణములేనిదాని వలెను సోలిపోవుచున్నదై సూతుని జూచి యిట్లనెను. "ఓ సూతకులాగ్రణీ! రాముడును, లక్ష్మణుడును సీతయు నెచ్చటకు వెళ్లిరో యచ్చట నన్ను విడచిపెట్టుము. నీకు పుణ్యముండును. ప్రఖ్యాత చరిత్రులగు వారిని విడచి యొక్క నిమిషమైన నీ శరీరము నిలిచియుండదు. రథమును మరల్పుము. గుణాలంకారులగు వారుండెడు దండకాటవి యందు వేగముగా నన్ను విడచిపెట్టుము. నా పుత్రులను గలిసికొనకున్నచో, యముని సదనమునకు వెళ్లుట నిశ్చయము సుమా!" అని కరుణ పుట్టునట్లుగా నేడ్చుచున్న ఆ కౌసల్యను జూచి నమస్కరించుచు సుమంత్రుడిట్లు చెప్పెను.

**సుమంత్రుడు కౌసల్య నూరార్చుట :**

"ఓ కౌసల్యాదేవీ! మోహమును శోకమును విడచిపెట్టుము. దుఃఖము వలన గలిగిన సంభ్రమమును వదలుము. పరితాపమును వీడి నీ కుమారుడు కోడలితో గలిసి యడవులలో సంచరించుచున్నాడు. ఓ స్త్రీరత్నమా! లక్ష్మణుడును ధర్మమునందాసక్తితో నియమములతో నింద్రియములను జయించినవాడై రాముని పాదపద్మములను మహితమైన పరలోకమును గోరి సేవించుచున్నాడు. స్త్రీరత్నమగు సీతయు శ్రీరాముని యందు మనస్సు నిల్పినదై జనరహితమైన యడవియందు కూడ ఇంటియందువలెనే భయమును కొంచెమైనను పొందకుండ ధైర్యము గలిగి యెంతో సంతోషముతో తిరుగుచున్నది గాని ఇంతయైనను దైన్యమును బొందుటలేదు. ఆ జానకీదేవి మునుపు ఉద్యాన

వనములందెంత సంతోషమున దిరుగుచుండెనో అట్లే జనశూన్యమైన యడవుల యందును ననురాగముతో విహరించుచున్నదమ్మా! చంద్రకళవంటి ఫాలభాగము గల భూపుత్రి చిన్న బాలికవలె తన హృదయేశ్వరుని యందర్పించిన మనస్సుతో జనులు సంచరించని యడవులలో నిశ్చింతగా విహరించుచున్నది. ప్రాణము అతని యధీనము చేయుటచేతను మనస్సతని యందే నిల్పుటచేతను సీతకు రాముడులేని యయోధ్య అడవివలె తోచును. తన నాథుడుండుటచే ఆ సీతకు వనములయోధ్యగానే తోచుచున్నవి. త్రోవలో నున్న గ్రామములను, పట్టణము లను నదులను వృక్షములను జూచుచు సీతాదేవి రాముని లక్ష్మణుని వీని పేరేమి? యివి యెటకు బోవును ఇవి యేమిటి? అని యడుగుచు వెళ్లెను. శోకము నొకింతయైనను ఆత్మలోనైనను పొందదయ్యెను. మన యూరికొక్క క్రోసుదూరమున నున్న తోటలందు క్రీడించు సంతోషముతోనే యా జానకీదేవి అడవులలో విమలమైన మనస్సుతో సంచరించుచున్నది. ఆమెకై నీ విట్లు దుఃఖింపదగునటమ్మా! ఇప్పుడు నాకింతవఱకే జ్ఞాపకమున్నది. కైకేయిని గూర్చి తటాలున కోమలియైన సీత యేమేమొ చెప్పినదిగాని అవి యన్నియు నిప్పుడు నాకు దోచుటలేదు" అని పొరపాటున సీత ఆమెను గూర్చి పలికిన మాటలు చెప్పబోయి ఆ విషయమును మార్చి సంతోషకరములైన మాటలనే మధురముగా నిట్లు చెప్పెను. "దారిలో శ్రమనుగాని, గొప్పదైన గాలివలనగాని యెండయొక్క వేడిచేగాని, సంభ్రమముచేతగాని చంద్రకిరణముల వంటి కాంతి గలదియగుసీత వికృతిని పొందలేదు సుమా. తల్లీ! అందుచేత నీవు చింతను వీడుము. ఇది నిజము. నీ పాదముల సాక్షిగా చెప్పుచున్నాను. పద్మదళము వంటిదియు, చంద్రతుల్యమునయి ప్రకాశించు ఆ భూపుత్రి యొక్క అద్దమునుబోలు ముఖము యొక్క కాంతి రవంతయైన వికాసమును గోల్పోవదు. లత్తుక రసము వంటివగు భూసుత యొక్క పాదములు లత్తుక పూయబడని వయ్యును తమ సుకుమారమైన కాంతిచే నిప్పుడును తామర మొగ్గలవలె నున్నవి. ఆభరణముల మీది ప్రేమచేత

సుందరియైన జానకీదేవి అందెలను దాల్చియే వేగముగా తన హృదయాధి నాథునితో సమముగా వెళ్లుచుండగా పాదములు ఘల్ఘలు ఘల్లుమని మ్రోయుచుండగా సంతోషముతో విలాసముగా వెళ్లుచుండుట జూచితిని సుమా. ఓ తల్లీ! యిక నీవు చింతించుట యెందులకమ్మా! శ్రీరాముని బాహువు లనెడు కోటనాశ్రయించినదై సీతాదేవి అడవియందు పులులను, ఏనుగులను, సింహములను కన్నులార చూచియును భయము చెందుటలేదు సుమా! వారికొఱకైనను మనకొఱకైనను రాజును గురించియైనను బాధను పొందకుము. వీరి యొక్క చరిత్ర స్థిరమై భూమియందు సత్కీర్తితో నిలిచియుండును సుమా! తండ్రి యాజ్ఞగొని తన యొక్క సత్యము లోకమునందంతటను ప్రకాశింపగా మునిజనులు సంచరించు మార్గమున సంతోషముతో ఫలములును, ఆకులును భుజించుచు ఆ పవిత్రుడగు రాముడు స్థిరమైన కీర్తిని గాంచును. నీ వార్తిని జెందకుము" అని చెప్పగా కౌసల్యయును తనయుని దలంచుకొని "సుకుమారా! సుతా! కుమారా! రాఘవా!" యని విలపించెను.



# అఱువది యొకటవ సర్గము

## కౌసల్య దశరథునితో నతని దుశ్చేష్ట గుఱించి చెప్పుకొని యేడ్చుట :

ఈ ప్రకారముగా విలపించుచు కౌసల్య తన భర్తను జూచి "రాజా! నీకు ధరణియందు వదాన్యుడు, కారుణికుడు, సత్యవాక్కే ధనముగా గలవాడు, ప్రియమునే పలుకువాడు అను గొప్ప కీర్తి వ్యాపించుగాక! కాని సుఖముగా పెరిగినవారగు మన పుత్రులును, జనకరాజ పుత్రియును వనములందు కష్టముల నెట్లనుభవింపగలరో గదా! చలికి వణకక, ఎండలకు తపింపక, గాలికి సుడివడక సుఖముగా పెరిగినదియు, సుకుమారియునగు తరుణియునగు ఆ సీత అడవులలో నెట్లుండగలదో చెప్పుమా? పప్పును, ఊరుగాయలును, పచ్చళ్లును నోటికింపు గలుగునట్లుగా రుచిగా నంజుకొనుచు మృదువైన యాహారమును భుజించు సీతాదేవి అయ్యో! ఉప్పును కారమును లేని చప్పిడివగు భూమిమీద రాలిన గడ్డి గింజలనే విధముగా తినునోగదా! చూడుము, ఇది యంతయు నీవలననే గదా! సంగీతములను మంగళకరములైన ధ్వనులను వీనులవిందుగా నెల్లప్పుడు వినునట్టి సీత పెద్దపులులు సింహములు మొదలగు వాని భయంకర గర్జనలనెట్లు వినుచున్నదో గదా! ఇంద్రధ్వజమువలె నున్నతుడును గడియమ్రానుల వంటి భుజములు గలవాడును నగు నాసుతుడు తన భుజమే తలదిండుగా చేసికొని లేతపచ్చికయే మెత్తని పరుపుగా తలచి దిక్కులేనివాని మాదిరిగా నెక్కడ పవళించెనో గదా! అక్కటా! తండ్రియే మనస్సునందు కల్మషమునొంది వ్యథయను సముద్రమున ద్రోయగా నెవ్వరు దిక్కగుదురు? వికసించిన తామర రేకులవంటి రంగును, క్రొత్తగా వికసించిన పద్మముల

సౌరభము గల యూర్పులును, బద్మములవంటి నేత్రములును, సుకుమారములై వ్రేలుచున్న ముంగురులును గలిగి మనోహరమై చిరునవ్వుచే ప్రకాశించునదై పున్నమచంద్రుని దిరస్కరించు నా పుత్రుని ముద్దు మొగము నేనింక నెప్పుడు చూచెదనో గదా! ఇంత జరిగినను నా హృదయమింతింత ముక్కలుగా పగుల కుండుట యాలోచించి చూడగా నిది వజ్రముతో జేయబడి యుండవచ్చును. ఇది నిక్కము గాకున్నచో నీ పాటికి వేయి ముక్కలైపోకుండునా? నా కొడుకును కోడలిని నా కాప్తులైన వారల నపరిమిత సుఖముల ననుభవింపదగువారిని వనముల మధ్యకు ద్రోసితివి. ఏ కాలముననైన నిట్టివాడైన భర్త యుండునా? పదునాల్గేండ్లును వనవాసముచేసి నా సుతుడు పదునేనవ యేట వచ్చినను భరుతుడేలుచున్న రాజ్యమును కోరడు. భరతుడిచ్చినను పుచ్చుకొనుట కంగీకరింపడు. శ్రార్ధమునకు యోగ్యుడైన బ్రాహ్మణుని బిలువక ధనలోభముచేత విప్రులు తమవారలకే భోజనముపెట్టి యోగ్యులైన బ్రాహ్మణులను మీరిష్టపంక్తికి దయచేయుడనగా అటువంటి వారి యింటియం దమృతమును బెట్టినను సుగుణవంతుడును పండితుడును, దేవ సమానుడును నైన బ్రాహ్మణుడు భుజింప సమ్మతింపడని జగమున చెప్పికొనగా మనము వినుచుండలేదా? ముందు భుజించినవారు బ్రాహ్మణులే యయినను, ఓ రాజా! తిరస్కరింపబడిన విప్రులింక వారియింట శృంగభంగమందిన వృషభములవలె భుజింపరు. ముందుగా తమ్ముడనుభవించిన రాజ్యమును ధనమును తరువాత గొప్ప బుద్ధి గలవాడును శ్రేష్ఠుడును, అగు నా పుత్రుడు తానే పెద్దకుమారుడగుటచేత తానెట్లు తీసికొనునో చెప్పుము? ఇతర జంతువులు తినగా మిగిలిన మాంసమును గొప్ప బలము గలిగిన పులి యెప్పుడును తినుట కిష్టపడదు. పురుష వ్యాఘ్రుడైన రాముడు ఒకరనుభవించినదానిని అసహ్యపడక యెట్లు కోరును? ఓ రాజా! ఒక యాగమున కుపయోగించిన నేయి, దర్భలు, సమిధలు, హవిస్సు, పురోడాశము,

యూపములు మొదలగువానిని తరువాత చేయు యజ్ఞములందు మఱల నెవరైనను వాడుకొందురా? ఓ భూపతీ! సారము హరింపబడిన మద్యమును వలెను, సోమపానము చేయబడిన యాగమును వలెను, ఇతరులచే ననుభవింప బడిన రాజ్యమును నా కుమారుడెట్లు కోరును. అంత చెడి బ్రతుకుచున్నాడా? ఇంతటిదైన యవమానమును సీతానాథుడే ప్రకారముగా సహించును? తన తోక చివఱను ద్రొక్కినచో పెద్దపులి శాంతముతో నోర్చుకొని యుండుట జగత్తులో గలదా? చెప్పుము. గొప్ప యుద్ధమున లోకములన్నియు నొక్కటిగా వచ్చినను నా సుతునకు లేశమయినను భయమును కలుగజేయ జాలవు. కాని భూమియం దధర్మపరులను ధర్మమార్గమున నడపింప దలచి ఆ విధియందు లగ్నమైన మనస్సు గలవాడై తానీ విధముగా దుఃఖములను భరించుచున్నాడు. బంగారుతో చేయబడిన ములుకులుగల వాడి బాణములతో సముద్రము నైనను, భూతసంఘములనైనను ప్రళయకాలునివలె దహింపగలవాడు. అట్టి సింహ బలుడును వృషభము కన్నుల వంటి విశాలమయిన కన్నులు గలవాడునగు రాముడు పెద్ద చేపచే చంపబడిన చేపపిల్లవలె తన తండ్రిచేతనే కొట్టువడియెను గదా! ఓ రాజా! నీవును ధర్మమును తెలిసినవాడవుగదా! చెప్పుము, కన్నకుమారుని ఈ ప్రకారముగా నీవు కానలయందు బాధలనందునట్లు గెంటివేసితివి గదా? అక్కటా ఇది రాచవారుగాని బ్రాహ్మణశ్రేష్ఠులుగాని మెచ్చునట్లుగా నే ధర్మశాస్త్రము నందైనను విహితకృత్యముగా విధింపబడియున్నదా? ఏ స్త్రీకైనను భర్త మొదటి దిక్కగును. రెండవ దిక్కు పుత్రుడు. ఆపై ప్రియబంధువు గతియగును. విచారింపగా కాంతకు వేరొక గతి లేదుసుమా! నీవు నా యొక్క సవతి చేతిలో చిక్కినవాడవై నన్ను విడచుటచేత నీవుండియును నాకులేనివాడ వయితివి. ఇక నా పుత్రుని నీవే యడవులపాలు చేసితివి. నా కెవ్వరు చుట్టములను వారు లేరు. అడవులకు వెళ్లుదమన్నను భర్తవైన నీవు బ్రతికియుండగా కూడదు గదా!

ఇట్లు నన్నన్నివిధములచేతను నాశనము చేసితివిగదా! ఓ రాజా! ఈ రాజ్యమంతయు నీవలన నాశనమైపోయినది. నీవును మంత్రులందఱును చెడిపోయితిరి. నేనును, నా సుతుడును నశించితిమి. పౌరులందఱు నశించినవారే. ఇక నిచ్చట అధిక సంతోషముతో భూమిని నీ ప్రియురాలును, నీ కుమారుడును సాటిలేని భోగముల నందుచు హాయిగా నేలుచుండెదరు" అని కఠోరముగా తన్ననుచున్న మాటల విధమును విన్నవాడై రాజు దుఃఖమును భరింపలేనివాడై వేగముగా ఓర్పు నశించి, భూమిపైబడి "యీ కౌసల్య నిజమునే చెప్పినది. ఇతరులెవ్వరు చేయని యే మహాపాపమును చేసితినో కదా!" యని మనస్సునందు తలంపులలో మునిగెను.



# అఱువది రెండవ సర్గము

## దశరథుడు కౌసల్యను క్షమింప వేడుట :

అట్లు దశరథుడు సోలిపోవుచు మూర్ఛలతో భూమిమీద పడి లేచుచు కౌసల్య ముఖమును జూచుచు చింతచేత కలతచెందిన మనస్సుతో నాలోచింపగా పూర్వము తాను చేసిన పాపము స్ఫురించెను. తెలియక శబ్దమును బట్టి ప్రయోగించిన తీవ్రమైన బాణములచేత మునిపుత్రుని జంపిన పాపముచే నిప్పుడు తన పుత్రుడు తన్నువిడచి వెళ్లిపోవుట తలచి రెండింతలుగా దుఃఖమును బొందుచు తన రాణి యనుగ్రహమునకై చేతులు జోడించి యిట్లనెను. "ఓ కౌసల్యా! నీ వెప్పుడును శత్రువుల మీదనైనను కారుణ్యము లేనిదానవు కావుగదా. ఓ దేవీ! నన్ను దయతో క్షమింపుము. తెలియక నీయెడ తప్పు చేసితిని. చేతులు జోడించి మ్రొక్కెదను. ధర్మమునందాసక్తి గల స్త్రీలకు మంచి గుణములు గలవాడైనను దుర్గుణములు గలవాడైనను భర్తయే ప్రత్యక్షదైవము సుమా! నిరుపమానముగా ధర్మము ననుసరించుదానవు. నిత్యము లోకములో జరుగు మంచిచెడ్డలు తెలిసినదానవు. గుణములే సంపదగా గలదానవు. అట్టి నీవు పుండుపయి ఉప్పును పెట్టదవా? పరితాపమును బొందుచున్న నన్నిట్లు తూలనాడెదవా? దుఃఖమునందిన దానవయినను శాంతమును దయను దలపకుండ నన్ను కఠినమైన మాటలతో నొప్పించుట ధర్మమా?" అని దీనముగా చెప్పుచున్న రాజును జూచి భయమును, సంభ్రమమును కలుగుచుండగా తన భర్త యొక్క జోడించిన చేతులను పద్మమును వలె తన శిరస్సునందు ధరించి కన్నీరు ధారలుగా కురిసి హృదయేశ్వరునితో నిట్లనెను. "ఓ ప్రాణనాథా! నీ పాదములపై బడి వేడుకొనుచున్నదానను. భార్యనగు నన్ను నీ విట్లు

ప్రార్థించుట తగునా? నన్ను జంపుట నీకు న్యాయమా? కోపముతో భర్త తనను బ్రతిమాలుకొనునట్లు బాధపెట్టునట్టి స్త్రీలు ఇహమును పరమును పొందక దుర్గతిని బొందెదరు. ఓ రాజచంద్రమా! నీవు సత్యమునందనురక్తుడవని, నిశ్చలమైన ధర్మమూర్తివని నేను తెలియనిదానను గాను. సత్యముగా చెప్పెదను వినుము. నా కుమారుని తలచుకొన్నచో, ఏమి చెప్పుదును. కడుపులో భగ్గున మండును. బలీయమైన పుత్రశోకముతో పల్కితిని గాన నన్ను క్షమింపదగును. దుఃఖముచేత ధైర్యము నశించును. దుఃఖముచేత పాండిత్యము నశించును. శోకముచే సర్వ వినాశమగును, గాన శోకముతో సరియైన విరోధి యెందును నుండదు సుమా. శత్రువులు చేతితో బాదిన దెబ్బలనైన భరింపవచ్చును గాని ఆకస్మికముగా వచ్చిన శోకముచే కలిగిన తాపమనెడు అగ్నిని కొంచెమైనను భరింపలేము. శ్రీరామచంద్రుడు వనములలో నివసించుటకు వెళ్ళి యైదు రాత్రులయినది. ఓ రాజా! అవి నాకు దుఃఖముచే నైదేండ్లు గడచినట్లు తోచుచున్నవి. విచారించిన కొలది అంతకంతకు నా శోకము – నదీవేగముచే నాక్రమింపబడిన సముద్రమువలె బెరిగిపోవుచున్నది, యిక దారి యేమియో గదా!" అనుచు కౌసల్య భర్త నోదార్చుచుండ సూర్యు దస్తమించెను. రాత్రి యయ్యెను. రాజు భార్య యొక్క హితములైన మాటలను విని కూడ శాంతిని బొందలేనివాడై దుఃఖముచే గలతచెందుచు కొంచెము కన్ను మూసెను.



# అఱువది మూడవ సర్గము

**ఒ**క్క ముహూర్తమట్లు కన్నులు మూసికొని, మేలుకొని తన అపరాధమును గూర్చి చింతించును. ఆ చింత సూర్యుని కబళించెడు రాహువు విధమున ఘోరముగా కప్పుకొనగా, తన కోడలిని, కొడుకును తలంచి ఆ రాజచంద్రుడు ఆరవనాటి రాత్రి నడిరేయిని కౌసల్యతో నిట్లనెను.

**దశరథుడు తాను జంపిన మునిబాలకుని వృత్తాంతము కౌసల్యకు జెప్పుట:**

ఓ శీలవతీ! మేలైనను కీడైనను మనుష్యుడితరుల కేమి చేయునో అది ఫలితమునకు వచ్చినపుడు తప్పక అనుభవింపవలసినదే! కాని వేఱుగా జరుగదు గదా! ఓ గుణాఢ్యురాలా! యే పనినైనను ప్రారంభించునప్పుడు దానివలన శుభము కలుగునో అశుభము సంభవించునో యని ఆలోచించక చేయు పురుషుడు వట్టి మూర్ఖుడగును సుమా! ఫలములు పువ్వులంతనే యుండునని తలచి యొకానొక మూర్ఖుడు మామిడి చెట్లను నరికించివేసి యచ్చట మోదుగు చెట్లను నాటించి వానికి నీళ్లుపోసి పెద్దవగువఱకును బెంచి, అవి ఫలితమునకు వచ్చి పనికిమాలిన పువ్వులను కాయలను ఫలించినపుడు ఎక్కువగ విచారించును. ఆలోచింపక చేసిన పనుల యొక్క ఫలితము లిటువలెనే యుండును సుమా! ఈ పనికిటువంటి ఫలితము, ఈ విధముగా జేసిన నిటువంటి ఫలితము కలుగునని తెలియకుండ చేసినను మోదుగును పెంచిన వానివలె ఫలితము ననుభవింపక తప్పదు సుమా! ఆ ప్రకారముగా మామిడి తోటను గొట్టివేసి మోదుగులను నాటినట్లుగానే రాముని విడచిపెట్టి నేనును ఇప్పుడిట్లేడ్చుచున్నాను. చూచుచున్నావుగదా! నా చిన్నతనమందు నేర్పరి

తనముతో ధనుస్సును ధరించినవాడనై శబ్దభేదియను కీర్తితో ప్రకాశించుచు నేను మూఢుడనగుచు మునుపొక పాపము చేసితిని. పిల్లవాడు తెలియక విషమును మ్రింగినట్లుగా మోహముతో ఓ లోలాక్షీ! చేతులార పాపము చేసితిని. దానియొక్క ఫలమే యిప్పుడు తప్పక అనుభవింపవలసివచ్చినది సుమా! పామరుడొక్కడు పువ్వుల యందమును జూచి సంతోషముతో మోదుగులను ముద్దుగా బెంచినట్లు ఓ సుకుమారీ! నేను కూడ ముందు రాబోవు అనర్థములను దెలిసికొనలేని వాడనై ఈ విధముగా నాశనమగుటకుగాను శబ్దవేధి వలన పుట్టిన మహాపాపమును చేయుట సంభవించెను. ఆ కథ చెప్పెదను వినుము. అప్పటికి నేను నిన్ను వివాహమాడి యుండలేదు. నేను యువరాజుగా నుంటిని. ప్రఖ్యాతిగా వానకాలము మన్మథ గర్వమును కామ సంభ్రమమును బెంపొందించుచు ప్రాప్తించినది. అంతవఱకు భూమి సారమును పీల్చి బీటలు వారజేసిన సూర్యుడు దక్షిణ దిక్కు చేరెను. ఎండ తగ్గిపోయినది. నల్లని కాంతితో మేఘములు ఆకసమున గ్రమ్మినవి. నీళ్లయందు బలసిన కప్పల కూతలు విపరీతము లయ్యెను. లేళ్ల నెమిళ్ల ధ్వనులు మిన్నంటెను. అప్పుడు చినుకులవలన ఱెక్కల పైభాగములు తడియుచుండగా స్నానము చేసినట్లై పక్షి సముదాయములు గాలివానకు గదలుచున్న కొమ్మలుగల చెట్లమీద కెట్టులో చేరుచున్నవి. జోరున కురియుచున్న వర్షధారలతో కూడిన మదపుటేనుగు ఆ జలప్రవాహముతో గూడి ఎత్తైన కొండవలెను నిశ్చలమైన సముద్రమువలెను గనిపించెను. ఓ కౌసల్యా! గైరికాది ధాతువులతో గలసి తెల్లని యెఱ్ఱని వర్ణములు గల శుభ్రమగు సెలయేళ్లు దావాగ్ని భస్మములతో గూడిన సర్పములవలె యెడతెగక ప్రవహించెను. వానకాలమునందు ఓ పద్మాక్షీ నదులన్నియు కలిగిన యెఱ్ఱని నీళ్లు గలవియై గట్లపైదాకా పొంగి పొర్లుచుండెను. అందమైన యా మంచి సమయమున నేను చేతియందు కోదండమును ధరించి రథమునెక్కి వేటాడ వలెనను కోరికతో సరయూ నదీతీరమున లేళ్లు, దున్నలు మొదలైన మృగములను

జంప నుద్దేశించి రాత్రిపూట ఒంటరిగా ధనుస్సును సంధించి చాటున పొంచియుంటిని. అప్పుడు ఏనుగు నీరు ద్రావుచున్న శబ్దమును బోలిన యొక ధ్వనిని వింటిని. కటికి చీకటి కారణముగా కన్నులకేదియును గానరాకున్నను, శబ్దము యొక్క జాడనుబట్టి యది యేనుగే యని తలచి ఆ ధ్వనివచ్చినచోటికి సర్పమును బోలిన యొక బాణము నేసితిని. ఆ ఘనమైన బాణము పడినచోటి నుండియే హా! యను స్పష్టమైన మనుష్య స్వరము వినవచ్చెను. అక్కడ నొక ముని నా వాడిబాణముచే నేలబడెను. అట్లు పడి యతడిట్లనెను. "తపస్వి నయిన నా వంటివానిపై ఈ బాణమెట్లు పడినది. జనులు సంచరింపని యీ అర్ధరాత్రియందు నీటికై యీ యేటికి వచ్చితిని. ఎవ్వడో నన్నిట్లు చంపెను గదా! ఎప్పుడైన వానికి నే నపకారమును చేసితినా! పరులను హింసించుట వదలి ఋషినై మెలగుచు ఆకులలము లాహారముగా పొట్ట పోసికొనుచు జడలుదాల్చి నారచీరలను ధరించి యడవిలో నుండునట్టి నేనెక్కడ? ఈ క్రూరమైన బాణముచే చచ్చుటెక్కడ? ఏ పరమార్థము నాశించి నన్నెవ్వడిట్లు చంపెనో కదా! నే నెవ్వరికేమి కీడు చేసితినో! ఇట్లు చేసినవానిని భూమి యందలి జనులు గురుపత్నీ గమనము చేసినవానిని వలె పురుగులు పడునుగాక యని తిట్టకుందురా? ఇట్టి యనర్థపు పని నిష్ఫలముగాక యెవ్వడేమి జుఱ్ఱుకొనునో గదా దైవమా? అక్కటా! నా చావునకు నేను బాధనొందనుగాని, నేను చాలకాలముగా పోషించుచున్న వృద్ధ దంపతులగు నా తల్లిదండ్రులను దలచుకొన్నచో గుండె ఝుల్లనుచున్నది. నా చావును విన్నచో నా తల్లిదండ్రులు కూలిపోవుదురు. వారికింక దిక్కేది. ఏవిధముగా సంచరింపగలరు. వివేకము లేనివాడును పాపాత్ముడునునగు నెవ్వడో ఒక్క బాణముతో ముప్పురిని సంహరించెను గదా!" యనుచు దుఃఖపు మాటలు పలుకుచుండగా విన్న యంతనే నాయవయవములన్నియు వణకి పట్టుతప్పినవయ్యెను. విపరీతమైన దుఃఖముతో నేను పట్టుకొనియున్న ధనుస్సును బాణములును తమంత తామే

భూమి మీద బడిపోయినవి. గుండె ఝల్లుమనగా సరయూ తీరమునకు వెళ్లి అధికమగు నెత్తుటిలో దడిసి పగిలిపోయిన కుండగలవాడై ధరణిమీద శరీరమంతయు దుమ్ముకొట్టుకొనగా జుట్టు విడిపోగా దుఃఖించుచు, దొరలుచు, బాణము తాకుటవలన బాధ ననుభవించుచున్న తాపసిని చూచితిని. అట్లు నేను చూడగానే ఓ వాల్గంటీ! ఆ బ్రహ్మచారి కన్నులవెంట నిప్పులు గురియు చుండగా నన్ను జూచుచు యిట్లు దూషించెను. ఏమి చెప్పుదును. “అడవులలో బడియుండు నేను నీకేమి యపకారము చేసితినయ్యా! ఓ రాజా! నా తల్లిదండ్రులు దప్పిగొని నన్ను నీరు తెమ్మనగా వచ్చి నీచేత చచ్చినాడను. ఒక్క బాణముచేత నన్ను గొట్టి నీవు దానిని చేతనే గ్రుడ్డివారును వృద్ధులునునైన నా జననీ జనకులను జంపితివి సుమా! దాహముచేత పెదవులు తడుపుకొనుచు తమ కొడుకెప్పుడు వచ్చునా యని యెదురుచూచుచుండువారలు దీనినెట్లోర్చుకొందురు. భూమి మీద బడియున్న నన్ను నా తండ్రి ఎట్లెరుగును? నా వేదాభ్యాసము – తపము ఫలితములేనివయ్యెను. నిన్ను వెదకుటకు మాకు కన్నులు లేవుగదా కొడుకాయని యేడ్చుచు నింట పడియుండెదరు. నా పరిస్థితి వారికి తెలియదు. వారి కీ విషయము నెవ్వరు చెప్పుదురు? ఆపద తెలిసినను వారు నడువలేనివారలు గదా! వారే విధముగా గుట్టలు గుట్టలు తిరిగి తిరిగి యెట్లు నన్ను వెదుకగలరు. నడువలేనివాడును వృద్ధుడునునగు నా తండ్రి నా గతి తెలిసియు నేమి చేయగలడు. గాలిచేత నేలగూలుచున్న చెట్టు – భూమిపై గూలుచున్న మఱియొక చెట్టునెట్లు నిలబెట్టగలదు. ఓ రాఘవా! నా తండ్రి నివసించియున్న చోటికి వేగముగా నీవే యరుగుము నీవు వెళ్లకున్నచో నాగ్రహమును పొందినవాడై నిన్ను శపించును సుమా! దావాగ్ని యడవిని వలె నతడు నిన్ను నీక్షణమునందే భస్మము చేయును. ఆ ఆశ్రమమునకు వెళ్లునట్టి కాలిబాట అదియే. చప్పున నా తండ్రిని శాంతినందునట్లు చేయుము. నీవతనిని వేడుకొన్నచో నీ యందు కోపమును బొందడు. ఓ రాజా! యింక నీ బాణమును తీసివేయుము. నదియొక్క

వేగము ఇసుక తిన్నెను గోసినట్లు బాణము నా ప్రాణములను గోయుచున్నది సుమా!" అని చెప్పగానే నేను బాణమును దీసినచో ప్రాణములు పోవును. తీయకున్నచో దుస్సహమైన శరీరబాధ ననుభవించుచున్నాడు గదా! యని బాధపడుచుండ దీనుడనగు నన్ను జూచి యాతడిట్లనెను. "బ్రహ్మహత్యా పాతకము వచ్చునని భయపడకుమయ్యా! నీ యొక్క బాణము నిప్పుడే తీసి వేయుము. నేను బ్రాహ్మణుడను గాను సుమా! ఓ రాజా! శూద్రస్త్రీకిని కోమటికిని బుట్టినవాడను" అని చెప్పుచు నా బాలుడు మాటాడలేక రోజుచు భూమిపైబడి పొర్లుచు సొమ్మసిల్లెను. కఠినమైన బాణము గుండెలో నాటియున్నవానిని, దొర్లుచున్నవానిని, మాటాడలేనివానిని, వణకుచున్నవానిని, చేష్టలుడిగినవానిని జూచి బాణమును తీసివేయగా అతడు నన్ను జూచుచు భయము చెందుచు ప్రాణములను విడచెను.



# అఱువది నాల్గవ సర్గము

**నే**నా పుణ్యచరిత్రుని, సరయూ తీరమందు పడియున్నవానిని, ఆపదనొందిన వానిని, రక్తముచేత శరీరము తడిసినవానిని చూచి చూచి వ్యాకులత జెందుచు ఎంతగానో విలపించితిని – ఓ కౌసల్యా! నాకెంతటి పాపము చేకూరెనని కడు దుఃఖించితిని" అని చెప్పి మునికుమారుని తన మనస్సున తలచుకొని ఏడ్చినవాడై మఱల కౌసల్యతో నిట్లనెను. "నేనా మునిని చూచుటకు వెళ్లుట మంచిదో వెళ్లకుండుట మంచిదో, పొరపాటున నాకెంతటి పాపము సంభవించినది. అని చింతించుచు నేనా కుండతో మంచినీళ్లు తీసికొని ముని కుమారునిచే జెప్పబడిన దారినిబట్టి ఆశ్రమమునకు వెళ్లితిని. నడువనేరనివారిని, కనులు కనబడనివారిని, ముసలితనముచేత శరీరము వణకుచున్నవారిని, రెక్కలులేని పక్షులను బోలినవారిని, చిక్కిపోయినవారిని, ఇంతసేపయినది మన పిల్లవాడుదకమును దీసికొనిరాడేయని అడలుచున్నవారిని, నాచేత నిరాశులుగ జేయబడినవారిని, ఏ ప్రయత్నము చేయలేనివారిని చూచితిని. మునిపుత్రుని జంపితినను పెద్దనైన దుఃఖముతో మనస్సు వ్యాకులత జెందగా, భయముచే గుండెలదరగా ఆశ్రమమును జేరుచున్నకొలది నా దుఃఖ మధిక మయ్యెను. నేను నడచుచుండ కాలిచప్పుడు విన్నవారై యెంతసేపయినదిరా తండ్రీ! యిక్కడనే యున్న ఏటిలో నీళ్లు తెచ్చుటకు నీవు వెళ్లి. ఇంతసేపాలస్య మును చేయుట నీకు తగునా నాయనా! మాకు దాహముచేత నాలుకలు ఎండిపోవుచుండగా నాయనా! నీళ్లకు వెళ్లి ఆటలతో కాలమును పుచ్చుచుంటివా?

ఇంత యాలస్యమైనను ఇంకను బాలుడురాడేమని వగపుచేత నీ తల్లి దురపిల్లుచున్నది. నీళ్లుతెమ్ము. ఎన్నడిట్లు చేయవు. నేడేల నిట్లు చేసితివి పుత్రకా! ఈ మాటలను తప్పుగా దలంపకుము. నిన్ను నేను గాని నీ తల్లి గాని తప్పులు పట్టినచో నీవు ధన్యుడవయ్యెదవు. ఓ తపోధనుడా! మాకు నీవే సుమా తెప్పవు. నీవే గతివి. నీవే మా చూపు కూడ... అని మేము మా ప్రాణముల నెప్పుడు నీపై బెట్టుకొని బ్రతుకుచున్నారము. ఓ కుమారా! మాటాడవేమిరా. కనులులేని మాకు కన్నులు నీవే యని, దిక్కులేని మాకు దిక్కు నీవే యని నమ్మియున్నాము. ఓ గొప్ప నడవడి గలవాడా! మమ్ముల నీ ప్రకారముగా నుపేక్ష చేయుట తగునా?" అని సన్నని గొంతుతోను, తొట్రుపాటుతోను పలుకుచున్న ఆ పవిత్రుడైన మౌనిని సమీపించి నేను చేసిన దుష్టకృత్యముచేత భయము చెందుచు మెల్లమెల్లగా నిట్లంటిని. "నేను మీ పుత్రుడను గాను. ఓ మునీంద్రా! పంక్తిరథుడను పేరు గలవాడను. రఘువంశపు రాజును. గొప్ప పాపమును చేసిన సజ్జన గర్హణీయ చరిత్రుడను. దుర్మార్గమును చేసితిని. రాత్రి సరయూ నది యొద్ద వేటకై వెడలి హస్తమునందు ధనుస్సునందు బాణమును సంధించి పట్టుకొని చాటుగా కాచుకొనియుండగా నీళ్లలో బడబడమను శబ్దము వినిపించెను. ఆ ధ్వని కుండ ముంచుటచేతనని తలంపక ఏనుగు నీళ్లు త్రావుచున్న చప్పుడని భావించి వేగముగా బాణమును వేసితిని. ఆ బాణము రొమ్మున దగిలి భూమిపై బడియున్న మౌనిని నేను చూచితిని. ఓ అనఘులారా! అడవి యేనుఁగును చంపుటకై నీటియందు విడువబడిన బాణముచే మీ తనయుఁడు వధింపబడెను. అతడు తన వృత్తాంతమును చెప్పెను. అతని మాట ప్రకారమే ఆ బాణమును తీయగా అతడు 'హా! తల్లిదండ్రులారా! వృద్ధులారా! అంధులారా!' అని పల్కుచు మరణించెను. అతడు దెల్పిన విధముగా ఓ మహాత్ములారా! మిమ్ము జూడ వచ్చితిని. మీ కుమారుని జంపిన పాతకిని

నన్ను మీ మనస్సుకు దోచిన విధముగా చేయుడు. అజ్ఞానముచేత మీ కుమారుని నేను నిమిషములో చంపితిని. ఇది నిజము. నేను దోషిని. నన్ను దయంజూతురో శిక్షింతురో మీ యిష్టము వచ్చినట్లు చేయుడు.'' పాపభయముచేతను, దుఃఖముచేతను నేను పల్కిన కఠినమైన మాటలు చెవులబడగానే విలపించుచు వేడికన్నీరు కనుల నుండి ధారలుగా కారుచుండగా మిక్కిలి భారముతో నిట్టూర్చుచు తల్లడిల్లుచు సమీపమున నున్న నన్ను గూర్చి ఆ మునిపుంగవు డార్తితో నిట్లనెను. "వానప్రస్థుని జంపి క్షత్రియుడు బ్రదుక గల్గునా? బుద్ధిపూర్వకముగా చేసినచో ఆ యింద్రుడైన స్థానభ్రష్టుడు కాకుండునా? ఓ రాజా! యిట్లు పశ్చాత్తాపమునొంది నీవే నీ పాపమును చెప్పుటచేత బ్రతికి యుండగలిగితివి. లేనిచో నీ శిరస్సు వేయి వ్రక్కలు కాకుండునా? ఎరిగి యెరిగి గొప్ప తపశ్శాలియు బ్రహ్మవాదియునగు వీనిని కఠినమైన బాణముచే జంపియుండినచో ఇప్పుడే నీ తల వ్రక్కలైపోయి యుండెడిది. తెలియక చేయుటచే బ్రతికితివి సుమా! తెలిసియే చేసియున్నచో నీవన నెంతవాడవు? రఘువంశమే నశించిపోయెడిది గదా! ఓ రాజా! మా తనయుడెక్కడ పడియున్నాడో అచ్చటికి మమ్ము నీవు తీసికొని వెళ్లుము. రక్తముచే తడుపబడిన శరీరముతో విరియబారిన జుట్టుతో చచ్చి భూమిపై బడియున్న నా తనయు చూడవలెనని యున్న"దని కోరగా నేను వారినిద్దఱను అచ్చటకు తీసికొనిపోయితిని.

**ఋషి తన పుత్రునకై విలపించుట :**

ఆ ఋషి చేనిపోయి పడియున్న తన పుత్రుని తడవి తడవి చూచి యిట్లనెను. "ఓ పుత్రా! నీ తండ్రినైన నేనిచ్చటకు వచ్చియున్నను నమస్కరింపవు. నీకిది తగునా? అయ్యయ్యో! పుత్రా! మాటాడవివేమిరా! కోపము వచ్చినదా తండ్రీ? ఇచ్చట నిట్లు నేలపై బడియుంటివేలరా? ఒకమాటైన చెప్పరాదా? నామీద

నీకు ప్రేమ లేకున్నచో నీ తల్లినైన చూడరా కుమారా! తియ్యగా ఒక్క పలుకైన పలుకరా. మనసునందలి దుఃఖము తొలఁగు నట్లుగా ఒక్కసారి కౌగలించు కొనరా? క్రమము తప్పకుండగా మనస్సునకు మిక్కిలి ఆహ్లాదము కలుగునట్లుగా అపరరాత్రులందు లేచి శాస్త్రములాదిగా సకల కళల నెవ్వరింక చదువుదురు? ఎవరు చదువగా విందునురా. ఓ పుత్రా! ఇక నెవ్వరు స్నానము చేసి సంధ్యాగ్నిహోత్రముల నుపాసించి పుత్రశోక భయార్తుదనగు నన్ను సేవింతురు? కుమారా! చెప్పుము. ఇటునటు తిరుగలేనివారిని, ఇంకొక దిక్కులేనివారిని, నిత్యకృత్యములను చేయ శక్తిలేనివారిని మమ్ములను అనురాగములతో ఎన్నియో కందమూలములను పరమాదరముతో సత్పురుషుడైన అతిథికి బెట్టినట్లు మాకు బెట్టుచు నిండైన ప్రేమతో నింక చూచువారెవ్వరు? హా! తనయా! యిట్లు వెళ్లుట నీకు న్యాయమా? కడుపు దుఃఖముచే నెక్కువగా తపించుచున్న నీ తల్లిని, వృద్ధురాలిని, దీనురాలిని, కనులు గానరానిదానిని, నాయనా భరించుట నాకెట్లు శక్యమో చెప్పుము. ఓ పుత్రా! యమపురమునకు వెళ్లకుము. ఇదే నీ తల్లితో గూడ తెల్లవారినచో నేనును నీవెంట వచ్చెదను. నిలుపుము. నేను యమునితో చెప్పుదును లెమ్ము. ఓ యమా! మా పుత్రుని క్షమింపుము. తల్లిదండ్రులమగు మమ్ము తీసికొని వచ్చుటచే ఆలస్యమయినది. కాన శిక్షించుటకు తగినవాడు కాదు సుమా యని చెప్పెదను. ఓ తనయా! నిన్నెడ బాసి దుఃఖభారముచే నలగుచు దిక్కులేనివారమై వనములందు క్రుగ్గిపోవుచు నెట్లు బ్రదుకగలము? గొప్ప కీర్తి కలవాడు కల్మషములేనివాడు నగు ఆ యమధర్మరాజు నా మనవులను విని జాలిబొంది నిన్ను కోపగింపకుండును. మమ్ము చూచినంతనే ప్రేమతో నీ కభయమొసంగును. ఓ పుత్రా! నీవు చేసిన పాపమేమియు లేదురా. ఈ పాపాత్ముడైన రాజే నిన్ను చంపెనురా. కుమారా! అందువలన నా సత్యము యొక్కయు, తపస్సు యొక్కయు బలముచే నీవు

యుద్ధమున గూలిన శస్త్రయోధుల గతికి వెళ్లుము. యుద్ధములందు వెనుకంజ వేయక పోరాడి మరణించిన శూరులలోకమును జేరవయ్యా! పుత్రకా! సగర దిలీపులు, శైబ్యుడు, నహుషుడు, ధుంధుమారుడు, జనమేజయుడు మొదలగు రాజులకు కలిగిన గతినే నీవు పొందుదువుగాక. ఓ సచ్చరిత్రుఁడా! మునులకు, సాధువులకు, భూదాతలకు గలుగు సుగతికి నీవు వెడలుము. ఏకపత్నీవ్రతులును. వేనవేల గోవులను దానము చేసినవారలును, గురులను భక్తితో పూజించిన వారలును, యోగముతో దేహమును వీడినవారలును వెడలునట్టి మంచి లోకములకు నీవు వెళ్లుము వత్సా! ఊర్ధ్వలోకములను పొందవలెనను కోరికను మనసున నిల్పి గంగా యమునా సంగమస్థలమునందో అగ్నియందో తమ దేహములను విడచిపెట్టెడు వారు పొందునట్టి లోకములను నీవు పొందుదువు గాక! మా వంశమందు పుట్టిన వారికెవ్వరికిని అధమమైన గతులు కల్గలేదు సుమా! అవి నీకెట్లు కలుగును. నీ మృతికి కారణమైనవాని కంటువంటి యధోగతులు కలుగును సుమా” అని పనవి, పనవి యేడ్చుచు, మునీంద్రుడు తన పుత్రునకు తిలోదకములనిచ్చెను. అంతట మునిపుత్రుడు దివ్యమైన రూపముతో ఆకాశవీథియందు ఇంద్రునితో కూడి నిలిచి తన గురువులను జూచి యిట్లనెను. “మీకు పరిచర్యలు చేయుటచేత నాకు పరలోక సుఖము లిట్లు ఘటించినవి. కావున బ్రహ్మజ్ఞానము గలవారగు మీరు పరితపింపకుడు. ఓ భవ్యమూర్తులారా! మీరును తొందరగా నన్ను జేరవచ్చెదరు” అనుచు ప్రకాశించుచున్న దివ్యవిమానమునందు దివ్యమైన శరీరముతో మునికుమారుడు స్వర్గమును జేర నరిగెను. ఈ ప్రకారముగా కుమారుడు స్వర్గమునకు వెడలగా ఆ తపస్వి భార్యతో గూడ నతనికి నీళ్లువిడచి చేతులు జోడించి దగ్గరనున్న నన్ను జూచి దుఃఖముతో తపించుచు నిట్లనెను.

**ఋషి దశరథుని శపించుట :**

"ఓ రాజా! ఒక్క పుత్రుడు గలిగిన నన్ను పుత్రులు లేనివానిగా జేసితివి గదా! ఇంక చావనగా నాకు భయమేమున్నది. నాకును నిప్పుడే మృత్యువును గలుగజేయుము. మహా బుద్ధిశాలియు, పవిత్రుడును నగు కుమారుని నిష్కారణముగా జ్ఞానహీనుడవై చంపితివి. ఆ దుఃఖము తీరునట్లుగా నిన్ను భయంకర దుఃఖము పొందునట్లు తిట్టెదను. నాకిప్పుడిట్టి పుత్రశోకమును గలుగజేసితివి గాన ఓ రాజా! నీవు కూడ నిట్లే పుత్రవియోగ శోకముతో ఒంటరిగా తలచి తలచి దుఃఖించి చచ్చెదవు సుమా. ఓ రాజా! నీవు తెలియక చేయుటచేత నీకు బ్రహ్మహత్యా పాపము కలుగదు. దాతకు దక్షిణలిచ్చిన ఫలము కలిగినట్లు వెంటనే నా శాపము ఫలించును" అని యిట్లు నాకు శాపమిచ్చి యనేక విధములుగా పుత్రునకై విచారించి వారిద్దఱును కట్టెలతో నేను చితినమర్చగా ఆ అగ్నియందు బ్రవేశించి స్వర్గమును జేరిరి. ఇంక నేమని చెప్పువాడను? ఓ దేవీ! శబ్దభేది బాణముతో మునిపుత్రునేయుటయును, ఆ బాణమును పెరికివేయుటయును, చిన్నతనమున చేసినట్టి ఆ పాపమిప్పుడు చింతచే జ్ఞప్తికి వచ్చినది. ఆ పాపఫలమీ ప్రకారముగా నన్ను జేరినది. అపథ్యాహారమును తినిన రోగము రాకుండునా? హా! కౌసల్యా! ఇంకేమి చెప్పగలవాడను. ఉదారులైన యా మునుల యొక్క వాక్యము లిప్పుడు నాకు సరిగా ప్రాప్తించినవి. పుత్రవియోగ శోకమువలన గలిగిన ఆర్తిచే నేను ప్రాణములను విడుచు సమయ మాసన్నమైనది. తెరుపు మరుపు లెక్కువగు చున్నవి. ఓ తన్వీ! కన్నులు కానరాకున్నవి. ఓ మానినీమణీ! నిన్ను చూడలేకున్నాను సుమా. నన్ను మెల్లగా స్పృశింపుము" అనుచు భయముతో నేడ్చుచు కౌసల్యతో నిట్లనెను. "ఓ చంద్రముఖీ! వినుము. రామునికి నేను చేసినది నాకే తగియున్నపని. రాముడు నాకు చేసినది యతనికే తగియున్నది. ఎట్లంటివేని చెప్పెదను. ఈ భూమిమీద యెంతటి చెడునడవడి గలవానినైనను

పుత్రుని విడచిపెట్టెడి యవివేకి యుండునా? ఈ ప్రకారము అడవికి వెళ్లుమన్న తండ్రినే పుత్రుడైనను సహించి యూరకుండునా? యమలోకమునకు వెళ్లి తిరిగి తమవారిని చూడగలుగు వారెవ్వరైన నుందురా? కావున ఈ భువియందు జీవించియుండగనే రామచంద్రుని, కమలముల వంటి నేత్రములు గలవానిని చూడగోరుచున్నాను. రాముని చేయి తగిలినచో, రాముని ముఖకమలమును జూడగలిగినచో, ఓ భామా! యముని మందిరము చెంతకు బోకుండ నిలువవచ్చును సుమా! నామది చలించు చున్నది. తెలివితప్పుచున్నది. నిన్ను చూడలేకపోవుచున్నానే. నాకు క్షేమమింకెట్లు గలుగును? అదిగో యమభటులు నన్ను తొందరపెట్టుచున్నారు. ఆలోచింపగా నాకింతకంటె మించిన దుఃఖముండునా? మరణించు సమయమందు సన్నుతింపదగిన గుణములు గలవాడగు రామచంద్రుని కన్నులార కాననైతిని. అతని చూడక పోవుట వలన గలిగిన మహావ్యధచే నా ప్రాణములు, తీక్ష్ణమైన యెండ వేడిమికి కొంచెమైన నీరువలె శోషించుచున్నవి. పవిత్ర చరిత్రుడగురాముని ముఖమును పదునాల్గేండ్లు గడచిన తరువాత పదునేనవ యేట మఱల నెవరు చూచెదరో ఓ సుదతీ! వారు దేవతలేగాని మానవులుగారు. తామరలవలె విశాలము లైన యా కన్నులు, ఆ అందమైన ఉన్నత నాసిక, ఆ సుందరమైన కనుబొమలు సాటిలేని ధళధళ మెఱయు నా చెక్కులును, శోభాసమన్వితమైన శరత్కాలచంద్ర బింబమును బోలిన యా ముఖమును ఓ మానిని! మరలి వచ్చిన తరువాత చూచు జనులు నిజముగా ధన్యులు సుమా! వనవాసమును పూర్తిచేసి మరలి వచ్చిన పవిత్రుని, ఋజుమార్గవర్తిని రామచంద్రుని శుక్రుని జూచినట్లుగా పుణ్యములు చేసినవారు కౌతూహలముతో చూచెదరు సుమా! ఓ కౌసల్యా! కనులు కనిపించుటలేదు. చెవులు వినబడుటలేదు. చిత్తవిభ్రమముచే మనస్సంతయు ముక్కలైనట్లుగా తోచుచున్నది. ఇంద్రియము లేవేమో తెలియకున్నవి. చమురులేని దీపపు కాంతుల విధముగా చిత్తనాశమగుటచే

నాయింద్రియములన్నియు వికలములగుచున్నవి. ఇంకేమి చెప్పవలెను. ఏటి వేగము గట్లనెల్లను కూలద్రోయునట్లుగా ఓ కౌసల్యా! పుత్రశోకవేగము అనాథుడనగు నన్ను దుఃఖమున గూల్చివేయుచున్నది" అని చెప్పుచు మఱియును, "హా రామా! నా ముద్దులతనయా! ఎక్కడకు వెళ్లితివిరా! రారా! నాకు నీవే దిక్కుగదరా! నన్నింత శోకమును ముంచదగునా? ఒంటరిగా నన్ను విడచిపెట్టదగునా? నా యవస్థ నొక్కసారి చూచియైన పోరా! ఇట్లు చేయుట నీకు తగునా! అయ్యయ్యో! పుత్రకా! హా రామా! ఓ గొప్ప బాహువులు గలవాడా! హా పూర్ణచంద్రవదనా! హా ప్రియపుత్రా! హా! నను రక్షించువాడా! యెక్కడ కేగితివి? రారా! నా ఆయాసము నణచుమురా నీకు పుణ్యముండునురా" అని పలవించెను. మఱియును "ఓ కౌసల్యా! నిన్ను కూడ నేను పాడుచేసితిని గదా. ఓ కాంతా! సుమిత్రా! నిన్ను కష్టపెట్టితిని. నాకు శత్రువైన ఓ కైకా! నా కులమును నాశనము చేసినదానా! ఈ భరింపరాని సంతాపము నీవలననే వచ్చినదిగదా. ఓసీ! చండీ!" అని వాపోవుచు అర్ధరాత్రి సమయమున నా సీతానాథుని దలంచుచు దశరథుడు ప్రాణములను విడచిన వాడయ్యెను.



# అఱువది యైదవ సర్గము

## దశరథుడు మృతుడగుట :

తెల్లవారగనే వందిజనులును సూతులును వేరువేరుగా రాజప్రాసాదమున ప్రవేశించి మంగళకరములైన మంచి స్తోత్రములను సౌధమందంతటను వ్యాపింపజేయగా చేతులతో వాద్యములను ప్రయోగించువారు తమ నేర్పరి తనముతో చేతులతో తాళము వేయుచు ఎక్కువగా శబ్దించుచుండగా ఆ ధ్వనులచే రాజుయొక్క అంతఃపురమునందున్న పంజరములలోను, చెట్లమీదనున్న పక్షులు మేలుకొన్నవై కలకలమని కూయుచుండగా, వేదములు చదువుచున్న పుణ్య శబ్దములు వినబడుచుండగా, వేణు వీణాది వాద్యరవములు వ్యాపించుచుండగా ఆ భవనమంతయు నా వివిధ ధ్వనులతో నిండినదయ్యెను. ఉషఃకాలమున జేయవలసిన సేవలయందు నేర్పరులగు స్త్రీలును నపుంసకులును నిర్మలమైన హరిచందన సమన్వితమైన జలమును బంగారు కడవలతో నింపి, మనోహరము లైన అనులేపనములను దర్పణమును, ఆభరణములను వస్త్రములను సిద్ధము గావించికొని, సర్వలక్షణ సంపన్నముగా సూర్యోదయమునకు ముందుగా యథాప్రకారముగా గనిపెట్టుకొనియున్నను, వేకువయయినను ఆ రాజు నిద్రనువీడి లేచి రాకుండుటకు కారణమేమియని సంశయించు చుండిరి. అప్పుడు రాజునొద్దనున్న స్త్రీలు మెల్లగా రాజును సమీపించి రాజును మేల్కొల్పుటకై పైన చేయివేసి, మెల్లమెల్లగా శరీరమును తాకి, ఆయన యందు నిద్ర లక్షణమును గానక, ఏ ప్రక్క పెట్టుకొన్న కాళ్లు, చేతులు నట్లే చల్లగా నుండుటచేతను, ముక్కుపై వ్రేలుంచిన శ్వాస లేకుండుటచేతను, గుండెలదర కుండుటచేతను ఆ స్త్రీలందఱును తమ నాథుడు చనిపోయెనోయని సందియపడి

ప్రవాహమున కెదురుగానున్న గడ్డిపరకల వలె గంపించిపోవుచుండిరి. వణకుచు, మరల మరల రాజును జూచుచు, కాళ్లు తడబడుచుండగా, మనస్సున తమకు గలిగిన సందియమే నిజమని దుఃఖించుచు కౌసల్య సమీపమునకు వెళ్లగా..

**దశరథు మృతికై అంతఃపుర స్త్రీ లేడ్చుట :**

అచ్చట కౌసల్యయు, సుమిత్రయు, పుత్రశోకముచే దుఃఖించుచు రాజునొద్ద తెల్లబోయిన మొగములతో, మబ్బు మూసిన నక్షత్రముల వలె కాంతి దొరగి శరీరమున ప్రాణము మాత్రము మిగిలి నిద్రించుచుండగా, వారి స్థితిని, రాజు యొక్క మరణమును జూచి ఆ స్త్రీలందఱును గొల్లుమని గజనాథుడు మరణింపగా నేడ్చుచున్న ఆడయేనుగుల వలె ఒక్కపెట్టున రోదనములు చేయగా మనస్సులు జల్లుమనగా కౌసల్యయును, సుమిత్రయును లేచి భర్తను జూచి, ముట్టుకొని మృతుడయ్యెనని నిజముగా తెలిసికొని ప్రాణనాథా! యనుచు నేలమీద పడిపోయిరి. నేలమీద ధూళిలో సొమ్మసిల్లి పడిపోయి ఆకాశము నుండి నేలమీద రాలిపడిన చుక్కవలె కాంతి తొలగి కౌసల్యయుండగా, మిగిలిన భార్యలందఱును సంభ్రమముతో రోదన ధ్వనులొక్కమారుగా చేయుచుండగా కైక మొదలైన స్త్రీలందఱు దుఃఖించుచుండగా చుట్టములందఱును చుట్టుకొన, రాజు భార్యలందఱును చేతులు పట్టుకొని యనేకవిధముల బిగ్గరగా ప్రలాపములను జేయుచుండిరి. అంత..



# అఱువది యాఱవ సర్గము

**చ**ల్లారిన దావాగ్నివలెను, జలములేని గొప్ప సముద్రమువలెను, కాంతిని విడచిన సూర్యునివలెను, మృతిచెంది పడియున్న భర్తను చూచి, వ్యథచేత ఆవరింపబడిన మనస్సు తోను, కన్నీరు కాల్వలు గట్టుచున్న కనులతోను రాముని తల్లి భర్త తలను తన తొడపై నిడుకొని కైకతో నిట్లనెను. "ఓసీ! దురాత్మురాలా! ఇంక నీ మనస్సు చల్లగా, నిరాటంకముగా నీ రాజ్యమును, ఈ ఐశ్వర్యమును హాయిగా నీ వశము చేసికొనుము. నీవు పెట్టు కష్టము సహింపలేనివాడై నాథుడు మృతిచెందెను. రాముడు వనములందు బాధల నందుచుండెను గదా! హా! హా! నీ యొక్క కోర్కెలు నెఱవేరెను గదా! దొంగల భయమున్న యడవియందు ఒంటరిగా నరుగుచున్న స్త్రీవలె, నీ యూరియందు భర్తను పుత్రుని గోల్పోయి ప్రాణములతో ఏ ప్రకారముగా నుండగలను? తన పాలిటి దైవమైన భర్తను వీడి బ్రదుకవలెనని భూమండలమున, ధర్మము తప్పిన కైక తప్ప యేవనిత యుత్సహించును? విషదిగ్ధాహారమును దిను పిచ్చిదానివలె లోభి దోషము నెఱుగగల్గునా? ప్రఖ్యాతి గలిగిన రఘువంశమును గయ్యాళియైన కైక మంథర కొఱకు మసిచేసెను గదా. దుష్టమైన మాటను భార్య చెప్పగానే విని రాజు భార్యతోగూడ రామచంద్రుని నడవికి బంపెనను మాట వినినచో జనకుడు నావలెనే యెంతటి దుఃఖమును బొందునో గదా. ఇక్కడ రాజు మృతి చెందుటయును, వైధవ్యమును పొంది దిక్కులేక దీనత్వముతో కృశించి నేనిట్లుండుటయును, అక్కటా! అడవిలో నున్న నా కుమారు డెరుగడు గదా! ఏమని చెప్పుకొందును. ఎన్నడు దుఃఖమెరుగని ఆ సుకుమారియైన మిథిలాధిపతి

పుత్రిక క్రూరమైన సింహములు, సివంగులు, ఎలుగుబంట్లు, కోతులు, అడవిపందులు, సర్పములు, ఖడ్గమృగములు మున్నగు వాని భయంకరములైన యరపులతో భీతిని జెందినదై ఆ రామచంద్రుని నాశ్రయించినదై దుర్భరమైన కష్టముల నెట్లోర్చుచున్నదో కదా! ఈ దశరథు డల్పపుత్రకుడు. పెక్కురు పుత్రులనైన గనలేదు. నల్గురే పుత్రులగుటచే నిప్పుడెవ్వరు దగ్గరలేక, దుఃఖతప్తుడై యీ ముదుసలి రాజు నశించెను గదా! నేనును పతివ్రతాధర్మము ననుసరించి యీ రాజుతో నిప్పుడే అగ్నియందు దగ్ధమైన శరీరము గలదాననై యమలోకము నకు వెళ్లెదను" అని ఈ ప్రకారముగా పలవరించుచుండగా వ్యవహారములందు నేర్పుగల మంత్రులచ్చటకు వచ్చి దశరథుని భార్య నా సమయమునకు దగిన మాటలతో నూరడించి పుత్రుఁడొక్కడును దగ్గర లేకుండుటచే ఆ రాజు యొక్క శరీరమును నూనె కాగులోనుంచి దానిని జాగ్రత్తగా రక్షింప నియోగించి తక్కిన రాజకార్యములను నెరవేర్చిరి. ఆ ప్రకారముగా దశరథుని దేహమును తైలద్రోణిలో నుంచుటను గాంచిన అతని యంతఃపుర కాంతలు "భూపాలా! పోయితివా" యనుచు ఆర్తితో గోలచేయుచు చేతులను పైకెత్తుచు, చేతులతో నెత్తులపై మొత్తుకొనుచు, కన్నీటిలో మునిగిన ముఖములు గలవారై "హా! నాథా! వెళ్లిపోయితివా? ప్రాణేశా!" యనుచు నేలపై బడిపోయిరి. సత్య సంధుడును, ప్రియముగా మాటాడువాడును నగు రామచంద్రుడు మమ్ము విడచి వెళ్లెను. నీవును మమ్ము వీడిపోదగునా? దుష్టురాలగు కైకేయి శ్రీరాముని దూరము చేసినది. భర్తను చంపినది యగు దీని యొద్ద విధవలమై యెట్లు నిలువగలము. నీకును మాకును దిక్కు ఆ సీతాపతి యొక్కడే కదా. అట్టి ధన్యుడు రాజ్యమును సంపదలను వదలి వెడలెను. నీవును స్వర్గలోకమునకు వెళ్లితివి. భర్తవైన నిన్ను జంపినది. గుణవంతుడైన రాముని దూరము చేసినది. వీరుడైన లక్ష్మణుని వెడల గొట్టినది. ముద్దుకోడలై చిన్నతనము పోనట్టి సీతాదేవి కనబడకుండ చేసెను గదా. అట్టి దుష్టురాలగు కైక యింక నెవ్వరిని నాశనము

చేయకుండును. ఈ కైక మాటలను పడుచు నే ప్రకారముగా నిచ్చట నిలిచి యుండగలము?" అని దుఃఖముతో నిండిన మనస్సులతో ఎడతెరపి లేనట్లుగా పొరలి పొరలి దుఃఖించుచుండిరి. భర్తలేని స్త్రీవలెను, చంద్రుడులేని రాత్రివలెను అయోధ్యా పట్టణము రాజు లేకపోవుటచే కాంతిరహితమై చింతాక్రాంతమై ప్రకాశింపకుండెను. అంతటను పౌరులందఱును కన్నీరు గార్చుచుండగా, రాజు భార్యలు హా! హా! యని యరచుచుండగా, ఏ యింటను అందముగా అలుకుటలుగాని ముగ్గులుగానిలేక పట్టణము గుర్తుపట్టరానిదై కళావిహీనమై యుండెను. భూపతి యేడ్చుచు దేహమును విడువగా, భామాజనమంతయు ఆర్తితో భూమిపై సొమ్మసిల్లి యుండగా, సూర్యుడస్తమింపగా, భూమి యంతయు పెనుచీకట్లు గ్రమ్మెను. బంధువులను, స్నేహితులును దగ్గర నుండి కూడ రాజు యొక్క కొడుకులు దగ్గర లేకుండుటచే ఆలోచించినవారై యతని శరీరమును దహింపక అతని యింటనే ఉంచివేసిరి. సూర్యుడులేని యాకసమువలెను, చుక్కలులేని రాత్రివలెను, మహాత్ముడగు రాజు లేకుండుటచేత గద్గద కంఠులైన జనులతో నిండిన చతుష్పథములు గలిగినదౌటచేతను పురముండగా, పురుషు లును, స్త్రీలును గుంపులు గూడినవారై ద్రోహము చేసినకైకను చెడదిట్టుచుండిరి.



# అఱువది యేడవ సర్గము

**త**రువాత తూర్పున సూర్యుడుదయింపగా రాజ్య కార్యనిర్వాహకులగు బ్రాహ్మణోత్తములు గౌతమ మౌద్గల్య కాత్యాయన మార్కండేయ జాబాలి కాశ్యపులును, వామదేవుడును తగు విధముగా మంత్రులతో సభ చేసి దశరథునియొక్క శ్రేష్ఠ పురోహితుడగు వసిష్ఠుని జూచి "గురువర్యా! రాజు సర్గతుడగుటచేత మనకీ రేయి నూఱేండ్లు గడచినట్లుగా గడచెనుగదా. రాజు మరణించెను. రామచంద్రుడు తమ్మునితో గూడి యడవులకు వెళ్లెను. శత్రుఘ్నునితో గూడి భరతుడు మేనమామ గృహమున నున్నవాడు. ఓ యనఘా! ఘనులైన రాజపుత్రులలో నెవ్వరినైన ఈ పట్టణమునకు రాజుగా జేయవలయును గదా. అరాజకము సంభవించినచో రాష్ట్రములును పౌరులును ఇబ్బందులకు గురియౌదురు గదా.

## అరాజకత్వ దోష వర్ణనము :

భూమి యరాజకమైనచో మేఘ సముదాయము దివ్యములగు వారి ధారలతో మెరుపులతో గర్జనలతో సకాలమున వర్షింపదు. భూమి యరాజకమైనచో పంటలను సక్రమముగా నిల్లు చేర్చుకొందుమను నమ్మిక లేకపోవుటచే కాపుజనులు సరియగు సమయమున విత్తనములు వేసి పైరులను పండింపరు. భూమి యరాజకమైనచో పుత్రులు, భార్యలు యజమానునకు వశవర్తులై యుండరు. అరాజక స్థితియందు ధనములు దక్కవు. భర్తలకు భార్యలును దక్కరు. ఇట్టి యుపద్రవము కలిగినచో సత్యమెక్కడనుండును? శౌచమెచ్చట

నుండును? అందువలన ఓ మహర్షివర్యా! భూమికి రాజనువా డొకడుండుట అత్యావశ్యకము గదా! ధరణి యరాజకమైనచో ప్రజల మనస్సులు స్థిమితములుగా నుండక పోవుటచే అందమైన ఉద్యానవనములకుగాని, ప్రశస్తములగు పుణ్యప్రదేశములకు గాని వెడలరు. పలువురొకచోట గూడి సభ చేయరు. రాజులేని రాజ్యమున బ్రాహ్మణులు యజ్ఞములు చేయ తలపెట్టరు. మిక్కిలి ధనవంతులు కూడ తాము దారులయ్యును చోర భయముచే దక్షిణల నీయరు. ధరణి యరాజకమైనచో నర్తకుల, నటుల అభినయములును, రాష్ట్రమందు జరుగుచుండు అధికమైన యుత్సవములును, యాత్రలు చేయుటలును కనిపింపవు. రాజులేని రాజ్యమునందు తగు తీర్పు చెప్పువారులేక, తీర్పరులు లంచగొండులగుటచేత వర్తకులు తమ వ్యాపారములందు లాభములను పొందలేరు. పౌరులు స్వేచ్ఛ గలవారై మంచి మాటలయందు మనసుంచరు. స్త్రీలు పలు విధములైన యలంకారములను జేసికొనరు. భూమి రాజరహిత మైనచో చక్కగా నలంకరించుకొని యువతులు విలాసముగా సాయంకాలము లందు ఉద్యానవనములలో విహరించుటలు చేయకుందురు. రాజ్యమరాజక మయినచో స్త్రీలు తమ పురుషులతో కలసి రథముల నధిరోహించి మంచి పువ్వులను కోసికొనుచు క్రీడించుటకై వనములకు వెళ్లరు. ధారుణి రాజ రక్షితముగానిచో ధనవంతులగు గోపాలకులు ప్రొద్దుగ్రుంకినచో దొంగల భయముచే గుండెలదురుచుండగా తలుపులు తెరువక నిద్రరాక బాధ నొందుదురు. అరువదేండ్లు వయసు గలిగిన గజశ్రేష్ఠములు చేక్కగా ఘంటానాదములు వినిపించునట్లుగా రాజవీథులందు సంచరింపవు. రాష్ట్రములు రాజ రహితములైనచో వీరులకు గూడ చిత్తములకు నిలుకడ లేకపోవుటచే విలువిద్య నభ్యసించుచు చేయు ధనుష్టంకారములు వినరాకుండును. దూరదూరములకు వెళ్లి వస్తువులను కొనునట్టి వర్తకులు చోరాది భయముచే

పల్లెలకు నూళ్లకు వెళ్లకుందురు. ధారుణియరాజకమయినచో సన్యాసియు ధైర్యముగా ఒంటరిగా దిరుగజాలడు. సూర్యుడస్త మించిన చోటనే పండగోరదు. అక్కడ అన్నదాత ఉండకపోవచ్చును గదా! అరాజకమైన భూమియందు పుణ్యముగాని యోగక్షేమములుగాని గలుగజాలవు. సేనలు తగు నధిపతి లేకపోవుటచే క్రూరులగు శత్రువులచే నశించును. ఓ మునీశ్వరా! రాజ్యమరాజక మగుటచే జనులు ఆనందముతో ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మున్నగు వాహనముల నెక్కి స్వేచ్ఛగా పురమునందు విహరింపరు. శాస్త్రపారంగతులైన పండితులు ఇష్టము వచ్చినట్లుగా వనములందు గాని యుపవనములందు గాని వాదోపవాదములను జరిగింపలేరు. రాజులేని రాజ్యమందు దేవునికి పుష్పహారములను కానుకలను దక్షిణలను భక్తితో సమర్పింపరు. పరిమళించు చందనము. అగరు పునుగు జవ్వాజి మొదలైన సుగంధములను దాల్చి వసంతమున చిగిర్చిన వృక్షములవలె రాజపుత్రులెందును సుఖులై ప్రకాశింపరు. నీరులేని యేఱులును, మృదువైన పచ్చగడ్డిలేని వనములును, గోపాలకులులేని గోవులును, రాజపరిపాలనములేని రాజ్యమును సమానములు గదా. పరికింపగా రథమునకు జెండాయును, అగ్నికి పొగయు చిహ్నములగును. ఆ రీతిగనే మనకును కేతనము వంటివాడగు మన రాజు మనలను వదలిపెట్టి స్వర్గమునకు వెళ్లెను గదా! భూమి రాజరహిత మైనచో ఎవరికేది సొంతమో చెప్పుటకు వీలుకాదు. జనులు ఊరక చేపలవలె ఒకరొకరిని మ్రింగుచుందురు. మర్యాదలను విడచిపెట్టినవారై నాస్తికత్వమును బూని రాజుచే పూర్వము శిక్షింపబడిన నీచజనులు రాజు లేకుండుటచే జంకులేక తమ ప్రభావమును చూపించుచు ఇష్టవచ్చినట్లు వదరెదరు గదా! రాజు జనులకందఱకు నిత్యమును మార్గమును జూపు కన్నుల వంటి వాడుగదా. బలము, శౌర్యము మొదలగు కళలను బొందినవాడై సత్యమును ధర్మమును రాజే నిలువబెట్టును. రాజే

సత్యము. రాజే ధర్మము. రాజే సత్కులీనుల సత్కులము. ప్రజలకందఱకు రాజే తల్లియు, తండ్రియు. రాజే వారికి హితమొనగూర్చువాడు. యమధర్మ రాజును, కుబేరుని, ఇంద్ర వరుణులను సామర్థ్యముచే మించినవాడై మంచి మార్గమున కీర్తింపబడుచు రాజు ప్రజలచే నభిమానింపబడును. రాజు మంచివారలను చెడ్డవారలను విడదీసి మంచిగా నుండునట్లు చేయనిచో రాజ్యమంతయును అంధకార బంధురమై బాధనొందకుండునా? రాజు జీవించి యుండగనే నీ యొక్క వాక్యమును మేము సముద్రము గట్టును వలె దాటి యెఱుగము. రాజులేని ఈ సమయమున నింకేమి చెప్పవలెను. నీవు సంకల్పసిద్ధుడవు గదా! రాజొక్కడు లేకున్నచో రాష్ట్రమంతయు నడవి యగునుగదా! ఇది నీకు తెలిసిన విషయమే కాన దశరథుని పుత్రులలో నొక్కనిని నీవిపుడు రాజుగా చేయుటయే ఓ మునిశ్రేష్ఠుడా! తగియుండును.



# అఱువది యెనిమిదవ సర్గము

## మంత్రి పురోహితులు భరతునకు దూతనంపుట :

అని చెప్పు మాటలను విని వసిష్ఠుడు ఇట్లనెను. "భరతుడును, తమ్ముడును సుఖముగా రాజగృహమునందున్నారు. కాన దూతలిప్పుడే వేగవంతములగు గుఱ్ఱముల నెక్కి వెళ్లి వారిని తొందరగా తోడ్కొని రావలెను. వారిచ్చట లేకున్నచో నేమియు సాగదు గదా!" అనగానే అందఱును అగునగుననిరి. అప్పుడు వసిష్ఠుడు, సిద్ధార్థుడు, విజయుడు, జయంతుడు, అశోకుడు నందనుడునను దూతలను జూచి యిట్లనెను. "చేయదగిన పనిని వినుఁడు. వేగవంతములైన గుఱ్ఱములనెక్కి వేగముగా రాజగృహపురమను పేరుగల పట్టణమునకు వెళ్లుడు. అచ్చట మీరు కొంచెమైనను దుఃఖమునందక భరతుని జూచి ఏ విధమైన విచారముగాని జంకుగానిలేక నా యాజ్ఞగా నిట్లు చెప్పుడు. 'మంత్రులును మీ గురువగు వసిష్ఠుడును మీ క్షేమముల నడిగిరి. ఏదియో ముఖ్యమైన పని యుండుటచే ఒక ముహూర్తమైన జాగుసేయక మిమ్ము రమ్మని చెప్పినారు' అని చెప్పుడు ఇంకనేమియు చెప్పవలదు. మీరలెవ్వరును సీతావిభుడు వనవాసమునకు వెళ్లెననిగాని, మీ తండ్రి వివంబు చేరెననిగాని చెప్పకుడు. రాజునకును, భరతునకును అందముగా నున్న వస్త్ర భూషణములు విలువైనవి పట్టుకొని వెళ్లుడు" అని ఆజ్ఞాపించి వారికి కావలసిన దారిబత్తెములను కూడ నిచ్చి పంపిరి. అవియన్నియు బుచ్చుకొని వారు తమ తమ గృహములకేగి తగిన గుఱ్ఱములనెక్కి ప్రయాణమై కావలసిన వస్తుసముదాయమును తీసికొని వసిష్ఠ ననుమతి వడసినవారై వేగముగా వెళ్లుచు అపరతాళమను పర్వతమునకు పడమరగాను, ప్రలంబ పర్వతమునకు నుత్తరముగాను ఈ రెండు పర్వతముల మధ్యమందున్న మాలినీ నది వెంట వెడలి హస్తినాపురమునొద్ద జాహ్నవీ నదిని

దాటి ఆవల పశ్చిమ ముఖముగా వెళ్లి జాంగలదేశ మార్గమున పాంచాల దేశంబునందు బ్రవేశించి కొలనులను, నదులను గాంచుచు వారు వెళ్లి వెళ్లి కార్యావసరముచేత వేగముగా జనసంకులమైన శరదండయను నదిని దాటుచు దాని పడమటి తీరమున నున్న సత్యోపయాచన వృక్షము (కోరినవారి కోర్కెలను నిజముచేయు వృక్షము) నకు నమస్కరించి వెడలి కుళింగపురమును జూచి, అభికాళమను గ్రామమును దాటి ఆ ప్రాంతమందున్న బోధిభవనమను పర్వతమును జేరి దశరథుని యొక్క పూర్వులచేత ననుభవింపబడిన యిక్షుమతీ నదిని చూచి, యందు దోసెడు జలమును మాత్రమే గ్రోలి తపమాచరించుచున్న విప్రులను దర్శించి అంతట బాహ్లిక దేశ మధ్యభాగము నుండి వెడలి సుదామమను పర్వతమును అందలి విష్ణుపాద చిహ్నమును చూచుచు అచ్చట విపాశానదిని తత్తీరమున గల బూరుగు చెట్టును చూచి సుందరమైన బావులను, చెఱువులను, చిన్న నీటిగుంటలను నదులను తిలకించుచు, లేళ్లు, ఏనుగులు, సింహములు, పెద్దపులులు మొదలైన మృగములను చూచుచు వెళ్లి వెళ్లి గుఱ్ఱములలసిపోవుటచే కడు దూరము నడక సాగించి వేగముగా గిరివ్రజమను పురము ప్రవేశించి రాజవంశమునకు ప్రియము కలిగించగల ప్రతిష్ఠ నిలబెట్టగల దూతలు ఒక రాత్రివేళ పురమును చేరి రాత్రియంతయు నొకచోట గడిపిరి.



# అఱువది తొమ్మిదవ సర్గము

## భరతుడు దుస్స్వప్నము గని పరితపించుట :

ఏ రాత్రియందు దూత లాపురము చేరిరో ఆ రాత్రియందే భరతుడొక క్రూరమైన దుస్స్వప్నమును గని మిక్కిలి తల్లడిల్లెను. వేకువనే లేచినవాడై రాత్రివచ్చిన స్వప్నమును తలచి వ్యాకులతను జెందియుండగా భరతుని యొక్క మిత్రులు మంచిమాటలతో శోకమును పోగొట్టుటకై సభతీర్చినట్లుగా ప్రొద్దు గడచుటకై యనేకమైన మాటలను జెప్పుచుండిరి. కొందఱు కథలు చెప్పుచును, కొందఱు హాస్యప్రసంగములను జేయుచును, కొందఱు నాట్యాది కళలను తిలకింపజేయుచును, కొందఱు వ్యాద విశేషములను మ్రోగించుచు నెంత యత్నించినను అవియేవియు భరతుని చింత మాన్పజాలకపోయెను. అప్పుడొక ప్రియమిత్రుడు తక్కిన మిత్రులందఱితో గూడి నీవేల సంతోషము నందకున్నావని లాలించి యడుగగా అతడిట్లనెను. “ఓ మిత్రమా! నా అతిదీనతకు కారణమును వినుము. ఇది నిక్కము. భయంకరమైన కల వచ్చి నన్ను బాధపెట్టుచున్నది. ఏమని చెప్పుదును. ఏమి చేయుదును. ఆ కలలో మా తండ్రి మాసిన బట్టలను ధరించి, జుట్టు విరబోసికొని, పర్వతము మీదనుండి పేడ మడుగులో పడినట్లును, అందులో తాను కప్పవలె గంతులు వేయుచు నవ్వుచు దోసిళ్లతో నూనెను త్రావుచున్నట్లును, తిలాన్నమును దినుచున్నట్లును కలగంటిని. అంతేకాక శరీరమందంతటను తైలము పూసికొని తలక్రిందుగా నుండి ఆ తైలమునందు మునుగుచున్నట్లు కలగంటిని. సముద్రములన్నియు నెండిపోయినవి. చంద్రుడు నేలపై గూలబడెను. జగమునంతయు చిమ్మచీకట్లు ముంచివేసెను. పట్టపుటేనుగు యొక్క దంతము విరిగిపోయినది. అగ్ని చల్లబడిపోయినది. భూమి బీటలు తీసినది. అన్నిచోట్లను వృక్షము లెండిపోయినవి. పర్వతములన్నియు పొగతో నిండియున్నవి. నల్లగానున్న యినుప పీఠమునందు నల్లని బట్టలు ధరించి కూర్చొనియున్న దశరథ మహారాజు, నల్లని పచ్చని వర్ణములు గలిగిన స్త్రీలు

తనను గేలిసేయుచు నవ్వుచుండగా నెఱ్ఱని పూలదండలను ధరించి గాడిదలను గట్టిన రథముపైనెక్కి దక్షిణాభిముఖముగా వెళ్లుచుండుటను జూచితిని. రక్తవస్త్రములు ధరించిన యొక స్త్రీ రాజును జూచి నవ్వుచుండెను. వికృతమైన ముఖముగల రాక్షసి యొకర్తె నా తండ్రిని బలవంతముగ లాగుచుండెను. ఇట్టి కలగంటిని. ఈ రాత్రి యిట్టి భయంకరమైన కల వచ్చుటచే, దశరథునకో, శ్రీరామునకో, నాకో లేక లక్ష్మణునకో వినాశము సంభవించుననిపించుచున్నది. ఖరములను గట్టిన వాహనము మీద మనుష్యు డెవ్వడైన వెళ్లుచున్నట్లు కల వచ్చినచో కొలది కాలముననే అతని యొక్క చితిమీద పొగలధికముగా గనిపించ గలవు సుమా! అందుచే నా మనస్సు తల్లడిల్లుచున్నది. మాటలు తడబడుచున్నవి. గొంతుక యెండిపోవుచున్నది. మనస్సు కంగారుపడుచున్నది. ఎటువంటి చెడు వార్త విందునో గదా! మనస్సుడికి పోవుచుండుటచే మీతో ప్రియముగా మాటలాడుటకు ముఖము చెల్లుటలేదు. ఇప్పుడిటువంటి భయము కల్గుట కేమికారణమో తెలియదు. అధికమగు భీతితో తల్లడిల్లుచున్నాను. ఎందులకో నా మాటలు తడబడుచున్నవి. నా తేజము సన్నగిల్లినది. మనస్సు కళవళ పడుచున్నది. ఇందులకు కారణమేమో మనస్సునకు కొంచెమైన తెలియకున్నది. ఇదివరకెన్నడు నెరుగని ఈ గొప్ప చెడు కల అనేక విధములుగా బాధపెట్టు చుండుటచే ఓ ప్రియమిత్రుడా! నా తండ్రికేమైనదోయని సంతాపమును పొందుచున్నాను” అని తన స్వప్న వృత్తాంతమును మిత్రులకు వినిపించుచు, బాధనొందుచు, తన తండ్రిని దలంచుచు చింతాసముద్రమున మునుగుచు వ్యథనొందు చుండెను.



# డెబ్బదియవ సర్గము

## రాజదూతలు భరతునితో సంభాషించుట :

ఆ సమయమునందే దూతలు వచ్చి కేకయ రాజుచేతను, అతని పుత్రుడైన యుధాజిత్తు చేతను మన్ననలను పొంది రాజు పాదములను చేతులతో నంటి నమస్కరించి భరతుని జూచి యిట్లనిరి. "ఓ భూపతీ! మీ పురోహితులును మంత్రులును మీ క్షేమము నడిగినారు. వేగముగా అయోధ్యా నగరమునకు ప్రయాణము కమ్ము. అత్యవసరముగా నీవు చేయవలసిన ఒక కార్యమున్నదట. నీ కొఱకు నగలను వస్త్రములను దెచ్చినారము. వీనియందు ముందుగా నిరువది కోట్లు రాజైన మీ తాతగారికిమ్ము. మీ మేనమామకు పదికోటులిమ్ము"నగా వాటి నన్నిటిని తీసికొని భరతుడు ఆ దూతలతో నిట్లనెను. మా తండ్రియైన దశరథ మహారాజు కుశలముగ నున్నాడా? శ్రీరామచంద్రుడు సుఖముగా నుండెనా? అనఘుడైన సౌమిత్రి యారోగ్యవంతుడై యున్నాడా? మునియైన వసిష్ఠుడు కుశలమేనా? ఆర్యధర్మముల నెఱిగినదియు, ధర్మనిరతి గలదియు నయిన శ్రీరాముని తల్లికి భద్రమేకదా! అతి ధర్మాత్మురాలగు లక్ష్మణుని తల్లి సుమిత్ర ఆనందముగ నున్నది కదా! విశేషమైన కోపము గలదియు తన కోర్కె నెరవేరవలెనను పట్టుదల గలదియు, తానే సర్వజ్ఞురాలి ననుకొనునదియు, దుష్టురాలును నగు నా తల్లి కేవ్యాధియు రాలేదుగదా! మీరిచ్చటికి వచ్చునప్పుడు మీతో నింకేమి చెప్పినది?" అనగా దూతలెంతో వినయముతో నిట్లు చెప్పిరి. "ఓ అనఘా! మీరిప్పుడడిగిన వారికందరకు క్షేమమే. లక్ష్మీదేవి నిన్ను జెందునుగాక! ఓ గుణాఢ్యా! ఇంక ఆలస్యమేల? వేగముగా ప్రయాణమును సాగింపుము" అనగానే భరతుడు దూతలారా! నేను రాజునకు చెప్పి ఇదిగో వేగముగా వచ్చెదనని చెప్పి భరతుడు తాతగారిని చూచి "రాజా! నేను నా తండ్రిని చూచుటకు వెళ్లివచ్చెదను. ఈ దూతలు తొందరపడుచున్నవారు. మీరలెప్పుడు చూడవలెనని కోరిక కలిగిన నప్పుడే వేగముగా వచ్చెద"నని చెప్పగా ఆ రాజు సమ్మతించి, "నాయనా! భరతా! గురువులను పురోహితులను

మంత్రులను ప్రేమతో క్షేమమడిగినట్లు చెప్పుము. ఆ శ్రీరామునకును, లక్ష్మణునకును, గొప్పవారైన బ్రాహ్మణులకెల్లను కుశలములు దెలుపుము. ఈ విలువైన కంబళములు మొదలైన వన్నియును వారందరకు నిమ్ము.” అని చెప్పుచు బంగారు నాణెములను రెండు వేలును, పదునారు నూర్ల గుఱ్ఱములను, కంబళములను, అజినములను, ధనములను భరతునకు ప్రేమతో నిచ్చెను. ఆ అశ్వపతి మహారాజు భరతునకు తోడుగా సద్గుణవంతులును విశ్వాస్యులును నయిన మంత్రులను పంపెను. తన యల్లునకు యుధాజిత్తు ఇరావంతము ఇంద్రశిరమునను పర్వతములందు బుట్టినవియగు ఏనుగులను, వేగముగా వెళ్లగల గాడిదలను, భయంకరములగు కోరలుగల పెంపుడు కుక్కలను నొసగెను. ఇట్లు తాతయు మేనమామయు నిచ్చిన వన్నియును బుచ్చుకొని మనస్సున నేమియు సంతోషములేక కలలోని యావృత్తాంతము, దూతలు పెట్టు తొందర ప్రేరేపగా భరతుడు బయలుదేరు చుండగా, తాతయు, సచ్చరిత్రుడైన మేనమామయు సమ్మతితో వీడుకొల్పిరి. రథములపై తమ్ముడు తానును నెక్కి స్వర్గలోకమునుండి బయలువెడలు సిద్ధునివలె బయలుదేరినవాడై వేగముగా నూరు వదలి సేనలు సేవించుచుండగా రథములు, గుఱ్ఱములు, ఒంటెలు, గోవులు తన్ను వెన్నంటిరాగా మహాత్వరతో భరతుడు రాజగృహము నుండి బయల్వెడలెను.



# డెబ్బది యొకటవ సర్గము

**భరతుడయోధ్యకు ప్రయాణమగుట :**

రాజగృహపురము నుండి తూర్పు ముఖముగా కొంత దూరము వెళ్లి సుదామ మను నదిని సమీపించి, మిక్కిలి విశాలమైన హ్లాదిని యను నదిని దాటి పడమటి ముఖముగా ప్రవహించుచున్న శతద్రు నదిని ఏలాధనమను గ్రామసమీపమున తరించి అపరపర్పట మను గ్రామము చేరి విశ్రమించి అటనుండి గదలి శిలావహమను నదిని దాటి ఆగ్నేయ దిక్కుగా మనస్సున కానంద మొదలించు శల్యకర్తన మను పురమును జూచి చైత్రరథమను వనము యొక్క అందమును మెచ్చుకొనుచు, గంగయు, సరస్వతియు నను అందమైన రెండు నదులను చూచినవాడై వీరమత్స్యదేశమున కుత్తరమున నున్న భారుండ వనమును ప్రవేశించి, కొండల నడుమనున్న కుళింగమును దాటి తరువాత యమునా నదీతటమున బలములతో గూడ విడిసినవాడై అచ్చట గుఱ్ఱములను సేదదేర్చి వాటిని కడిగించి తామును స్నానమొనరించి దాహము తీరునట్లుగా జలపానము చేసిరి. అవతల నీరు లభింపదు గనుక ఆ నదియందే నీటిని తీసికొని భయంకరమైన అడవులలో ప్రవేశించిరి. రాకుమారుడు ఏనుగుపైనెక్కి ఆకాశమున సంచరించు గాలి వలె ఆ వనము నవలీలగా దాటి భాగీరథీ తీరమును జేరెను. అంశుధానమను దేశమునందు ప్రాగ్వటమను పట్టణ సమీపమున భాగీరథిని దాటి తరువాత కుటికోష్ఠికయను నదిని దాటి ధర్మవర్ధనమను పురమును జూచి అటనుండి తోరణ గ్రామమునకు దక్షిణ దిశనున్న జంబూ ప్రస్థమను పేరు గల పట్టణమును చేరెను. అటనుండి అందమైన వరూథమను గ్రామమును జేరి దాని సమీపమున గల వనమునందు

నిలిచి అటనుండి తూర్పు ముఖముగా వెళ్లుచు ఉజ్జిహానమను పట్టణమున గల ప్రియకారామమును సమీపించి అచ్చట వేగవంతములగు గుఱ్ఱములను రథమునకు గట్టించి, సైన్యమును నెమ్మదిగా రమ్మని యాజ్ఞాపించి తాను తొందరగా ప్రయాణము సాగించి సర్వతీర్థమునం దొక్క రాత్రిని గడపి అచ్చటి నుండి బయలుదేరి యుత్తానిక మొదలైన నదులను, కుటికా నదిని ఏనుగుల మీద గట్టిన అంబారీల మీద నిలిచి దాటినవాడై లౌహిత్యమను పురము సమీపమున కపీవతీ నదిని దాటెను. ఏకసాలాగ్రామమున స్థాణుమతీ నదిని వినతమను నగరమునందు గోమతీనదిని దాటి దూరప్రయాణముచే గలిగిన శ్రమను తొలగించుకొనుటకై కళింగపురమున సాలవనమునందు కొద్దిసేపు విశ్రమించి రాత్రియే విలంబము చేయక అది దాటినవాడై తెల్లవారుసరికి మను నిర్మితమై సిరులతో తులతూగుచున్న తమ అయోధ్యా పట్టణమును ఏడురాత్రులు ప్రయాణించి చూచి తన సారథితో నిట్లనెను.

**భరతు డయోధ్య దుస్థితికి వగచుట :**

"ఓ సూతా! చూచితివా! రాజశ్రేష్ఠునిచే పరిపాలింపబడినదై యజ్ఞములు చేయుచు శాంతగుణము గలిగి వేదపారంగతులయిన బ్రాహ్మణబృందములు గలదై యుండియు తెల్లని సున్నపు ముద్దవలె దూరము నుండి చూచుటకీ పట్టణమెందుచేతనో గాని సంతసము కలుగజేయకున్నది. మునుపెన్నడును కలకలమని స్త్రీల యొక్కయు పురుషుల యొక్కయు సందడి దూరమందుండగానే వినబడుచుండెడిది గదా. ఇప్పుడింత దగ్గరకు వచ్చినను వినిపింపకున్నది సారథీ! ఎందులకో కదా. వేడుకగా విహరించుటకు సాయం సమయములందు ఉద్యానవనములకు వచ్చి రాత్రియంతయు విహరించి తెల్లవారుచుండగా ఇండ్లకు వెళ్లువారలే కనిపింపరేమి సూతా! ఓ సారథీ నాకు చూడ పురము అరణ్యమువలె తోచుచున్నది. వాహనముల మీద నైనను జనులెవ్వరును రాకపోకలను జరుపుట లేదెందు చేతనో? అనేకములగు ఏనుగుల మీదను

అశ్వముల మీదను జనులు సంతోషముతో వివిధ క్రీడలాడుట లేదెందుచేతనో! యని మనస్సు ఆందోళనపడుచున్నది. కోకిలలు, చిలుకలు, గోరువంకలు అందముగా నున్న చెట్ల కొమ్మలయందు నిలిచి ఒంటొంటితో కేళీ వినోదములు సలుపుచు గుంపులుగా గూడి మనసు నానందింపజేయుచుండగా సరస్సుల తోనూ పూబొదరిండ్లతోను ప్రకాశించు ఈ వనములు ఏ గతి పట్టియున్నవో చూచితివా? ఆకులన్నియు నేలకు రాలిపోవుచు కొమ్మలు విరిగిపడుచు నున్న చెట్లు గోలుగోలుగా నేడ్చుచున్నట్లు తోపగా ఈ క్రీడావనములు శృంగారములేనివై తోచుచున్నవి గదా. ఓ సూతా! ఈ చెట్లగుంపులం దొక్కరును గనిపింపరు. చెవుల కింపుగా పక్షుల కలధ్వనులును వినిపించుటలేదు. అగురు చందనముల ధూపములతో గలిసిన వాయువు యొక్క కమ్మని వాసనలు సోకకున్నవిగదా. భేరీ నాదములుగాని మృదంగ వేణు వీణా నాదములు గాని పూర్వపు విధముగా నెందులకు వినబడవు? శకునములు కూడ మంచివిగా కనుపించుటలేదు. నా హృదయము వ్యాకులమగుచున్నది. ఇది నిజము. నా బంధువులకు శుభము కల్గుట దుర్లభమే. ఏదో యాపద సంభవించినది. ఆరాటముచే నా హృదయము వివశమగుచున్నది" అని పల్కుచు భరతుడు వేగముగా వైజయమని కీర్తిగాంచిన ద్వారముగుండా ఆ పట్టణములోనికి ప్రవేశించి విజయధ్వనులు చేయు మార్గదర్శకులు వేగముగా వెడలుచుండగా వారి వెనువెంట నేగుచు, పరిపరి విధములుగా మనస్సు బ్రద్దలగుచుండగా సూతునితో నిట్లనెను. "కారణము లేకుండగా గురువైన వసిష్ఠుడు నన్నేమిటికి తొందరగా రమ్మని పిలిపించెనో గదా! ఏదో యశుభము జరిగెనని తోచుచున్నది. నా శరీరము తాపము నొందుచున్నది. మనస్సు విహ్వలత్వమును బొందుచున్నది. రాజు నశించు కాలమున నేవేవి సంభవించునని వినియుంటినో ఇప్పుడవి యన్నియును కనిపించుచున్నవి. ఓ సారథీ! పెంటలనూడ్చుట గాని, ధూప ధూమములు వెల్వడుట గాని, వంటలు వండుట గాని అన్ని పరికరములతో

బలులిచ్చుట గాని ఈ గృహంబులందు కనిపించుటలేదు. గృహస్థుల గృహము లన్నియు లక్ష్మితొలగినవై కన్పించు చున్నవి. పౌరులందఱు కాంతివిహీనులయిరి. పువ్వులమ్ము అంగళ్లయందు అమ్మకములు గానరాకున్నవి. జనులు అలుకుటలు గాని, ముగ్గులు పెట్టుటలుగాని దేవతాగృహములను పువ్వులతో నలంకరించుట గాని చేయరు గదా! ఎక్కడను ఒక్క మనుష్యుని ముఖమైనను కనిపించుటలేదు. పాడుపడినట్లు తోచుచున్నది గుళ్లు పూర్వమువలె నేలనో ప్రకాశింప కున్నవి. సూతా! గొప్పదైన పరితాపము పుట్టుచున్నది గదా! కోవెలలయందును, మఠముల యందును, పెంచబడు పావురములు చిలుకలు మొదలగు పక్షులుగూడ వ్యథతో గూడుకొన్నవై శిరస్సులను వ్రాల్చినవై కన్నీరు కార్చుచు మిక్కిలి బాధజెందు చున్నవి. స్త్రీలును పురుషులును అంతులేని కలతతో ఆర్తినొందుటకు కారణ మేమియోగదా. దైవమా!" మాటిమాటికి, తన రథసారథితో నిట్టి మాటలు చెప్పుచు వెళ్లి వెళ్లి శూన్యముగా నున్న వీథులను అంగడులను, గృహములను, అధికమైన ధూళిచే ధూసరితములైన గడపలు ద్వారములు తలుపులు గలిగి పూర్వము స్వర్గమువలె వెలుగొందుచుండిన ఆ పురమును జూచి భరతుడు దుఃఖముచే కలతజెందినవాడై తలవంచుకొని వేగముగా...



# డెబ్బది రెండవ సర్గము

## భరతుడు కైకేయి మేడకు బోవుట :

తన తండ్రి నివసించు మేడకు వెళ్లి అచ్చట జనకుడు కనిపించకపోవుటచే వేగముగా తన జనని యొక్క గృహములోనికి వెళ్లగా చాలకాలము దూరదేశమున నుండి వచ్చిన తన కుమారుని జూచి యెక్కువైన సంతోషముతో కైకేయి బంగారు గద్దియ నుండి దిగ్గన దుముకుటను జూచి భరతుడు వినయముతో నమస్కరింపగా అతనిని తన తొడమీద గూర్చుండబెట్టుకొని శిరమును మూర్కొనుచు “ఓ తనయా! యెన్నాళ్లయినదిరా ఈ యూరిని విడచి. కుమారా ప్రయాణపుబడలికతో నున్నావేమో కదా. నీ యొక్క మేనమామ సుఖముగా నున్నాడా? అచ్చట ఇన్నాళ్లు నీవెట్లు గడపితివి? నీకక్కడ సంతోషముగా గడచినదా? నాయనా! నాకిక్కడ నీవెప్పుడును కన్నులకు గట్టినట్లుంటివి సుమా! అని అడుగుచున్న తల్లితో భరతుడిట్లనెను. “అమ్మా మేము మామగారింటి నుండి కదలి ఆఱున్నొక్క రాత్రులయినది. తాతయు మామయు క్షేమముగ నున్నారు. వారు లెక్కలేనన్ని ధనములను నాకిచ్చి పంపిరి. అవి యన్నియు నెమ్మదిగా వచ్చుచున్నవి. దూతలు నన్ను విడువక తొందరపెట్టుటచే నేను ముందుగా వచ్చితిని. ఓ జననీ! నేనడుగువానికి సరియైన సమాధానమును జెప్పుము. బంగారుతో చేయబడిన నీ శయ్య శూన్యమై ప్రకాశరహితమై యున్నది. రాజ కుటుంబమువారందఱు దీనతతో నున్నవారెందులకు? పవిత్ర చరిత్రుడైన నా తండ్రి ఎప్పుడు ఇందే నీ గృహమునందే యుండువాడుగదా. ఈ రోజున నిచ్చట లేకున్న కారణమేమియో గదా!

**కైకేయి భరతునకు దశరథుని మరణమును దెల్పుట :**

"అమ్మా నా తండ్రిని చూచుటకై ఇక్కడకు వేగముగా వచ్చితిని. ఆయనకు నమస్కరింప వచ్చితిని. వేగముగా ఆయనకు చెప్పుము. పెద్దభార్య యింట నున్నాడా?" అని యడుగుచున్న భరతునకు కైక తన అధికమైన రాజ్యకాంక్షచే మోహితురాలై ప్రియవార్తను వలె ఆ ఘోర వార్తను వినిపించెను. "ఓ తనయా! యజ్ఞములను చేసినవాడును, పాపరహితుడును మహాతేజశాలియు, మహాత్ముడును, సజ్జనుల కాధారమైనవాడును అగు ఆ రాజచంద్రుడు ఎల్ల ప్రాణులకు నేది తప్పనిగతియో అట్టి గతిని పొందెను" అని చెప్పగనే భరతుడార్తితో హా! యని నేలమీద పడినవాడై చచ్చినవాని వలె కొంత తడవుండి లేచి తన చేతులను పైకెత్తి విలపించుచు.. వాపోవుచు దిగ్భ్రాంతి జెందుచు, నేలమీద పడిపోవుచు, నన్ను చూడుము నాయనా! ఎచ్చటికి వెళ్లితివి. "నన్ను దయతో చూడుము. అయ్యో తండ్రీ శరద్రాతియందు నిండుచంద్రునిచేత ఆకాశమువలె నీచేత నీ శయనము మునుపెంతయో కాంతితో నుండెడిది. నేడయ్యో నీవు లేకపోవుటచే చంద్రుడులేని ఆకసము వలెను, నీళ్లెండి పోయినట్టి గొప్ప సముద్రమువలెను తోచుచున్నది." అనుచు ముఖమును గుడ్డతో కప్పుకొని గొడ్డలిచే నరుకబడిన చెట్టువలె నేలపైబడి యేడ్చుచుండెను. ఏనుగును, సూర్యుని, చంద్రుని, ఇంద్రుని పోలిన భరతుడట్లు విలపించుచుండగా కైక తన పుత్రుని మెల్లగా లేవనెత్తి, లాలించి విడువక తొరగుచున్న కన్నీరు తుడుచుచు చనువుతో శాంతమనస్కురాలై యిట్లనెను. "లేలెమ్ము. రాజా! ఎందుల కీప్రకారముగా దుఃఖించెదవు. ఇట్లు ఎందులకు నేలపైబడి విలపింతువు. నిను బోలిన బుద్ధిమంతులిట్లు దుఃఖింతురా? మనుష్యునకు కాలమును గడచి బ్రతుకుట శక్యమా? గురువులు మెచ్చునట్లుగా ఎల్లవేదములు చదివితివి. సజ్జనుల మెచ్చుకొనునట్టి నడవడితో మెదలితివి. దానము యజ్ఞము మొదలగు సత్కర్మలచే

నీ బుద్ధి మందర పర్వతమున సూర్యకాంతివలె మిక్కిలిగా ప్రకాశించును. ఈ విధముగా నేడ్చుట వలన లాభమున్నదేమో నీ మనస్సున తలంచి చూడుము" అని చెప్పగా భరతుడు భూమిమీదబడి దొరలుచు నెట్టకేల కిట్లనెను. "శ్రీ సమన్వితుడైన నా తండ్రి శ్రీరాముని యువరాజుగా జేయునో లేక యేదైన యజ్ఞము చేయ సంకల్పించెనో యని తలచి ఆశతో వేగముగా వచ్చితిని. రాజును చూచెడు పుణ్యము లేకుండుటచే తలచిన కోర్కెలెల్లను కట్టా మొదలంట నశించెను గదా. నా హృదయము ముక్కలు ముక్కలుగా పగిలిపోయెను. నేనిచ్చటకు రాకముందు తండ్రికేమయినది? ఏమి జబ్బుచేసి మరణించెను? తండ్రికంత్య సంస్కారములు చేసిన యా రామలక్ష్మణులు ధన్యులు గదా! నేను రాగానే రాజు తన శరీరమున కించిత్తు ప్రాణమున్నను ప్రేమతో నా శిరస్సును ముద్దిడుకొనకుండునా? ఈ విధముగా దుమ్ముకొట్టుకొనియున్న నా శరీరమును ప్రేమతో తుడిచి తన చేతులతో నిమురుచు లాలించువారింక నెవ్వరు గలరు? ఆ విధముగా స్పృశించు చేతులు లేవుగదా! ఎవడు నాకు అన్నయు, తండ్రియు, చుట్టమునయి యున్నాడో నేనెల్లప్పు డెవ్వనికి సేవకుడనో అట్టి మహాగుణశాలయయిన రామునకు నా రాక దెల్పుచు వేగముగా వార్త నంపుము. వివేకవంతుడైనవానికి జ్యేష్ఠ సోదరుడే తండ్రి. ఆ రామవిభుడే నాకు గతియగుటచే నే నతని పాదద్వంద్వము మీద వ్రాలెదను. ఉత్తమ ధర్మముల నెఱిగిన వాడును, సత్వగుణ ప్రధానుడును, నిర్మలచరిత్రము గలవాడును అయిన నా తండ్రి తాను స్వర్గమున కేగునప్పుడు నాకు న్యాయములును హితములు నయిన మాటలేమి చెప్పుమనెను? అమ్మా జనకుడు చిట్టచివరగా నాకై చెప్పిన హితమును వినుటకై ఆశపడుచున్నాను అని భరతుడు పలుకగా అతనితో కైక యథార్థమునిట్లు పలికెను. "రామా యనియును సీతా యనియును, సౌమిత్రీ యనియును రాజు మిక్కిలి సంతాపముతో నేడ్చుచు నేడ్చుచు తాను శరీరమును

వీడి స్వర్గమును జేరెను. విడువబడని పాశములతో బంధింపబడిన ఏనుగువలె తపించుచు మరణించునప్పుడు, ఎవ్వరు భువన పూజ్యుడైన సీతాసమన్వితుని రాముని, లక్ష్మణుని, వారలు తిరిగి వచ్చినప్పుడు చూడగలుగుదురో వారే ధన్యులనుచు చివటి మాటలుగా తాను చెప్పెను. మరి యింతకుమించి మరేమియును వచింపలే"దని చెప్పగా, తన తల్లి చెప్పిన రెండవ అప్రియవార్తను విని భరతుడు మిక్కిలి తహతహపడుచు దుఃఖపూరితమైన ముఖముతో తన తల్లి ముఖమును జూచుచు నిట్లనెను. "ఓ తల్లీ! రఘురాముడు స్త్రీ రత్నమయిన సీతతోడను, తమ్మునితోడను ఎచ్చటకు వెళ్లెను? అట్లు వెళ్లుటకు కారణమేమి తెలియునట్లుగా చెప్పుము" అని అడుగగా కైకేయి వినుటకింపుగాని వార్తను భరతున కిష్టమగునను తలంపుతో తాను చేసిన పనిని ఉన్నదున్నట్లుగా చెప్పదొడగెను.

## కైకేయి భరతునకు శ్రీరాముని వనగమనమును చెప్పుట :

"భరతా! రాముడు నారవస్త్రములు గట్టి భూపుత్రితో గూడి పినతమ్ముడు తన్ను సేవించుచుండగా దండకాటవి కేగెను." అను వార్తను చెప్పగా విన్నవాడై ఆ దారుణమైన వార్తకు భయముతో ముక్కలయిన మనస్సు గలవాడై తన వంశము యొక్క కీర్తిని తలంచుచు సోదరుని యొక్క సద్గుణముల కెట్టి భంగము వాటిల్లెనోయని శంకించుచు భరతుడిట్లనెను. "ఆ రామచంద్రుడు బ్రాహ్మణ విత్తము నాశింపడు గదా. క్రూరుడై ధనవంతునినైనను నిరుపేదవానినైనను దోషహీనుని దండింపడు గదా. పరస్త్రీల పొందు కోరడు గదా. అటువంటి శ్రీరాముని భ్రూణహత్యను చేసినవానిని వలె దండకాటవి కేల పంపిరి?" అని అడుగగానే తానే పండితురాలనని భావించునదియు, చంచల స్వభావము గలదియునైన కైక స్త్రీ స్వభావముచేత తాను చేసిన పనికి తానే మనస్సులో సంతోషించుచు ఉన్నది ఉన్నట్లుగా నిట్లు చెప్పెను. "ఒకప్పుడైనను బ్రాహ్మణుల

విత్తమును కొంచెమైన నా రామచంద్రుడు పుచ్చుకొనడు. కామమోహముతో పరస్త్రీలను కన్నులనైన చూచి ఎరుంగడు. పేదవానినైనను సిరులు గలవానినైనను శిష్టాచారము గలవారి నెప్పుడును నొప్పించి యెరుగడు. నీ తండ్రిని రాముని వనములకు బంపుమనియు, నిన్ను రాజుగా జేయుమనియు, నేనే కోరి యున్నాను. తన మాటను నిలుపుకొనుట కొరకే నీ తండ్రి రాముని సీతతోడను, తమ్మునితోడను వనములకు బంపెను. తరువాత తన ప్రియపుత్రుని చూడలేనను దుఃఖముచేత తాను మరణించెను. పుత్రా! నీ కొరకై నేనింతకార్యమును చేసితిని. శోకమును విడచిపెట్టుము. నీ కొరకై పురోహితులు మొదలైనవార లెదురుచూచు చున్నారు. అఖండమైన యీ భూవలయంబంతయు సహజమైన శూరత్వము గల నీ కర్పించుటకై వేచియున్నారు. కాన నీవు ధైర్యము వహింపుము. పట్టాభిషేకము నందుటకు సిద్ధము కమ్ము. ఈ పట్టణము, ఈ రాజ్యము, ఈ ధనాగారములు అన్నియును నీవే అగును కనుక ఈ రాజు యొక్క ఉత్తర క్రియల తరువాత నీ యభిషేకమును విప్రులు జరిపింతురు.”



# డెబ్బది మూడవ సర్గము

## భరతుడు కైకేయిని దూషించుట :

అని చెప్పగా భరతుడు తన తండ్రి యొక్క మృతిని, తన అన్నగారును తమ్ముడును వనములకు వెళ్లుటయును విని శోకముతో ఉడికిపోవుచున్నవాడై తన తల్లితో నిట్లనెను. "నా తండ్రిని, తండ్రి వంటి రఘురాముని నెడబాసి యేడ్చుచున్న ఈ యనాథునకు భాగ్యహీనునకు హా! ఈ సిరి యెందులకు? రాజ్యమెందులకు? ఓ చండీ! రాజును చంపివేసి, సద్గుణములు గలిగిన రామచంద్రుని నడవులకు మౌనిగా బంపి, భరింపరాని దుఃఖముమీద దుఃఖమును పుండుమీద ఉప్పును బెట్టినట్లుగా ఘటించితివి గదా! ఆ రాజేంద్రుడు అయ్యో! తెలివితక్కువవాడై నిన్ను పొందుటచే అగ్నిని ఒడిలో పెట్టుకొన్నట్లయ్యెను గదా! దుష్టురాలా! నీవెక్కడ దాపురించితివి. అక్కటా! ఈ విధముగా కొంప గూల్చితివి. అయ్యో! కాళరాత్రి వలె ఆ రాజును నీవే చంపివేసితివి గదా! నీచురాలా! అజ్ఞానముచే ఈ కులమున కంతకును సుఖము లేకుండ చేసితివిగదా. నిన్ను వివాహము చేసికొనుటచేత నా తండ్రి దిక్కు లేకుండగా చచ్చెనుగదా. పుణ్యాత్ముడు సత్యవ్రతుడునైన నా తండ్రి నెందులకు జంపితివి? సజ్జనులచేత సమ్మానింపబడు నా యన్న నరణ్యభూములకు పంపుట కేమి కారణము? ఇంక కౌసల్యయు సుమిత్రయు కడుపు దుఃఖము నెట్లు సహించెదరు. నా తల్లివైన నీ దగ్గర వారలిక జీవింపగల్గుటే కష్టముగదా. ఎల్లప్పుడు ధర్మమార్గమున నడచువాడును, మంచి వ్రతములు చేయువాడును అగు రాముడు నిన్నెల్లప్పుడును శ్రద్ధాభక్తియుక్తముగా కన్నతల్లివలె సేవించుచున్నవాడు గదా. సజ్జనులచేత నమస్కరింపబడినదియు, దూరాలోచనము గలదియు నగు ఆ

కౌసల్యామాత ప్రేమతో తోడబుట్టినదానిగా నిన్ను మన్నించుచున్నది గదా. ఆ మహనీయురాలి యొక్క పుత్రుని మంచి గుణములు గలవానిని నారచీరలను గట్టనిచ్చి భయంకరమైన యడవులలో ద్రోసివేసినట్టి దుర్మార్గురాలా! కొంచెమైనను నీ మనస్సునందు కలత జెందకున్నావు గదా. నిందింపబడని వానిని సన్మార్గమున నడచువానిని రాముని నడవులకు బంపించిన దురాత్మురాలా! నీవేమి ఫలితమును పొందెదవు? రాముని యెడ నేనెట్టివాడనై యుందునో నీ వెఱుగలేకపోయితివి గదే లుబ్ధురాలా! ఈ గొప్పనైన యనర్థమును నీవీ రాజ్యమునకు దెచ్చిపెట్టితివి గదా ఓ కులఘాతుకురాలా! శూరులలో అగ్రగణ్యులైనవారలును, పరిశుద్ధమైన మనస్సు గలవారలును నగు రామలక్ష్మణులు నాకు దూరమైనచో నిక నే నే బలముతో ఈ రాజ్యము నేలగలవాడను? మేరుపర్వతము తన మీదనున్న మేరువనము ప్రాపున వలె దశరథ మహారాజు కూడ వారి సహాయము చేతనే దుర్భేద్యముగ రాజ్యమునేలుచుండెను. మహా పరాక్రమవంతులగు వారిచేత మోయబడదగిన యీ రాజ్యభారమును మోయుట నావంటి వానికి శక్యమౌనా? ఎద్దు మోయగలిగిన భారమును లేగదూడ మోయజాలదు గదా. బుద్ధిబలము చేతనో యోగబలముచేతనో ఈ భూభారమును భరించవచ్చుగాని నీ పుత్రునకు రాజ్యలాభమును గలిగింపవలెనను నీ విపరీతపు పాపపు గోరికను తీర్చుటకు నే నొప్పుకొందునా? అంతులేని సంతాపముతో మండి మాడుము. ఓ రాక్షసీ! తప్పక నీ కిదియే తగిన శిక్ష. ఆ శ్రీరాముడు నిన్ను తల్లివలె విశ్వాసముతో చూచుచుండుటచేత నేను నిన్నేమియైన చేయుటకు మనస్సునందు తలంపలే కున్నాను సుమా. లేకున్నచో ఓ మాయలమారీ! నిన్ను దూరముగా బంపివేసి సుఖమును పొందకుందునా? దుష్టురాలా! నిందింపదగిన నడవడి గలదానా! వంశ నాశనకరురాలా! ఇటువంటి బుద్ధి నీకెందులకు కలిగినదే? మా వంశమునందు పెద్దవాడే రాజ్యభారమును వహించుటయును సోదరు లందఱును అతనిని తండ్రిని వలె భక్తిశ్రద్ధలతో గొల్చుటయును పూర్వము

నుండియు వచ్చుచున్న ధర్మము. ఇది నీకు తోచలేదా? రాజులందఱును మమ్ము చూచి నేర్చుకొనుచు మమ్ములను మెచ్చుకొనుచుందురు. ఓ నీచురాలా! అట్టి ధర్మరక్షకులైన గొప్పవారి వంశ మందు సాధుచరిత్రులమనియును, ప్రశస్తమైన నడవడి గలవారమనియును చెప్పుకొను మా గర్వము ఇప్పుడు నీ సంబంధము వలన నేలగలసెను గదా. నీ పుట్టినింటియందు రాజులలో జ్యేష్ఠుడే రాజ్య భారమును స్వీకరించుటలేదా? ఓ కుమతీ! ఈ దుష్టాలోచన నీ తలయందెట్లు పుట్టెనే? నన్ను చంపజాలినంతటి గొప్ప దుఃఖమును గలిగించితివి గనుక ఓ పాపచరిత్రా! నీ కోర్కెను తీర్చెడు పనిని నేను చేయజాలను సుమా! నీ యిష్టమును దీర్చకుండుటే గాక అనిష్టమును చేసెదను. ఇప్పుడే ఆ శ్రేష్ఠుని, స్వజనులయందు ప్రీతి గలవానిని ఓ దుష్టురాలా తిరిగి పురమునకు దెచ్చెదను చూడుము. ఇచ్చటికి తీసికొని వచ్చుటే కాదు ఆ అగ్నిహోత్ర ప్రకాశుడగు రామునకు నేను స్థిరమైన మనస్సుతో దాసుడనై అతనిని రాజుగా జేసి సమ్మదముతో సేవించెదను” ఇట్లు భరతుడు కటకటపడి కుటిల బుద్ధిగల కైకను తిట్టి గొప్ప దుఃఖముతో గుహలోనున్న సింహమువలె గర్జించెను.



# డెబ్బది నాలుగవ సర్గము

**అ**ని పరుషములైన మాటలు పలికి తన మనస్సునందు అంతకంతకు రేగుచున్న శోకాతిశయముచే భరతుడు కైకను జూచి రోషముతో శరీరము కంపించుచుండగా ఇట్లనెను. “ఛీ పో, ఓ పాపచరిత్రురాలా! ఈ రాజ్యమును విడచి పొమ్ము. క్రూరురాలా! నీచురాలా! ఇట్లు ధర్మమునకు హాని కలిగించితివి. నేను చనిపోయితినని దుఃఖింపుము. రాజుగాని, పవిత్రుడగు సీతారమణుడుగాని యింతకు పూర్వము నిన్నెన్నడైన తిట్టియున్నారా? రాజు స్వర్గమునకును, రాముడరణ్యములకు ఒక్కమారే వెళ్లుట నీ కారణముగా ఎట్లు సంభవించెను? ఓ కైకేయీ! ఈ కులమును నాశనము చేయుటచే నీకు భ్రూణ హత్య చేసిన ఫలము సంభవించును. దానిచే పీడింపబడుచు నరకలోకమునకు వెళ్లు నీకు నీ భర్తతో గలసి యొక లోకమున నుండు సుఖము ఘటింపదు. ఇది నిక్కము. స్థిరమైన క్రూరమైన యెత్తుగడ గల ఈ పాపపు పని చేసిన నిన్ను జూచిన లోకప్రియుఁడగు సీతాపతి దగ్గరలేకుండుటచే నా కు భయము కలుగుచున్నది గాని అక్కటా! దుష్టాత్మురాలా! ఈ రాజ్యమును నేను బొందుట వట్టిది సుమా! నా జనకుని మన్నున గలిపి, అన్నను వనములకు బంపి, యపకీర్తిని నా తలకెత్తితివే. ఇంక నే నేవిధముగా భూమిపై తల యెత్తుకొని సంచరింతును? నీవు నాకు తల్లివిగావు చెడ్డ శత్రువవు సుమా! క్రూరమైన కోరిక గలదానా! నీతో మాటాడదగదు. ఓ భర్తృఘాతినీ! నీ మొగము కూడ చూడఁదగదు. నీ విట్లు దాపురించుటచేత రాముని తల్లియు, సుశీలయైన సుమిత్రయు మొదలుగాఁ గల నా తల్లులందఱు దుఃఖమును పొందిరి. ఇది తథ్యము. నీవు

గొప్ప ధర్మాత్ముడగు అశ్వపతి ప్రభువునకు పుత్రికవుగాదు. అతని కులమును కూల్చుటకై యుదయించిన పిశాచమవు. ఏలనన ఎప్పుడును ధర్మము ననుసరించి నడచువాడును, సత్యపరాక్రముడును అయిన రామచంద్రుని అడవులలో త్రోసివేసితివి. నా తండ్రిని ఆ దుఃఖముతో వేగముగా స్వర్గమున కేగునట్టొనర్చితివి. లోకముల కప్రియము కలిగించుదానా! నీ కృత్యము వలన నేను లోకములకు చెడ్డవాడనయితిని. ఓసీ లుబ్ధురాలా! రాకాసీ! నీ అధికమగు పాపము నన్ను చుట్టుకొనినది. నీవు నా తల్లివౌటచే నాకు పాపములు రాకుండునా? సజ్జనులచే పొగడబడిన నడవడి గల కౌసల్యను అక్కటా! పుత్రుని కోల్పోవునట్లు చేసి నీవెట్లీ యైశ్వర్యమును గోరితివే? ఓ దురితశీలురాలా! యెట్టి ఘోరమైన నరకమున బడుదానవో గదా! క్రూరమైన నింద్యమైన చరితము గలదానా. కౌసల్య కుమారుడు బంధువుల కాశ్రయమైనవాడును, పరమ ధర్మనిష్ఠుడును జ్యేష్ఠుడును, తండ్రితో సమానమైనవాడును, ఆ నియమవంతు నెఱుగవా. అంగ ప్రత్యంగముల నుండి జనించినవాడును హృదయపద్మము నుండి పుట్టిన వాడును అగు పుత్రుడే తల్లికి ప్రేమచే గొప్పవాడు ఏ బంధువులును సుతునకు సాటికారు గదా. పూర్వమొకనాడు భూమిని దున్నుచు, తన పుత్రులు నాగటి కాడి మ్రాకుల భారముచే మెడలు వ్రేలవేసి భూమిమీద పడిపోగా ఆ మధ్యాహ్న సమయమున ధర్మజ్ఞురాలగు సురభి (కామధేనువు) పుత్రశోకముతో బోరున నేడ్వగా దాని కన్నీరు క్రిందుగా వెళ్లుచున్న ఇంద్రునిపై పడగా ఆ పురుహూతుడు పవిత్రమైన వాసన గలిగిన కన్నీళ్లు సురభివిగా గుర్తించి తలను పైకెత్తి ఆకసము వంక చూచి అచ్చట నిలిచి యేడ్చుచున్న దేవతల కామధేనువును జూచి దాని యొద్దకేగి మిగుల కలతచెందినవాడై చేతులు జోడించి దానితో నిట్లనెను. 'ఓ గోమాతా! మాలో సంచరించుచు జగములకు మేలు చేకూర్చు నీకు దుఃఖించునంతటి భయమెట్లు కలిగినది. మాచే నీ కిట్టి భయవికారము కలుగలేదు గదా?' అని పలికెను. సురరాజిట్లడుగగనే దేవతల ధేనువిట్లనెను.

“హరిహరీ! మీవలన నాకెప్పుడైనను ఆపద కలుగలేదు. అట్టి దుస్థితిలో నున్న పుత్రులను జూడగనే నివారింపరాని దుఃఖము గలిగినది. ఇంద్రా! చూచితివా సూర్యకిరణములచేత తపించుచు దీనములైన కృశించిన శరీరములు గల నా బిడ్డలను? బక్కచిక్కినవై నడువలేక ఈడిగిలబడుచుండగా ముక్కులు మూసియు, శరీరమున వాతలు పెట్టియు, కఱ్ఱలచేత పొడిచియు, తోకలను విరుచుచు, బడియలచేత మోదుచు కాపులు కష్టపెట్టుచున్నారు. నా కడుపున బుట్టి యిటువంటి పాట్లు పడుచుండగా జూచి యేమియు చేయలేనిదాననై యిట్లు విచారించు చున్నాను. స్త్రీలకు కొడుకువలె ఇష్టతముడు మరియొకడుండునా?” అని వేలకొలది బిడ్డలు భూలోకమునందుండి బాధలనొందుటను చూచి విచారించుచున్న కామధేనువును ఇంద్రుడు చూచి స్త్రీలకు పుత్ర సమూహమే ఎక్కువ యిష్టమని తలంచెను. ఎన్నరాని శుభప్రవృత్తి గలదియు, సమస్త జగములను సంరక్షింపవలెననెడు కోరిక గలదియు, సమృద్ధిగా దధి క్షీరములు గలదియు, నిరంతరములైన సద్గుణములు గలదియు, పొగడదగిన సహజ ప్రవృత్తి గలదియు, వేలకొలది పుత్రులు గలదియు నగు కామధేనువే యింత దుఃఖము నొందగా రాముని నెడబాసిన కౌసల్య విషయము నేమందును? ఒక్క పుత్రుడు మాత్రమే కలిగిన సాధ్వియైన కౌసల్య హీనబుద్ధివగు నీచేత పుత్రునెడబాసి దుఃఖింప కుండునా? ఆ పాతకముచే ఓ గయ్యాళీ! నీవు ఇహపర లోకములు రెండింటియందు దుఃఖమును పొందెదవు సుమా! నేను వెళ్లి మా అన్నను దోడ్కొనివచ్చి ఈ సామ్రాజ్యమునకు రాజుగా జేసి వినయముతో అతని పాదముల నింపుగా సేవింతును. తరువాత పితృ కార్యములు నెరవేర్చి నేను మంచికీర్తిని పుణ్యమును పెంపొందచేసెదను. నీవట్లే నేత్రము లందు అశ్రుధారలు గ్రమ్ముచుండగా చూచుచుండుము. ఆ రామచంద్రుని పిలుచుకొని వచ్చి నిజముగా రాజ్యమునందు నిలిపి, నీవు చూచుచుండగా నేను తప్పక మునులు నివసించు నడవులకు వెళ్లెదను. కనుగొలకులందు మెదలెడి కన్నీళ్లతో

మిక్కిలి ఆపదలను బొందిన సకల జనులు చూచుచుండగా నీవు చేసిన ఆ నీచపుపని సహింపశక్యము గానిది కదా! ఇప్పుడే నీవగ్నిలో దూకుము. హోయని యరచుచు నడవులకైన బొమ్ము. ఉరిపోసికొనియైన ప్రాణములను విడువుము. ఓ పాపాత్మురాలా! నీకు వేఱొక ప్రాయశ్చిత్తము లేదు సుమా. నీ వడవులకు బంపిన గొప్పదైన పాపము పోవునట్లుగా రామచంద్రుని కడువేగముగా దోడ్కొనివచ్చి జనసంఘములు సంతసించునట్లు భూమికి రాజు నొనర్చి నేను కడు పుణ్యాత్ముడనయ్యెదను'' అని పల్కుచు నేలపైబడి అంకుశముతో పొడువబడిన యేనుగువలెను సర్పమువలెను క్రోధముతో రోజుచుండెను.



# డెబ్బది యైదవ సర్గము

**భ**రతుడు తన మేనునున్న విలువైన భూషణముల నన్నిటిని తీసి పారవైచి చినిగిన బట్టలతో భూమిపై బడిపోయెను. ఉత్సవాంతకాలము నందు వ్రాలిన ఆ యింద్రుని ధ్వజము వలె పడియుండిన అతడు కొంతసేపటికి తిరిగి లేచినవాడై నిష్ఠురములైన చూపులతో దీనురాలైయున్న తన తల్లిని చూచుచు మంత్రులతో నిట్లనెను. “ఈ యైశ్వర్యమును నేను కోరినవాడను కాను. ఇట్టి కుటిలమైన ఆలోచన చేయుమని నా తల్లిని ప్రేరేపించినవాడను కాను. రాజు తలపెట్టిన పట్టాభిషేక వార్త నేను చిన్నతమ్మునితో గూడ దూరదేశమున నుండుటచే నాకు చేరియుండలేదు. సీతాదేవియు, రాముడును దండకారణ్యమున కేగుటయు నాకేమియు తెలియదు.” అని పెద్ద పెద్ద కంఠధ్వనితో రోదనము చేయు చుండుటను విని ఆ ధ్వనినిబట్టి గ్రహించినదై కౌసల్య సుమిత్రతో నిట్లనెను.

**భరతుడు కౌసల్యను జూడబోవుట :**

వింటివా కైకేయి యొక్క మేడయందు భరతుని మాట వినిపించుచున్నది. దుష్టవర్తను రాలగు కైక యొక్క కుమారుడు సత్ప్రవర్తన గలవాడు చూడవచ్చినాడు. వానిని చూడవలెనని మనస్సునందిష్టము కలుగుచున్నది” అని పల్కుచు దీనురాలై అతని కడకు వెళ్లుటకై ప్రయత్నించెను. వివర్ణతయు, బలహీనతయు కనిపించుచుండగా ప్రాణములు వచ్చునో పోవునో యనునవస్థలోనున్న కౌసల్య భరతుడున్నచోటికి వెళ్లదలంచుచుండగా అంతలోనే భరత శత్రుఘ్నులు పరమసాధ్వియైన కౌసల్య యున్న యింటికి వచ్చి మనస్సులు కలతచెందు చుండగా శోకవేగముచేత భూమిపై సొమ్మసిల్లి పడియున్న ఆ తల్లి నాలింగనము చేసికొని దుఃఖింపగా ఆమెయు భరతుని జూచి యిట్లనెను. “సామ్రాజ్య

మంతయును అడ్డులేకుండగా ఓ భరతుడా తలపెట్టి కార్యమును సాధింపగల కైక మూలముగా క్షణములో నీకు లభించెను గదా! తలపెట్టిన కార్యమును నిర్వహించుకొనిన నీవును నీ తల్లియును ఇంక గుండెలపై చేయి నిడుకొని నిద్రపొందు. నా కుమారుని ముతక నారచీరలను గట్టించి అడవులకు బంపించి క్రూరబుద్ధితో నీ తల్లియేమి బావుకొన్నది. ఆ దుష్టురాలు నన్ను కూడ భయంకర మైన యడవులకు పంపకుండునా? అట్లైనచో విష్ణుమూర్తి యగు నా కుమారు నెడబాయక సుఖముగా నుండుదానను కదా. ఆమె పంపుటెందులకు? నేనే రాజును అన్నలతోను, సుమిత్రతోడను గలిసి రాముడున్న చోటునకు తీసికొని వెళ్లెదను. ఆతడే పితృక్రియ లాచరించును. నీ తల్లి దుష్టత్వముతో ఆర్జించిన ధనధాన్యములు, గోసంపద, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు వానితో సమృద్ధమైన ఈ భూమిని నీవే సాటిలేని రాజువై పాలింపుము" అని కౌసల్య కఠినమైన మాటలు పల్కగా..

**భరతుడు కౌసల్యతో శపథములు చేయుట :**

విని భరతుడు పుండుమీద సూది గ్రుచ్చిన విధముగా దుఃఖసముద్రమున మునుగుచు కౌసల్య యొక్క పాదముల మీద మూర్ఛిల్లి పడిపోయెను. కొంతసేపటికి తేరుకొని వినయముతో చేతులు జోడించి "తల్లీ! ఎందులకు నిందల నాడెదవు. శ్రీరామునిపై నాకు గల స్థిరభక్తి నీకు క్రొత్తయా? ఏ సంగతియు నేపాపమును నేనెఱుగను. ఇవి అబద్ధములు కావు సుమా! అన్న నడవులకు ద్రోయునంత ద్రోహచింత గలవాడనా? రాముడడవులకు వెళ్లుట కొప్పుకొన్న దుర్మార్గుడు శాస్త్రముల వలన లభించిన ప్రజ్ఞయంతయు గోల్పోవుగాక. పాపాత్ములను సేవించుగాక. దుర్బుద్ధియై సూర్యున కభిముఖముగా మలమూత్ర విసర్జనము చేసిన మూర్ఖుడు పొందు దుర్గతిని పొందుగాక! ఓ ధర్మతత్పురురాలా! తల్లీ! నిశ్చింతగా నిదురించియున్న ధేనువును తన పాదతలముచే తన్నువానికి, ప్రేమ ఉన్నటులు నటించుచు గొప్ప పనులను చేయ నియమించి తానేమియు నీయక ఊరకే సేవకుని బంపివేయువానికి ఏ గతులు కలుగునో రాముని

పోకడ తెలిసి యంగీకరించిన వాని కాగతులు కలుగుగాక! ప్రేమతో భూతసంఘములను తన కన్నబిడ్డల వలె రక్షించు రాజుపట్ల ద్రోహమును తలపెట్టు వానికి, నియమముగా ఆరవ వంతు పన్ను పుచ్చుకొనుచు ధరణిని ప్రేమతో రక్షింపని రాజునకు ఏ గతులు కలుగునో రాముని పోకడ తెలిసి యంగీకరించిన వాని కా గతులు కలుగుగాక! మంచి మాటలతో తన యొక్క యాగమున మీ కోరిక తీరునట్లుగా యింత దక్షిణ యిచ్చెదనని చెప్పి ఆ యాగము పూర్తియైన పిదప వంచెన చేసి తిరస్కరించెడివాడు పొందు దుర్గతి రాముని పోక తెలిసి యంగీకరించినవాడు పొందుగాక! తల్లీ! యేనుగులు గుఱ్ఱములు భటులు మొదలగు సైన్యములతోడను అస్త్రశస్త్రములతోడను సంకులమైన రణరంగమునందు నుండి పారిపోయివచ్చు రాజునకును, గురూపదిష్టమైన తత్త్వమును మరచిపోయిన దురాత్మునకును గలుగునట్టి దుర్గతులు రాముని పోకడ తెలిసియు అంగీకరించిన వానికి కలుగుగాక! ఓ తల్లీ! నేను రాముడడవికి పోవుట తెలిసియు అంగీకరించిన వాడనైనచో, చంద్ర సూర్యులతో సమానమైన ప్రభ కలవాడును, అందమైన రూపము గలవాడును, సింహము వంటి పరాక్రమము గలవాడును, నగు రాముడు రాజై సింహాసనము నందు ఒప్పుచుండగా చూడకపోవుదును గాక! కరుణలేనివాడై మేక (మాంసము)ను, తిలాన్నమును, పాయసమును కారణము లేకుండగా నెవ్వడు తినునో ఆ దుష్టుని గతికి ఆ శ్రీరాముని పోకడ కొప్పుకొనని చెనటి పోవుగాక! తామసముతో పెద్దలను అవమానించువానికిని, ఆవును అధికమైన క్రొవ్వెక్కి తన కాలితో స్పృశించు వానికిని, గురువుపై గర్వముతో నిందలను మోపునట్టి వానికిని కలుగు దుర్గతులు రాముడడవులకు పోవుటెఱిగియు అనుమతించిన వానిని పొందుగాక! తల్లీ! తాను మనస్సునందు నమ్మియును మిత్రుని జెరుప దలంచువాడును, తనయందలి నమ్మకముతో చెప్పిన గోప్యమైన వార్తను పలువురికి చెప్పు పురుషుడును పోవు గతిని రాముని వనగమన వార్త తెలిసియు అంగీకరించిన దురాత్ముడు పొందుగాక! మేలు చేసినవానికి తిరిగి మేలు చేయని

వాడును, చేసిన మేలును మరచిపోయిన పాపాత్ముడును, మంచివారలచేత విడువబడినవాడును, సిగ్గువిడచిన దుష్టాత్ముడును, లోకమునకు విరోధి యయ్యును కలతచెందని వాడును, భార్యయు, బిడ్డలును, సేవకులు నున్న గృహమందుండి తానొక్కడే మంచి ఆహారమును తినెడు గొప్ప పాపాత్ముడును, తనకు జోడైన భార్యను చేసికొనక సంతతిలేక చచ్చునట్టివాడును ధర్మబద్ధములైన కార్యములు చేయనివాడును పొందు దుర్గతులను నాకు మున్నే రాముని పోక తెలిసియున్నచో పొందుదును గాక! రామచంద్రుడు వనములకు వెళ్లుట తెలిసి సమ్మతించినట్టి అధముడు తన భార్య కడుపున తనయులను పొందక అలమటించుచు, అర్ధాయుష్కుడై పరలోకమునకు వెళ్లువాడగుగాక! వృద్ధులను, బాలురను, రాజు భార్యలను చంపిన వచ్చు పాపమును సేవకుల విడచిన వాని పాపమును పొందువాడగును! శ్రీరాముడడవులకు వెళ్లుట యెఱిగిన పాపాత్ముడు, కల్లును, లక్కను, ఉప్పును, విషమును, లోహమును, మాంసమును విక్రయించి తాను పోషింపవలసిన వారిని పోషించువాడు పొందు గతిని పొందుగాక! ఘోరమైన యుద్ధమునుండి పారిపోయెడి పిరికివానిని పట్టుకొని చంపునట్లుగా శ్రీరామచంద్రుని పోక నొప్పికొన్నచో నన్ను చంపదగును తల్లీ! రాముని వంచించినవాడు చేతియందు పుఱ్ఱెను బట్టుకొని చినిగిన బట్టలను గట్టి వెఱ్ఱివానివలె భిక్షాటనము చేయుచు భూమియందు దిరుగు దేశద్రిమ్మరి యగును మఱియు నట్టివాడు మద్యపానము చేయుచు, ద్యూతపరుడై స్త్రీ వ్యసనము గలవాడు ఎల్లప్పుడు కామక్రోధములకు వశుడగును. వానియొక్క ధర్మబుద్ధి నశించు గాక! ఎప్పుడును అధర్మబుద్ధి కలుగుచుండుగాక! వాడు సంపాదించి దాచిన ధనమంతయు దొంగలు దోచుకొనిపోవుదురుగాక! శ్రీరాముని యందు ద్రోహచింత చేసిన పాపాత్ముడీ గతులు తప్పక పొందుగాక! సూర్యుడుదయించునప్పుడును, సూర్యుడస్తమించుచున్నప్పుడును నిద్రను జెందు జనుడే పాపమును బొందునో జానకీనాథుని యెడల ద్రోహము తలపెట్టిన ద్రోహిట్టి పాపమున బడుగాక! గురువు యొక్క భార్యను పొందిన నీచమైన

బుద్ధి గలవాని కేపాపము గల్గునో, ఇండ్లకు నిప్పుబెట్టిన వాని కే పాపము గల్గునో, మిత్రులను వంచించుట వలన నేపాపము గల్గునో ఆ మహాపాపము సీతాపతిని మోసముతో అడవులలో బాధనొందజేసిన ద్రోహికి సంభవించుగాక! పవిత్రమైన మనస్సుతో దేవతలకును, పితృదేవతలకును, తండ్రికిని సేవచేయని వాడు పొందు పాపమును సీతానాథుని యెడ ద్రోహము తలపెట్టిన వాడు పొందునుగాక! రాముని యొక్క వనవాసమున కిష్టపడినచో చాలమంది బిడ్డలు గలవాడును, పేదవాడును, ఎల్లప్పుడు జ్వరముచే బాధపడువాడును, ఎల్లప్పుడు ఎక్కువైన కష్టములకు చిక్కి బాధపడువాడును అగును. రాముని యొక్క పోకను తెలిసి యనుమతించినవాడు, చేతులొగ్గి నుతులు చేయుచు కళ్లను పైకెత్తి ఆశచే దీనముగా వేడుకొనుచున్న వాని యొక్క ఆశను వ్యర్థము చేయువాడగు నమ్మా! సాటిలేని సత్య ధర్మముల యందనురక్తులైన మహాత్ములతోడి స్నేహమును, సజ్జనులచేత నుతింపబడు కీర్తియు, మంచివారికి చేసిన సత్కారమును రామునడవికి బంపిన పాపజాతివాని కీ క్షణముననే విడచిపోవు గాక! అట్టివాడు తల్లికి శ్రద్ధగా సేవ చేయక యనర్థకారి యగుగాక! మాయలను చేయువాడును, అతితెలివిగా మాటలాడువాడును, దోషములు చేయువాడును, న్యాయము తప్పి చరించి రాజునకు భయపడువాడును, లోభియు, ఋతుస్నాతయైన రోజున భార్య దగ్గరనుండియు కలియని దుష్టాత్ముడును అగును రామునడవులకు వెళ్లుట కనుమతించి దుష్టుడు. తన ధర్మపత్నిని పొందకుండ, పరుల భార్యలను పొందువాడగును. అధర్మ రతి యతనికి స్థిరమగును గాక! అన్నము నీళ్లు నీయక తన బిడ్డలను చంపునట్టి బ్రాహ్మణుడును, చిన్న దూడలు గల యావుల పాలు పిదుకు దుష్టుడును, బ్రాహ్మణుల కిచ్చిన దానము నపహరించువాడును పొందు పాపమును రామునకు దుఃఖమును గలిగించినవాడు పొందు సుమా! ఓ జననీ! ఏ దుష్టుడు శ్రీరాముని వనవాస కారణమున మిగుల కష్టములపాలు చేసెనో వాడు నీటిని కలుషమొనర్చిన వాడును, విషమును పెట్టిన వాడును పొందు పాపములను పొందుగాక! తల్లీ! నీ ప్రియపుత్రుని పోకకు ఒప్పుకొన్న

వాడు దాహముతో నీళ్లను కోరగా ఇంటియందు మంచినీరు కలిగియుండియు ఈయక ఏవో యుపాయములతో వెడలుమనిన మోసగాడును అట్టివానికి వెదకి ఉప్పునీటి నిచ్చువాడును పోవు ఆ నరకమును పొందును. జానకీనాథుని యెడల పాపచింతనము చేసినవారు పొందు గతి, తగవులలో ఇరువురికి తాను మధ్యవర్తిగా నుండి స్నేహముచేత అందొక్కనికి జయము కల్గునట్లు చేయువాని గతియే యగుగాక.”

**కౌసల్య భరతు నూరార్చుట :**

అని యిట్లు భర్తలేనిదియు, పుత్రు నెడబాసినదియునై దుఃఖించుచున్న తల్లిని గొప్పనైన శపథములచేత ఊరడించుచు దుఃఖ మధికమగుటచే చప్పున నేలమీద పడిపోగా, కౌసల్యయు ఆ కుమారుని చూచి యిట్లనెను. “తండ్రీ! ఎంతటి ప్రమాణములను చేసితివి. నిన్ను చూడగా అధికమగు సంతాపము కల్గుచున్నది. నా పుత్రుని యొక్క వియోగముచే తపించుచున్న నా మనస్సును నీ వాక్కుల సమూహములచే నొప్పించియును ఓ తనయా! నా ప్రాణములను నిలబెట్టినాడవు గదా! నీవు కూడ తమ్ముడగు లక్ష్మణుని వలెనే అన్న యెడల ధర్మమును వీడకున్నావు. ఇది యదృష్టము. ఓ పుత్రకా! సత్య ప్రతిజ్ఞుడవై ప్రకాశింపుము. సజ్జనులు వెళ్లెడి స్థిరమైన లోకమునందుము” అని పల్కుచు అతని నొడిజేర్చి కౌగలించుకొని దుఃఖముతో దీనురాలై హోయని ఏడ్చెను. ఈ మాదిరిగా శోకముతో కూడిన విచారముతో మూర్ఛలనంది నేలపై పడిపోవుచు ఎక్కువగా వేడి నిట్టూర్పులను వడిగా విడచుచు, వగర్చుచు తల్లడిల్లుచుండగా రాత్రియు గడచిపోయెను.



# డెబ్బది యాఱవ సర్గము

**భరతుడు తండ్రి శవమును జూచి యేడ్చుట :**

ఈ విధముగా తెల్లవారగానే వసిష్ఠుడు వచ్చి కైక పుత్రుని జూచి మిక్కిలి ప్రేమతో యిట్లనెను. "అన్నా! దుఃఖింపకుము. నీ వీ ప్రకారముగా ఏడ్చుచున్నందుల కేమైనను ఫలమున్నదా? ఓ రాజపుత్రా! నీ తండ్రి కంత్యక్రియలు తీర్చుట విధి కాన ఆ కార్యమును నిర్వహింపుము" అని చెప్పగా భరతుడును ధైర్యమును తెచ్చుకొని శాస్త్ర ప్రకారముగా తన తండ్రికి ఔర్ధ్వ దైహికములను జేయదలంచి రాజు యొక్క నిద్రపోవుచున్నట్లున్నదియు పచ్చని వర్ణము గలదియునగు దేహమును అనేక రత్నములచే నలంకరింపబడిన బంగారపు శయ్యయందుంచినవాడై కైకేయీపుత్రుడు ఎక్కువయిన దుఃఖముతో ఆరాటమును బొందుచు అనేక విధములుగా నేడ్చుచుండెను. "రాజేంద్రా! అట్లు ఊరు విడచి దూరముగా నున్న నేను రాకమునుపే ధర్మనిరతుడైన రామచంద్రుని గొప్ప శౌర్యము గలిగిన సౌమిత్రిని ఏ కారణముచేత అడవులకు బంపితివి? ఆ సీతానాథుని నన్నును ఎడబాసి ఈ ప్రకారముగా ఎక్కడకు వెళ్లితివో గదా. అయ్యో! తండ్రీ! ఎట్లు దుఃఖింతును? అనుపమానమైన మంచి నడవడి గలవాడగు సీతానాథుడు విడచి వెళ్లుటచే అనేక విధములుగా యేడ్చుచున్న యిచ్చటి ప్రజలను నన్నును చూడుము తండ్రీ! రామచంద్రు డడవులకు వెళ్లగా నీవు స్వర్గధామమును చేరగా ఇంక తగిన విధముగా ఈ

ప్రజల యొక్క యోగక్షేమముల నెవ్వరు చూచెదరు? ఓ రాజా! రాజువైన నీవు లేకున్నచో ఈ రాష్ట్రము అనాథయగును. చంద్రుడులేని రాత్రివలె నీ యయోధ్యా పట్టణము ప్రకాశింపదు గదా మహాత్మా!"

**భరతుడు దశరథునకు ఉత్తర క్రియలు చేయుట :**

అని తలచి తలచి యేడ్చుచున్న భరతునితో వసిష్ఠుడిట్లనెను. "ఓ బుద్ధిమంతుడవైన భరతా! విచారమును మాని నీ యొక్క తండ్రికి చేయవలసిన ప్రేతకార్యమును జరిగింపుము" అనగానే అట్లే యగుగాక యని భరతుడు ఆచార్యుని ఋత్విజులను పురోహితులను పిలిపింపుడనగా ఇంటి బయటకు రాజును అగ్నిహోత్రమును యథావిధిగా దెచ్చి పవిత్రులైన యాజకులును ఋత్విజులును అంతట రాజు యొక్క శవమును శిబిక మీదకు చేర్చిరి. కనులవెంట బాష్పములు గురియుచు పరిచారకులు మోయుచుండ మార్గమందు వెండి బంగారములను చల్లుచు వస్త్రములను బాటలందు పరచుచు జనులు కొందఱు ముందు వెడలుచుండిరి. మఱికొందఱు చందనము, అగరు, సువాసన కల కస్తూరి, గుగ్గిలము ధూపములను వేయుచుండగా చందనము మొదలగు సుగంధవంతము లైన కఱ్ఱలచే పేర్చబడిన చితిమీద రాజు యొక్క శవమును చేర్చి ఋత్విక్కులు మంత్రయుక్త ముగా భరతునిచేత రాజు యొక్క చితికి అగ్నిని ముట్టింపజేసి, సామవేద మంత్రములు చదువుచుండిరి. అప్పుడు రాజు యొక్క భార్యలు పల్లకీలపై నెక్కి వృద్ధస్త్రీలతో గూడి పురము వెడలి భరతుడు మొదలగు వారున్నచోటికి వచ్చిరి. కౌసల్య మొదలగు స్త్రీలందరును రాజునకు సవ్యాపసవ్యముగా ప్రదక్షిణము చేసిరి. వారందఱు మిగుల దుఃఖముతో విలపించుచుండ ఒక్క మాఱుగా కీడుమూడిన వేలకొలది ఆడ క్రౌంచపక్షు

లాక్రోశించినట్లు గరుణరసభూయిష్టముగా శ్రోత వినిపించెను. విడువక శోకించుచు పల్లకీలలో సరయూ తీరమును చేరి ఆ రాజు భార్యలు పురోహితులును మంత్రులును తామును పుత్రునితోపాటు నదిలో స్నానములు చేసి జలంబులను విడచి కన్నుల నీరు గారుచుండగా పురము ప్రవేశించి భూమిపై శయనించుచు పదిరోజులును యథావిధిగా సూతకమును వెళ్లబుచ్చిరి.



# డెబ్బది యేడవ సర్గము

పదునొకండవ దినమున భరతుడు మైలను విడచినవాడై పండ్రెండవ దినమున శ్రార్థకర్మలన్నింటిని జరిపించి బ్రాహ్మణుల కమితమైన ధనమును రత్నములను, భోజ్యములను, విలువగల వస్త్రములను, తెల్లని మేకలను, నూర్లకొలదిగా ఆవులను, దాసదాసీ జనములను, వాహనములను, ఇండ్లను, అనేక విధములైన దానములను భరతుడు తన తండ్రిని గురించి చేసెను. తరువాత పదమూడవ దినమున రాజపుత్రుడు అస్థులను గ్రహించుట కొఱకై వచ్చి, గట్టిగా రోదించుచు చితి దగ్గరకు వచ్చి గద్గద కంఠముతో విలపించెను. "నన్ను మా అన్నయైన రామచంద్రుని చేతుల కప్పగించితివి. సజ్జన స్తుతుడైన ఆ రాముడు వనములకు వెళ్ళుటచేత నన్ను ఆశ్రయము లేనివానినిగా చేసితివా తండ్రీ! ఉన్న ఒక్క కుమారుని భయంకరమైన అడవులకు బంపుటచే అనాథయై యేడ్చుచున్న నీ భార్యయైన కౌసల్యను విడచి ప్రియము హితమునైన చరిత్ర గలవాడా ఎచ్చటికి వెళ్ళితివయ్యా!" అనుచు కాలుటచే నెఱ్ఱబడి, ఎక్కువైన బూడిదలో కప్పబడియున్న తండ్రి అస్థికలను జూచి తండ్రిని తలంచుచు పనవి పనవి విలపించుచు మూర్ఛిల్లి నేలపై బడెను. ప్రక్కనున్న వారు పట్టి యెత్తినను కట్టుసడలిన యింద్రధ్వజమువలె తిరిగి పడిపోయెను. స్వర్గము నుండి పడిపోయిన యయాతిని ఋషులందఱునువలె భరతుని చుట్టును మంత్రు లందఱు గుమికూడిరి. అట్లు భరతుడు నేలమీద పడగానే శత్రుఘ్నుడు తండ్రి యొక్క గుణగణములను తలంచుచు సంతాప భారముచేత తెలివితప్పినవాడై పిచ్చి యెత్తినవానివలె యుండి తండ్రి గుణములను తలపోసి తలపోసి మనస్సు కలత చెందుచుండగా నిట్లు విలపించెను. "మంథరా ప్రబోధముచేత పుట్టినదియు, కైకేయి యనెడు మొసలి గలదియు, వరములనిచ్చుటయను గొప్పవైన అలలచేత గొట్టబడుచున్నదియు అగు గొప్ప శోకమను సముద్రమున మమ్ము ముంచివేసి వెళ్లితివా తండ్రీ! చిన్న బాలుడును సుకుమారుడును ఎల్లప్పుడు నీచేత లాలింప బడువాడును నగు భరతుని విడచి వెళ్లుటకు నీకు మనస్సెట్లు ఒప్పినదో గదా తండ్రీ! ఓ పుణ్యచరిత్రా! ఇక నెవ్వరయ్యా మమ్ములను బుజ్జగించి మేము

కోరినవి యిచ్చువారలు. మేము కోరిన భోజ్యములు గాని పానీయములు గాని ఇవిగో తీసికొనుడని ఇచ్చువారెవ్వరయ్యా తండ్రీ! మంచి వలువలను విలువగల భూషణములను, మమ్ములను పిలిచి యిక నెవ్వడిచ్చునయ్యా! తగిన బుద్ధులను జెప్పి హితములను బోధించి మమ్మెవ్వరు మంచి మార్గమున నడిపింతురు? తొడమీద కూర్చుండబెట్టుకొని బుగ్గలను పుణికి ముద్దుపెట్టుకొనుచు ఆదరముతో గారాబము చేయువాడెవ్వడు? నిన్ను విడచి చెడక నిలిచిన ఈ భూమి యెంత గట్టిదో గదా. ఇది ప్రళయకాలమున గూడ చెడిపోదు. ఇది కావలెనా కుమారా యిది కావలెనా యనుచు నీ విధముగా సంతోషముతో బలవంతముగా యేది కావలెనన్నను ఇచ్చువారెవ్వరు? తండ్రి స్వర్గమునకు వెళ్ళెనట సచ్చరిత్రుడైన రాము డడవిదారి బట్టెనట. ఇక శరీరమున ప్రాణములు నిల్పశక్యమా? వారు లేనట్టి అయోధ్యలో ప్రవేశించుటకు మనసొప్పుటలేదు. అడవులకైనను వెళ్లెదను. లేక అగ్నిలోనైన బడిపోయెదను." అని ఈ ప్రకారముగా అన్నదమ్ము లిద్దఱును విలపించుచు, కొమ్ములు విరిగిన లేగదూడలవలె నేలపై బడిరి. వారిని జూచి చుట్టునున్న వారందరు విచారించుచుండగా వేదాంతియైన వసిష్ఠమౌని దగ్గఱకు వచ్చి భరతుని జూచి యిట్లనెను. "భరతా! పదమూడవ నాడు చేయవలసిన కార్యమును జరిగించక వృథా కాలయాపనము చేయ తగునా? మిగిలిన అస్థిసంచయనము సాంతముగా జేయవలయును. అదియు గాక ఆకలియును, దప్పియును, శోకమును, మోహమును, ముసలితనమును మరణమును అను ఈ ఆరింటిని (ఇరు మూటిని) తప్పించుకొనుట కెవడు శక్తుడు? తప్పించుకొనలేని దానిని గూర్చి శోకించుట తగునా?" అని పలుకుచుండగా అంత సుమంత్రుడు భరతుని తమ్ముడగు శత్రుఘ్నుని యొద్దకు వెళ్లి లేవనెత్తి అతనికి సర్వప్రాణులకు పుట్టుట గిట్టుట సహజమని చెప్పి యూరడించెను. అంతట వారిరువురును వానకు ఎండకును వడలిపోయిన యింద్రధ్వజముల వలె గన్పించుచు విడువక కన్నులవెంట బాష్పధారలు గురియుచున్నను వారి యొక్క మంత్రులను దీనముగా తక్కిన కార్యములను పూర్తి చేయుడని తొందరించి వేగముగా యథావిధిగా సమస్త క్రియా కలాపమును పూర్తిచేసిరి.

# డెబ్బది యెనిమిదవ సర్గము

## శత్రుఘ్నుడు భరతు నూరార్చి మంథరను తన్నుట :

అందఱును తమ యిండ్లకు వెళ్లగా భరతుడు రఘురాముని జూచు కోరికతో అప్పుడే దండకారణ్యమునకు పోవలెనని తలంచుచుండగా శత్రుఘ్నుడు నిర్వేదముతో నిట్లనెను. "ఏదారియులేక విచారించు భూతసంఘము నకు ఎప్పుడును గతియై పాలించు వాడెవ్వడో అతడే నీకును ఆధారమగునని వేరుగా చెప్పవలెనా? మనకే అననేల? రామభద్రుడు సమస్తమైన భూతజాలము నకు నూతకఱ్ఱగా గలవాడుగదా! అధికమైన బలము గలవాడయ్యును, అసమర్థునివలె ఆడుది వెళ్లుమనగానే అడవికి వెళ్లెను. ఔరౌరా! నివారింపరాని పరాక్రమము గల లక్ష్మణుడు కూడ తండ్రి నట్లుండుమని పలుకక రాము డరణ్యములకు వెళ్లుట కెట్లొప్పుకొనెనో గదా! ఆడుది ఆడించినట్లుగా ఆడి తప్పుత్రోవను పోవుచున్నవానిని ముందుగా తానే తప్పొప్పులను విచారించి దండింపవలదా? తండ్రియని ఆలోచింపవచ్చునా?" అని శత్రుఘ్నుడు చెప్పు చుండగా తూర్పు ద్వారమునందు శరీరమున చందన మలంది, పుష్పములను ధరించి, రాజులు ధరించు వస్త్రములు గట్టి మణులు పొదిగిన బంగారపు టాభరణములు దాల్చి నడుమున వడ్డాణము ప్రకాశించుచుండగా త్రాటిచే గట్టబడిన కోతివలె మందర వచ్చుచుండగా దాని నా ద్వారపాలకులు పట్టుకొని ఆ దయలేని దానిని శత్రుఘ్నుని యెదుట నిల్పి "ఈ దుష్టురాలిచేతనే యింతలు పుట్టెననియు, దీనివలననే యీ కష్టములు వచ్చెననియు, రాముని నడవులకు బంపుటయును, రాజు స్వర్గమునకు వెళ్లుటయు దీనివలననే యనియు, దీనిని నీ యిష్టమెట్లో అట్లొనరింపు మనియు పలుకగా సుమిత్రా నందనుడు మిక్కిలి మండిపడి ఇంతకు మూల మీ చెడుగు దాదియేయను మాట చెవిని బడగానే మనసునందు సంతోషమునంది అచ్చట నున్నవారందరిని జూచి "రాజును

నాసహోదరులను కష్టముల బెట్టిన ఈ రాక్షసిని, ఈ దుష్ట చింతన గలదానిని ఇప్పుడే తగిన ఫలమనుభవింప జేసెదను చూచుచుండుడు" అనగా సేవకులు సఖీజనులలో నున్న ఆ దుర్మార్గురాలగు కుబ్జను బలాత్కారముగా పట్టుకొనగా అది ఆ భవనమంతయు మారుమ్రోగునట్లేడ్చుచుండ శత్రుఘ్నుడు కోపముతో దానినిబట్టి నేలమీద పడ 'కీక్కు' మనునట్లు తన్నగా ఆ దురాత్మురాలు హోయని యేడ్చు చుండగా నేలమీద దానిని వేగముగా ఈడ్చెను. దానిని చూచి అక్కడనున్న సేవకులందఱు ఎక్కువైన కోపముతో నున్న ఆ శత్రుఘ్నుని చూచి మూలకొక్కెతగా కంపితాంగులై దాగ బోవుచు ఒకళ్ల నొకళ్లు చూచుకొనుచు అందఱును ఈతని వరుస చూడగా సమూలముగా అందఱను చంపునట్లున్నాడు. దయావతియు, స్వచ్ఛమైన ధర్మము ననుసరించి నడచునదియు అగు కౌసల్యను నిండు మనస్సుతో ఈ గండమును గడపుమని వేడుటయే మంచిదని ఆమె యొద్దకు పరువెత్తిరి. ఆ రాజపుత్రుడు మంథర మొఱ్ఱోయని గోలపెట్టు చుండగా నేలమీద పడవేసి ఈడ్చుచుండగా అది ధరించిన సొమ్ములు చుట్టును రాలుటచే ఆ యింటిని చుక్కలతో నిండిన శరత్కాలపు టాకాశము వలె నొనరించెను. తన ప్రియమైన దాసిపై దయతో కైక అడ్డము వెళ్లగా శత్రుఘ్నుడామెను కూడ కోపముతో తిట్టెను. క్రూరమైన మాటలతో తిట్టియు, దిమ్మెత్తునట్లుగా కాలితో వేగముగా తన్నబోగా ఎక్కువైన భయముతో కైకేయి తన పుత్రుని శరణు కోరగా అతడు గొప్ప ఆగ్రహము పూనియున్న సుమిత్రానందనుని జూచి "యీ దుష్టురాలిని క్షమింపుమయ్యా! తమ్ముడా! ఎల్లజీవుల యందును స్త్రీలు వధింపదగనివారు గదా. తల్లిని చంపిన వాడనని నన్ను అనఘుడైన రాముడు నా ముఖమును చూడడని భయము మనస్సున కలుగుటచేత ఈ దుర్మార్గురాలైన కైకేయిని ఈ భూమికి బలిచేయక విడచిపెట్టితిని. చెడుదైన ఈ కుబ్జను మనము చంపినట్లైన కోపమును బొందినవాడై అతడు ముఖమును పైకెత్తి మనతో ఎందులకు మాటాడును? ఇది నిజము సుమా" అని చెప్పుచున్న భరతుని మాటలను విన్నవాడై శత్రుఘ్నుడు వెంటనే కుబ్జను విడిచిపెట్టెను. అది కాళ్లపైబడి యేడ్వగా కైక వలలో దగుల్కొనిన క్రౌంచపక్షి వలె విలపించుచున్న దాని నూరడించెను.

# డెబ్బది తొమ్మిదవ సర్గము

**రాజకర్తలు భరతుని పట్టాభిషేకము చేసికొమ్మని ప్రార్థించుట :**

పదునాల్గవ నాటి యుదయమున రాజ కార్యనిర్వాహకులు భరతుని జూచి యిట్లనిరి. “మీ తండ్రియైన దశరథ మహారాజు తన జ్యేష్ఠపుత్రుడైన రాముని, లక్ష్మణుని వనవాసులుగా జేసి తాను వెంటనే స్వర్గమున కేగెను. ఓ రాజపుత్రా! నీవిప్పుడే మాకు రాజువగుము. దైవయోగముచేత ఈ యరాజక రాజ్యమింత వఱకు వికలము కాలేదు. కావలసిన అభిషేక వస్తువులను సమకూర్చి పౌరులును మంత్రులును ఇదిగో ఎదురుచూచుచున్నారు. నీ తండ్రి తాతలు పాలించిన యెక్కువైన వైభవముగల ఈ రాజ్యము నంతయు స్వీకరించి మమ్మందఱను పాలింపుము” అనగానే భక్తితో అభిషేకమునకు తెచ్చిన మంచి వస్తువులకు ప్రదక్షిణము చేసి భక్తితో తనను ప్రార్థించుచున్న అందఱను పరమ ప్రీతితో చూచుచు రాజపుత్రుడిట్లనెను. “ఓ పౌరులారా! వినుడు మా వంశమునందు పెద్దవాడే రాజ్యలక్ష్మికి అర్హుడు. నన్ను రాజుగా నుండుమనుట మీకు న్యాయముగ నున్నదా? మా అన్నగారైన రామచంద్రుని రాజుగా జేసి నేను పదునాల్గు సంవత్సరములును వనములలో నివసించెదను. ఇది నిజము. మా అన్నయైన శ్రీరాముని తిరిగి తీసికొని వచ్చెదను. అన్నియును సమకూర్చి పట్టుకొని వెళ్లుదము. సకల సైన్యములను సిద్ధపరుపుడు. అభిషేకమునకు గావలసిన వస్తువులను ముందుగా పట్టుకొని వెళ్లుదము. అందఱును బయలుదేరుడు. రామునకు అరణ్యమునందే పట్టాభిషేకమును సంతసముతో చేసెదను.

యజ్ఞమునకు తెచ్చు అగ్నిని వలె భూతనయాపతిని పట్టాభిషేకముతో రాజుగా జేసి తీసికొని వచ్చెదను. జనులారా! ఇది నిజము సుండీ! పేరునకు మాత్రము నా తల్లియైన పిచ్చి కైక యొక్క కోరిక దీర్చవలెనని నేను కోరను సుమా! భూభారము నన్నగారి కప్పగించి యిచటికి దెచ్చి నేను వననివాసము చేసెదను. దారులలో అడ్డులేకుండ ఎత్తుపల్లములు లేకుండ చేయుటకు శిల్పులను, దుర్గవేత్తలను పంపించుడు" అని పలుకగా వారందఱును ఆనంద బాష్పములతో నిండిన కన్నులతో రాజపుత్రుని జూచి మంచి మాటలతో నిట్లనిరి. "అన్న గారికి పనిగట్టుకొని రాజ్యము నిచ్చుటకు మదిలో తలంచిన నీ యాలోచన చాలా గొప్పది. దానిచే శ్రీదేవి నిన్ను వీడకయుండి నీకు ఎల్లప్పుడు ఆనందమును కలుగజేయు గాక. ఓ రాజచంద్రా! నీ ఆజ్ఞ ప్రకారముగా ఎన్నికైన శిల్పులను దారులను బాగుచేయువారలను రాజునందు భక్తిగలవారిని ఇప్పుడే పంపితిమని చెప్పి వారందరును పనులు నెరవేర్చుటకు వెళ్లిరి.



# ఎనుబదియవ సర్గము

**పౌరులు వనమార్గమును చక్కబఱుచుట :**

అంతట వనమార్గములు తెలిసినవారును భూమిని త్రవ్వువారును, మార్గము లెట్లు ఏర్పరుపవలెనో త్రాళ్లను గట్టి సూచించువారును, మంచి శక్తి కలవారగు కమ్మరులు వడ్రంగులు కొయ్యపనిముట్లు చేయువారును కూలివారును మేదరులును, నూతులను త్రవ్వువారును దగ్గర నుండి పనులను చేయించు వారును, మార్గములను జూపించువారును మొదలుగా గల నేర్పరులగు పనివాండ్రు పున్నమరాత్రియందు సముద్రము పొంగు విధముగా ముందుగా వెళ్లిరి. వారందఱు కష్టపడుదుమోయని తలంచక, శ్రమయనుకొనక, రామచంద్రుని చూచెదమను సంతోషముచే తమంత తాముగా తమ తమ పనిముట్లను తీసికొని గుంపులు గుంపులుగా బయలుదేరిరి. ముందుగా ముండ్లను రాళ్లను లేకుండగా తుడిచివేసి, త్రోవకడ్డముగా నున్న చెట్లను కొట్టివేయుచు గోతులను పూడ్చివేయుచు, లేనిచోట దారిప్రక్కను చెట్లను పాతుచు, గండ్రగొడ్డళ్లతోను కత్తులతోను నేర్పుతో పొదలను కొట్టివేయుచు, చక్కగా బండ్లు వెళ్లుటకు వీలుగా మార్గమును తయారుచేయుచు, కొంతమంది వెడలిరి. మఱికొందఱు ప్రవేశించుటకు వీలుకాని భయంకరమైన అడవులను భగభగమను మంటలచే దగులబెట్టిరి. కొంతమంది వేగముగా ఎత్తుగానున్న దిబ్బలను పల్లములను సమముగా జేసిరి. పెద్ద పెద్ద గుంటలను కొందఱు పూడ్చివేసిరి. కాలువలమీద అవసరమైన చోట్ల వంతెనలను గట్టిరి. రాళ్లతో నున్న నేలలను రాళ్లుకొట్టి చదును చేసిరి. ఎక్కువ నీరున్న చెఱువు కట్టలను నఱికిరి. కొంతమంది కొండలమీది నుండి వచ్చుచున్న వాగులను అడ్డకట్టలు

కట్టి సముద్రములవంటి పెద్ద జలాశయములను చేసిరి. నీళ్లులేనిచోట్ల గడియలో చెఱువులను త్రవ్విరి. గారపూతలతో నునుపైన అరుగులను నిర్మించి, కొలనులలో పూలచెట్లను, మధుర స్వరములను, పక్షులను, జెండాలను కల్పించిరి. విడిది చేయుచోట్లలో వివిధములగు పుష్పములతో నలంకరించి, చందన గంధము గల నీటిని మార్గమువెంట చల్లిరి. ఆ సేన వెళ్లు మార్గము దేవలోకమునకు వెడలు త్రోవయా యనునట్లొప్పుచుండెను. భరతుని యాజ్ఞ ననుసరించి నియమింపబడిన యధికారులు అచ్చటచ్చట భరతుడు నిలుచుటకు గా నుచితమైన విధముగా డేరాలను నిర్మించి ప్రశస్తముగా నలంకరించిరి. పూర్వము దుమ్ముతోను, రాళ్లతోను, ముండ్లతోను నిండియున్న దారులు ఇండ్లతోను, మేడలతోను ఇంద్రుని యమరావతి వలె ప్రకాశించు వీధులతోను ఒప్పు చుండెను. ప్రాకారములతోడను, ఆకాశమునంటుచున్న బురుజులతోడను విమానములమీది పావురములతోను, క్రొత్తగా కట్టబడిన ఇంద్ర పట్టణమా యనునట్లుగా జాహ్నవీ నదీతీరము ప్రకాశించెను. ఆ త్రోవ చంద్రుడు, నక్షత్రముల సముదాయము గల ఆకాశమార్గము వలె శిల్పులచే కట్టబడిన యా త్రోవ అందమై యొప్పెను. శ్రీరాముని తీసికొనివచ్చుటయను శుభ నిర్ణయము చేయబడిన యా రాత్రి సంతోషముతో గడవగా..



# ఎనుబది యొకటవ సర్గము

**సూ**తులును మాగధులును స్తోత్రములు చేయుచు, తమకు శ్రేయస్సు కలుగజేయు మాటలను చదువుచుండగా జాము జామునకు మ్రోగు దుందుభులు నాల్గుమూలలను మ్రోగుచుండగా శంఖములు ధ్వనించుచుండగా భరతుడు మేలుకాంచినవాడై, విపరీతమగు దుఃఖమును పొందినవాడై "నేను రాజును గాను. నాకివియన్నియు నెందులకు? చాలింపుడు" అని చెప్పి శత్రుఘ్నుని చూచి "చూచితివా తమ్ముడా! కైకేయి జగత్తుకంతకును అపకారము చేసినది. నన్ను భరింపరాని దుఃఖమును పొందునట్లు చేసి దశరథుడు వెళ్లిపోయెను. ఈ రాజ్యలక్ష్మి చుక్కానిబట్టి నడపు కర్ణధారుడు లేని పడవయో యనునట్లు తల్లడిల్లుచున్నది. మనకందఱకును దిక్కైన ఉత్తముడైన రాముని నా తల్లి యన్యాయపరురాలై యడవులకు బంపించెను. ఇటువంటి విపరీతమయిన పనికి ఏమని ఏడ్తును." అని ఏడ్వగా అంతఃపుర స్త్రీలందఱును విలపించు చుండగా వసిష్ఠుడు మిక్కిలి విలువగల ఉత్తమ రత్నములతో నొప్పుచున్న కొల్వుకూటమును శిష్య సమూహము సేవించుచుండగా ప్రవేశించి బంగారముతో చేయబడిన అందమైన పీఠముపై గూర్చుండి సేవకులను జూచి "బ్రాహ్మణులను మంత్రులను పెద్దలైన వారలను పిలువుడు. అత్యవసరమయిన పని యొకటి గలదు. రాజపుత్రులగు భరత శత్రుఘ్నులను మనకు హితమును సూచించు విజయుని సుమంత్రుని కూడ పిలువుడు." అని చెప్పగా వారలు అట్లే పిలిచిరి. అంత హలహలమను ధ్వనులతో అశ్వములు రథములు మొదలగు వాహనములనెక్కి వచ్చిరి. వచ్చుచున్న భరతుని జూచి దేవవిభుడైన యింద్రుని స్వర్గవాసులవలె ఎదురువచ్చి మునుపు దశరథుని నిర్మలబుద్ధితో కొలుచునట్లు అందఱు కొలుచుచుండగా తిమి తిమింగిలములు గలిగి చలనములేని యుదకము గలిగి రత్నములు శంఖములు గల యిసుక గలిగి బుప్పెడి సరోవరము వలె ఆ సభ భరతునిచే పూర్వము దశరథ మహారాజుచేత వలె మిక్కిలి ప్రకాశించెను.

# ఎనుబది రెండవ సర్గము

## వసిష్ఠుడు భరతుని పట్టాభిషేకము చేసికొమ్మని చెప్పుట :

పెద్దవారలతోను పౌరులతోను నిండియున్న ఆ సభలో ఉచితములైన యాసనములం దందఱను గూర్చుండ నియమించి భరతుడును కూర్చొని యుండగా మంచి వస్త్రములతోను, విలువైన అలంకారములతోను, చందనము మొదలయిన లేపనములతోను ఒప్పుచున్న పౌరులతో నిండిన ఆ సభ పూర్ణచంద్రునితో నొప్పుచున్న శరత్కాల రాత్రివలె అలరుచుండెను. అంత ధర్మవిదుడగు వసిష్ఠుడు లేచి అందఱను కనుంగొని కైక కుమారునితో నిట్లనెను. "కుమారా! నీ తండ్రి ధర్మపద్ధతిగా రాజ్యమునేలి ధనధాన్యములతో నిండియున్న భూమి నంతయు నీ కిచ్చి స్వర్గమున కేగెను. సత్యమును నమ్మినవాడై మంచివారు చేయు ధర్మ పద్ధతిని దలంచి రామచంద్రుడు తండ్రి యాజ్ఞను తీర్చుటకై అడవులకు వెళ్లెను. చంద్రుడు వెన్నెలను విడువలేనట్లతడును ధర్మమునెన్నడు వీడనివాడు. తండ్రి చేతను, అన్న చేతను ప్రదత్తమైన భూతలమును అకంటకమైన దానిని స్వీకరింపుము. రాజ్యాభిషేకమును వెంటనే చేసికొనుము. నీ మంత్రులందఱును, మిక్కిలి సంతుష్టులైన ఈ భూమి నాల్గుచెరగులనున్న రాజులును నీ యందలి యనురాగముతో కుతూహలముతో నీకు వివిధములైన కానుకలను సమర్పింతురు" అని పలుకగా విని గొప్ప దుఃఖముతో తన వంశము యొక్క ధర్మమును తలంచుచు రామచంద్రుని తలంచి గద్గదకంఠముతో భరతుడు కలహంస స్వరముతో ఈ విధముగా ఆ గురువగు వసిష్ఠుని ఛీయనుచు, అతడు గురువనియు, అది సభామధ్య మనిగాని జంకక ఆరాటముతో నిందావాక్యములు పలికెను. "గురుకులమున వసించి ధారాళముగా వేదముల

నధ్యయనముచేసి, అందఱు అన్నియును దెలిసినవాడని నుతించు చుండగా చెలంగెడి ధర్మాత్ముని రాజ్యమును ఏ పురుషుడు నావలె తీసికొనగోరును. పంక్తిరథుని పుత్రుడనై పుట్టి అన్నయగు శ్రీరామచంద్రుని ఐశ్వర్యమును కోరునంతటి పాపాత్ముడనా? దశరథునకు పుట్టియు నేనెట్లీ రాజ్యము నపహరింతును? ఈ రాజ్యమును, అట్లే నేనును రామునికి చెందినవారము గదా! ఇట్లగుటచే నీవే ధర్మమును చెప్పుము. ఓజస్సుచే దిలీపుని నహుషుని బోలునట్టి రఘురాముడే దశరథుని వలె ఈ రాజ్యమును పొందుట కర్హుడు జ్యేష్ఠుడగుటచేతను, జనులచేత ప్రశంసింపబడిన ధర్మగుణముచే పవిత్రుడగుట చేతను అతడే రాజ్యమునకర్హుడు. ఓ మునీ! నన్నే కారణముచేత ఈ రాజ్యము నేలుమంటివి? వయసుచే నాకంటె పెద్దవాడు, గుణములచే మిక్కిలి శ్రేష్ఠుడు అట్టి సీతానాథుని రాజ్యమును చిన్నవాడనైయుండి కఠినుడనై కోరుటకు నేనంత నీచబుద్ధి గలవాడనా? దుష్టాత్ములు చేయునట్టిదియు, తప్పక నరకమును పొందించునదియునయిన గొప్ప పాపమును నేను చేసి ఇక్ష్వాకుల వంశమున కపకీర్తి తెచ్చువాడ నగుదును గదా! నా కన్నతల్లి చేసిన అకార్యము నాకు హితవుకాదు. అడవులలో నున్న మా యన్నగారికి చేతులు జోడించి నమస్కరించెదను. ఓ విద్వాంసులచే నుతింపబడినవాడా! ఆతడిక్కడనే యుండి మూడు లోకముల నేలగలడు. నేను వేగముగా రాముడు వెళ్లిన దారినే వెళ్ల దలంచితిని. పలుమాటలేల?” అని పలుకగా విని సభలోని వారందఱు ఆనంద బాష్పములను విడచుచు రామచంద్రుని యందే మనస్సులను నిల్పిరి. తరువాత రాజ పుత్రుడైన భరతుడు ఇట్లు పలుక దొడగెను. “ఓ సభాసదులారా! వినుడు. నేనేవిధమున నైనను రామచంద్రుని పురమునకు వచ్చునట్లు ప్రార్థించెదను. అతడు రాకున్నచో నేనును లక్ష్మణుని వలె భయంకరమైన అడవులలో నివసించెదను. మీరును నాతో గూడ రండు. ఎట్లైన రఘురాముడు వచ్చును. ఆ విధమును నేను చేయుదును. మునుపు పనివాండ్రనందఱను మార్గములను శుభ్రము చేయుటకై

పంపించితిని. వేగముగా పోవుటకే నేను నిశ్చయించితిని" అని పల్కి దగ్గర నున్న సుమంత్రుని జూచి "నీవు తగిన విధముగా మన బలమునంతయు నేను చెప్పినట్లుగా సిద్ధపడునట్లు చేయుము" అనగా అతడట్లే చేసెను. సేనాపతులును పట్టణమున నున్న జనులును, రాజపుత్రుడును శ్రీరాముని దీసికొనివచ్చుటకై వెళ్లుచుండుట తెలిసినంతనే సంతోషముతో ప్రతి యింట కుతూహలముతో స్త్రీలందఱును తమ భర్తలను ఆ యాత్రకు సంపూర్ణముగా ప్రయత్నములు చేయుడని ప్రేరేపించిరి. కొందఱు గుఱ్ఱముల మీదను, కొందఱెడ్లబండ్ల మీదను, మఱికొందఱు రథముల మీదను తొందరగా సిద్ధపడగా కైకేయి పుత్రుడు సుమంత్రుని జూచి "సుమంత్రా! నా రథము సిద్ధపరుపు" మనగా విని అతడానందముతో పొంగిపోవుచు ఆ ప్రకారముగా నొనర్చెను. అంత భరతుడు సుమంత్రుని జూచి "సేనలతో వేగముగా ప్రయాణము సాగింపుము. లోకము లకు మేలు కలుగునట్లు రఘురాముని తీసికొని వచ్చుటను కోరుచున్నాను. ఆ మాదిరిగా బలములకును, ప్రధానులకును, పౌరులకు, స్నేహితులకు తెలియపరచెను. శ్రేష్ఠులైన బ్రాహ్మణులు మొదలగు సర్వవర్ణములవారికి ఒంటెలు కంచర గాడిదలు మొదలగు వాహనములతో వస్తువులను గొని వెళ్లునట్లును చెప్పెను.



# ఎనుబది మూడవ సర్గము

## భరతుడు శ్రీరాముని కొనివచ్చుటకై వెళ్లుట :

తరువాత తెల్లవారుజాముననే కైక పుత్రుడుత్తమమైన రథము నెక్కి, మంత్రులును గురువులును ముందు వెళ్లుచుండగా మిక్కిలి యెత్తైన ఏనుగులు తొమ్మిదివేలు వెనుక నడువగా ఆయుధములు ధరించినవారు అరువది వేల మందియు, నూఱువేల గుఱ్ఱములును వెంటరాగా కైకయు, సుమిత్రయు, కౌసల్యయు ఉత్తమ వాహనముల నెక్కి వెంటరాగా మిక్కిలి సంతోషముతో వెడలెను. లక్ష్మణ సహితుడయిన జానకీనాథుని చూడవలెననెడి కుతూహలముతో వారి చరిత్రలనే మనస్సులు సంతోషించునట్లుగా ఒకరి కొకరు చెప్పికొనుచు ఆ శ్రీరాముడెచ్చటనున్నాడో ఏమో? గదా! అనుచు జనసమూహము నడచుచుండెను. ఎన్నడో? మేఘశ్యాముడును, స్థిరమైన సత్వము గలవాడును, ఆజానుబాహుడును, మహానియమమునందున్నవాడును, లోకుల సమూహము శోకము నాశనము చేయగల వాడును అగు రామచంద్రుని మనము చూచుటెన్నడో? ఆతనిని జూచుట మాత్రమే చీకట్లను సూర్యుడు తొలగించినట్లు మన మనస్తాపమును తొలగింపగలదు అని ఈ రీతిగా సంభాషించుకొనుచు, సీతానాథుని కథలు చెప్పికొనుచు, కోమటులును, కంసాలులును, కుమ్మరివారును, కమ్మరివారును, రత్నముల బేరము చేయువారలును, కంబళ్లు నేయు కురువలును, బుక్కవారును, ధాన్య వ్యాపారులును, నెమలి విసనకర్రలను చేయువారలును, బట్టలు నేయువారును, అంపములతో దూలములను గోయువారలును, తలయంటువారును, ఒడలు

పట్టువారును, ఉప్పరులు, గొల్లవారును, వైద్యులును, ఈడిగవారును, బెస్తవారును, స్త్రీలతో గూడ నాట్యమాడువారును, బ్రాహ్మణులును వారి వారి వాహనముల మీద వేడుకగా మంచి వస్త్రములను గట్టి చందనాది గంధము లలదుకొని వెళ్లుచుండిరి. అట్లు అశ్వములు, రథములు బండ్లు మొదలైన ప్రయాణ సాధనముల మీద కొంతదూరము వెళ్లి జనసమూహము జాహ్నవీ నదీ తీరమందు రామచంద్రుని మిత్రుడగు గుహునిచేత పాలింపబడుచున్న శృంగిబేరపురమును చూచెను. కుతూహలమొప్ప ఒకానొక రమ్యప్రదేశమున భరతుడు సైన్య సమూహముతో గూడ విడిసెను. భరతుడు ప్రజలందఱిని చూచి "ఈ నదిని రేపు దాటవచ్చును. నేను పవిత్రమైన ఈ గంగానదీ జలముతో మా తండ్రికి తర్పణము చేసెదను. మీరందఱును తగినచోటులను చూచుకొని యుండుడు" అని చెప్పగా వారు సంతోషముతో ఎవరికి తగిన చోటుల వారు విశ్రమించెను.



# ఎనుబది నాల్గవ సర్గము

## గుహుడు భరతుని రాక గని సందేహించుట :

అంతట నిషాదరాజైన గుహుడు ఆ సైన్యము నంతను జూచి తన మంత్రులందఱితో "చూచితిరా ఈ సేనను? దీనియంతము కనిపించుటలేదు. మనస్సునందైన నూహింప జాలనంత సేన ఈ చెంతకు వచ్చియున్నది. సముద్రమువలె చూచుటకు నెక్కసమైయున్నది. దుర్మార్గుడగు భరతుడు దుర్బుద్ధితో బలమంతయు తన్ననుసరింపగా వచ్చెను. ఇది నిజము సుమా! రక్తకాంచన వృక్షపు జెండా రథముపై మెరయుచున్నది. వీని మార్గము చూడగా వేరుగా దోచుచున్నదిగదా! మనలను కట్టి పడవేయునో చంపునో కైక కుమారుడు. తన తండ్రిచేత రామచంద్రుని జనసంచారములేని యడవులకు గెంటింపజేసి, అతని సంపద నంతయును దుర్మార్గుడైపుచ్చుకొనియు మనస్సున బుట్టిన క్రోధముతో రాముని జంపుటకై సేనలతో వెళ్లుచున్నట్లు తోచుచున్నది. చూచితిరా? రామచంద్రుడు నాకు రాజు. నాకు స్నేహితుడు కాన నెట్లయిన రామచంద్రుని కాపాడెదను. కాన మీరలు కడువేగముగా వెళ్లి గంగాతీరమును ధైర్యముగా సేనలతో అప్రమత్తులై కాచుచుండుడు. నావలయందు సేనలకు గావలసిన మాంసము కందమూలములు పండిన పండ్లు మొదలగు వానిని నింపుడు. ఐదు వందల నావలను సిద్ధముచేసికొని ఒక్కొక్క నావకు ఎక్కువ బలవంతులయిన నావికులు వందమంది చొప్పున నుండుడు. రేవులన్నిటను ఈ ప్రకారముగా శ్రద్ధతో నుండుడు. ఒకవేళ రామునియందు ప్రేమతో వచ్చియున్నచో భరతుడు క్షేమముగా ఈ నదిని దాటునుగాని, అట్లుగాక ఆవేశపడినచో తానెట్లు వెళ్ళునో నేను నొక్కచేయి చూపించనా?"

## గుహుడు భరతుని జూడవచ్చుట :

అని పలికి, తేనెను, మాంసమును పిండివంటలను కానుకలుగా దీసికొని

వేగముగా వచ్చుచున్న వీరుడగు గుహుని జూచి సూతుడు అతి వేగముగా వెళ్లి భరతుని జూచి "రాజా! రామచంద్రునకు స్నేహితులలో ముఖ్యమైనవాడగు గుహుడు వచ్చుచున్నాడు. ఇతనికీ దండకాటవియందు మార్గములెల్ల బాగుగా తెలియును సుమా! కనుక నీవు వెంటనే యతనికి దర్శనమిమ్ము. ఓ దాశరథీ! అతనికి రామలక్ష్మణులును, జానకియును నివసించుచున్న చోటు తెలియును. ఇది నిజము" అని పల్కగా ఆ భరతుడతనిని తీసికొని రమ్మనగానే బంధుజనులతో గూడిన బోయనాయకుని తీసికొనివచ్చెను. వచ్చిన గుహుని భరతుడు తగు విధముగా సత్కరింపగా అతడు "ఇది అందమైన ప్రదేశము. శ్రేష్ఠమగు ఉద్యానమువలె నున్నది. సుఖముగా మీరిందుండ రాదా. ఇది చూడగా ఓ కమలాక్షా! మీ యిల్లే కాదా? మమ్ములనిట్లు మాయచేయదగునా? మీరు వచ్చుచున్న వార్తను ముందుగా తెలియజేయరాదా! ఇచ్చట వేడుకతో నుండుడని ప్రార్థించుచున్నాను. ఇచ్చట కావలసినన్ని దుంపలు పండ్లు నున్నవి. అనేక విధములైన మాంసములను కావలసినంత పచ్చివిగాని యెండినవిగాని ఈ బోయవారు తేగల సమర్థులు. రాజా! కావున నీ సేనలతో గూడ నీ విచ్చట ఈ రాత్రిని గడపి తెల్లవారగనే వెళ్లవచ్చును. రాజా! నా ప్రార్థన మన్నింపు"డన..



# ఎనుబది యైదవ సర్గము

## గుహుడు భరతునుద్దేశంబు సందేహించి యడుగుట :

భరతుడు సంతోషముతో గూడిన ప్రేమతో నిట్లనెను. "మా అన్నయగు శ్రీరామునకు మిత్రుడవైన ఓ గుహా! ఒక్కమారుగా ఇంతటి సేనా సమూహమును గౌరవింప దలంచితివి. నీ యెల్ల కోరికలును నిత్యాభ్యుదయముగా నెఱవేరుగాక. అన్నరసము కంటెను ఆదరణ రసము గొప్పదని చెప్పుదురు గదా! నీ మాటలను మెచ్చుకొనుచున్నాను. ఈ గంగానది నెట్లు దాటవలెనో తెలియదు. ఇది అడవి ప్రదేశము గదా! మాకు భరద్వాజముని యాశ్రమమునకు బోవు మార్గమును తెలుపుము." అనగా గుహుడిట్లు పలికెను. "భరతా! ప్రఖ్యాతమైన పరాక్రమము గల రామచంద్రునందు దుర్మార్గమయిన తలపు నీకు లేకున్నచో పడవులు నడుపు పల్లెవాండ్రను పంపెదను. నేనును మీవెంట వచ్చెదను. ఇట్లు బలములతో రామచంద్రుని మీదకు వెళ్లుటకు కారణమేమిటో యని గొప్ప సందేహము మనస్సునందు తోచినది." అని పలుకగా ఆకాశమువలె నిర్మలుడైన భరతు డిట్లనెను. "అక్కటా నన్ను గూర్చి నీవు చెప్పినట్టి క్రూరమైన సమయము మిత్రమా! యెన్నటికిని రాకుండుగాక! గుహా! నన్నుమానింపకుమయ్యా! రఘువంశములో నుత్తముడును, నాకు తండ్రివంటి వాడును, మా యన్నయు నగు రఘురాముని తీసికొని వచ్చుటకై సన్నద్ధుడనై పోవుచున్నాను. నీ మనసునందు వేరు విధముగా భావింప తగునా? నేను సత్యమునే చెప్పుచున్నాను సుమా!" అని చెప్పగానే పరిపూర్ణమైన సంతోషముతో కూడినవాడై బోయల రాజిట్లనెను. "ఓ భరతా! నీవు ధన్యుడవు సుమా. ధరణిలో నిన్ను బోలిన మంచివారలు కనిపించరు. అప్రయత్నముగా వచ్చిన రాజ్యమును విడచిపెట్టు నంతటి గొప్ప మంచితనము వలనను, రఘురాముని మరలించవలెనని కుతూహలపడితివి కనుకను జగత్తునందు శాశ్వతమయిన కీర్తిని బొందెదవు." అని యిష్టాగోష్ఠిగా మాటాడు

చుండగనే సూర్యుడస్త పర్వతమును జేరబోయెను. రాత్రియయ్యెను. గుహుడు సేనలు విడియుట కేర్పాటు చేయగనే భరతుడు తమ్మునితో గూడి శయనింప వెడలెను. సుగుణసముద్రుడును, ఆగర్భ శ్రీమంతుడును ధర్మాత్ముడును నగు ఆ భరతుడు ఆ రాత్రియంతయు శ్రీరాముని గూర్చి వ్యథతో విచారించుచుండెను. దావాగ్ని చుట్టుముట్టిన చెట్టును చెట్టు తొఱ్ఱలో ప్రవేశించిన అగ్ని రగిలి రగిలి కాల్చివేయు విధమున ఆ అనఘుని యొక్క హృదయమును దుఃఖము అంతకంతకు దహించుచుండెను. సూర్యుని కిరణములచే వేడిచెందిన హిమవత్పర్వతము మంచు నెడతెగక స్రవించునట్లు అధికమైన దుఃఖాగ్నివలన బుట్టిన చెమటలను భరతుడు శరీరము నుండి వెలువరచెను. రాముని తలంపులనెడు కఠిన శిలలును, నిట్టూర్పులను ధాతువులును, దైన్యమనెడు వృక్షములును, దుఃఖమను గజబృందములును, మోహమనెడు మృగములును, భరింపరాని సంతాపమనెడు వెదుళ్లు ఓషధులును గలిగియున్న దుఃఖమనెడు పర్వతమందు బడినవాడై భరతుడు పెద్దవైన నిట్టూర్పులు విడుచుచు, మనస్థిమితములేక, ఏ దారియును లేనివాడై శాంతిలేక నిశ్చేష్టుడై గుంపునుండి విడిపోయిన ఎద్దువలె విచారించుచుండగా అతని జూచి బాధనొందుచు, రాముని దలచుకొనుచు గుహుడు ఊరడించుచుండెను.



# ఎనుబది యాఱవ సర్గము

## గుహుడు భరతునకు లక్ష్మణు వృత్తాంతము చెప్పుట :

తరువాత నిషాదరాజు మహానుభావుడైన లక్ష్మణును గురించి యిట్లు చెప్పదొడగెను. "బాణములను, ధనుస్సును ఖడ్గమును ధరించి నిద్రపోకుండ అన్నగారి రక్షణకు నిలిచి యున్న లక్ష్మణునితో నేనిట్లంటిని. ఓ తండ్రీ! నీకొఱకై సుఖముగా నుండుటకై మంచి శయ్య యేర్పాటు చేయబడినది. సుఖముగా దానిమీద శయనించి శ్రమపోవునట్లు నిదురింపుము. నా మాటను నమ్ముము. సమ్మానింపదగిన రాజకుమారా! నీవు సుకుమారుడవు. ఇచ్చట నున్న మా వారందఱును అడవులయందు దిరుగు కఠినమైన వారలుగాన జానకీనాథుని నీ రాత్రియందు జాగ్రత్తను పూని కాచుచుండుదుము. వెళ్లి సుఖముగా పరుండుము. ఎందుచేతననగా నాకు రామచంద్రుని కంటె ఇష్టుడు ఈ భువిలో మరెవ్వరును లేరు. ఇది నిజము సుమా. అబద్ధము కాదు. సత్యము మీద ప్రమాణము చేసెదను. ఓ సుమిత్రానందనా! ఈ మహామహుని యనుగ్రహము చేతనేగదా నేను కీర్తిని, శుభమును, సంపదను ధర్మమును క్షేమమును పొందుచున్నాను. నా బంధువులును నేనును సంధించిన విండ్లు ధరించి నాల్గు దిక్కులయందును నిలిచి ఎక్కువైన ప్రీతితో నిద్రజెంది యున్న భార్యాయుతుడగు మిత్రుని అప్రమత్తులమై చతురంగ బలములనైన నెదిరించి కాచుకొని యుండెదము. ఈ అడవులలో నేనెఱుగని దొక్కటియులేదు సుమా. నీవు భయము చెందకుము" అని పల్కగా లక్ష్మణుడు సజ్జననుతమైన ధర్మమార్గమును తలచి సంశయమును పొందకుండ మిక్కిలి జాలిగా మాతో నిట్లనెను.

"మిత్రమా! ఇది ధర్మమా? తామరల వంటి నేత్రములు గల రాముడును, సీతాదేవియును ఈ వట్టినేలమీద సందేహము లేక పవళించియుండగా నేను కన్నుగూర్కుట తగునా? నా కనులకు నిద్ర యెట్లు వచ్చును? నా బ్రతుకునకు సుఖమెట్లు కలుగును? భోగముల మీదకు మనస్సు వెళ్లునా? ఓ ప్రియ స్నేహితుడా! సురాసురులనైనను విలాసముగా పారగొట్టగల మహానుభావుడైన రాముడు భార్యతో గలసి యెండుగడ్డితో సిద్ధపరుపబడిన పక్కపై పరుండి యుండును గదా! అనేకమైన కష్టములు పడి తపస్సుచేసి తనయంతవాడగు నొక పుత్రుని గని, ఈ అపరిమితమైన ప్రతాపముగలవానిని వనములకు బంపి ఆ దశరథ మహారాజు వీనుడై ఎక్కువ కాలము భూమిపై జీవించుట అబద్ధము సుమా! మిత్రమా! ఈ భూమి దిక్కులేనిదై వేగముగా చెడిపోవును చూచు చుండుము. ఇది సత్యము. ఏడ్చి యేడ్చి ఆ రాజు భార్యలందఱును సొమ్మసిల్లి భూమిమీద పడిపోగా ఏడుపు ధ్వనులు లేనందున ఆ రాజు పట్టణము నిశ్శబ్దముగా నుండును గదా! స్త్రీలలో శ్రేష్ఠురాలగు కౌసల్యయు, దశరథ మహారాజును, నా తల్లియును, ఈ రాత్రియైన నందఱు బ్రతికి యుందురా? యని మనస్సునందు సందేహించుచున్నాను. నా తల్లి శత్రుఘ్నునిపై మనస్సు నిల్పుకొని బ్రతికిన బ్రతుకవచ్చును గాని జనులచే నుతింపబడినదియు, వీరమాతయునగు రాముని తల్లి దుఃఖముచే క్షణము కూడ బ్రతికియుండదు సుమా! మించెను. సమయము మించిపోయినది. అంతయు నైపోయినది. ఆ రాజు రాముని రాజు చేయకయే తాను నశించును. ఇది నిక్కము. తామున్నా మని వచ్చి ఆ రాజు మరణకాలము సేవించి పితృకార్యములన్నింటిని కోరికలు తీరిన ఆతని పుత్రులే నెరవేర్చెదరు. అక్కటా. తండ్రికి శ్రాద్ధకర్మములను పూర్తిచేసినవారై భరత శత్రుఘ్నులు రమ్యములైన నాల్గు మార్గము కూడళ్లచేతను శృంగారమైన మార్గముచేతను, మేడలచేతను, మిద్దెలచేతను, వేశ్యలచేతను,

ఏనుగులచేతను, నృత్యగీత వాద్యములచేతను సంతుష్టులై యున్న పౌరులచేతను సకల మంగళములచేతను పొదరిండ్లు గల యుద్యానవనములచేతను ప్రతి నిత్యము నుండెడు ఉత్సవములచేతను ఒప్పి గొప్పగా నా తండ్రి యేలుచుండిన ఆ రాజధానియందు వారు సంతోషముతో సంచరించుచుందురు. తన ప్రతిజ్ఞను పూర్తిచేసి క్షేమముగా నున్న రామచంద్రునితో గలిసి మేము తిరిగి పురమునకు వెళ్లగలమా? ఓ ప్రియమైన చెలికాడా! అంత పుణ్యము మాకు కల్గునా?" అని ఈ ప్రకారముగా సుమిత్రానందనుడు బాధతో తల్లడపడుచు విలపించుచుండగనే రాత్రి గడచిపోయినది. "ఏమి చెప్పుదును. సూర్యుడుదయింపగనే జడలు ధరింపజేసి అన్నదమ్ము లను సీతతో గూడనేను ఈ దేవనదిని సుఖముగా దాటించితిని. గజరాజుల వంటి వారు సందేహింపక జడలుదాల్చి, నారచీరలను సంతసముతో గట్టుకొని భయంకరములైన ఆయుధములను ధరించి, సీతాదేవి వెంటరాగా వెడలిరి."



# ఎనుబది యేడవ సర్గము

## గుహుని మాటలను విని భరతుడు విచారించుట :

అని గుహుడు చెప్పగా కైకేయి యొక్క పుత్రుడా ప్రియ వాక్యములను విన్నవాడై చింతాక్రాంతుడయ్యెను. సింహబలుడును, క్షీణించని పరాక్రమము గలవాడును, సుకుమారమైన యాకృతి గలవాడును నైన భరతుడు ఉస్సురనుచు తోత్రములచే పొడువబడిన యేనుగువలె మూర్ఛనుజెంది పడిపోయెను. దగ్గర నున్న శత్రుఘ్నుడతనిని లేవనెత్తి కౌగిట బట్టుకొని దుఃఖముతో తపించెను. భర్త మరణించిన దుఃఖముచే పీడింపబడినవారును ఉపవాసములచేత కృశించిన వారును అయిన భరతుని తల్లులందఱును వేగముగా వచ్చి భూమిమీద పడియున్న సద్గుణవంతుడగు కొడుకును జూచి ఏడ్చుచుండగా కౌసల్య భరతుని చేతులతో గ్రుచిపట్టుకొని తన కడుపున గన్నబిడ్డను కన్నతల్లి కౌగిట చేర్చికొన్నట్లు కౌగలించుకొని ఆ తపస్విని దుఃఖము కలత బెంచుచుండగా ఏడ్చుచు నిట్లనెను. "ఓ తండ్రీ! శరీరమున జబ్బేమియును లేదు గదా చెప్పుము నాయనా! ఈ గొప్పదైన వంశము నీ అధీనమున నున్నది సుమా! మా ప్రాణములు బ్రతుకులు అన్నియు నీవే కదా! నీ తండ్రి స్వర్గమునకు వెళ్లగా రఘురామచంద్రుడు అడవులకు వెడలగా దీనురాలనయ్యు నిన్ను చూచుకొని కదా శరీరమునందు ప్రాణములను నిల్పియుంటిని. కుమారా! అక్కటా! ఒక్కడే పుత్రుడుండి యారాటపడుచున్నదానను. అతడు భార్యతో భయంకరమైన అడవులకు వెళ్లి యున్నచోటినుండి ఏమైన వార్తను వినలేదు గదా! లక్ష్మణుని యందేదైన నొక యప్రియమైన వార్తను విన్నావా? ఓ తండ్రీ! నీవీ మాదిరిగా తపించిపోవుచున్నచో నిన్నెవ్వరోదార్చువారురా. నాయనా!" అని యేడ్చుచుండగా ఒక ముహూర్త కాలమునకు మూర్ఛదేరి తెలివినిపొంది ఎక్కువగా బాధనొందుచు కౌసల్య నోదార్చుచు గుహుని జూచి గళవళపడుచు భరతు డిట్లడిగెను.

**భరతుడు గుహుని సీతారాముల నిద్రాహారముల విషయము లడుగుట :**

"మిత్రమా! ఆనాటి రాత్రి మా అన్నగారు నేలమీద ఎక్కడ పవ్వళించెనో చెప్పుమయ్యా! అతి సుకుమారియైన మా వదిన ఎచ్చట శయనించెను? లక్ష్మణు డెచ్చట నుండెను? వారేమి భుజించిరి? దేనిపై శయనించిరి? అంతయును జెప్పు"మని యడుగ గుహుడు రాముని యప్పటి కథయంతయును చెప్ప మొదలిడెను. "నేను ప్రేమతో అనేక విధములైన ఫలములను, భక్ష్యములను, అన్నములను, పానీయములను తీసికొని వెళ్లితిని. నన్నాదరముతో చూచెనుగాని క్షత్రధర్మమును మనసునందు స్మరించినవాడై ఒక్కటి కూడ ముట్టుకొనలేదు సుమా. 'మిత్రమా! నీవిచ్చుట సబబే కాని మేము వీనిని పుచ్చుకొనుట తగదు' అని ఆ పుణ్యాత్ముడు మంచి మాటలతో చెప్పి నేను తెచ్చిన వస్తువులను త్రిప్పి పంపించెను. రాజా! ఆ తరువాత లక్ష్మణుడు మంచినీరు తేగా సీతాదేవితో గూడ త్రాగి ఉపవాసముండెను. మిగిలిన నీటిని తమ్ముని కీయగా అతడును త్రావెను. ముగ్గురును యథావిధిగా మౌనముగా సాయంత్రము చేయవలసిన పూజావిధులను చేసిరి. లక్ష్మణుడు వెంటనే దర్భలతో ప్రక్క పరువగా ఆ ప్రక్కమీద రాముడు సీతాదేవితో గూర్చుండ సౌమిత్రి రాముని శ్రీపాదములను కడిగెను. అంతట లక్ష్మణుడు దగ్గరగా నిలబడక కొంత దూరముగా వెళ్లెను.

**శ్రీరాముడు పరుండిన స్థలమును గుహుడు భరతునకు చూపుట :**

ఆ రాత్రి రాముడును సీతాదేవియు శయనించినట్టి దర్భలివే. ఆ గార చెట్టు మొదలిదే ప్రీతితో చూడుము. వారలిందే నిద్రజెందిరి. లక్ష్మణుడు బలమైన తల త్రాణమును, అంగుళి త్రాణమును ధరించి, వాడిబాణములుగల తూణీరము లను దాల్చి గొప్ప ధనుస్సును చేతపట్టి వారల చుట్టును తిరుగుచు నిద్రలేకుండ ఆ రాత్రియంతయు సంచరించెను. నేను కూడ ఆ వీరుడైన లక్ష్మణుని వెంట విల్లును బాణములను పూని తిరిగితిని. కన్నుల మీద ఱెప్పవాల్చకుండ, కునికిపాట్లు పడకుండ నా సేవకులందఱు ఆయుధములు ధరించి నావెంటనే యుండగా ఆ రాత్రియంతయు శ్రీహరిని బోలిన రాముని కాపాడితిమి."

# ఎనుబది యెనిమిదవ సర్గము

## శ్రీరాముడు పరుండిన స్థలమును జూచి భరతుడు పరితపించుట :

అని గుహుడు చెప్పగా అంతయును విని భరతుడు మంత్రులతో గూడి వెళ్లి ఆ యింగుదీవృక్షము మొదట రామచంద్రుడు పరుండిన ప్రక్కను జూచి విచారములో మునిగినవాడై యిట్లనెను. “ఓ తల్లులారా! చూచితిరా? రఘునాథుడు నాటిరాత్రి ఇచ్చట నీ ముండ్లవలెనున్న దర్భల శయ్యమీద కన్నులు మూసికొని పరుండెను. అదిగో చూచితిరా. ఆ ప్రక్క నలిగియున్నది. అదిగో శరీరము లొత్తుటచే కలిగిన ఆనవాళ్లు. ముట్టుకొన్న కందిపోవు శరీరమెక్కడ? ఈ దర్భల ప్రక్క ఎక్కడ? ఏమని చెప్పుదును. అపరిమితమైన కీర్తిని పొంది దశరథ మహారాజు యొక్క పుత్రుడై లోకులందఱిచే నుతింపబడిన బుద్ధిగలవాడై, మంచి కులములో బుట్టినవాడై, ఎన్నరాని పరాక్రమము గలవాడై జగత్తున కంతకును భర్తయైన రాముడు మెత్తనైన పట్టు పరుపులమీద శయనించువాడు ఈ భూమియందు దర్భల ప్రక్కమీద శరీరమునెట్లు మోపెనో ఎట్లు నిదుర జెందెనో గదా! మేడల మీదను, చంద్రశాలలయందును విహారము సల్పు రాముడు ఈ చెట్టునీడనుండెనే? బంగారపు బాటలు గల యుద్యానవనము లందు దిరుగు రాజు ఈ కటికనేలపై తిరిగెనా? చల్లని గాలులు వీచుచుండగా చిగురుటాకుల పాన్పులందు పండుకొనువాడు ఈ దర్భల ప్రక్కపై నిద్రజెందెనా? మంగళధ్వనులు వినుచు లేచు రామచంద్రుడు మృగపక్ష్యాదుల అరపులతో నిద్రలేచెనా? పెంపుడు చిలుకల పలుకులను ప్రీతితో వినువాడు భయంకరము లైన మృగముల యరపుల నెట్లు వినెనో గదా? ప్రజలు సేవించుచుండగా

నుండువాడు ఒంటరిగా ఎట్లుండెనో గదా! ఓ రామా! గట్టిగా నున్న ఈ రాళ్లనేలయే బంగారము – వెండి భవనములాయెనా నీకు. ఓ అన్నా! నీకు వాడిగా నున్న ఈ దర్భలప్రోవే సుకుమారమైన మెత్తని పరుపులాయెనా? ఈ గారచెట్టు కొమ్మలే నీకు పట్టుతోను బంగారపు తీగలతోను అల్లిన చాందినీ ఆయెనా? ఈ హోరుగాలియే స్త్రీలు వీచెడు వింజామరల గాలియయ్యెనా రామా! నీకు? ఓ పరమపురుషా! వందిమాగధుల స్తోత్రములును మంగళ వాద్యముల మ్రోతలు నయ్యెనా నీకు ఈ పరుషములైన కాకుల అరపులు? ఓ శ్రీయుతాంగా! ఈ చిమ్మటల ధ్వనులే నీకు బంగారు ఆభరణముల మధుర శబ్దములయ్యెనా నా మనస్సు మోసపోయినది గాని యిటువంటిది నిజముగా నుండునా? కలచే నేనిట్లు మోహపడుచున్నాను. అయ్యో నా రఘురాముడెక్కడ ఈ కఠినమైన నేలను బరుండుటెక్కడ? తలంచి చూడగా దైవముకంటెను కాలమే గొప్పదిగా కనిపించుచున్నది. దశరథనందనుడైన రామునొక దుర్మార్గునిని వలె కటికినేలపై నిద్రించునట్లు చేసెనుగదా! జనకరాజు యొక్క కుమార్తెయట. దశరథ మహారాజు కోడలట. రామచంద్రుని భార్యయట. ప్రీతి గలిగించు దర్శనము గలదియట! అటువంటి సీతాదేవియు వనములందు నేలమీద పవళించెనే? యింతకంటెను పాపమున్నదా? ఇది మా అన్నగారు పడుకొన్న ప్రక్క. అతని యొక్క మృదువైన శరీరము కఠినమైన నేలమీద పరువబడిన దర్భల ప్రక్కమీద ఇటునటు దొరలుటచే గడ్డి నలిగిపోయి యున్నది. అయ్యో మృదు శరీరునకు దర్భశయనమా? ఏమందును. జానకీదేవి శయనించిన పవిత్రమైన ప్రక్క యిదే. ఇందామె సొమ్ములను ధరించియే బడలికచే నిద్ర చెందెనని తోచుచున్నది. దీనియం దచ్చటచ్చట బంగారపు నలుసులు రాలి కనబడుచున్నవి. విధి విలాసము నేమనవచ్చును. దైవమా! ఆ జానకీదేవి యొక్క పైకొంగు దర్భల చివరలందు దగుల్కొనెను గాబోలు. చిన్న చిన్న

దారములు ఇచ్చట నున్నవి. నాయుద్దేశమున పతివ్రతయైన స్త్రీకి భర్తయొక్క శయ్య అది యెట్లున్నను సుఖమునే కలుగజేయునని. అందులకే సీత యిచ్చట యెట్టి దుఃఖములేక శయనించినది. కటకటా! నేనెంత పాపాత్ముడను. ఎంత దుష్టుడను. నా నిమిత్తముగా రాఘవుడు తన దేవితో ఇటువంటి శయ్యమీద, కటికినేలను పరచిన దర్భలమీద దిక్కులేని వానివలె కనులు మూయుట కలిగెను గదా! ఇంతకన్న దుఃఖమింకొకటి యున్నదా? తలచుకొనిన కడుపు మండిపోవు చున్నది. చక్రవర్తి వంశము నందు పుట్టి లోకులు మెచ్చునట్లు అందఱకు హితుడై ప్రకాశించెను. నీతికి నివాసమయ్యెను. అట్టి పద్మములవంటి నేత్రములు గలిగిన అందగాడు ఎఱ్ఱని నేత్రములు గలవాడు. ఇట్టి కఠినమైన ప్రక్కపైన పవళించెను. ఏమనవచ్చును. మహానుభావుడైన సౌమిత్రి ధన్యుడును, మాన్యుడునయ్యెను గదా! కష్ట దశలో వనములలో నున్న అన్నను సమయము నెఱిగినవాడై మంచితనముతో అనుసరించెను. ఆ సీతాదేవి ధన్యురాలు గదా! తన భర్తతో సంతోషముగా అడవులకు వెళ్లెను. నా మనసునందాలోచించి చూడగా మన దుశ్చేష్టకారణమున మనలను రామచంద్రుడు యనుగ్రహముతో చూచునని తోచుటలేదు. దశరథ మహారాజు స్వర్గమునకు వెళ్లుటచేతను రామవిభుడు అడవులకు వెళ్లుటచేతను కర్ణధారుడులేని నావవలె ఈ భూమి యంతయు దయనీయమైయున్నది. రామచంద్రుడడవులలో నివసించుచున్నను అతనిచేత రక్షింపబడుచున్నదౌటచేత ఈ పట్టణము నెవ్వడు నపహరింప గోరడు. ఎట్లు కోరును? ప్రాకార రక్షకులులేక, ఏనుగులు గుఱ్ఱము మొదలగునవిలేక కోట తలుపులు తెరచినవి తెరచినట్లేయుండ, దిక్కులేనివారై మనస్సున సంతోషములేక యున్న జనులు గల ఆ పాడుపడిన పట్టణమును ఏ పగవాడును తీసికొనగోరడు. విషము కలిసిన పిండివంటలను దినగోరు మానవుడు భూమియందుండునా? నా నిమిత్తమున గదా యిన్ని త్రిప్పులు వచ్చినవి.

దీనికి ప్రాయశ్చిత్తమును చెప్పెదను వినుడు. ఇప్పటి నుండి నేను గడ్డిమీద గాని ఆకులమీద గాని, నేలమీద గాని పరుండెదను. తలను జడలను దాల్చెదను. నారబట్టలను గట్టెదను. పండ్లను, కందమూలములను తిని ప్రాణములను నిలబెట్టుకొందును. ఇక మిగిలిన కాలమంతయు నేను హాయిగా వనములలో నుండెదను. ఓర్పుతో అన్నగారి ప్రతిజ్ఞను తీర్చెదను. లక్ష్మణునితో గలసి రామవిభుడీభూమిని బాలించుగాక! అన్నపై భక్తితో అడవియందు నివసించుచు నాకు కష్టములలో చిన్న తమ్ముడగు శత్రుఘ్నుడు తోడుగనుండును. బ్రాహ్మణశ్రేష్ఠులు అయోధ్యలో సీతానాథుని పట్టాభిషేకము యథావిధిగా చేసి మనస్సులందు సుఖించెదరుగాక. ఓ దేవతలారా! నా యొక్క అభిలాషను నెరవేర్పుడు. మీకు నమస్కరించెదను. ఆ రామచంద్రుని పాదముల మీద పడి అనేక విధములుగా బ్రతిమాలుకొనెదను ఆ రఘురాముడు నా మాట నంగీకరించనిచో నేనే వనములయందుండెదను. అతడు నన్నెందులకుపేక్ష చేయును?



# ఎనుబది తొమ్మిదవ సర్గము

**భరతుడు గంగానదిని దాటుట :**

అని విచారించుచుండ తెల్లవారుటయును, ఆ రాజపుత్రుడు తమ్ముడైన శత్రుఘ్నుని బిలిచి "రాముని గూర్చి చింతించుటచే రాత్రి కనులు మూతపడలేదు. తమ్ముడా! ఆ గుహుని పిలుచుకొనిరమ్ము. అందరిని అతడు గంగానదిని దాటించుగాక. నా జాగరణము నాది" అని యిట్లు పల్కుచుండగా అంతట గుహుడు వచ్చి నమస్కరించి "ఈ నదీతీరమున సుఖముగా రాత్రి గడపితివా? నీ సేనకును సుఖముగా గడచినదా?" యని స్నేహముతో నడుగగా భరతుడు "అందరమును సుఖులమే. నీవు చేసిన సపర్యలు మాకు సంతోషమును గలిగించినవి. మమ్మందఱను ఈ గంగానది దాటింపుము" అని తొందరించి పలుకగా విని గుహుడు తన పురమునకు వేగముగా వెళ్లి తన మనుష్యులను జూచి "తొందరగాలెండు ఇంక నావలను సిద్ధపరచు పనులను చేయుటకు వెళ్లుడు. శీఘ్రముగా సేనను దాటింపవలయును." అని చెప్పగా వారును రాజాజ్ఞను తలదాల్చి ఐదువందల నావలను సిద్ధముచేసి పెద్ద గంటలు, కిటికీలు, జెండాలు, కంబళములు గలిగి స్వస్తికమను పేర ప్రసిద్ధములైన గొప్ప నావలను నిల్పగా వానియందు గురువులును, బ్రాహ్మణులును ముందుగా భరతుని తల్లులు, తక్కిన స్త్రీలును సంతసముతో అందఱును ఎక్కిరి. అన్ని నావలలోను మేలైన ఓడను తెల్లని కంబళములు పరచినదియు, కమ్మని ఘంటాధ్వనులు చేయుచున్నదియు అందమైనదియునగు దానిని గుహుడు తీసికొనిరాగా వేగముగా రాజపుత్రులు అధిరోహింపగా, తరువాత బండ్లను సమస్త సామగ్రిని పడవల మీద నెక్కింపగా అప్పుడు నేను ముందు నేను ముందనుచు ఏటిలో

దిగువారి యొక్కయు, తాము నివసించిన ప్రదేశములను గాల్చువారి యొక్కయు, ఈ పాత్ర నాది ఈ చెంబు నాది యనువారి యొక్కయు పెద్ద పెద్ద కేకల ధ్వనులాకాశము నంటుచుండెను. పల్లెవాండ్రు తెరచాపలెత్తగా నావలు కొన్ని స్త్రీలతో, కొన్ని బండ్లతో, కొన్ని గుఱ్ఱములతో, కొన్ని ప్రయాణ వస్తు సామగ్రితో బయలుదేరి ఆవలి తీరమున దింపెను. నడచుచున్న పర్వతములో యనునట్లు ఏనుగులు జెండాలతోను మావటివాండ్రతోడను గూడ నీదుకొనుచు గంగానది యావలి గట్టునకు వెళ్లినవి. కొంతమంది ఈదుచు దాటిరి. కొందఱు తెప్పలమీద కొందఱు చెట్లమీద కొందఱు కుండలమీద పండుకొని దాటిరి. కొందఱు తాటిబుర్రలు మొదలైన సాధనములచేతను కొందఱు ఊతకోలలు బట్టుకొనియు వారి వారి కనుకూలమైన విధానములతో అనేకములైన రేవుల నుండి గంగానదిని దాటిరి.

**భరతుడు భరద్వాజ మహర్షిని దర్శింపబోవుట :**

ఆ ప్రకారముగా అందఱును ప్రయాగవద్ద నున్న వనమును మిత్ర ముహూర్తమున చేరిరి. అంతట అచ్చట తగిన స్థలములందు అందరిని సుఖముగా నుండ నియమించి భరతుడు తన పురోహితులతో కాల్నడకన తొందరగా ఋషులున్నచోటికి వెళ్లెను. జ్ఞానము చేతను, తపస్సు చేతను చాల గొప్పవాడును ఇంద్రుని పురోహితుడును ముదుసలియు నగు భరద్వాజుని జూచుటకు వెళ్లుచు ఆ మునీశ్వరుని యొక్క మిక్కిలి రమ్యములైన వృక్షములు గల తపోవనమును జూచెను.



# తొంబదియవ సర్గము

**చూ**చి, ఒక క్రోసు దూరమునందే జనసమూహములను నిలిపి ధనుస్సును శస్త్రములను వదలిపెట్టి, శరీరముమీద పైనున్న బట్టను వల్లెవాటుగా ధరించి ముందుగా పురోహితుడు నడవ భరతుడు వెళ్లుచుండగా వసిష్ఠుని జూడగనే భరద్వాజు డాసనము నుండి లేచి తన శిష్యులను అర్ఘ్యము నొసంగ నాజ్ఞాపించి వసిష్ఠుని దగ్గరగా వెళ్లి, అతని వెనుకనే వచ్చి తనకు నమస్కరించుచున్న భరతుని దశరథ పుత్రుడని మనమున గుర్తించి వరుసగా అర్ఘ్యపాద్యములను ఫలములను నిచ్చి 'నీ బలములకును, నీ ధనాగారములకును బంధుమిత్రులకు క్షేమమే కదా?' యని ప్రశ్నించి దశరథుడు మరణించుట యెఱింగి యుండుటచే ఆ మాట అడుగక యూరకుండెను. అంత భరతుడును వసిష్ఠుడును భరద్వాజ మునిని ఆశ్రమముననున్న లేళ్లకు పక్షులకు వృక్షములకు అగ్నులకు దేహములకు వేర్వేరుగా కుశలమడుగగా అతడు క్షేమమే యని చెప్పెను.

**భరద్వాజుడు భరతుని రాకకు కారణమడుగుట :**

భరద్వాజముని భరతుని జూచి రామచంద్రుని మీదనున్న ప్రేమతో నిట్లనెను. "ఓ భరతా! నీవు రాజ్యము నేలుచు ఇట్లు వచ్చిన కారణము చెప్పుము. నీ యొక్క కృత్యములందు తప్పు కనిపించుచున్నది. స్త్రీకి లొంగినవాడై నీ తండ్రి రామచంద్రుని భార్యతోడను తమ్ముని తోడను చాలకాల మడవులలో నుండునట్లు చేసెను గదా! ప్రఖ్యాతి జెందిన చరిత్ర గలవాడును, పాపరహితమైన శీలము గలవాడును అగు రామచంద్రుడు తండ్రి వెళ్లుమనగానే పదునాలుగేండ్లు అడవులలో నుండుటకు సమ్మతించి మారుమాట చెప్పకుండ వెళ్లెను గదా!

అట్టి సోదరునకపకారమును దలపెట్టి ఈ భూమినంతయును ఎదురులేకుండ నెమ్మదితో పాలింపదలచితివా దయలేనివాడవై కైకేయీనందనా? పాపార్జితమైన సౌమ్మునందు నీకింత యిష్టమా?" అని ముని అనగానే భరతుడు కన్నుల నీరు నిండినవాడై మాటలు తడబడుచుండ మునితో నిట్లనెను. "మహానుభావా! అక్కటా! నీ యంతవాడిట్లు తలపగా నేను బ్రతికి ఏమి సార్థకము. నాయందేపాపమును లేదు. విపరీతమైన కఠినములైన మాటలను చెవుల యందు గ్రుచ్చుట మంచిదా? నేను కైక యొక్క కుమారుడనను నింద తప్ప నాయందొక్క తప్పును లేదు సుమా! నేనింటలేని సమయమున కఠినురాలై నా తల్లి చేసినట్టి చెడుపని నాకు సమ్మతముగాదు. నాకది యిష్టము కూడ కాదు. దానివలన నేనెప్పుడును సంతోషమును పొందను. ఓ పావనశీలా! నేను రామచంద్రు నయోధ్యకు తీసికొని వచ్చుటకై వెళ్లుచున్నవాడను. ఆ పవిత్రుని పాదపద్మములపై బడి మంచి మనస్సుతో నన్ను క్షమింపుమని ప్రార్థన చేయవలెనని తలంచి వచ్చితిని. దయతో ఆ సీతానాథుడు సుఖముగా నెచ్చట నున్నవాడో చెప్పుము" అని అడుగగా అంత వసిష్ఠుడు మున్నగువారు కూడ వేడుకొనగా భరద్వాజుడు భరతుని జూచి యిట్లనెను. "రఘువంశమునందు జనించిన ఓ భరతా! నీకు పెద్దలయందు భక్తియు, ఇంద్రియ నిగ్రహమును, పండితులను సజ్జనులను అనుసరించుటయును, మిక్కిలి తగియున్నవి. గొప్ప తేజస్సు గలవాడా! మూడు లోకములందును శాశ్వత కీర్తివై యొప్పుదువు గాక. ఓ రాజపుత్రా! నీ మనస్సును నే నెఱుగనివాడను కాను. తెలిసియుండియు, నీకు ప్రతిష్ఠను కలుగజేయుటకును, నీ బుద్ధిని స్థిరపరచుటకును వాడిమాటలు పల్కినాడను. సీతయును, తమ్ముడును సేవించుచుండ రాముడు చిత్రకూటమను పర్వతమున నున్నవాడు. ఇది నిజము. నేనెఱుగుదును. నీవును నీ పరివారమును నీ మంత్రులును ప్రీతితో ఈ పూటకిచ్చట నిలువుడు. ఓ కోరిన కోరికలనిచ్చు గుణము గలవాడా! రేపు ప్రొద్దుట సీతానాథుని జూచుటకు వెళ్లవచ్చును.

# తొంబది యొకటవ సర్గము

అనగా "అట్లే యగుగాక" యని రాజకుమారుడా రాత్రి యచ్చట నిలిచెను. ముని తన యొక్క ఆతిథ్యమును తీసికొనుమనగా భరతుడిట్లనెను. "మునీంద్రా! అర్ఘ్యమును పాద్యము నిచ్చితిరి. అడవులలో దొరకు ఫలమూలములతో ఆతిథ్యమిచ్చితిరి. ఓ సచ్చరితుడా! నేను సంతుష్టి నొందితిని" అనగా స్నేహముతో చిరునవ్వు నవ్వుచు మునీంద్రుడిట్లనెను. "ఏదియో కొంచెముగా ఇచ్చుటచేతనే నీవు తృప్తిని పొందితివి. నాకు తెలియును. ఓ రాజా! నీకును, నీ సేనకును భోజనము పెట్టవలెనని కోరిక కలిగినది. నేను చెప్పినట్లు నీవు చేయుట నాకు మిక్కిలి సంతోషమును కలిగించును. నీ సైన్యమునంతయు దూరముగా నుంచితివి. ఇచ్చటికి తీసికొని రావైతివేల?" అనగా భరతుడు. "మునివరా! మీవలని భయముచేత బలగములను తీసికొని రానైతిని. రాజులైనను రాజపుత్రులయినను మునులున్న ప్రదేశములను ప్రయత్నముతో పరిహరించుట మంచిదగును. గుఱ్ఱములు ఏనుగులు మొదలగు సైన్యాంగము లాశ్రమమందలి పర్ణశాలలను వృక్షములను పాడుచేయునని నేనొంటరిగానే వచ్చితిని! అనగా భరద్వాజుడు "ఇంక ఆలస్యము చేయవద్దు. సేనలను పిలిపింపు"మని ప్రేమతో చెప్పగా రఘుకులమునందు బుట్టిన భరతుడు వేడుకతో సేననంతను బిలిపించెను.

**భరద్వాజుడు భరతునకు విందు పెట్టుట :**

ఋషిశ్రేష్ఠుడగు భరద్వాజుడంత అగ్నిగృహమున బ్రవేశించి మూడుమారు లాచనము చేసి రెండుమారులు పెదవులను కడుగుకొని రాజున కాతిథ్య

మిచ్చుటకయి విశ్వకర్మ నాహ్వానముచేసి సేనకాతిథ్య మొసగెదను. విశ్వకర్మయు, త్వష్టయు వేగముగా వచ్చి గృములను నిర్మింపుడు. ఇంద్రుడు మొదలైన దిక్పాలురు వచ్చి సర్వవిధములైన వస్తువులను తయారుచేయుడు. తూర్పునను పడమటను ఆకాశమందు భూమియందునున్న నదులు కొన్ని చెరకు రసమును, కొన్ని మద్యమును, కొన్ని ఇతరమైన పానీయముల నిటకు దెచ్చుగాక. విశ్వావసుడు హాహుడు హూహుడు మొదలగు దేవగంధర్వులును ఇరుతెగల దేవ వేశ్యలును, విశ్వాచి, ఘృతాచి, అలంబుస, నాగదంత, హేమ, నగ నివాసయగు హేమ, మిశ్రకేశి, ఈద్యనామ్ని మొదలుగా గల బ్రహ్మను ఇంద్రుని సేవించు స్త్రీలును తుంబురుడాదిగా గల సంగీత విద్వాంసులతో గలసిరండు. సంతోషము నొసగునదియు వస్త్ర భూషణములే పత్రములుగా గలదియు, అంగనలే ఫలములుగా గలదియునైన కుబేరుని చైత్రరథమా రమ్ము. చంద్రుడు భక్ష్యములను భోజ్యములను, లోపములేకుండ యిచ్చును గాక. అంతేగాక అనేక విధములైన పువ్వులతో గట్టబడిన పూలదండలను, మద్యమును, సిద్ధరసముతో సమానములయిన పానీయములను అనేక విధములయిన మాంసములను చంద్రుడిచ్చుగాక" అనుచు పద్మాసనాసీనుడై యోగమార్గంబున ఆ మౌని స్వరయుక్తమైన వాక్కులతో ఎక్కువైన శ్రద్ధతో చేతులు జోడించి జపతత్పరుడై తూర్పు ముఖముగా గూర్చుండి దేవతలను వేర్వేరుగా పేరుపేరున స్తోత్రము చేయగా వెంటనే మలయ పర్వతము మీద నుండియు దర్దుర పర్వతము మీదనుండియు సుఖము గలిగించు చల్లనిగాలి హాయిగా ఆ ఆశ్రమ ప్రదేశమున వీచెను. పువ్వుల వానలు కురిసెను. దశదిశలందును దుందుభులు మ్రోగెను. అంతటను దివ్యసుగంధములు వ్యాపించెను. అప్సరసల నాట్యములొప్పెను. దేవవేశ్యల యొక్క లయాన్వితమై మనోహరమైన స్వచ్ఛమైన వీణానాదములు వినిపించుట వారి రాకను తెలియజేసెను. ఎంతో సంతోషమును గలిగించు ఆ వీణారవము ఆగినంతనే సేనలన్నియు అచ్చట ఆనంద మతిశయింపజేయు మనోహరమయిన గృహముల ఏర్పాటును గాంచిరి. భూమియంతయు నైదు

యోజనముల దూరము సమతలమైనది. అందు నీలమణులు వైడూర్యముల వలెనున్న దట్టమైన పచ్చికబయళ్లేర్పడెను. వానియందు మారేడు, వెలగ, మాదీఫలము, పనస, మామిడి, ఉసిరిక మొదలగు వృక్షములు ఫలములతో గూడియుండుటచే చైత్రవన మనునట్లుండెను. నదులు గట్లపై చెట్లు తీగలు గలిగి నిండైన జలములతో వేగముగా అచ్చటకు వచ్చినవి. నాల్గు దిక్కులను సమముగా నున్న యిండ్లును, ఏనుగులు, గుఱ్ఱములు నుండుటకు తగిన చావడులును, తోరణములును, తెల్లని మేఘములవలె నున్నవియు, తోరణము లచే నలంకరింపబడినవియు, తెల్ల మాలికలచే నొప్పుచున్నవియు, దివ్య సువాసనలు గలవియునైన మేడల సమూహములును, విశాలములైన పడకలును, ఆసనములును,మఱియు బండ్లును, దివ్యమైన రుచులు గల అన్నములును, మంచి వస్త్రములును, విలువైన పాత్రలు గల్గి రాజులు నివసించదగిన గృహములును అచ్చట సిద్ధమైయుండెను. స్నానము చేయుట కును భుజించుటకును నిద్రించుటకును తగిన వసతులు గలిగియుండెను. భరతుడు భరద్వాజుని యాజ్ఞ ప్రకారముగా ఆయన శక్తిని మెచ్చుకొనుచు ఆ యుత్తమమయిన భవనమున ప్రవేశించెను. సేవకులు మంత్రులును వెంటరాగా భరతుడా భవనమునందలి రాజసింహాసనమును ఛత్రచామరములను చూచి అధికమైన భక్తితో వానికి ప్రదక్షిణము చేసి రామచంద్రుని తలంచుచు చామరమును తీసికొని వచ్చి మిక్కిలి ప్రీతితో మంత్రి కూర్చొనదగిన ఆసనము నందు కూర్చొనెను. తరువాత వరుసగా మంత్రులును పురోహితులును అతని వెనుక గూర్చుండిరి. సైన్యాధిపతియు సభాపతియును భరతుని ప్రక్కల నుండిరి. ఆ క్షణమునందే దివ్య ప్రభావము గల మహర్షి యొక్క మహిమచే పాయసములతో నిండిన ఏరులు కైకేయీతనయుని దగ్గర ప్రవహించినవి. ఆ నదీతీరమునందు తెల్లని సుద్దపూసిన వసతులుండెను. దివ్యాభరణములచే నలంకరించుకొన్న దేవవేశ్యలు యిరువది వేలమంది బ్రహ్మ పంపున అందరు ఆశ్చర్యముతో చూచుచుండగా అచ్చటకు వచ్చిరి. పగడములచేతను, నవవిధ

రత్నములచేతను, బంగారముతోను చేయబడిన అందమైన వివిధాలంకారము లతోనున్న స్త్రీలు కుబేరుని యాజ్ఞతో వచ్చిరి. సోకిన మాత్రముచేతనే మనస్సు వికలమై పిచ్చిపట్టునట్లు చేయగల సౌందర్యము గల యిరువది వేలమంది యప్సరసలు నందనవనము నుండి మిగుల కుతూహలముతో వచ్చిరి. సూర్యుని వంటి తేజస్సు కలిగిన తుంబురుడు, నారదుడు, గోపుడు మునియాజ్ఞచే ఆ రాజకుమారుని సన్నిధియందింపుగా పాడిరి. మిశ్రకేశియు, అలంబుసయు, పుండరీకయు, వామనయు అందముగా భరతుని ముందు నాట్యమాడిరి. చైత్రరథమను కుబేరుని యుద్యానవనము నుండి పలు విధములయిన పువ్వులచ్చటికి వచ్చెను. ఆ మునీశ్వరుని యాజ్ఞచే మారేడు చెట్లు మృదంగమును వాయించువారై, రావి చెట్లు నర్తకులై, తాండ్ర చెట్లు మనోహరమగు తాళమును వేయువారై ఆ రేయి నానందమును గూర్చెను. తరువాత తాడి చెట్లును, బొట్టుగు చెట్లును, గానుగ చెట్లును, సరళ వృక్షములును, గుబ్జలై తిరుగుచుండ, ఇరుగుడు చెట్లును (శింశుపా), ఉసిరిక చెట్లును, నేరేడు చెట్లును (మాలతి) పూవుల గురువింద తీవెలును, జాజితీగలును, మల్లెతీగలును సుందరరూపములొప్పు స్త్రీలై తిరుగుచు ఆ మహాముని యాశ్రమమున విననింపైన మంచి మాటలను చెవుల పండువుగ వినిపించుచున్నవి. మద్యము కావలసిన వారు వచ్చి త్రావుడు. ఇదిగో మద్యము, ఆకలిగొన్నవారు వచ్చి గ్రోలుడు ఇవిగో పాయసములు. ఈ మాంసములను భుజింపుడు. పదండి పదండియని చెప్పుచు మెఋపుదీగల వంటి దేహములు గల యెనిమిదేసి మంది స్త్రీలొక్కొక్కనికి సంతసము గల్గునట్లుగా తలయంటి నలుగుపెట్టి సమృద్ధిగా నీరు పోయుచుండిరి. అందమైన పట్టు వస్త్రముల నిచ్చిరి. దగ్గర నిలిచి వీవనలతో విసరిరి. మంచి పాత్రములతో మధువును కమ్మగా త్రాగనిచ్చిరి. ముని యాజ్ఞ ననుసరించి కొందఋ పురుషులు వాహనములైన ఏనుగులకు గుఱ్ఱములకు, మేలిరకములైన కంచర గాడిదలకు లోటు లేకుండ మేతలు పెట్టిరి. రాజు యొక్క సేనలో నున్న ప్రయాణ సాధనములైన జంతువులన్నింటికి ఎక్కువై పోవునట్లు పేలములను సారాయము

కలిపిన చెఱకు రసమును పెట్టిరి. రౌతులు గుఱ్ఱములను కట్టకనే విడచిరి. మావటీంద్రేనుగులను చూచుట మానివేసిరి. ఎందుచేతననగా పొట్టలునిండు నట్లు తిని, పడి పొర్లుచు వారు మైమరచియుండిరి. వారి కోరికలన్నియు నెరవేరినవి. తిరిగి దేవవేశ్యలు చేతులు పట్టుకొని వారివెంట వచ్చుచుండిరి. ఇట్లు సుఖమనుభవించుచు ఆ సైనికులు మేమిక దండకారణ్యమునకు వెళ్లము. అయోధ్యకు కూడ వెళ్లము. ఇచ్చటనే యుండెదము. రాజులలో శ్రేష్ఠుడైన రఘురామచంద్రునకు క్షేమము కల్గుగాక. కైకేయి కుమారుడైన భరతునకును క్షేమమగు గాక. వారెట్లు వెళ్లిన వెళ్లుదురుగాక మేము మాత్రమెక్కడకును పోమని కేకలు పెట్టుచుండిరి. ఆడెడువారును, పాడెడివారును, వారు వీరు కలసి నవ్వుచున్నవారును, పరుగులు పెట్టువారును, పువ్వులను వెదజల్లువారును అయి సైనికులందఱును, ఇదే స్వర్గము అని గర్జించుచుండిరి. ఆనందముగా తినియు, మరల తినగోరి కడుపులలో వెలితి లేకుండుటచే విచారించుచుండిరి. చెలికత్తెలు సేవకురాంద్రును, ఇతర స్త్రీలును క్రొత్త బట్టలను ధరించిరి. ఆవేళ ముని యొసంగిన ఆహారము తప్ప రాజభటు లెవ్వరును ప్రొయ్యులను రాజవేయరైరి. గుఱ్ఱములును, కంచరగాడిదలును, ఒంటెలును, ఆవులును, మృగముల సమూహములును, ఏనుగులును, అనేక విధములైన యాహారము లను ఆయాసమగునంతగా తిని ఆ సమయమున తృప్తిని బొందెను. తల మాసినవాడుగాని, శరీరము మాసినవాడుగాని, బట్టలు మాసినవాడుగాని, ఆకలి తీరనివాడుగాని ఆ సైన్యమందొక్కడైనను, కంటిలో కలికమునకైనను లేకుండెను. అనేక విధములైన మాంసపురాసులును, అనేక విధములైన పండ్లును, లెక్కలేనన్ని పూలమాలికలతో గట్టబడిన జెండాలును, అనేకములైన పాత్రములను అచ్చట వెలుగుచుండెను. ఆ వన సమీపములందు ధేనువులు మిక్కిలి రుచిగలిగిన పాలను చన్నవియునట్లు పిదికినవి. నాల్గు దిక్కులందును, కల్లు పాయసము, మాంసము నూతులలో నిండి అధికముగా కనిపించుచుండెను. కోళ్ల యొక్కయు, నెమళ్ల యొక్కయు, జింకల యొక్కయు వండిన మాంసములు బంగారు

పాత్రములయందు నిండియుండెను. చెఱకురసముతో నిండిన బావులొప్పు చుండెను. స్నానమున కుపయోగించు సుగంధ కల్కములును, సున్నిపిండ్లును, వేడినీరుగల కొలకులును సిద్ధముగనుండెను. పండ్లు తోముకొనుటకుపయోగ పడునట్టి సుందరముగానున్న కుంచెలవంటి పుడకలన్నిచోట్ల నుండెను. ఆవులు గుఱ్ఱములు విశ్రమించుటకు యోగ్యములైన రేవులును, కమలములు, కలువలు గల పవిత్రజల సమృద్ధములగు దిగుడుబావులును, చెఱువులును ఒప్పుచుండెను. పీటలు, మంచములు, బంగారు కంచములు, మామిడి రసము గల చెండులును, మంచి లవంగములు ఏలకులు, కమ్మని పెరుగులు గల కడవలును, కాళ్లకు ధరించు ముచ్చెలజోళ్లును, పావుకోళ్ల జతలును, కిఱ్ఱుచెప్పుల జతలును, అద్దములును, ఎన్నికైన కాటుక బరిణలును, కావలసినన్ని దువ్వెనలును ఒప్పుచుండెను. తిన్నవి వేగముగా అరుగుటకు ఔషధములతో తయారుచేసిన జలములతో గూడిన చోట్లును అచ్చటనుండెను. కలలో చూచుచున్నామా యనునట్లు అద్భుతముగా మునిచేత చేయబడిన ఆ మధురమైన విందును చూచినవారై ఆ జనులందఱు చెప్పవీలులేనంతగా వింతపడిరి. నందనవనములో సంచరించు దేవతల సమూహముల వలె సంతసముతో ఆ మునీంద్రుని ఆశ్రమమున ఆ జనులందఱును సంచరించుచుండగా ఆ రాత్రియంతయు గడచిపోయెను. గంధర్వులును, దేవతాస్త్రీలును, నదులును, మిగిలిన వన్నియును దేవతల సమూహముతో కూడ ముని యొక్క యాజ్ఞ ననుసరించి భూమిని విడచి స్వర్గమునకు వెళ్లెను. పానీయములను త్రాగిన మత్తును, తిన్న పదార్థముల మత్తును, వంటిమీద ధరించిన పువ్వుల యొక్క వాసన శరీరములందధికముగా పూసికొన్న చందనమును, దివ్యములైన అలంకారములును, విలువ గలిగిన వస్త్రములును గలిగి సైనికులందఱును రాత్రి అనుభవించినట్లుగానే తలంచుచు నుండిరి. ఈ ప్రకారముగా భరతుడు సేనా సమూహముతో రాత్రిని గడపి తెల్లవారగనే భరద్వాజుని దర్శించుటకు వెళ్లెను. ఆ మహర్షియు అతనిని జూచి ఎక్కువైన ప్రేమతో నిట్లనెను.

# తొంబది రెండవ సర్గము

## భరతుడు భరద్వాజర్షిని రామాశ్రమంబునకు దారి యడుగుట :

"ఓ రాజకుమారా! రాత్రి మా ఆశ్రమవనమునందు నీకు సౌఖ్యమును సంతోషమును కలిగినదా? మా ఆతిథ్యము మీ సేనల మనస్సులను సంతోషమును కలిగించినదా?" అనగా భరతుడు వినయముతో నమస్కరించుచు మునితో నిట్లనెను. "సజ్జనులచే పొగడదగిన శీలముగల ఓ ఋషీ! రాత్రి యందఱును సుఖసంపదయందు తేలియాడిరి. ఆ భోగము లిట్టివి యట్టివియని చెప్పుట నా శక్యమా? మంత్రులకును జనులందఱకును సర్వమును సంపన్న మైనది. మంచి పదార్థములును, శాల్యన్నములును మొదలయిన వన్నియును మాకు కూడ తృప్తి గలిగించినవి. అన్నగారైన రామచంద్రుని చూడవలెనను తొందరకలిగి యున్నాను. ఓ మునివర్యా! నాకు సెలవొసంగుము. నా యొక్క మనవినాలకించి నాయందు ప్రసన్నుడవై స్నేహముతో నన్ను సాగనంపుము. ఓ మునీశ్వరా! మా యన్న యెచ్చట నున్నాడు? ఆయన యొద్దకు వెళ్లుటకు మార్గమేది? ఆ ప్రదేశమిక్కడ కెంత దూరమున్నది? ఇప్పుడే వెళ్లదలచితిని." అనగానే మునిచంద్రుడిట్లనెను. "ఈ ప్రక్క నుండి బయలుదేరి రెండున్నర యోజనములు వెళ్లగా అడవిలో జనసంచారములేని, చూచుటకందమైన చిత్రకూటమను పేరుగల పర్వతమొక్కటి యున్నది. దానికుత్తరదిక్కున అందమైన వృక్షములతోను, లతలతోను సుందరమైన వనములు గల మందాకిని యను నది ప్రవహించుచున్నది. ఆ నదికిని పర్వతమునకును మధ్యనున్న ఆశ్రమముననే నీ యన్న నివసించుచున్నాడు. ఇది నిజము సుమా. తండ్రీ! యిచ్చట నుండి దక్షిణముగా నేగుము. కొంత దూరము వెళ్లగా నైఋతి దిశయందొక మార్గము కనిపించును. ఆ దారివెంట బలములను నడిపించుకొని వెళ్లుము. అట

సుగుణధాముడగు రాముని జూచెదవు." ఇట్లు భరద్వాజుడు వెడలు మార్గమును చెప్పగా దశరథుని భార్యలందఱును తమ వాహనముల నుండి దిగి ఆ మునీశ్వరుని చుట్టు నిలిచి నమస్కరించిరి. వెలవెల్లనయిన కృశించిన శరీరముతో కౌసల్య సుమిత్ర తన ప్రక్కన రాగా ముని యొక్క పాదములకు మ్రొక్కి నిలిచెను. కోరిన కోరిక తీరనిదియు, లోకులందఱిచేత నిందింప బడినదియునగు కైక ఋషీశ్వరునకు మ్రొక్కి సిగ్గుతో భరతుని యొద్ద నిలిచెను. అంత ముని భరతుని జూచి "ఓ సూర్యవంశ్యా! వీరిలో మీ తల్లులెవరో" తెల్పుమనగా భరతుడిట్లనెను.

**భరతుడు భరద్వాజునకు తన తల్లుల నెఱింగించుట :**

"పుట్టెడు దుఃఖభారముతో బాధనొందుచు, ఆహారమును గొనక కృశించుచు ధర్మదేవత యనునట్లు కనిపించుచున్న సాధ్వి దశరథుని పట్టపుదేవి యగు కౌసల్య ఈమెయే సుమా పురుషులలో శ్రేష్ఠుడును సింహ పరాక్రముడును అగు రాముని అదితి మాధవుని గాంచినట్లు కనినతల్లి ఈమెయే. అదిగో ఆమె యెడమ భుజము నాధారముగాగొని భరింపరాని దుఃఖముతో తపించుచు అరణ్యమునందు పువ్వులు వాడిన గన్నేరనునట్లు వెల్లబోయి కనిపించుచున్న ఆమెయే ప్రఖ్యాతిచెందిన శీలముగల సుమిత్ర సుమా! ఆమె పుత్రులు మంచి కీర్తి గలవారగు లక్ష్మణుడును ఈ చిన్నతమ్ముడగు శత్రుఘ్నుడును ఓ మునీశ్వరా! ఈమెయే సుమా! మహాపరాధమును జేసి పవిత్రులగు మా అన్నదమ్ములకు ప్రాణము మీదకు దెచ్చినది. రాజును స్వర్గమునకు బంపినట్టిది. ఆ మహా పాపాత్మురాలు. ఆ కఠిన స్వభావురాలు. మూఢచిత్తురాలు. దుర్మార్గముగా భోగముల సంపాదించినది యగు కైకేయి యిదియే సుమా. ఆర్య రూపమున నున్న అనార్యురాలు. దయారహితురాలు. పాపపు తలంపులు గలది. నా యొక్క సంతాపమునకు మూలకారణమయినట్టిదియునగు ఈ మూర్ఖురాలే నన్ను గన్నతల్లి మునీంద్రా!" అని బాష్పములు కారుచుండగా స్వరము తొట్రుపడు చుండగా పామువలె వగర్చుచు కన్నులెఱ్ఱవడగా పల్కుచున్న అతనిని జూచి

ముని యిట్లనెను. "ఓ భరతా! నీ తల్లిని నిందించుటెందులకు? ప్రఖ్యాతమైన కీర్తి గలవాడా! రామచంద్రుని వనవాసము తపస్వులకును, దేవతలకును మానవులకును దానవులకును మహాసుఖమును గలిగించును సుమా.

**భరతుడు చిత్రకూటమునకు ప్రయాణమగుట :**

ఇక మీరు ప్రయాణము చేయు"డని చెప్పగా భరతుడు నమస్కరించి యేనుగులు, గుఱ్ఱములు, రథములు మొదలగు అనేక విధములైన వాహనములతో వేగముగా బయలుదేరి ముని చెప్పిన దారివెంట వెళ్లజొచ్చెను. బంగారు ఆభరణములలంకరించిన గుఱ్ఱములను, రథములను అధిరోహించి జనులందఱును మిక్కిలి వేగముగా వరుసలు వరసలుగా కుతూహలముతో పయనించిరి. బంగారపు మేఖలలతో నలంకరింపబడినవై ఆడ యేనుగులును మగ యేనుగులును గంటలు మ్రోగుచుండగా నేగుచు వానకారున మేఘ సమూహములు గర్జించుచు పోవుచున్నట్లొప్పెను. చిన్నవియు, పెద్దవియునగు అనేక విధములగు మంచి విలువైన వాహనములు పోవుచుండగా భటులు పాదచారులై పోవుచుండిరి. కోడలిని గొప్ప తేజస్సు గలిగిన పుత్రులను చూచుటెప్పుడోయను సంతోషముతో కౌసల్యాదులు తమ వాహనములను తొందరపెట్టి నడిపించుచుండిరి. భరతుడు బాలభానుని వలె చంద్రుని వలె నొప్పు పల్లకీనెక్కి వెళ్లుచుండెను. అతనివెంట సైన్యమంతయు పెద్ద మేఘమో యనునట్లు వెడలెను. అట్లు వెళ్లి వెళ్లి దక్షిణదిక్కున గల వనములను దాటి గంగ యొక్క ఆవలి యొడ్డున బెదరిన పక్షులు మృగములు గల యొక్క వనమున బ్రవేశించెను.



# తొంబది మూడవ సర్గము

**ఆ**శ్చర్యకరమగు ఆ గొప్ప సైన్యమును జూచి కలతచెందినవై ఆ వనములోని అడవి యేనుగులు పరువులు పెట్టుచుండగా ఆ త్రొక్కులాటలో అల్లకల్లోలము జెంది ఎలుగుబంట్లును చుక్కలలేళ్లు, చారలదుప్పులు పర్వతములయందలి, నదీతీరములయందలి వనములందంతట వ్యాపించి కనిపించెను. సముద్రమును బోలిన ఆ సైన్యము వర్షించు మేఘమోయనునట్లు భూమినంతయు ఆక్రమించెను. అతి చంచలములైన గుఱ్ఱములచేతను, మదించిన యేనుగల సమూహముచేతను నిండియున్న ఆ సైన్యము సాగుచుండగా చాలసేపు వరకు భూమియే కానరాదయ్యెను. ఈ విధముగా కొంత దూరము ప్రయాణము చేసి వాహనములలసిపోగా ఇంద్రసముడగు భరతుడు వసిష్ఠమౌనిని సమీపించి యిట్లనెను. "మునీంద్రా! ఈ వనమును జూచితివా? మనకు భరద్వాజ ఋషి చెప్పినచోటు ఇదివలెనే తోచుచున్నది. అదియే చిత్రకూట పర్వతము గాబోలును. ఈ నది మందాకినియే కావచ్చును. చూచితిరా?

**భరతుడు శత్రుఘ్నునకు చిత్రకూట వనమును వర్ణించి చెప్పుట :**

నల్లని మేఘమువంటి శోభతో నొప్పారుచున్న ఈ వనమును చూచితిరా" యని పలికి లక్ష్మణుని తమ్ముడగు శత్రుఘ్నుని జూచి "తమ్ముడా! చూడుము ఈ పర్వత సాణువులను పర్వతాకృతిగల మన యేనుగులెట్లు పాడుచేయు చున్నవో. ఈ యేనుగులు నడచుటచే రాళ్లన్నియు పొడియయ్యెను. చెట్లన్నియు మృదువైన పుష్పములను సుగంధములు వ్యాపించునట్లు రాల్చెను. ఈ దృశ్యము వర్షర్తువునందు నల్లని మేఘములు వర్షబిందువులను రాల్చుచున్నట్లున్నది. దేవతలును కిన్నరులును సంచరించు స్థలమిదే చూడుము. కలతచెంది యిటు నటు తిరుగుచున్న మృగములు గల ఈ వనము మొసళ్లు నివసించు సముద్రము వలె కనిపించుచున్నది. చూచితివా? తమ్ముడా! సైనికులు తోలుచుండగా భయపడి

నాలుగు దిక్కులకు పరుగులు పెట్టుచున్న మృగములు గాలిచే నెగురగొట్టబడిన శరత్కాల మేఘముల గుంపులు ఆకాశమునందు పరుగులు పెట్టుచున్నట్లున్నవి చూచితివా? నల్లని మేఘముల వంటి తమ తలవెంట్రుకలను పైకెగయగట్టి ముడివేసికొని మన భటులు చాలా పూవులను పెట్టుకొని దక్షిణ దేశీయులా యనునట్లొప్పుచున్నారు చూచితివా? మనుష్యులు లేనటువంటి ఈ పర్వతము జనుల సమూహములతో నిండి యిప్పుడు మన యయోధ్యా పట్టణమువలె కన్నులపండువై యొప్పుచున్నది చూచితివా? గుఱ్ఱముల గిట్టల తాకిడిచే రేగిన దుమ్ము ఆకాశమంతయు పూర్తిగా కప్పివేయగా వెంటనే గాలి దానినిటునటు చెదరగొట్టి నాకానందమును కలిగించుచున్నది. ఓ తమ్ముడా! ఈ ప్రదేశము చూచుటకు కన్నుల పండువుగ నున్నది. ఇది కేవలము స్వర్గతుల్యమైయున్నది. ఈ ప్రదేశమున తపోవనములుండునని తోచుచున్నది. పువ్వులతో గప్పినారా యనునట్లు చుక్కలమృగము లొప్పుచున్నవవిగో. ఒక కొంత మంచి సైన్యమును రామునాశ్రమ మెక్కడనున్నదో వెదకుటకు పంపించుట మంచి"దనగా విన్నవారై కొంతమంది యచ్చటచ్చట వెదకి యొక్కచోట పొగ వచ్చుచుండుట చూచి వచ్చి కైక పుత్రునకిట్లు చెప్పిరి. "అదిగో చూడుము. అచ్చట నుండి పొగ వచ్చుచున్నది మనుష్యులు లేకున్నచో పొగ యెట్లు వచ్చును? కాన అచ్చట రామలక్ష్మణులు తప్పక యుండెదరు సుమా! ఒకవేళ వారు కాకున్నచో రఘురామునితో సమానులైన మౌనులైనను తప్పక యుందురు" అని పల్కగా వారి మాటలను విని వారందరితో భరతుడిట్లనెను. "సైన్యములతో గూడ మీరందఱిచటనే నిలువుడు. నేనును, సుమంత్రుడును, గురువైన వసిష్ఠుడును ముందు వెళ్లెదము" అని చెప్పగా ఇష్టములేనిదైనను సైన్యమచ్చట నిలువగా భరతుడును దూరముగా నున్న ఆ పొగయందే దృష్టి నిలిపి అటువైపు వెళ్లుచు రామునందే చిత్తమును నిశ్చలముగా నిలిపి ఆ రాఘవశ్రేష్ఠుని వేగముగా కనులపండువుగా చూచెదను గదా! యని మనస్సునందు హర్షాతిశయమును బొందెను.

# తొంబది నాలుగవ సర్గము

## శ్రీరాముడు సీతకు చిత్రకూటమున వినోదములు చూపుట :

అక్కడ చిత్రకూటమునందు శ్రీరాముడు సీతతో గూడి ప్రీతితో చాలకాలము నుండి ఆ పర్వతముపై నుండినను, ఆ పర్వతము యొక్క సొగసులు చూచుటకు క్రొత్తక్రొత్తవై ఎక్కువైన వేడుకను గలుగజేయుచుండగా తెల్లవారగనే పనులన్నిటిని పూర్తిచేసికొని ఆ పర్వతమునందు సీతకును తనకును సంతోషమును కలిగించుచున్న యొక చోటున ఇంద్రుడు శచీదేవికి వలె దేవసమానుడగు రాముడు సీతాదేవికి చూపుచు ఆమెతో నిట్లనెను. "ఓ వనితా! ఈ పర్వతము యొక్క అందమును జూచుచున్నచో శ్రేష్ఠమైన రాజ్యమును విడచి వచ్చుటయును, మిత్రసమూహమును వీడివచ్చుటయును, కొంచెము కూడ వ్యథను కలిగించుటలేదు సుమా! ఓ పద్మహస్తా! తామరరేకుల వంటి కనులు గల ఓ సీతా! అదిగో చూడుము. ఆకాశమునంటుచున్న శిఖరములు గలిగి కదలాడుచున్న తుమ్మెదల గుంపులతో, చిలుకలతో మృగములతో సుందరములైన చోటులను చూచితివా? ఇంపు గలిగించుచు కొన్ని పచ్చగాను కొన్ని ఇంద్ర నీలములవలె నీలముగను, కొన్ని స్ఫటికముల వలె తెల్లగను, పగడములవలె ఎఱ్ఱగను, పీతాంబరమువలెను, మొగలివలెను పచ్చగను ప్రకాశించుచున్నవి. ఓ చెలీ! క్రూరత్వమును వీడి సివంగులును భయంకరములైన పెద్దపులులును ఈ పర్వతకూటములందు విహరించుచుండగా, అందమైన ధ్వనులతో గూడిన మనోహర పక్షిసమూహములతో ఈ పర్వతము మిక్కిలి యందమై యున్నది. మద్ది, మామిడి, ఊడుగు, చీకటి మున్నగు వివిధములైన పువ్వులు, పండ్లు, నీడ గల వృక్షములతో నెంత యందముగనున్నదో చూచితివా? ఓ చిలుకల

వంటి పలుకులు గలదానా? అదిగో కిన్నర దంపతు లేకచిత్తులై మనోహరములగు విహారవిలాసములతో పర్వతాగ్రమునందు విహరించు చున్నారు. వారిని చూచుటచే శరీరము గగుర్పొడుచుచున్నది. తమ వస్త్రములను ఆయుధములను చెట్లకొమ్మలందుంచి అధికమైన యానందముతో విద్యాధరులు తమ స్త్రీలతో గూడి ఆయా ప్రదేశములందు క్రీడించుచుండిరి. వారిని చూడుము. భూభాగమును భేదించుకొని ప్రవహించుచున్న ఆ జలపాతములను చూడుము. దేవీ! అవి మదించిన యేనుగుల గండస్థలముల నుండి స్రవించు మదధారలవలె నొప్పుచున్నవి. చూడగా చూడగా కనులకు విందొనరించుచున్న వివిధ పుష్పముల యొక్క సువాసనలను మోసికొని గుహల నుండి వచ్చుచున్న చల్లని గాలులెవ్వని మనస్సునకు సంతోషమును గలిగింపకుండును? ఓ తరుణీమణీ! నీవును, లక్ష్మణుడును, నన్ను సేవించుచుండ నేనీ యడవులందెన్ని యేండ్లున్నను మనస్సునకు విచారము కలుగదు సుమా! సుందరమైన పుష్పములు, పండిన పండ్లు, చిలుకలు మున్నగు పక్షి సమూహములు గల ఈ చిత్రకూటమును విడువకుండ నేను సంతోషముతో సంచరింతును. వికసించిన పద్మదళముల వంటి కన్నులు గల ఓ సీతా! ఈ వనవాసముచేత తండ్రి ఋణమును దీర్చుటయును, తమ్మునకు ప్రీతి గలిగించుటయును అను రెండు విధములైన ఫలితములు కలిగినవి సుమా! ఓ చిన్నదానా! ఈ చిత్రకూట పర్వతమునందు మనోవాక్కాయములకు సంబంధించిన యనేక భావములను వేడుకతో చూచుచు ప్రేమతో నన్ను గూడి విహరింతువా? ఓ దేవీ! ఈ వనవాస వ్రతము మా పెద్దలందఱును మోక్షదాయకమనియు, సంసార బంధనములను ఛేదించునది యనియు గొప్ప ఆదరముతో చెప్పిరి. పద్మమువంటి ముఖము గలదానా! ఈ పర్వతమునందెచ్చట చూచినను నల్లని, తెల్లని, ఎఱ్ఱని మఱియు ననేక విధముల రంగులు గల వందలకొలది చాపరాళ్లు ఒప్పుచున్న విధమును చూచితివా? రాత్రులందీ రాళ్లయందు గొప్ప ఔషధుల కాంతులుపడి ప్రకాశింపగా, అవి

దిక్కులకు వ్యాపించగా ఈ కొండ యందంతట అగ్నిజ్వాలల సమూహములవలె నొప్పుచుండును. ఈ పర్వత ప్రదేశములు కొన్ని యిండ్లవలెను, కొన్ని లేతతోటలవలెను, కొన్నిచోట్ల ఒక్కటే రాయివలెను ఒప్పుచున్నవి. కన్నుల పండువుగా చూడుము. ఈ చిత్రకూట పర్వతము భూమిని పెకలించుకొని వచ్చినట్లు కన్పించుచున్నది. పున్నాగములు నల్లకలువలు భూర్జపత్రములు, మీద పరువబడిన దుప్పట్లవలె నొప్పగా అవిగో కాముకుల తామరలు పరచిన పాన్పులను చూడుము. కాముకుల శరీరముల యొక్క రాపిడులచే కందిపోయి నలిగిన తామర పువ్వుల దండలను చూడుము. వారు అనేక విధములైన ఫలములను సాపడి విత్తనములను టెంకలను విడచిపెట్టినారు. నానావిధములైన ఫలములు నీళ్లు గలదియని ప్రసిద్ధి చెందినదగు ఈ చిత్రకూట పర్వతము యొక్క అందమును చూచితివా? ఉత్తర కురుభూములను, మానస సరోవరమును మించియున్నది సుమా! ఓ సీతా! ఈ వనవాస కాలమంతయును నీవును, లక్ష్మణుడును ప్రేమతో నన్ను సేవించుచుండగా సంతోషముతో ఇచ్చటనే గడపివేసి తరువాత రాజ్యసంపదను పొందుటకై వెళ్లెదను."



# తొంబది యైదవ సర్గము

## శ్రీరాముడు సీతకు మందాకినీ నదిని వర్ణించి చెప్పుట :

అని చెప్పుచు పర్వతమును దాటి మందాకినీ నదిని చూపించి "చిత్ర విచిత్రమైన యిసుక తిన్నెలతోను, అందముగా కూయుచున్న బెగ్గురు పక్షులతో హంసలతోను, బంగారపు పద్మములతోను ఒప్పుచున్న ఈ నదిని చూచితివా? సీతా! సుందరమైన వికసించిన పువ్వుల చేతను, ఫలముల చేతను భారముగా నున్న నానావిధములైన వృక్షములు గట్లయందుండగా ఈ నది కుబేరుని యొక్క సరస్సువలె తోచుచున్నది సుమా! ఓ కాంతా! చూచితివా? ఇచ్చట జంతువులు నీరు త్రావుటచేత కలగి ఆ నీరు కలుషితమైనది. అయినను వింతయందముతో నొప్పుచు మదికి వేడుక కలిగించుచున్నది. సమయము తప్పక ఋషి సమూహములు జడలను లేడిచర్మములను ధరించి యిందు స్నానము చేయు చున్నారు. అతి కఠినమైన నిష్ఠగలవారు కొంతమంది అదిగో చేతులు పైకెత్తి సూర్యోపాసన చేయుచున్నారు. గాలిచే కదలాడుచున్న చెట్ల కొనల యందలి పుష్పములు ఇటునటు నూగుచుండగా కొండయే నటించుచున్నట్లున్నది చూచితివా? ఓ మనోహరగాత్రీ! ఒకచోట జలములు ముత్యముల కాంతితో ప్రకాశించుచున్నవి. ఓ విశాల నితంబా! ఒకవంక మిక్కిలి మనోహరములైన ఇసుక తిన్నెలు ప్రకాశించుచున్నవి. కలువకంటీ! తుమ్మెదలు వ్రాలిన పుష్ప సమూహము (మకరాంకుని శరములు) ఊయలలూగుచున్నవి చూచితివా? ఓ పద్మహస్తా! ఒకచోట కుతూహల మతిశయింపగా సిద్ధజనులు వాహ్యాళి తిరుగుచున్నారు. ఓ నీలవేణీ! గాలిచే కొన్ని పూవులు గట్లమీద రాలగా కొన్ని నీళ్లలోరాలి తేలుచున్నవి. ఓ తరుణీ చక్రవాక పక్షులు సరసోక్తులతో పూల

పాన్పుల నెక్కుచున్నవి. ఓ బాలా! ఈ చిత్రకూట పర్వతమును ఈ మందాకినీ నదిని చూచినచో పట్టణమును జూచుటకంటెను, నిన్ను చూచుటకంటెను సంతోషము కల్గుచున్నది సుమా! చిగురాకువంటి మేనుగల ఓ సీతా! ఇంద్రియ నిగ్రహము చిత్తశాంతి కలవారును పాపరహితులును తపస్వులును అయిన సిద్ధులు స్నానము చేయుటచేత పవిత్రమైన ఈ మందాకినీ నదియందు నాతో గలసి స్నానము చేయుము. నీ చెలికత్తెతో గూడి జలకేళి యాడు విధముగా నాతో కలిసి ఈ నీటియందు జలకేళులాడుము. నీ యందమును జూచి సిగ్గుపడి తెల్లతామరలు నెఱ్ఱతామరలును ఓ కలికీ! ఇందు మునిగిపోగలవు. ఈ వనములో నున్న మృగములే పౌరజనులనియు, ఈ పర్వతమే యయోధ్యయనియు, ఈ నదియే సరయూనది యనియు భావించి ఓ జలజాక్షీ! ఇందు సంతోషముతో సంచరింపుము. నా మాట నతిక్రమింపక లక్ష్మణుడు సేవించుచుండగా జానకీ! నీవు నా మనస్సున కనుకూలముగా నడచుచుండగా, ఈ భూమియందింతకన్న సౌఖ్యము నాకున్నదా? మూడువేళలందును ఈ మందాకినియందు స్నానము చేయుచు తేనెతో గూడిన దుంపలను దినుచు నీతో గూడ సంతోషముగా నిందుండెదను. నేను రాజ్యమునైనను అయోధ్యనైనను కోరను సుమా! ఏనుగుల గుంపులు గలదియు, ఏనుగులు, సింహములు, కపీశులు మొదలగు వానిచే త్రాగబడు జలము గలదియు, పువ్వులతో నిండిన వృక్షములు గలదియు నగు ఈ నది ఓ సుందరీ! యెవ్వరికైన సంతోషమును కలిగింపకుండునా?"



# తొంబది యాఱవ సర్గము

**అ**ని జనకులమున బుట్టిన శ్రీరాముడు తన సతికి చెప్పుచు చిత్రకూట సానువునందు విశ్రమించి "ఇది పవిత్రమైనది, ఇది రుచికరమైనది – ఓ సుదతీ! ఇది బాగుగ కాలినది" యని మాంసమును ఆమెకు జూపుచుండగా ఆకాశమునంటునట్లుగా పెద్ద ధ్వనియు, దుమ్మును రేగినవి. ఆ ధ్వనికి కలతజెంది ఆ అడవియందుండు మృగములును, పక్షులును, ఏన్గుల గుంపులును గగ్గోలుపడి చెదరిపోయి నానాదిక్కులకు పరుగెత్తుచుండ రామచంద్రు డది చూచి లక్ష్మణునితో "లక్ష్మణా! చూచితివా? భూమియొక్క ధూళి మిన్ను ముట్టుచున్నది. భయంకరమైన మహాధ్వని యధికమగుచున్నది. ఏనుగులో, అడవి దున్నయో, సింహపు భయముచే లేళ్లో, దిగంతములకు వేగముగా పరువెత్తుచున్నవి. లేకున్నచో ఏ రాజైన వేట నిమిత్తమై వచ్చుచున్నాడో, లేక యేదేని క్రూరమృగము వచ్చినదో. చూడగా ఇచ్చట ఒక్క పిట్టయయినను గనిపించుటలేదు.. దీని కారణమేమో తెలిసికొని రమ్మ"నగా లక్ష్మణుడు వెళ్లి పువ్వులతో నున్న యొక చెట్టునెక్కి తూర్పువైపుగా జూచి తిరిగి యుత్తర దిక్కు పరికించి చూడగా ఆ దిక్కునందు ఒకానొక గొప్ప సైన్యము తమదెసకే వచ్చుచు దూరమున గనిపించెను. గొప్పవైన రథములు, గజములు, గుఱ్ఱములు, భటు సమూహములు గల గొప్ప సైన్యమును జూచి అటనుండియే రాముని జూచి "అన్నా! వేగముగా అగ్నిని చల్లార్పుము. నీ ధనుస్సు నెక్కుపెట్టుము. సీతాదేవిని గుహలో నుండుటకై పంపుము. ముఖ్యముగా కవచమును ధరింపుము. అన్నయ్యా! గొప్ప మోసము వచ్చినది సుమా!"

**లక్ష్మణుడు శ్రీరామునితో భరతుడు సేనతో వచ్చుట తెలుపుట :**

అని చెప్పుచున్న లక్ష్మణునితో "ఓ అనఘా! ఆ సైన్యమెవ్వనిదో జాగ్రత్తగా చూడు"మనగా లక్ష్మణుడు ఆ సైన్యమును తన కనుల జంటతోనే కాల్చివేయు నట్లుగా చూచి మండిపడి యిట్లనెను. "అన్నా! గొప్పవైన రాజ్య సంపదలనన్నిటిని పుచ్చుకొని తాను రాజ్యాభిషేకమును చేసికొన్నవాడై మనలను చంపుటకై కైక

పుత్రుడైన భరతుడు వచ్చుచున్నవాడు సుమా. ఆ గొప్ప రథమందు విశాల కాండము గల ఎఱ్ఱకాంచన వృక్షము గుర్తుగా గల జెండా కనిపించుచున్న దదిగో చూడుము. మనసునందు సందేహమును విడువుము. వచ్చుచున్న వాడతడే సుమా! శౌతులును మావటీంద్రులును, గుఱ్ఱములను, ఏనుగులను నెక్కి ఆయుధములను ధరించి వేగముగా నిటు వచ్చుచున్నారు. మనమిప్పుడే విండ్లను వాడి బాణములను పట్టుకొని కొండ నెక్కుటయో? ఇచ్చటనే యుండుటయో నీవెట్లు తలంచుచుంటివి. ఓ రాజా! నేడు యుద్ధములో నీతడు మనకు చిక్కును, నీకును, నాకును, సీతకును భరింపరాని కష్టమును గూర్చెను. శాశ్వతమైన యైశ్వర్యము నుండి నిన్ను తొలగించెను. మనస్సునందపకారమును తలపెట్టెను. శత్రువైన ఆ కైక పుత్రుడు మఱల మన మీద పడుటకై వచ్చుచున్నాడు చూచితివా? భయంకరములైన నా బాణములతో అతని గర్వమును బూడిద గావించి చంపివేసెదను. ఈ భరతుని చంపుటలో ఒక్క పాపమైనను లేదని నాకు తోచుచున్నది. దుష్టమైన నడవడి కలవానిని, మునుపు మనకపకారము చేసినవానిని పరిత్యజించినను అధర్మమేమియు లేదని పెద్దలు చెప్పుదురు. వినుము.. ఇతడు ధర్మము విడచి నడచినవాడు కాన ఈయల్పుని జంపెదను. రాజ్యమునంతయు నేలుకొనుము. తన పుత్రుడు నా బాణసమూహములచే మదపుటేనుగుచే విరిగిన కొండవలె నేలగూలగా రాజ్యము కావలెనని కోరిన కైక ఏడ్చుచు చూచును గాక! తరువాత ఈ కైకను బంధువులతోడను, అనుచరులతోడను గూడ చంపెదను. సంభవించిన పాపము తొలగినదై ఈ భూమి తేజస్సుతో ప్రకాశించును గాక. ఎండిన పొదలపై తీక్ష్ణమైన అగ్నిని వలె అపకారమువలన జనించిన నా తీవ్రమైన క్రోధమును విరోధుల సమూహముల మీద ప్రసరింపజేసెదను. ఓ కాకుత్స వంశాగ్రణీ! క్రూరములైన వాడి బాణముల సమూహములను ప్రయోగించి శత్రుసేనల నన్నిటిని చించి చెండాడి లోకము మెచ్చునట్లుగా ఈ చిత్రకూటమును రక్తమాంసములతో బాగుగా తడియునట్లు చేసెదను. బాణములచే బ్రద్దలైన హృదయములు గల ఏనుగుల, గుఱ్ఱముల భటుల శరీరములను విశేషమయిన సంతోషముతో వన్యమృగములు దినును గాక. ఈ విధముగా ధనుర్బాణముల ఋణమును తీర్చికొందును.

# తొంబది యేడవ సర్గము

## భరతునిపై కోపగించిన లక్ష్మణుని శ్రీరాముడు శాంతిపరచుట :

అని పల్కుచు క్రోధమున మునిగియుండి యుద్ధ ప్రయత్నమును చేయుచున్న లక్ష్మణుని శాంతింపజేయుచు ఓదార్పు మాటలతో రాముడిట్లనెను. "సోదరా! సౌమిత్రీ! మేటి విలుకాడును సద్బుద్ధి గలవాడునునగు భరతుడు తనంతట తాను వచ్చుచుండగా బాణముచేతగాని వింటిచేతగాని ఖడ్గముచేతగాని యేమైనను పనియున్నదా? జనకుని సత్య వాక్యమును నిల్పుటకై ఇచ్చుటనున్న నన్ను చూచుటకై వచ్చిన భరతుని మంచివానిని సంహరించి లోకపు నిందలను పడుచు రాజ్యమును పొందుటవలన ఏమి ఫలము గలుగునో లక్ష్మణా చెప్పుము? మహాబుద్ధిశాలీ! నీ మనస్సునకు సిరుల యందంత యభిలాష యున్నదా? స్నేహితులును బంధువులును మరణింపగా వారి యొక్క ఐశ్వర్యమును నేను తీసికొన గోరను. మృతిచెందిన వారు విడచిన సొమ్ములను విషముతో గూడిన తినుబండారములను వలె చూచెదనని నీకు తెలియదా? భూమిని ధర్మమును, అర్థమును, కామమును నేను మీకొఱకే కోరుదును. ఈ రాజ్యమును గూడ మీ మేలునకే కోరుదునని ఓ సౌమిత్రీ! నేను శస్త్రమును ముట్టి శపథము చేసెదను. సముద్రపర్యంతమైన ఈ భూవలయమునందలి సంపదలన్నియు నేను సంపాదించుట నాకసాధ్యమయిన పనిగాదు. ఓ తమ్ముడా! ధర్మమార్గమును తప్పి నేనింద్రపదవినైనను కోరను. సాటిలేని మంచి గుణములు గలిగిన భరతుడును, నీవును నీ తమ్ముడైన శత్రుఘ్నుడును సుఖముగా లేనిచో నా సుఖములన్నిటిని అగ్ని బూడిదగా చేయునుగాక. సోదర వాత్సల్యము కలిగిన భరతుడు మన కులధర్మమును తలంచినవాడై అయోధ్యకు వచ్చి నేను నీ

తోడను సీతతోడను నారచీరలను గట్టి వానప్రస్థుడనై వనములకు వచ్చుట విన్నవాడై నాకు ప్రాణములకంటెను ఇష్టుడు కనుక ఆలోచించి ధర్మతత్పరుడై కలతచెంది స్నేహభావము హృదయమంతయు నిండియుండగా చూచుటకు వచ్చుచుండెను గాని యింకొకటి కాదు సుమా. కైక మీద కోపించినవాడై దుర్భాషలను పలికి పుణ్యాత్ముడగు తండ్రి కృపకు పాత్రుడై నాకు తిరిగి రాజ్యము నిచ్చుటకు వచ్చెను. ఇది నిజము. విన్నావా? భరతుడు మనలను చూడ వచ్చుటయు తగియున్నది. అతడు మనస్సునందయినను మనయందు కీడును దలపెట్టడు. అటువంటివానిపై నీవిట్లు కోపగించుట తగునా? మెచ్చదగిన గుణములు గలవాడా! ఆ పవిత్రుడు నీ కెప్పుడైనను అపకారమును తలపెట్టెనా? ఊరకే భయపడెద వెందులకు? ఇట్టి మాటలెప్పుడైన ననెనా? నీకిట్టి సందేహము తగునా? ఇకనెప్పుడును అతనినిట్టి మాటలనకుము. ఒకవేళ వినయమును వీడి నీవతనినన్నచో వినుము. అవి నన్నినట్టులుగా తలచెదను. ఎంత ఆపద వచ్చినను తండ్రిని చంపగల పుత్రుడుండునా? ప్రాణసమానుడైన సొంత తమ్ముని జంపు అన్న యుండునా? ఇంతింత మాటలాడుటకు నీ నాలుక యేవిధముగా వచ్చినది? రాజ్యముమీద కాంక్ష గనుక నీకంత ఎక్కువైనచో ఓ భరతా! ఈ రాజ్యమును లక్ష్మణున కిమ్ము అని చెప్పుదునా? ఊరక మాటవరుసకు ఈ భూమిని లక్ష్మణున కిచ్చివేయుము తమ్ముడా యని నేనన్నచో ప్రేమతో అట్లే యనును సుమా! ఇసుమంత యైనను అతనికి రాజ్యము మీద కోరిక లేదు సుమా!" అని చెప్పగా ధర్మశీలుడైన రామచంద్రుని మాటలను విన్నవాడై రాముని శ్రేయస్సునే కోరునట్టి లక్ష్మణుడు ఎక్కువైన సిగ్గును పొంది తనలో తాను చిన్నబోయినవాడై బాధనొందుచు నిట్లనెను. "ఓ రామచంద్రా! మిమ్ములను జూచుటకై రాజైన మన తండ్రి దశరథుడు వచ్చుచున్నవాడేమో" యని పల్కగా సిగ్గుజెందిన లక్ష్మణుని జూచి యెదుటివారి మనస్సును గ్రహింపగలిగిన శ్రీరామచంద్రు డిట్లనెను. "లక్ష్మణా! మనలను జూచుటకే రాజు వచ్చుచుండెనో

లేక మనమీ వనములలో పడుచున్న కష్టములను మనసునందు తలచి మనల నింటికి తీసికొని వెళ్లుటకే వచ్చుచున్నాడోయని తలంచెదను. మనకొఱకు కాకున్నను రాజు ఈ భూపుత్రిని సుకుమారిని, సుఖములను పొంద నర్హురాలిని తలచియైన మన తండ్రియగు దశరథుడు సత్యముగా వచ్చును సుమా. ఆ వచ్చుచున్న వాయువేగము గలవియు, మంచి కులమున బుట్టినవియు సుందరములైనవియునగు రెండు గుఱ్ఱములును, తండ్రిదైన శత్రుంజయమను ఏనుగును సైన్యమునకు ముందు వచ్చుచున్నవి చూచితివా లక్ష్మణా? ఆ సైన్యమునందెచ్చట జూచినను, దివ్యమైనదియు, భూమియందు పూజింప బడినదియునై ఒప్పెడి మన తండ్రి యొక్క తెల్లని గొడుగు కనబడకున్నది. లక్ష్మణా! నా మనస్సున కనుమానము తోచుచున్నది సుమా. లక్ష్మణా నా మాట వినుము. ఆ చెట్టును దిగి తొందరగా రమ్ము" అనగా ఆ సౌమిత్రి అట్లొనర్చి రామచంద్రునకు నమస్కరించి యొక ప్రక్కగా నిలిచి యుండెను. అట్లు వచ్చుచున్న భరతుడు తన సైన్యము యొక్క సందడి చేత తన యన్న ఆశ్రమము కలతజెందునని తలచి అధికమైన ఆ సైన్యమునంతయు ధర్మబుద్ధితో పర్వత సమీపమునందే యుంచెను. అట్లు నిలిపిన ఆ సైన్యము ఒకటిన్నర యోజనముల మేర నాక్రమించెను. తరువాత రాజపుత్రుడు వినయవంతమగు వేషముతో..



# తొంబది యెనిమిదవ సర్గము

## భరతుడు పాదచారియై రామాశ్రమమును వెదకుట :

అన్నయైన శ్రీరాముని జాడగోరి గురువైన వసిష్ఠుని యనుమతిని పొంది పాదచారియై తన్ను సేవించుచున్న చిన్నతమ్ముని జూచి ‘‘తమ్ముడా! మనమందఱము ఈ వనమునందే రఘురాముని కాల్నడకతో వెళ్లి వెదకవలెను. ఈ జనులందఱును బోయలును నీవెంటరాగా నీవు ఆ దిక్కున వెదుక బొమ్ము. ఇక నెన్నరాని బలపరాక్రమములు కల్గిన గుహుడు తన బంధువర్గముతో గలిసియు, మంత్రివర్గమును, గురువులును నన్ననుసరించి వత్తురు. నేను తొందరపడుటకు కారణమేమన వారలను చూచువఱకును నా మనస్సునకు శాంతి కలుగజాలదు సుమా! తమ్ముడా! రామచంద్రుని, గొప్ప బలవంతుడైన లక్ష్మణుని మహానుభావురాలగు జనకరాజపుత్రిని క్షేమముగా చూచువరకును నా మనస్సునకు శాంతి లేదు సుమా! తామరరేకుల వంటి నేత్రములు గల రామచంద్రుని యొక్క పూర్ణచంద్రుని నిరసించు ముఖపద్మమును మనస్సు తృప్తిచెందునట్లుగాను, కన్నుల నిండుగా చూచువఱకు నాకు శాంతి యెట్లు కలుగునయ్యా! సోదరుడా! రాజలక్ష్మణములతో గూడిన రాముని యొక్క పాదపద్మములను భక్తితో నా శిరస్సునందు ధరింపకున్నచో నా మనస్సునకు శాంతి లేదు సుమా! మన తాత తండ్రులచే పాలింపబడిన ఘనమైన రాజ్యభారమును వహించి రాజుగా మన పెద్దన్న అభిషేకమును పొందువరకు నాకు శాంతియనునది కలుగదు సుమా! ఆ సీతాదేవి యొక్క చంద్రసమానమై యందమైన ముఖమునెంతో సంతోషముతో తానొక్కడే చూచు లక్ష్మణుడెంత ధన్యుడో గదా! తమ్ముడా! చూచితివా? సాధ్యులలో శ్రేష్ఠురాలైన మహానుభావురా

లైన జనకరాజపుత్రి రాజులలో శ్రేష్ఠుడైన తన భర్తను అన్యచింతలేక సేవించుచు వెంట వెళ్లినది. ఎంత ధన్యురాలో గదా! ఆ నందన వనములో సంతసముతో కుబేరు డుండునట్లుగా ఈ సుందరమైన పర్వత సమీపమున రాజగు శ్రీరాముడు నివసించుచున్నవాడు గదా! ఈ పర్వతము యొక్క పుణ్యము నేమని పొగడుదు నయ్యా! క్రూరమృగ సముదాయము నివసించు ఈ అడవి జగత్తును రంజింపజేయు రామచంద్రుడు నివసించుటచే ధన్యత్వము జెందెను. రామచంద్రుని సాంగత్యముచే నేది ఘనతను చెందకుండును?" అని చెప్పుచు భరతుడు ఆ వనమునందు పాదచారియై పర్వతము పయినున్న పువ్వులతో నిండిన చెట్ల మధ్యలో నడచుచు ఒక చెట్టును సమీపించగా అచ్చట రామచంద్రుని యొక్క ఆశ్రమము నుండి వచ్చుచున్న పొగ కనిపించెను. శ్రీరామచంద్రు డక్కడ నుండుటను భరతుడు తెలిసికొన్నవాడై సముద్రము నీదుచున్న మానవుడు గట్టును గాంచినట్లుగా బంధుసహితుడై గొప్ప యానందమును పొందెను.



# తొంబది తొమ్మిదవ సర్గము

**భరతుడు రామాశ్రమును జూచుట :**

పవిత్రచరిత్రులైన అచటి మహాత్ములందఱును 'రామచంద్రుని యాశ్రమమదే సుమా!' యని చెప్పుచుండగా, తనవెంట వచ్చుచున్న సైన్యముల నచ్చట నిలుచునట్లుగా ఆజ్ఞాపించి భరతుడు గుహుడు వెంటరాగా ముందుకు నడచెను. గురుభక్తుడగు భరతుడు తన తల్లులందఱను అచ్చటికి తోడ్కొని రమ్మని వసిష్ఠునకు చెప్పెను. ఈ విధముగా వెళ్లునప్పుడు, సీతానాథుని దర్శించుట యందు భరతునితో సమానముగా తొందరపడుచున్న సుమంత్రుడు కూడ శత్రుఘ్నుని వెంట నడచుచుండ భరతుడు తమ్మునకు తాపసుల ఆశ్రమముల మధ్యమందున్న రామాశ్రమమును చూపుచు తొందరగా వెళ్లుచు దూరము నందున్న శ్రీరాముని పర్ణశాలను, అగ్నిగృహమును చూచెను. ఆ ఆశ్రమమునకు ముందు ఖాళీప్రదేశమున పూజ కొఱకుపయోగించు పుష్పములను, చీకటి పోగొట్టు మంటలు వేయుటకై ఉపయోగించు విరిచిన కట్టెలను చూచుచు ఆ వీరుడు వెళ్లుచు రామలక్ష్మణులు తమ ఆశ్రమము గుర్తు తెలియుటకై అచ్చట చెట్లకొమ్మల చివరలందు దర్భలను నారవస్త్రములను కట్టియుండుటను చూచెను. అడవులలో నుండు మృగముల యొక్కయు దున్నపోతుల యొక్కయు (మలము) పిడుకలను చలికాచుకొనుటకై కుప్పలుగా నుంచినవానిని చూచుచు సంతోష పడుచు మంత్రియగు సుమంత్రునితోను తన తమ్ముడగు శత్రుఘ్నునితోను ఇట్లనెను. "మనకు భరద్వాజుడు చెప్పిన ప్రదేశమిదియే యని తోచుచున్నది. మందాకినీనది యిచ్చటికి సమీపమున నుండవచ్చును. అన్న యిచటనే యుండవచ్చును. తమ్ముడా! చూడుము. ఇచ్చట ఎత్తుగా నున్న వృక్షములయందు

కట్టబడిన నారవస్త్రముల పేలికలు చూడగా లక్ష్మణుడు దూరముగా వెళ్లి తిరిగి వచ్చునప్పుడు పర్ణశాల మార్గమును గుర్తించుటకుగాను కట్టినవిగా నా మనస్సునకు తోచుచున్నది. ఏనుగులు దంతములతో పోరాడుకొనుచు ఆశ్రమములోనికి వెళ్లుటకు వీలులేకపోవుటచే ఆశ్రమ ప్రాంతమునుండియే వెడలినట్లున్నవి. ఉదయము సాయంకాలము హోమము చేయుటకై ఏ యగ్నిహోత్రములను నిరంతరము ఋషులు రక్షించుచుందురో ఆ యగ్నులవలన వచ్చు పొగ విపరీతమై కనవచ్చుచున్నదిగో. ఓ కల్మషములేనివాడా! పురుష సింహుడును, గొప్పదైన సంస్కారము తెలిసినవాడును బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును పవిత్రమైన ఋషులను పోలినవాడును అగు రాముని నేనిందే తప్పక చూచువాడను" అని కొంతదూరము వెళ్లి మందాకినీనదిని జూచి చింతచేత నిండిన మనస్సు గలవాడై ముఖమును వంచి కన్నుల నీరు వెడలుచుండగా తనతో వచ్చుచున్న వారితో నిట్లనెను. "పురుషసింహుడును భూపతియు నగు సీతాపతి జనసంచారములేని వనమునందు వీరాసనమున కూర్చొని యున్నాడు. అదృష్టహీనుడను. నా ప్రాణములెందుకు? నా జన్మమెందులకు? వృథా గదా. అక్కటా! నా కొఱకై జగతీపతియైన రామభద్రుడు సర్వ సౌఖ్యములను విడచి వనములకు వెళ్లెననెడి అపకీర్తి జగత్తంతయును వ్యాపించినది కదా! నేను రాముని పాదముల మీద వ్రాలి మనస్సు తేలికపడునట్లు సీతాలక్ష్మణులకు మ్రొక్కెదను" అనుచు కొంత దూరము వెళ్లి మద్ది, తాడి మొదలగు చెట్ల ఆకులచే కప్పబడినదియు, విశాలముగ నున్నదియు, దర్భలచే అరుగులుగా నలంకరింప బడినదియు, గొప్పనైన హరివిల్లువలె శత్రుభయంకరమైన విండ్లచే ప్రకాశించు చున్నదియు, సూర్యకిరణములను మించిన కాంతితో చూచుటకు భయము కలగజేయుచు, అమ్ములపొదులయందు వాడిబాణములు వెలుగుచుండగా సర్పములతో గూడిన భోగవతియో యనునట్లున్నదియు, బంగారపు ఒరలతో ప్రకాశించు గొప్ప ఖడ్గములచేతను, బంగారు చుక్కలు గల అందమైన డాలుల

చేతను ప్రకాశించుచున్నదియు, బంగారు ఆభరణములతో నొప్పుచున్న అంగుళిత్రాణముల యొక్క స్వచ్ఛమైన కాంతులు గలదియు, సింహపు గుహ యనునట్లుగా విరోధులకు తేరిచూడ శక్యముగానిదియు, తూర్పునను, ఉత్తరమునను పల్లమై వెలుగుచున్న అగ్నిహోత్రము కల వేదికచే అందమైనదియు, పవిత్రమైనదియు నయిన రాముడు నివసించు పర్ణశాలను బుద్ధిమంతుడైన ఆ భరతుడు చూచెను.

**భరతుడు శ్రీరాముని దర్శించుట :**

ఎక్కువైన కుతూహలముతో కొంతసేపు భరతుడు దీక్షగా చూచి పెద్ద జడలతో పర్ణశాలయందు కూర్చొనియున్న తన అన్నయగు శ్రీరాముని ధైర్యవంతుని చూచి అన్నగా గుర్తించెను. 'లేడి చర్మము పైబట్టగాను, నార వస్త్రములు కట్టువస్త్రములుగాను తాల్చి అగ్ని సమానుడయి కూర్చొనియున్న వాడును, గొప్ప చేతులు గలవాడును, పద్మముల వంటి నేత్రములు గలవాడును, నాల్గు దిక్కుల సముద్రముల మధ్యయందున్న భూమికి రాజైన వాడును, సింహభుజముల వంటి భుజములు గలవాడును, నిత్యమును ధర్మము ననుసరించువాడును, సీతా లక్ష్మణ సమేతుడై దర్భాసనము మీద గూర్చుండి స్థిరుడైన బ్రహ్మము వలె నొప్పుచున్నవాడును అగు రాముని జూచి పరుగెత్తి దగ్గరకు వెళ్లి, చూడగానే యేడ్చుచు కన్నులనీరు కారుచుండగా రుద్ధమైన కంఠముతోనిట్లు పలికెను. "పౌరులు పొగడుచుండగా సభలో ఎత్తైన సింహాసనమున నుండవలసిన మా అన్నయే అరణ్యమందలి మృగములు పక్షులు మొదలైనవి చుట్టు సేవించుచుండగా ఇట్లడవులలో నున్నాడు గదా! విలువ గట్టరాని పట్టువస్త్రములు ధరించువాడీ జింక చర్మమును ధరించెనే. పట్టణము నందు సౌఖ్యముల ననుభవింపవలసిన సుకుమారుడు అడవులలో కష్టపడు చుండెనా? సువాసనలు వెదజల్లు పుష్పములను ధరించు నందగాడు జడలుగట్టిన పెద్దజుట్టును ధరించినాడు. చందనమలంది శోభించు ఆ శరీరము ఈ దుమ్ముతో

నిండియున్నది. నా నిమిత్తమున కదా సౌఖ్యపడవలసిన రామచంద్రునకు ఇన్ని దుఃఖములు ప్రాప్తించినవి? జగమునందిట్టి నిందనొందిన ఈ క్రూరుని బ్రతుకెందులకు? ఈ విభవమెందులకు? ధర్మమును రక్షింప దలచినవాడై విధి విహితముగా అనేక యజ్ఞములుచేసి ధర్మ సంపన్నుడుగా కీర్తినందవలసిన వాడు ఇట్లడవులలో కష్టములకోర్చి చరించుచున్నవాడు.' చిన్నబుచ్చుకొనినవాడై ఈ ప్రకారముగా విలపించుచు చెమటలుబట్టిన ముఖము గలవాడై అన్న దగ్గరకు వెళ్లలేనివాడై భరతుడు "అన్నా!" యనుచు నింకనేమియు పలుకజాలక నేలపై పడిపోయెను. కన్నుల గ్రమ్మిన నీరు కంఠమును రుద్ధమొనర్పగా కైక పుత్రుడు రాముని కన్నులెత్తి చూచి "అన్నా!" యని పిలిచియు వేరొక మాట పలుకలే డయ్యెను. అంత రోదనము చేయుచు శత్రుఘ్ను డన్న పాదములపై వ్రాలెను. తన పాదముల మీద వ్రాలిన తమ్ములను చేతులతో గ్రుచ్చి యెత్తి తామరల వంటి నేత్రములు గల ఆ రాముడు వారి కన్నుల నీరు తుడిచి కౌగలించు కొనుచు వారి దుఃఖమును పోగొట్టెను. తరువాత సుమంత్రుడును, గుహుడును ప్రేమతో సమీపింపగా శుక్రునితో బృహస్పతితో గూడిన సూర్య చంద్రులవలె అన్నదమ్ములు ప్రకాశించిరి. వనమునందలి వారును వారిని జూచుచు దుఃఖమును బొందిరి.



# నూఱవ సర్గము

## శ్రీరాముడు భరతుని కుశలప్రశ్న వేయుట :

జడలను ధరించి, నారవస్త్రములను గట్టి చేతులు జోడించి భూమిపై బడిన కల్పాంత సూర్యునివలె దీనుడై చిక్కిపోయి పాలిపోయి ఆనవాలు పట్టలేనట్లున్న భరతునెట్లెట్లో ఆనవాలు పట్టి తన ప్రేమపాత్రుడగు ఆ తమ్ముని చేతులతో నెత్తి రాముడు అక్కున జేర్చికొని శిరము నాఘ్రాణించుచు తన సరసను గూర్చుండు నట్లుగా కూర్చుండబెట్టి వివరముగా కుశలములనడిగెను. “నీవిచ్చుటకు వచ్చుటతో తండ్రి యెచ్చట నున్నవాడు? ఇంటియొద్ద తండ్రి ప్రాణములతో నుండగా నీవిచ్చుటకు రావు గదా! ఆశ్చర్యము. ఎన్నినాళ్లు గడచినది నిన్ను చూచి? గుర్తుపట్టరానట్లున్నావు గదా! తమ్ముడా! ఈ భయంకరమైన అడవులకు ఇట్లు నీవు వచ్చుట కేమికారణము? నీ విట్లు వచ్చుటను తెలిసి తండ్రి బ్రతికి యుండనేర్చెనా? స్వర్గమునకు వెళ్లలేదు గదా! మిగుల పూజింపదగినదగు రాజ్యము బాలుడవైన నీవు ధరించుటచేత చెడిపోయినదై నిన్ను విడువలేదుగదా! రాజైన మహాత్ముని తండ్రిని ప్రతిదినమును పూజించి సంతుష్టిని పొందించు చున్నావా? నాయనా!

## శ్రీరాముడు కుశలప్రశ్న రూపమున భరతునకు ధర్మోపదేశము చేయుట :

“భరతా! సత్యమైన ప్రతిజ్ఞ గలవాడును, సకల ధర్మములను తెలిసినవాడును, రాజసూయము, అశ్వమేథము మొదలైన యాగములను చేసిన పుణ్యాత్ముడును అగు మన తండ్రి దశరథుడు క్షేమముగ నున్నాడు గదా! దాశరథీ! విద్వాంసులలో శ్రేష్ఠుడును, బ్రాహ్మణుడును, గొప్ప ప్రకాశము గలవాడును అగు మునిశ్రేష్ఠుడు

వసిష్ఠుడు మునుపటి వలె పూజింపబడుచున్నాడా? ఆ విధముగా విడచివచ్చిన నా తల్లియు, సత్సంతానవతి యగు సుమిత్రయు సుఖముగా నున్నారా? పూజ్యురాలైన నీ యొక్క తల్లియగు కైకేయి సంతోషముతో నున్నదా భరతా? మంచి కులమున బుట్టినవాడును, వినయము గలవాడును, వేదములను పఠించినవాడును, నిర్మలమైన మనస్సు గలవాడును, కార్యములయందు నిపుణుడును, అసూయలేనివాడునై నీ పురోహితుడు నీచేత అర్చింపబడు చున్నాడా! ఓ గొప్ప బుద్ధి గలవాడా! నీ పురోహితుడు గొప్ప బుద్ధి గలవాడును, అగ్నిహోత్రములను రక్షించువాడును, సత్క్రియలయందు నేర్పు గలవాడును, ధీరుడును, మనసునందును, పైకిని ఒక్కమాదిరి నిష్ఠగలవాడును, హోమములు చేయుటయందును, చేయించుటయందును నేర్పుగలవాడునునై ఉచిత సమయములందు నీకు విధులను నెరవేర్చుచున్నాడా? దేవత సమానులగు వృద్ధులను, వైద్యులను, విప్రులను, సత్కారములతో తన్పుచుంటివా? అర్థశాస్త్రము నందు నేర్పుగలవాడును, అస్త్ర శస్త్ర సంపన్నుడును, నీ శ్రేయస్సు కోరువాడును అగు సుధన్వుడను ఉపాధ్యాయుని భక్తితో పూజించుచున్నావా? నీ మంత్రులందఱను శౌర్యము గలవారలేనా? సత్కుల సంజాతులేనా? శాస్త్రజ్ఞాన సంపన్నులేనా? నీతో సమానులైన వారేనా? ఇంద్రియములను జయించిన వారేనా? ఎదుటి హృదయములోని అభిప్రాయములను గుర్తింపగలవారేనా? (ఇంగితజ్ఞులేనా?) తండ్రీ! జయమునకు మంత్రమే మూలము సుమా! రాజులకు శాస్త్రములు తెలిసిన మంత్రులు పొరపాటులేక దానిని రక్షించుచున్నారా? నీ వెప్పుడును నిద్రకు వశుడవుకావు గదా. తగిన సమయము లందు మేలుకొని యుండెదవా? అర్ధరాత్రులందు లేచి ధనమునే నేర్పుతో సమకూర్పవలెనో నీవు ఆలోచించుచున్నావా? ఒంటరిగా గాని పలువురితో గాని మంత్రాలోచనము చేయుట లేదా గదా! నీ మంత్రాంగము రాష్ట్రమందు తొందరగా తెలిసిపోవుటలేదు గదా! కొలది సాధనములచే మహాఫలము నొసగునట్టి కార్యము నిశ్చయింపబడిన వెంటనే తొందరగా చేయుచున్నావా? కార్యము చెడిపోవునట్లుగా ఆలస్యమును

చేయవుగదా? నీ వాలోచించిన కార్యములను అవి నెరవేరు వరకును సామంత రాజులు తెలియజాలక నెరవేరిన మీదటనే తెలిసికొనుచున్నారు గదా! నీ మంత్రాంగమును, అనేకమైన యుక్తులచేతనో తర్కములచేతనో మఱి ఏ ప్రకారముననో నీవలనగాని నీ మంత్రులవలనగాని ఇతరులు తెలసుకొనలేరు గదయ్యా! బలవంతులైన వేయిమంది మూర్ఖులైనను ఒక్క పండితునకు సాటిగారని నీ మనస్సునందు తలచుచున్నావు గదా! గండములై వచ్చిన కార్య కష్టముల యందు అతడే గొప్ప మేలును కలుగజేయును సుమా! వేయిమంది యేమి? పదివేలమంది మూర్ఖులు కొల్చుచున్నను రాజునకు వారి వలన సహాయము కలుగబోదుసుమా! ఒక్క మేధావియును శౌర్యవంతుడును, పనులయందు నేర్పుగలవాడును, నీతి తెలిసినవాడును మంత్రిగానున్నచో గొప్ప రాజునైనను, రాజమాత్రునినైనను మహా ధనవంతునిగా జేయగలడు సుమా! గొప్పవారలను గొప్ప కార్యములందును, మధ్యములను మధ్యమ పనుల యందును, అధములను అధమకృత్యములందును నేర్పుతో భృత్యులను నియోగించుచున్నావా? మనయందు ప్రేమ గలవారిని, అనేక విధములైన పరీక్షల యందు నెగ్గినవారిని, పూర్వరాజుల నుండియు మనలను గొల్చుచున్న వారిని, సత్యమైన వాక్కు, బుద్ధి, కర్మ కలిగిన వారిని మంత్రిశ్రేష్ఠులను మనసు నందు గుర్తించి శ్రేష్ఠులనే శ్రేష్ఠ కార్యములందు నియోగించుచున్నావు కదా! తీక్ష్ణమైన దండనలతో నీవు పౌరులను పీడించుచున్నచో నీ మంత్రులు మొగమాటపడి నీవు నడచు మార్గము మంచిదేయని తలల నూపుచు తగు మాటలను చెప్పకున్నారా? దుర్మార్గముగా ధనమును సమకూర్చుకొని యజ్ఞమును చేయగోరిన దుర్మార్గుని యాజ్ఞికులును, బలాత్కారముగా పట్టగోరు కాముకుని స్త్రీలు, విడుచునట్లుగా నాయనా! దుష్టమార్గమున ధనమును పెంచినచో నిన్ను ప్రజలు అనాదరముతో జూతురుగదా! నీ యొద్ద మలినమైన మనస్సు గలవారును, దుష్టవిద్యలయందు విశారదులును, నిజసేవకులనే దూషించువారును, రాజన్న భయము లేనివారును, అసూయ గలవారును,

దుష్టులై రాజునకే ఉపద్రవము గలిగించువారును ధనాశతో ధనమును పెంచుకొనువారును లేరుగదా! వీరలను రాజు సంహరింపనిచో వారిచే రాజే చచ్చునుసుమా! సుగుణములయందాసక్తి గల ఓ భరతా! సంతుష్టుడును, శౌర్యము గలవాడును, స్థైర్యముగలవాడును, మంచి వంశమునందు బుట్టిన వాడును, మంచి బుద్ధి గలవాడును, నిర్మలుడును, పనులయందు నేర్పు గలవాడును, రాజునందు ప్రేమ గలవాడును నీకిప్పుడు దండనాథుడుగ నున్నాడా? నీ సైన్యముఖ్యులు మంచి బలవంతులును, పరాక్రమముచే ప్రకాశించువారును, యుద్ధమునందు నేర్పుగలవారును, పూర్వమందు తమ పౌరుషమును జూపినవారును అయియున్నారా? అట్టివారలకు బహుమతులతో నీయందు ప్రేమ అధికమగునట్లుగా సంతోషమును కలుగజేయుచున్నావా? నీ సేవకులకు తగిన కాలమందు జీతమును బత్తెమును కాలయాపన చేయకుండ ఇచ్చుచున్నావా? వేళకు జీతములీయని రాజును భటులు కోపముతో చూచుచుందురు సుమా! అంతేగాక ప్రీతి తొలగినవారై తిట్టెదరు. దానివలన అనేకమైన కీడులు కలుగును సుమా! సత్కులజులయిన ప్రధానులు నిశ్చలమైన ప్రేమతో నిన్ను చూచెదరా? అవసరము వచ్చినచో యుద్ధమునందు నీకై తమ ప్రాణములనైనను ఇచ్చుటకు ఎక్కువైన ప్రీతితో సిద్ధపడుదురా? కార్యములను సక్రమముగా నిర్వహింపదలచినవాడవై, మన దేశమునందే పుట్టినవాడును, పండితుడును, నిర్ణయించిన మార్గమును తప్పక అనుసరించువాడును, చతురుడును, ప్రతిభావంతుడును అగు మనుష్యుని నీ దూతనుగా ఏర్పరచితివా? పరులపక్షమున మంత్రియు, పురోహితుడును, యువరాజును, సేనాపతియు, కారాగారాధిపతియు మొదలుగాగల పదునెనుమంద్రు తీర్థాఖ్యులను, తన పక్షమునందు మొదటి ముగ్గురు తప్ప తక్కిన పదియేనుమందిని జాగ్రత్తగా అనుసరించి వారి వారి ప్రవర్తనను తెలిసికొనుటకై ఇతరులకును, వారిలో వారికిని తెలియకుండునట్లుగా ముగ్గురు గూఢచారులను నియమించితివా? సుగుణములే భూషణములుగా గల ఓ భరతా! విరోధియైనవాడు నీచేత

తరుమబడినవాడై గర్వము విడచి మరల నిన్నాశ్రయించినచో అట్టివానిని శక్తిలేని వాడని ఉపేక్షాదృష్టితో చూడకుందువు గదా. ప్రత్యక్షానుమానములనే ప్రమాణములుగాగొని వేదప్రామాణ్యము నంగీకరింపని బౌద్ధచార్వాకాది మతస్థులను బ్రాహ్మణుల నేసమయముననైన నాదరించుటలేదు గదా! వారు మహానర్థకారణులు. విపరీతబుద్ధి గలవారు. తామే పండితుల మనుకొనువారు. ఆ దుష్టపండితులు వికటమైన శుష్కవాదముల యందాసక్తులై వివిధ ధర్మశాస్త్ర విషయములను నిందింతురు. కాన వారితో సఖ్యమును విడచి యుండుటే రాజునకు మేలు. తండ్రీ! అందమైన దృఢమైన ద్వారములు గలదియు, ఏనుగులతోను, గుఱ్ఱములతోను, రథములతోను సందడిగా నున్నదియు, ఎల్లప్పుడు నుత్సాహము గలవారును, ఇంద్రియములను జయించినవారును, పూజ్యులును, తమ తమ కర్మల నాచరించు శ్రద్ధ గలవారును అయిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులతో ప్రకాశించుచున్నదియు, అనేక విధములైన మేడల సమూహము గలదియు, వైద్యులు గలదియు, మనోహరమైనదియు, నిత్య సంతుష్టి గలదియు, వీరులైన మన పూర్వులచేత యథావిధిగా పాలింపబడినదియు నగు మన పట్టణమును అయోధ్యను సార్థకమగు నామము గలదానినిగా మిక్కిలి ప్రీతితో పాలించుచున్నావా? (యుద్ధమున జయింప నసాధ్యమైనది అయోధ్య) నిలుకడగా నివాసము చేయు వారిచేతను, వందల యజ్ఞములు జరిగిన ప్రదేశముల చేతను, దేవాలయములచేతను, చలిపందిరులచేతను (ప్రపలు = చలివేంద్రములు) పవిత్రములగు సరస్సులచేతను సంతుష్టిగానున్న జనులచేతను పవిత్రలైన స్త్రీలచేతను, ఇంపుగా చేయబడు ఉత్సవములచేతను, నిండియున్న పశుసంపదల చేతను హింస చేయుట తెలియని జనసమూహము చేతను, వానలపై ఆధారపడక వరి పండించువారిచేతను, క్రూరమృగములు లేక భయరహితులైన సహృదయులైన వేలకొలది పౌరులచేతను, బంగారము, మణులు, వెండి మున్నగునవి లభించు గనులచేతను ప్రకాశించుచున్న మన దేశము సుఖముగానున్నదా? భరతా! భూమిని దున్ని జీవించుచున్నవారిని,

పశువులను మేపుచు జీవించువారిని ప్రేమతో చూచుచుందువా? నిన్నాశ్రయించి వర్తకముచే జీవించు వారలకు శుభమే కదా! ప్రజలకు ఇష్టములను సమకూర్చి, అనిష్టములను దొలగించి రక్షింతువా? జనులు సంతుష్టితో జీవించునట్లు రాజైనవాడు విధివిహిత రీతితో ఎవ్వరినైనను రక్షింపవలెను. నీ స్త్రీలను మన్నించుచున్నావా? వారిని జాగ్రత్తగా రక్షించుచున్నావా? వారి మాటలను నీవు స్వీకరింపక యుందువుగదా! ఏకాంతమునందైనను నీ రహస్యములను వారికి తెలియజేయవుగదా! ఏనుగుల జన్మస్థానమగు నాగవనమును రక్షించుచున్నావా? ఏనుగులను పట్టుటకు తగినట్లుగ ఆడయేనుగులు ఆర్జించుటయందు ఎన్నడును సంతుష్టి పొందకుందువుగదా! ప్రతిదినము నందును తెల్లవారగానే భూజనులందఱకును దర్శనమిచ్చు చున్నావుగదా! అట్లు కనిపించనిచో రాజు శరీరమున కేమైనదోయని జనులనుమానించెదరు సుమా! పనివాండ్రకు విచ్చలవిడిగా తన్ను చేరునట్లు స్వతంత్రమీయరాదు. తరచుగా వారిని చూడకుండగా కూడ ఉండరాదు సుమా! ఇందుచేత రాజులు మధ్య రకముగా నుండుటయే మేలు. ఓ భరతా! మన దుర్గములు, ధనధాన్యములతోను, జలముతోను సాధన సంపత్తితోను కూడియున్నవా? వీరులైన భటులతో విలుకాండ్రతో గూడియున్నవి గదా. శిల్పులతో గూడియున్నవియా? ఆదాయము దండిగా నున్నదా? వ్యయమును మితముగా చేయుచున్నావా? ఏ ప్రకారముగనైనను నీ ధనము నపాత్రులను చేరనీయవు గదా? యోధులకును, అతిథులకును, బ్రాహ్మణులకును మిత్రులకును ధనమును నీవిచ్చుచుందువు గదా! దేవతలకును పితృదేవతలకును చేయు కృత్యములకై నీవు ధనరూపమైన సాహాయ్యమును చేయుదువు గదా! మంచి మనస్సు గలవాడును నిర్మలుడును నైన ప్రాజ్ఞుడొకడు దొంగతనముచేత దూషింపబడినవాడైనచో ప్రాజ్ఞులతో నాలోచింపక లోభముతో చంపుదువా? దుర్మార్గుడు చౌర్యముచేసి సొమ్ముతో గూడ పట్టుపడినచో వానివలన ధనముపొంది వధింపకుండ విడచిపెట్టుటలేదు గదా! ధనవంతునకును ధనము లేనివానికిని వ్యవహారము వచ్చినచో నీ

మంత్రులు దురాలోచన గలవారై ధనవంతుని రొక్కమునకు ఆశపడకుండ వారలను పరీక్షించుచుండెదవా? దోషము చేయకున్నను శిక్షింపబడిన యట్టి జనుల యొక్క అశ్రువులు భోగములయందే ఆసక్తుడైయున్న రాజును పశు వులు ధనములు సంతానము లేనివానినిగా చేసి చెడిపోవునట్లు చేయును సుమా! బాలురను, వృద్ధులను, వైద్యులను, మేలైన ధనములతోను, ప్రేమతోను, మంచి మాటలతోను ఈ మూడు మార్గములచేతను నీకు అనుకూలురగునట్లుగా చేసికొనుచున్నావు గదా! గురువులకును, వృద్ధులకును, తపస్వులకును, బ్రాహ్మణులకును, చైతన్యములకును, అతిథులకును, శుభములను గలుగజేయు దేవతలకెల్లను నియమము గలవాడవై భక్తితో మ్రొక్కుచుందువా? అర్థముచేత ధర్మమును, ధర్మముచేత అర్థమును కామముచేత ధర్మార్థములును నశింపకుండ సమర్థించుచుందువుగదా! అట్లుగాక సుఖమున కలవాటుపడి వాటిని చెడగొట్టుకొనుటలేదు గదా! ఉదయము పూట ధనార్జనమును, తరువాత ధర్మమును ప్రొద్దుపోయిన తరువాత కామమును సంపాదింపవలెననునది తెలిసి యనుష్ఠించుచున్నావా? మనస్సు చెడినవాడవై ఒకదానితో నొకటి కలిసిపోవు నట్లు చేయుటలేదు గదా! ఓ రాజపుత్రా! సర్వశాస్త్రములు తెలిసిన బ్రాహ్మణులు పౌరులతోను, జనపదులతోను గలసి ప్రతినిత్యమును నీవు భూమిమీద సుఖములతో నుండునట్లు ప్రార్థనలను చేయుచున్నారు గదా! రాజపుత్రా! అబద్ధము చెప్పుట, నాస్తికబుద్ధి (దీర్ఘసూత్రత) దురాలోచన చేయుట, క్రోధము, పొరబడుట, అలసత్వము, జ్ఞానులయినవారికి దర్శన మీయకుండుట, పంచేంద్రియములకు వశుడగుట, కార్యములపట్ల ఒక్కడే ఆలోచించుట, ఎట్టివానికైన ఎదురుతిరుగుట, నిశ్చయింపబడిన పనిని నెరవేర్పకుండుట, విషయములు చక్కగా తెలియనివారితో మంత్రాలోచన చేయుట, మంత్రములను రక్షింపకుండుట, శుభము కలుగజేయు కార్యములందనాదరము చూపుట అనుచు చెప్పబడిన పదునాలుగు రాజదోషములను విడచియుందువు గదా! ఓ అనిందిత చరిత్రా! పదియును, ఐదును, నాల్గును, ఎనిమిదియు, ఏడును,

మూడును అయిన వర్గములను విడువక, మూడువిద్యలను మనస్సునందు తలంతువుగదా. ఇంద్రియములను నీవు చెప్పినట్లు వినునట్లుగా స్వాధీనము చేసికొన్నావా? దైవముచేతను, మనుష్యులచేతను వచ్చు వ్యసనములను తెలిసికొన్నావా? పకృతి మండలమును, వింశతి వర్గమును, షడ్గుణములను, యానము, సంధి, విగ్రహము, యాత్ర, దండము అనువానిని తలంతువా? (ఇందు పది యనగా వేట, జూదము, పగటినిద్ర, అపవాదము, స్త్రీలు, మదము, నృత్తము, గీతము, వాద్యము, పనిలేక తిరుగుట అనునవి. ఐదనగా, జాతి వైరము, వస్తువు కొఱకు వైరము, స్త్రీ కొఱకు వైరము, వాగ్వైరము, అపరాధము చేయుట వలన కలిగిన వైరము అను వైరములు. నాలుగనగా సామ దాన భేద దండములనెడు చతురుపాయములు. లేక ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములు. లేక ధనమును న్యాయముగా ఆర్జించుట, రక్షించుట, పెంపుదలచేయుట, సత్పాత్రమున దానముచేయుట అను నాల్గు ధర్మములు ఎనిమిదనగా వ్యవసాయము, వాణిజ్యము, దుర్గములు, ఆనకట్ట ఏనుగులను బంధించుట, గనులు, పన్నులు రాబట్టుట, శూన్య నివేశనము అనునవి. ఏడనగా రాజు, మంత్రి, రాష్ట్రము, దుర్గము ధనాగారము, సైన్యము, మిత్రుడు అనునవి. మూడనగా ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి అను శక్తులు. మూడు విద్యలనగా త్రయి, వార్త, దండనీతి అనునవి. షడ్గుణములు సంధి, విగ్రహయాన, ఆసన, ద్వైదీభావ, సమాశ్రయములు. దైవిక వ్యసనములనగా నిప్పు, నీరు, రోగము, కరవు, చావు అనునవి. మానుష వ్యసనములనగా అధికారులు, దొంగలు, శత్రువులు, రాజున కిష్టులైనవారు, రాజు యొక్క లోభగుణము అనునవి. వింశతి వర్గ మనగా బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, బంధువులచే విడువబడినవాడు, పిరికివాడు, భయపడు మంత్రి సేనాపతులు గలవాడు, లోభము గలవాడు, లోభము కలవారి మధ్యనున్నవాడు, ప్రజలయం దనురాగము లేనివాడు, విషయములందత్యంతాసక్తి గలవాడు అనేకాలోచనలు గలవాడు, దేవబ్రాహ్మణనింద చేయువాడు, మహర్షి శాపమును బొందిన వాడు,

దైవపరుడై ప్రయత్నమే చేయనివాడు, కరవుచే పీడితుడు, సైన్యనాశముచే పీడింపబడినవాడు, విదేశములలో నున్నవాడు, పెక్కు శత్రువులు గలవాడు క్రూరగ్రహ దశాభాగము కలవాడు, సత్యధర్మములు లేనివాడు అను ఈ ఇరువదిమంది రాజుచే సంధి చేసికొనదగనివారు. ప్రకృతులనగా ఐదు మంత్రి, రాష్ట్రము, కోట, ధనాగారము, దండము అనునవి. మండలము అనగా పంద్రెండుగురు రాజుల సమూహము. నలువురో, ముగ్గురో మంత్రులతో కలిసి ఆలోచనలు చేయుచున్నావు గదా! వారు వారలు చెప్పు విధమును అంతయు విని దానిని నీవు నీ మనస్సునందు బాగుగా నాలోచించుచున్నావు గదా! ఓ ప్రజ్ఞ గలవాడా! నీ చదువులును, నీ ధనములును, నీవు చేయు పనులన్నియును, నీ భార్యయును, నీ శాస్త్రజ్ఞానమును సత్ఫలితముల నిచ్చుచున్నవా? ఓ రాజపుత్రా! ధర్మార్థ కామ సహితమైనదియు, శుభప్రదమును, ఆయువును వృద్ధి చేయునదియును, అయినట్టి నిర్మలమైన బుద్ధితో నేను చెప్పిన విసయమునంతయు నీవు జరిగించుటకు మనస్సునందు తలంచితివా? మన తండ్రియును, మన తాతలును మునుపు నడచినట్లుగా నడచుచున్నావు గదా. ఓ పవిత్రాత్ముడా! అటువంటి ధర్మమార్గము అనుసరింపదగినదే కదా! వినుము నీ వొక్కడవే మధుర పదార్థములను భుజింపవు గదా! ప్రేమతో నీ శ్రేయస్సును గోరు మిత్రవర్గమునకు అవసరమైనచో ధనముచే సంతుష్టిని గలుగజేయుదువుగదా! రాజు ధర్మముగా రాజ్యపాలనమును జేసి తరువాత స్వర్గమునకు వెళ్ళును గావున ఓ రాజతనయా! ఏ సమయమందైనను ధర్మమును విడువ తగదు సుమా" అని చెప్పెను.



# నూటొక్కటవ సర్గము

## భరతుడు శ్రీరామునకు దశరథుడు మరణించుటను దెల్పుట :

ఆ మాటలను విని భరతుడు ఇంద్ర సమానుడగు నా రాముని జూచి వినయముతో నిట్లనెను. “నావంటి ధర్మహీనుడు రాజధర్మముల నెల్లను జేయగలడా? మనలో పూర్వము నుండి వచ్చుచున్న ధర్మమొకటి కలదు గదా! జ్యేష్ఠుడు జీవించియుండ చిన్నవాడు రాజ్య భారమును భరింపరాదు. అందమైన సమస్త వస్తు సంభారములతోనున్న యయోధ్యకు నా వెంబడి స్నేహముతో వచ్చి ఉత్సవముగా అభిషేకము పొందుము. రాజు కూడ మనుష్యుడే యనువారు కూడ సాటిలేని ధర్మార్థములతో గూడిన నీ నడవడిని మనుష్యుల కతీతమైనదని చెప్పుటచే ఓ అనఘా! నిన్ను నా ఆత్మయందు దేవునిగా తలంతును. కేకయ రాజు యొక్క గృహమునందు నేనుండగా, సీతాలక్ష్మణ సహితుండవై నీ వడవులకు వెళ్లగానే, దుఃఖముచేత తిరస్కరింపబడినవాడై వేగముగా మన తండ్రియైన దశరథుడు స్వర్గమునకు వెళ్లెను. కాన లెమ్ము. తండ్రి కుదకదానము చేయుము. మేమిద్దరము చేయవలసిన కార్యములెల్ల మునుపు చేసియున్నారము గావున మీ రిరువురు నిప్పుడు చేయుటకు పూనుకొనుడు. ప్రియమైన వాడు నీళ్లు విడచినచో ప్రేతకు తృప్తికలుగును. మరియు పితృలోకము వారల కక్షయ్యముగా సిద్ధించును. మన తండ్రికి నీవు మిక్కిలి ప్రియమైన వాడవు గావున లెమ్ము. లేచి నీవింక ప్రేమతో నివాపములనిమ్ము. నిన్ను తలంచుకొనియే యేడ్చుచు నిన్ను చూచుటనే కోరుచు, నిన్ను విడువలేని బుద్ధితో, నిన్ను మరలింప లేక – ఓ అనఘా! నిన్ను విడుచుటచేత గలిగిన ఆర్తిచేత పీడింపబడినవాడై అక్కటా! నీ తండ్రి నిన్నే అధికముగా స్మరించుచు అస్తమించెను.”

# నూట రెండవ సర్గము

## పితృమరణము విని శ్రీరాముడు దుఃఖించుట :

అని భరతుడు తండ్రి మరణవార్తను ఇంద్రునిచే విడువబడిన వజ్రాయుధముల వంటి వాక్యములతో దారుణముగా వినిపింపగా అడవియందు గండ్రగొడ్డలిచే మొదలంటగా నరుక నేలవ్రాలు పుష్పఫలభూషితమైన వృక్షమో యనునట్లుగా రాముడు కూలిపోయెను. ఒడ్డులను గూలద్రోసి అలసటతో నిదురించు ఏనుగో యనునట్లు నేలపై వ్రాలిన యన్నను జూచి తమ్ములును సీతయును వ్యథయను నగ్నిచే పీడింపబడినవారై రామునకు చేల్లని నీటిచేత శరీరమంతయు తడుపగా అంతట దీనవదనుడై రఘురాముడు మూర్ఛనుండి తేరుకొని కన్నుల నుండి నీరు కారుచుండగా భరతుని జూచి యిట్లు పలికెను. ఉత్తముడైన ఆ నా తండ్రి లేకున్నచో నింక నాకయోధ్యలో నేమున్నది? లోకములో నున్నతుడగు ఆ దశరథుడేలినట్టి యయోధ్యను ఇంక భరింపగల సమర్థు డెవ్వడయ్యా! ఆదిశేషుడు మోయు భారమునేది మోయగలదు? నన్ను గురించి తలచి తలచి మరణించిన జనకుని యొక్క సంస్కార విధులను నిర్వహింపలేనట్టి నన్ను పోలిన పుత్రుడు దుష్టమైన జన్మగలవాడు అటువంటి ఘనునకు పుట్టి యేమి ప్రయోజనమో చెప్పుము. ఓ భరతా! శత్రుఘ్నునితో కలిసి నీవు పూనికతో జనకునకు ప్రేత కార్యమును తీర్చితివి కనుక నీవే ధన్యుడవు. నాకా పవిత్రమైన పుణ్యము అబ్బునట్టి భాగ్యములేదు గదా! దిక్కులేక జనులు దీనులై చీకాకు పడుచున్న మన పురమునకు వ్రతము సమాప్తమైన తరువాత కూడ అచ్చట తండ్రి లేనికారణముచేత మరలివచ్చుటకు నాకు మనసొప్పుటలేదు సుమా!

ఓ భరతా! ఈ వనవాసమును పూర్తిచేసికొని యయోధ్యకు నేను తిరిగి వచ్చునప్పుడు నన్ను చూచి తిన్నగా నడపించు వారెవ్వరయ్యా! జనకుడు లోకాంతరమున కేగెను గదా! పూర్వము సత్కార్యము లొనరించి వచ్చిన నన్ను తనతో గూడ గూర్చుండబెట్టుకొని చెప్పిన అమృతవాక్కులను చెవులకింపుగా వినినవాడను. ఇంక ఎన్ని విధముల ఆలోచించినను అట్టి మాటలను వినజాలను గదా! హా!" అని భార్యయైన సీత దిక్కునకు మొగము ద్రిప్పి "ఓ తరుణీ! ఇంక నీకు మామగారు లేడు గదా! ఇంకెవ్వరిని మామా! యని పిలిచెదవు? ఓ లక్ష్మణా! తండ్రి లేనివాడవైనావు గదా!" అని కన్నీరు నిండిన కన్నులు గలవాడై ఆ రఘురాముడు తల్లడిల్లుచుండగా, భూపుత్రి భర్త రాముని యొక్క శోకముతో గూడిన ఆ మాటలను విని అతని సోదరులు మిక్కుటమగు శోకముతో తమ మనస్సులందు తండ్రియగు దశరథుని దలచి తలచి దుఃఖించిరి. ఇట్లుమ్మలికము పొందుచున్న రఘురాముని తమ్ములు ఓదార్పు మాటలతో ఇక తండ్రికి నివాపములిచ్చుట కార్యమనియు వగచిన ఫలమేమి యనియు నూరడించిరి. మామ స్వర్గమున కేగెనను మాట వినినంతనే ఆర్తితో జానకీదేవి యేడ్చుచు కన్నుల నిండ నీరునిండుటచే భర్తను గూడ చూడజాలనిదయ్యెను. రాముడామె నూరడించి కన్నులు వాచునట్లుగా దుఃఖించు లక్ష్మణుని ప్రేమతో బిలిచి "తమ్ముడా! తండ్రికి నీళ్లు వదలుటకై వెళ్లుదును. స్నానవస్త్రమును గారపిండియును తొందరగా సిద్ధపరపుము. ముందుగా సీతను వెళ్లనిమ్ము. తరువాత నీవు వెళ్లుము. ఆవెనుక నేను వచ్చెదను. దారుణమైన కార్యములను జేయునప్పు డిదియే జరిగించవలసిన విధము సుమా!" అనుచు వెళ్లుచున్న వారలనచ్చట నున్నవారు ఓదార్పు మాటలతో నూరడించిరి. ఇంద్రియముల నణచినవాడును, ఆత్మజ్ఞానము కలవాడును, శాంతుడును, రామునియందు భక్తిగల వాడును, మంచి హృదయము గలవాడును ఎల్లప్పుడును వీడని బుద్ధి గలవాడును నగు సుమంత్రుడును మంచి మాటలచే వారల దుఃఖోపశమనము గావించెను.

వారలు దుఃఖమున పాదములు తడబడుచుండగా పుష్పములచే ప్రకాశించు వృక్షములతో నొప్పుచున్న వనములు గలదియు, పవిత్ర తీర్థమైనదియు నయిన మందాకినీ నదిని సమీపించి నిర్మలముగా వేగముగా పారుచున్న ఒక రేవు చేరి యశస్సు గలవారలు రాజును మనస్సునందు తలచుచు "ఇవే నీకు ఇవే నీకు" అనుచు జలములను విడచిరి. అంత రాముడు దోసిట నుదకంబులు తీసికొని దక్షిణదిశగా తిరిగి అధికమైన శోకభారముచే తపించుచు తండ్రిని గూర్చి యీ విధముగా పలికెను.

**రామలక్ష్మణులు తండ్రికి నివాపములిచ్చుట :**

"ఓ తండ్రీ! పితృలోకమునకు వెళ్లిన నీకు నేనొసంగు పవిత్రమైన ఉదకము అక్షయ సుఖముల నిచ్చుటకు సమర్థంబగును గాక!" అని చెప్పుచు రాముడు తమ్ములతో సహితముగా ఆ మందాకినీ తీరమున నివాపమును విడచి ఇంకొకచోటికి వెళ్లి అచ్చట దర్భలను పరచి గారపిండియును రేగుపండ్లను గలిపి పిండములను చేసిపెట్టి తండ్రిని తలంచుచు కన్నుల నుండి నీరు జడివానగా కురియుచుండగా ఆ పిండములను చూపుచు దృఢమైన మనస్సుతో నిట్లనెను. "పురుషున కేది యన్నమో ఆ పురుషుని దేవతకును అదియే ఆహారమౌను గాన రాజా! మా కాహారమైన ఈ పిండిని ఎక్కువైన ప్రీతితో భుజింపుము" అని చెప్పుచు చేయవలసిన క్రియల నన్నిటిని నెరవేర్చి తిరిగి పర్వతము నెక్కి ఆకులతో గప్పిన పర్ణశాలనుచేరి 'హా'యని భరత లక్ష్మణులను గౌగలించుకొని శోకమతిశయింపగా నిలపించుచుండ వారి ఆ విలాసధ్వనులకు పర్వతము ప్రతిధ్వనించెను. అది విన్న భరతుని సైన్యములు భయముచెంది భరతుడు శ్రీరాముని చూచెను కాబోలును. రాముడు తమ తండ్రి మరణవార్తను వినెను కాబోలును. కావుననే ఇంత కలకలము పుట్టుచున్నది అనుకొనుచు వారలు వారి వారి వాహనములను విడచి ఆ ధ్వని వచ్చు దిక్కుగా జాడనుబట్టి పరువెత్తిరి.

**పౌరులు శ్రీరాముని పర్ణశాలకు బోవుట :**

సుకుమారులగు కొందఱు గుఱ్ఱముల మీదను కొందఱేనుగుల మీదను కొందఱు రథముల మీదను వెడలగా తక్కిన అందఱును కాలినడకనే ఆ స్థలమునకు వెళ్లిరి. రామచంద్రుని విడచి కొన్ని నాళ్లేయయినను ఎన్నాళ్లో అయినట్లుగా ఏకారుచు లోకులు కడువేగము ఆ యన్నదమ్ములను జూచుటకై వెళ్లిరి. ఆ యన్నదమ్ముల సమాగమమును ప్రేమతో చూచుటకై తొందరగా వెళ్లుచుండగా ఉత్పన్నమైన గుఱ్ఱముల గిట్టల యొక్కయు రథచక్రముల అంచుల యొక్కయు ధ్వని ఆకాశమున మేఘబృందము కూడినప్పటి స్థితిని దలపించెను. గడబడ దడబడయను శబ్దములతో తడబడుచు ఆ అడవిలోని దున్నలు, ఏనుగులు, పెద్దపులులు, పాములు, గవయములు, తోడేళ్లు కొండ అదరునట్లు పరువెత్తినవి. చక్రవాక పక్షుల సమూహములు, హంసలును, బెగ్గురు పక్షులును, నీరుకోళ్లును, క్రౌంచ పక్షులును విడువని భీతితో ఆకాశమున అరువ దొడగెను. పక్షులాకాశమునను, జంతువులును, మనుష్యులును నేలమీదను ఎల్లచోటులను నిండియుండగా దుఃఖముతో నేలమీద గూర్చుండియున్న రాముని జనులందఱు జూచిరి. కైకను మంధరను తిట్టుచు, పుట్టెడు కన్నీటితో కన్నులు నిండగా అట్లే రాముని చూచి కట్టాయనుచు అందఱు విచారపడుచుండగా వారందఱిని జూచి రాముడు సాదరముగా తల్లిని తండ్రిని వలె ప్రేమతో గౌగలించుకొనెను. కొందఱు రాముని కౌగలించుకొనిరి, కొందఱా పవిత్రునకు మ్రొక్కిరి. బంధువులను స్నేహితులను రాముడు తగు విధముగా ఆదరించెను. వారి యేడ్పుల ధ్వనులు భూమ్యాకాశములు నిండగా గిరిగుహలు మృదంగ ధ్వనులను బోలిన ప్రతిధ్వనుల నిచ్చెను.



# నూట మూడవ సర్గము

**కౌసల్య సుమిత్రకు శ్రీరామ లక్ష్మణుల యేటినీటి రేవు చూపి దుఃఖించుట :**

అంతట దశరథ మహారాజు భార్యలను ముందుంచుకొని వసిష్ఠుడు సీతానాథుని జూచుటకెంతో సంతోషముతో వచ్చుచుండగా మార్గమున దశరథుని దేవేరులందఱును మెల్లమెల్లని నడకలతో మందాకినీ నదీ తీరమునందు నడచుచు రామ లక్ష్మణులు సేవించు పవిత్రమైన తీర్థమును జూచి కన్నులవెంట కన్నీటి ధారలు గురియగా కౌసల్య తన వెంట వచ్చుచున్న సుమిత్ర మొదలగు స్త్రీలతో మెల్లగా నిట్లనెను. "తమ రాజ్యము నుండి వెడలగొట్టబడినట్టి అనాథులు పవిత్ర చరిత్రులునైన రామ లక్ష్మణులు మంచితీర్థమునకు వచ్చు రేవు సుమా యిది. అడుగుజాడలు గనిపించుచున్నవి. ప్రతి దినము వచ్చి వెళ్లుచుండుటచే గట్టిపడి యున్నది. సుమిత్రా! చూచితివా వారి కష్టములు? నా పుత్రునకై యిచ్చటనుండి నీ కుమారుడు భక్తిశ్రద్ధలతోను ప్రేమతోను ఇచ్చటి నుండి నీళ్లు ప్రతి దినము తీసికొనిపోవును గదా. సుమిత్రా! ఇది నీచమైన పనియే. ఈ కారణమున జగత్తంతయు నీ పుత్రుని నిందింపదు. అన్నగారికి సేవ చేయుటయే పరమార్థ మని అతడట్లు చేయును. ఆ సుగుణవంతునకే అది చెల్లును. భరతుని కోరిక నెరవేరినచో ఇతని కష్టమంతయు తీరిపోవును గదా!" అని ముందుకు నడచుచు దక్షిణ దిశగా కొనలున్న దర్భల మీద రాముడు తండ్రికిగా నుంచిన గారపిండిని జూచి తన వెంటనున్న దశరథునని భార్యలను చూచి కౌసల్య యిట్లనెను. "చూచితిరా. తండ్రికై రఘురాముడు యథావిధిగా పెట్టిన పిండములను? దేవునితో సమానుడును, ఇంద్రభోగముల వంటి భోగముల ననుభవించిన

వాడును. పూజ్యుడును చతుస్సాగర పర్యంతమైన భూమి నేలినవాడును అయిన దశరథ మహారాజేవిధముగా నీ గారపిండిని తినును. ఇటువంటి పిండములను రాజైన దశరథునకు రాముని వంటి పుత్రుడు పెట్టవలసివచ్చెను. ఇంతకంటె విచారింప వలసినదున్నదా? అక్కటా! తండ్రికి రాము డింగుదీ పిణ్యాకమును పెట్టుట కన్నులార చూచియును నా హృదయము వేయి ముక్కలుగా పగులకున్న దేలనో. పురుషునకేది యన్నమో అతని దేవతలకు అదియే అన్నమను వేద వాక్యములను మునుపు వినియుంటిని. అది నిజమని యిప్పుడు కన్నులతో చూచుటైనది.”

**కౌసల్యాదులు శ్రీరాముని జూచుట :**

అని యిట్లు దుఃఖించుచున్న కౌసల్యను సవతులందఱును సముదాయించుచు ఆశ్రమమునకు వెళ్లి భోగములను విడచి స్వర్గమునుండి భూమికి దిగివచ్చిన దేవశ్రేష్ఠుని పోలిన రాముని చూచి గొల్లుమనుచు పెద్దపెట్టున ధ్వనివచ్చునట్లుగా ఏడ్చుచుండ రామచంద్రుడు తొందరగా తల్లుల పాదములకు నమస్కరింపగా వారందఱును సుఖమైన స్పర్శగల తమ మృదువైన చేతులతో తమ వ్రేళ్లతో సీతానాథుని వీపుమీద రాయుచు దుమ్మును పోదుడిచిరి. అంత తల్లులను జూచుచు లక్ష్మణుడు దుఃఖముతో సాష్టాంగపడగా రాముని వలెనే అతనిని గూడ తల్లులాశ్వాసించిరి. సీతాదేవి వచ్చి తపించుచున్న హృదయముతో కన్నులనీరు గారుచుండగా అత్తలకందఱకు నమస్కరించి నిలిచియుండగా, అత్తయగు కౌసల్య దయతో తల్లి బిడ్డను వలె చేతులతో గ్రుచ్చిపట్టుకొని వనవాసక్లేశముచేత కృశించియున్న దీనురాలగు జానకిని వీక్షించి గద్గదకంఠియై యిట్లు పలికెను. “అమ్మా! జానకీ! నీకు తండ్రి జనకరాజు. దశరథ మహారాజు మామ. రామవిభుడు ప్రాణసమానుడైన భర్త అయియుండియు నిట్లడవులలో దుఃఖము లెట్లనుభవించుచున్నావమ్మా? తామరలవంటి నేత్రములు గల ఓ

జానకీ! వాడిపోయిన కలువపువ్వువలెను, ఎండకు నేలవ్రాలిపోయిన పద్మమువలెను, దుమ్ముచే గప్పబడిన బంగారమువలెను మబ్బుగుంపులు గప్పిన చంద్రునివలెను నీ మొగము గొప్ప శోకమనెడు అగ్నియై కట్టె నగ్ని కాల్చునట్లుగా నన్ను కాల్చుచున్నది సుమా!" అని యీ ప్రకారముగా రాముని తల్లి దుఃఖించు చుండగా ఇంద్రుడు దేవగురువునకు మ్రొక్కిన విధముగా శ్రీరాముడు వసిష్ఠునకు మ్రొక్కి అతనితోగూడ నాసీనుడయ్యెను. భరతుడు తన మంత్రులతోను పౌరులతోను గూడ కలిసి కూర్చుండెను. అప్పుడు భరతుడు చేతులు జోడించి రామచంద్రునకు మ్రొక్కి ఏమి పలుకునో విందమని ప్రజలు చెవులప్పగించి వినుచుండగా, రాముడును అతని తమ్ములును పౌరులతో గలసి సభ్యులతో గూడిన యజ్ఞాగ్నుల వలె నొప్పిరి.



# నూట నాలుగవ సర్గము

## శ్రీరాముడు భరతుని రాకకు కారణమడుగుట :

భక్తవత్సలుడైన రాముడు లక్ష్మణునితో గూడి భరతుడు తన్ను చూడవచ్చుట యందు గల భావము తెలిసియుండియు అతనిని కౌగలించుకొని మంచి మాటలతో నిట్లడిగెను. "ఇది యేమి? నీవే చెప్పగా వినవలయునని మనసు కలుగుచున్నది. భరతా! నీవేల యిచ్చటికి వచ్చితివి. ఈ జడలనెందులకు దాల్చితివి. ఈ నారచీరల నెందుకు ధరించితివి? మన రాజ్యమును విడచి నీవెందులకిట్లు వచ్చితివి?" అని యడుగగా భరతుడు చేతులు జోడించి యిట్లనెను. "ఓ అన్నా! చేయరాని పనిచేసి మిమ్ముల నెడబాసి రాజు పుత్రశోకముచే శరీరము విడచిపెట్టెను. ఆడుదియైన నా తల్లి చెప్పిన మాటను విని ఆత్మయశస్సును హరించునట్టి మహాపాపమును చేసెను. రాజ్యము ప్రాప్తించకపోగా వైధవ్యమును బొంది ఏడ్చుచు దుర్మార్గురాలగు నా తల్లి గొప్ప భయంకరమైన నరకమున బడును. అట్టి అపవాదముచేత దహింపబడుచున్న నన్ను నీ సేవకుని ననుగ్రహించుట నీకు తగును సుమా! దేవేంద్రుని వలె మరల రాజ్యమును బొందుము. భూమియందు గల జనులందఱును వైధవ్యమును పొందిన మన తల్లులందఱును నిన్ను చూచుటకు వచ్చియున్నారు. ఇదిగో. కులమునకు భూషణమైనవాడా! నిర్మలుడా! రామా! మమ్ములను దయతో చూడుము. పెద్దవాడుండగా చిన్నతమ్ముడు రాజగుట మన వంశ మర్యాదయేనా? భరింపదగ్గ దక్షత గలవాడవైన నీవే యీ భూమికి రాజువై జనులు సంతోషించు నట్లుగా హితమును గలుగజేయుము. కలువల మిత్రుడైన చంద్రునిచే ప్రకాశించు శారదరాత్రివలె నిన్ను రాజుగా పొంది భూమి సనాథయై జనులు

సంతోషమును బొందునట్లుగా ప్రకాశించు గాక! నీకు సోదరుడను శిష్యుడను నీకు దాసుడను. మంత్రులతో గూడి నేను సాష్టాంగ నమస్కారముతో వేడుకొనెదను. దయతో చూడుము. సజ్జనులలో శ్రేష్ఠుడైనవాడా! పూజింప దగినదై శాశ్వతమైనదియు తాతముత్తాతల నుండియును సంక్రమించినదియు నగు రాజ్యమును స్వీకరింపుమని ప్రజలు చేయు ప్రార్థనమును మీరుట భూజనులయందు వాత్సల్యము గలవాడా! ఆలోచింపగా నీకు యోగ్యము కాదు సుమా!”

## శ్రీరాముడు భరతునితో నీవు నిర్దోషివని చెప్పుట :

అని చెప్పుచు కన్నులయందు శోకముచే నుబికివచ్చుచున్న కన్నీరు అల్లనల్లన వెడలు చుండగా రాముని యొక్క పాదమూలములందు తన శిరము మోపి నిట్టూర్పులు విడుచు చున్న తమ్ముని జూచి లేవనెత్తి తన కౌగిట గ్రుచ్చి పట్టుకొని యిట్లనెను. “తమ్ముడా! నీ బోటివాడే యిట్లుండగా నిక పామరుల విషయము చెప్పవలెనా? మంచి కులమున బుట్టిన వాడవు. సాత్వికుడవు. గొప్ప వ్రతములు చేసినవాడవు. మహా శక్తి సంపన్నుడవు. ఈ భూమికై యింతటి పాపమును తలపెట్టుట నీకెట్లు తరమగును. కాన నీ వలన కొంచెమైన నపకారము లేదని నేనెఱుగుదును. నీవు బాలుడవగుటచే నీ తల్లి నిట్లు తగని విధముగా దిట్టితివి. ఇది తగదు సుమా! మంచి బుద్ధి గలవారైనను తాము మనస్సునందు మెచ్చునట్టి దారపుత్రాదుల పట్ల ఆదరము గల్గి ప్రవర్తించుట విపరీతము కాదు గదా! తమ్ముడా! కొడుకులును, భార్యలును, శిష్యులును ఏవిధముగా భూమియందు సంచరింపవలెనని సాధువులు చెప్పుదురో ఆ ప్రకారముగా మన తండ్రి యెడల మనమును నడచుకొనవలదా? భూభారమును వహింపుమని యాదేశించుట కెట్లర్హుడో అట్లే మన తండ్రి నన్ను కానలయందు కృష్ణాజినములు ధరించి, తిరుగుమనుటకు అర్హుడుకాడా? ధర్మమార్గమునెఱిగిన తండ్రి యందు మనము జనులు పొగడునట్లు గౌరవము నుంచినట్లే, ఓ ధర్మజ్ఞుడా తల్లియందు కూడ

మనము గౌరవముంచుట మర్యాదగాదా? చెప్పుము. ధర్మశీలురైన తల్లియును తండ్రియును రామా! నీ వరణ్యమునకు వెళ్లుము అని చెప్పగా, ఓ న్యాయ చరితుడా! నేనా యాజ్ఞను మీరవచ్చునా? ఓ పూజ్యమయిన నడవడి గలవాడా! నీవయోధ్యలో రాజ్యమును బొంది భువనములచే సత్కారమును బొందుము. నేను దండకారణ్యమునందు వల్కలములను అజినములను ధరించి ఉండెదను. లోకములెఱుగునట్లుగా ఈ ప్రకారముగా విభాగించి మన తండ్రి స్వర్గమునకు వెళ్లెను. భరతా! నీకిచ్చిన భాగమును నేను పుచ్చుకొనుట ధర్మమా? నీవే చెప్పుము. లోకమునకు ఆచార్యుడును, ధర్మము తెలిసిన వాడును అగు మన తండ్రి చెప్పినమాట నీకు ప్రమాణమే కదా! నీ కతడిచ్చినట్టి భాగమును నీవు భోగింపకుండుట ధర్మమగునా? నాకు జనకుడు ప్రసాదించిన భాగమగు ఈ వనవాసమును పదునాలుగేండ్లును వనమునందుండి అనుభవించుటే తండ్రికి హితమని తలచెదను సుమా! పరలోకమునందు సైతము సత్కరింపబడినవాడును, ఇంద్రసమానుడును అయిన తండ్రి చెప్పిన మాటయే పరమార్థమనియు, చేయవలసినదనియు తలంతును, కాని లోకములన్నింటిని ఏలుటయైనను నాకు సంతోషమును కలుగజేయునా? తమ్ముడా!" అని చెప్పుచుండగా..



# నూట యయిదవ సర్గము

## భరతుడు శ్రీరాముని రాజ్యమును గ్రహింపుమని కోరుట :

ఆనాటి రాత్రి ఈ మాదిరిగా ఆ మనుష్య సింహులకు శోకము తోడనే గడచిపోయెను. సూర్యుడుదయింపగానే మందాకినీ నదికి వెళ్లి నిష్ఠతో జప తపములను దీర్చుకొనని భరతాదులందఱు హితులతో మంత్రులతో గలసి రామచంద్రుని కొలిచి యుండిరి. అట్లు కొంతసేపు చూచువారలలో నొక్కరైనను మాటలాడకుండిరి. అప్పుడు పెద్దవాడైన అన్నను జూచి కైక పుత్రుడు ప్రేమయు, గౌరవమును స్పష్టమగునట్లు ఈ విధముగా బల్కెను. "నా తల్లికి, బుద్ధి చెప్పితిని. అక్రమముగా నాకు సంక్రమించిన ఈ యపారమయిన సంపదతో కూడిన రాజ్యమును మీ కొసగుటకై పనిబూని వచ్చినాడను. గొప్ప గుణములు గల ఓ రామచంద్రా! మహారాజా! అడ్డులేని ఈ భూమిని పుచ్చుకొని నన్ను కృతార్థునిగా జేయుము. వాన కాలమందు ప్రవాహ వేగముచేత గట్లను పడగొట్టుచు వచ్చు జల ప్రవాహమును (నదిని) ఆపలేని విధముగా ఈ రాజ్యమును నీవుకాక ఇతరు లేలలేరు సుమా! గుఱ్ఱము యొక్క నడకను గాడిదయు, గరుత్మంతుని గమనమును కాకియు సరిపోలదరమా? అట్లే! దేవా! నీ యొక్క శ్రేష్ఠమైన మార్గమును అనుసరించుట నా వశమగునా? ఒకరి యాజ్ఞలో నుండి రక్షణ భారము తెలియకుండ నుండువాని జీవితమే సుఖమగును గాని ఇతరులను రక్షించు భారమును తన తలపై ధరించువాడు కష్ట జీవితమును గడపువాడే సుమా! ఒక పురుషుడు విత్తనము నాటగా నది పెద్దవృక్షమై మరుగుజ్జువాని కెక్కరనట్లు పెరిగి పువ్వులు పూచి కూడ ఫలవంతమై వంగనిచో చెట్టును పెంచినవానికేమి సంతోషము కలుగగలదో మనసునందు తలంపుము. ఓ మహాభుజుడవగు రామా! మా కందఱకును నీవే రక్షకుడవు నీ సేవకులమగు

మమ్ములను నీవే యేలుటకు పూనుకొనకున్నచో పైన చెప్పిన విషయమే దీనికుపమానము సుమా! ఇది నీవే యెఱుగవలెను. రాజ్యమునందలి పౌరులును మంత్రులు శత్రుదమనుడవు, రాజ్య సింహాసనస్థుడవు నయిన నిన్ను నిండు తేజస్సుతో వెలుగు సూర్యునివలె కాంచుదురు గాక! నిన్ననుసరించుచు మదపుటేనుగులు ఘీంకరించును గాక! అంతఃపురమున నున్న స్త్రీలును తృప్తితో పొంగిపోవుదురు" అని పల్కుచుండగా రాముని భరతుడు వినయముతో వేడుకొనుచున్న విధమును చూచి, అచ్చట నున్న జనులందఱు భరతుని మాట నేర్పరితనమును మెచ్చుకొనిరి. తన్ను దీనమైన మాటలతో ఆర్తితో వేడుకొను తమ్ముని జూచి ప్రీతితో నోదార్చుచు నియమవంతమగు చిత్తము గల రామచంద్రు డిట్లనెను.

## శ్రీరాముడు భరతునకు దుఃఖోపశాంతి వచనములు చెప్పుట :

"తమ్ముడా! యెన్నడైనను మనుష్యునకు స్వాతంత్ర్యమున్నదా? తన యిష్టము వచ్చినట్లుగా లోకమున సంచరించుచుండగా దైవమే అటునిటు లాగి కష్టపెట్టును సుమా! వినుము. ధనములు తుదిని నశించునవియే. అభివృద్ధిలో నున్న పదార్థములును తుదకు నశించునవియే. పుట్టుట యొక్క అంతము గిట్టుటే; కలిసికొనుటలన్నియు తుదిని విడిపోవుటకే సుమా! పండిన ఫలములు రాలిపోవుట తప్ప వేరు విధమైన భయములేని విధముగా భూమిమీద పుట్టిన మనుష్యునకు మరణించుట తప్ప వేరు విధమైన భయము కనిపించదు సుమా! బలిష్ఠమైన స్తంభములు గల యిల్లు కాలము గడచుటచే రూపము చెడునట్లుగా పురుషుడు ముదుసలితనముచే పట్టుతప్పి చావుచేత నశించునుగదా! కడచిన రాత్రి అంతటితో కడచిపోయినదే యగునుగాని మరలివచ్చునా? ఎక్కువ జలములు కలిగి త్రుళ్లిపడుచున్న సముద్రములో గలిసిన నిండైన యమునానది తిరిగి వచ్చునా? పగలును రాత్రియును గడచుచు ప్రాణుల యొక్క ఆయువును వేసవిలో సూర్యుడు తన కిరణముల వేడిమిచే జలములను ఆవిరి యొనర్చునట్లు మ్రింగివేయుచున్నవి. అందువలన ఓ తమ్ముడా! నీకై నీవేడువుము. ఇట్లేల

యితరులకై చింతించుచు ఏడ్చుచున్నావు. ఆయువు శాశ్వతమా? తమ్ముడా! పుట్టినవాడు చచ్చుట నిశ్చయము. నడచుచున్నను నిలిచియున్నను వేగముగా నీ యాయుస్సు క్షీణించుచున్నది. అందువలన ఈ జన్మము సార్థకమగు మార్గమేదో కనుగొనుము. ఓ తమ్ముడా! పురుషునితో పాటే మృతియు పుట్టును. పురుషుని తోడనే కలసియుండును. పురుషునితోడనే తిరుగుచుండును. ఈ మృతియనునది మనుష్యుడెంత దూరము వెళ్లిన నంతదూరము వెళ్లును. అతడు మరలిన మరలును. బుద్ధియందాలోచింపుము. శరీరము ముడుతలుపడగా పాదములు తడబడుచుండగా తల తెల్లగా నెరసిపోగా నుండు కాలమున నిన్ను నీవు రక్షించుకొనుటకెట్లు సమర్థుడవగుదువో చెప్పుము. ఇదిగో సూర్యు డుదయించెను. అదే సూర్యుడస్తమించెను అని లోకమున ప్రజలు సంతోషముతో చూచుచుందురు. తమ తమ బ్రదుకులు క్షీణించుచుండుటను తెలిసికొనరు అయ్యో! ఒక ఋతువు వెళ్లిపోయి మఱియొక ఋతువు ప్రవేశించుటను జూచి ఈ భూమి యందున్న జనసంఘములు హర్షమును బొందుదురు. అది తమ బ్రతుకు పరిమాణమును దినివేయుచుండుటను పరికింపరు గదా? ఒక కట్టెయు నింకొక కట్టెయు ఏటినీటిలో బడి సముద్రమును బ్రవేశించి ఒకచో కలిసియున్నట్లే యుండి ఆకస్మికముగ విడిపోవు రీతిగా, భార్యయు, బిడ్డలును, బంధువులను ఒకచో చేరియుండియు తరువాత విడిపోవుట కాలబలముచేతనే. ఏ విధముగా నైన విడిపోవుట తప్పనిది. ఇది నిజము. నమ్ముము. ఇక చింత ఏమిటికి? ఇష్టముతో బ్రతికియున్న ఇష్టజనులందఱితో నొకచోట కలిసియుండవలె ననుకొన్నను శక్యముగాకున్న దనగా ఇక చచ్చెడివారి నాపుటకు శక్యమగునా! ఓ గొప్ప వివేకము గలవాడా! నీవు మనమున బాగుగ నాలోచింపుము. ప్రాణికి ఎక్కడి మిత్రులు, ఎక్కడి సోదరులు, ఎక్కడి చుట్టములు? దారిలో నిలిచియున్న వాడు ఆ త్రోవలో వెళ్లుచున్న పాంథులతో నేనుగూడ మీవెంట వచ్చెదనని పలుకు విధముగా పెద్దవారు నడచిన మార్గముననే నడచుట శ్రేయము సుమా. కనుక దాటశక్యము గానటువంటి మార్గమున నడచినట్టి జీవులకై విచారించిన ఏవిధమైన మేలు కలుగునో చెప్పుము? ఈ వయస్సు ప్రవాహము వంటిది

సుమా! తొందరగా ముందునకు వెళ్లుచుండునుగాని వెనుకకు మరలదు సుమా! అందుచేత మనస్సును నిలకడగా నుండునట్లు నియమించుకొన్నచో ప్రజలు సుఖించెదరు. దానివలన చెడిపోవనటువంటి సుఖమును పొందెదరు. మన తండ్రి ధర్మము తెలిసినవాడై యుండి శుభములనిచ్చు యజ్ఞములన్నిటిని చేసియున్నాడు. దక్షిణలచేత బ్రాహ్మణుల నందఱిని సంతుష్టులను చేసినాడు. తన సేవకులను, భూజనులను మంచి దానముల చేత సంతుష్టినొందించినాడు. చేతికొలది దానము చేసి ఇష్టభోగముల నన్నిటి ననుభవించినాడు. అటువంటి తండ్రికొఱకు దుఃఖించుటెందులకో చెప్పుము. తండ్రీ! ఈ చివికిపోయిన మనుష్య శరీరమును భూమియందు విడచి బ్రహ్మలోకములో సంచరించదగిన దివ్య దేహమును ధరించి ప్రకాశించుచున్న తండ్రికై దుఃఖించుటెందులకో చెప్పుము. సాధు మార్గమున నడచువాడా! తమ్ముడా! ప్రాజ్ఞుడీవిధముగా నేడ్వబోడు సుమా! నిన్ను బోలిన శాస్త్రపారంగతుడు శోకములో మునిగియుండదగునా? ఈ విధముగా శోకించుటవలన ఏమి కార్యమగునో చెప్పుము తండ్రీ! ధైర్యము గలిగియున్న బుద్ధిమంతుడెట్టి దశయందైనను మనసునందు గలిగిన దుఃఖభారముచేత కనులవెంట నీటిబొట్లను పుట్టనీయడు సుమా! కావున స్వస్థ చిత్తుడవై విచారమును విడచి మనయూరికి వెళ్లి రాజ్య భారమును వహింపుము. తండ్రి యాజ్ఞ ననుసరింపుము. నేనును పదునాలుగేండ్లీ వనవాసమును పూర్తిచేసెదను. నేనే తండ్రి యాజ్ఞను విఫలము చేయవచ్చునా? నాబోటివాని కది ధర్మమా? ఆతడే మనకు తండ్రియును అతడే చుట్టమును గావున నీవాతని మాటను మన్నించుట ఖ్యాతిప్రదము. నాకు కూడ అదియే ఇష్టము సుమా. ఓయీ ధర్మార్థముల నెఱిగినవాడా! పరలోకమును గోరు మనుష్యుడు ఎక్కువ దయ గలవాడును ఎక్కువ నిష్ఠ గలవాడును అయినను గురుజనుల వాక్యమును పరిపాలించినవాడు కావలయును సుమా! ఓ భరతా! మన జనకుని సత్ప్రవర్తనను మనస్సునందు తలంచి అతని మాటను నిలబెట్టుటకై రాజ్య భారమును వహింపుము. ఇట్లేల దుఃఖమున మునిగెదవయ్యా!”

# నూట యాఱవ సర్గము

## భరతుడు శ్రీరామునితో తన దుఃఖమునకు కారణము చెప్పుట :

అని శ్రీరాముడు చెప్పగా రాముని జూచి భరతుడిట్లనెను. అన్నా! నీవంటి వాడుండుటరుదు సుమా! నిన్ను కీడు కొంచెమైనను కష్టపెట్టజాలదు. మేలు నిన్ను పొంగిపోవునట్లు చేయజాలదు. జ్ఞానులగు పెద్దవారికి కూడ వారెఱుగని విషయములు చెప్పునట్టి నీవు ఏమియు దెలియనివానివలె వారిని సందేహముల నడిగి వారికి జ్ఞానము కలిగించుచుందువు. కనబడని వస్తువునందు కోరిక కలుగదు. చనిపోయినవారిమీద పగయుండదు. అట్లే బ్రతికియున్నవారిపై గూడ పగయుండదు. కనుక రాజా! నేనును తండ్రిని గూర్చి మనస్సునందు విషాదమును పొందను. మఱి యేల దుఃఖింతువనగా పరమార్థము తెలిసిన వాడు దుఃఖభారమునకు చలింపడు సుమా! ఓ దేవసమానుడా! సత్వసంపద గల మహాత్మా! నీవును నా విధముగనే దుఃఖములేక యున్నవాడవు. సత్యమైన ప్రతిజ్ఞ కలవాడవు, సర్వము తెలిసినవాడవు, సర్వము చూడగలవాడవు. చాతుర్యముగల బుద్ధి గలవాడవు. ధైర్యము గలవాడవు సంసార స్థితి నెఱిగినవాడవు అయిన నీవే భరింపరానట్టియిట్టి కష్టముల ననుభవింపదగునా? ఓ గౌరవింపదగిన చరిత్ర గలవాడా? ఆ విషయమును దలచుకొనిన మాకు సుఖమెక్కడిది. నిన్ను బోలినవాడు భయంకరమైన యరణ్యములందు కష్టపడుచుండ నేనెట్లు దుఃఖపడకుందును. నేనా విధముగా ఇంటియందు లేనట్టి సమయమున నీచచరిత్ర గలిగిన నా తల్లి కైక లోకమంతయు నిందించు గొప్పదైన పాపమును చేసినది. నేనిప్పుడే నా తల్లి నింతింత ముక్కలు ముక్కలుగా నరికియుందును గాని ధర్మమను త్రాళ్లచే బంధింపబడియుండుటచే ఏమియును

చేయలేనివాడ నయితిని. పరిశుద్ధమైన వంశమున జన్మించిన అజమహారాజు పుత్రుడగు దశరథునకు జన్మించితిని. ధర్మమార్గముల నన్నిటిని నేను త్వరగా నేర్చుకొని యుంటిని. చూచి చూచి గర్హింపదగిన అధర్మమును నేనెట్లాచ రింతును? గొప్పవాడును, ఆచార్యుడును, ముసలివాడును, కార్యజ్ఞుడును అయిన మన తండ్రి మరణించెను. కనుక అతనిని గూర్చి నిండుసభలో నిష్ఠురములు చెప్పరాదు గాని ఏ మానవుడైనను ఒక ప్రస్త్రీ ప్రీతికై అర్థధర్మముల నశింపజేయునట్టి క్రూరమైన పాపమును ధర్మమెఱిగిన వాడైయుండియు చేయ బూనుకొనునా? వినాశకాలమునకు విపరీతపు బుద్ధిపుట్టునని లోకులు చెప్పునట్టి సామెతను రాజు వెనుదీయక క్రోధ మోహములతో తగని కార్య మొనరించి ఇప్పుడు యథార్థమొనరించెను. దానికి ప్రతిగా నీవు మంచి మార్గమున నడచి అతడు చేసిన పాపమును మరల్పుము. తండ్రి యొక పాపకార్యమును జేసినచో దానియొక్క పాపము తండ్రిని చెందకుండునట్లు దానికి ప్రతి చేసినవాడే పుత్రుడు సుమా! తండ్రికి పాపము కలుగజేసినవాడు పుత్రుడగునా? తండ్రిని రక్షింపుము. అతడు చేసిన దానిని మరచిపొమ్ము. అన్నా క్షత్రియధర్మమెక్కడ? భయంకరమైన మహాటవులలోనుండుట యెక్కడ? ఎక్కడి రాజ్యపాలనము? ఇదేమిటయ్యా జడలను ధరించుట. అక్కటా ఇట్టి పనులు తగునా? నన్నును, తండ్రిని, కైకను, స్నేహితులను, పౌరులను బంధువులను తక్కిన జనులను దయతో పాలింపవయ్యా! నీకు నమస్కరించెదను.

**భరతుడు శ్రీరామునకు వనవాసము తగినది కాదనుట :**

లోకమందు ప్రాజ్ఞుడవని కీర్తి చెందినవాడా! ఈ ప్రజలను పాలించుట నీకు శక్యముగాని పనియా? రాజచంద్రా! ప్రజాపాలన సమర్థునికి రాజ్య పట్టాభిషేకము చేయుట ప్రాజ్ఞులు ప్రథమ ధర్మమని చెప్పుదురు. ప్రత్యక్షముగా నున్న ప్రజాపాలన ధర్మమును విడచి సంశయాస్పదమైనదియు ఎప్పుడో కలుగబోవు ఫలము గలదియు, సలక్షణము కానిదియు, జరుగునో జరుగదో

చెప్పరానిదియు అయిన ధర్మమును ఏ క్షత్రియుడు తలచును? నీవు కష్టముతో గూడిన ధర్మమునే ఆచరింప దలచితివేని నాలుగు వర్ణములవారిని పాలించుట కష్టసాధ్యమయినదే కనుక దాని నాచరింపుము. నాలుగాశ్రమములందును గృహస్థాశ్రమము శ్రేష్ఠమయినదని శ్రేష్ఠులైన వారి యభిప్రాయము గదా! ధర్మతత్పరుడా! నీవంటి ధార్మికుడు దానిని విడువజూచుట ధర్మమగునా? జన్మముచేతను, విద్యలచేతను నీకంటె చిన్నవాడను. నీవుండగా నేనెట్లు రాజ్యము నేలగలను? అన్నయ్యా! బుద్ధియందును గుణములందును పిన్నవాడను అగుటచే నీవు లేకుండ నిలువజాలను సుమా! అట్టిచో నేనెట్లు అయోధ్యకు వెళ్లి రాజ్య భారమును వహింతును. అయోధ్యకు వెళ్లబోను సుమా! పౌరులు హితులు పురోహితులు బాంధవులు మొదలైనవారెల్లరు నిచ్చటనే యున్నారు గనుక ఇచ్చటనే పట్టాభిషేకమును ప్రజ్ఞతో జరిగించెదము. తరువాత రాజ్యపాలనమునకై యయోధ్యకు వెళ్లుము. దుర్మార్గులగు శత్రువులను జయించి ఇంద్రునివలె వెలుగొందుచు నీవు అందఱును సంతోషించునట్లు ముందుగా మూడు ఋణము లనుదీర్చి మిత్రుల కిష్టమును శత్రువులకు కష్టమును గలుగజేయుచు మమ్మెల్లరను కాపాడుము. రమ్యగుణములు గలిగిన రామభద్రా! హితులు సంతోషింతురు. శత్రువులు వెనుదిరుగుదురు. నా తల్లిని నిందను తొలగించి పవిత్రురాలిగను తండ్రిని పుణ్యాత్మునిగను చేసి వారి పాపముల దొలగింపుము. భూతజాలములను రక్షించు ఈశ్వరునివలె మమ్ము రక్షింపుము. ఓ రామచంద్రా! నీవు నా మాటలను పెడచెవిని బెట్టి ఈ మహారణ్యావాసమునే జరిగించినచో నేనును మీతోడనే అడవులకు వచ్చెదను. ఇది యథార్థము సుమా!" అని చెప్పగా ఇంతగా చెప్పుచున్నను పురమునకు వెళ్లుట కిష్టపడని జానకీపతిని గాంచి పౌరసమూహము కన్నుల నీరునించి హా! యని, అరరే యెంతటి ధీరచిత్తుడనియు మెచ్చుకొనుచు హర్షము నొందెను. తల్లులు కూడ దుఃఖమును బొంది హా! యనుచు వ్రాలిపోయిరి. కైక పుత్రుని మెచ్చుకొనిరి.

# నూట యేడవ సర్గము

## శ్రీరాముడు భరతునితో అతడు రాజగుట ధర్మమని చెప్పుట :

భరతుడిట్లనేక విధములుగా చెప్పగా రాముడిట్లు పల్కెను. దశరథునకును కైకేయికి జన్మించిన నీకు రాజ్యమును స్వీకరించుట తగును. ఎట్లన కైకేయిని పరిణయమాడునపుడు మన తండ్రి మీ తాతకు తన ప్రాజ్యమగు రాజ్యమును శుల్కముగానిచ్చి కైక పుత్రునకు పట్టము గట్టెదనని బాసచేసెను. దేవ దానవ యుద్ధమున నీ తల్లి రాజైన దశరథునకు సహాయపడిన కారణమున ఎక్కువయిన సంతోషముతో ఆయన రెండు వరములిచ్చెను. ఆమెయు వానినే యిప్పు డడిగినది. దాని వలన దోషమేమున్నది? అందొకటి నీవు రాజౌటయు, రెండవది నేనరణ్యముల నుండుటయును అనునవి. అవి రాజిచ్చెనుకాన తండ్రిమాటను బట్టి పదునాలుగేండ్లు నేను వనములలో నివసింపవచ్చినాడను. నావెంట జానకియు లక్ష్మణుడును వచ్చిరి. ఇది తండ్రిని సత్యవచనుని చేయు పద్ధతి. అట్లే నీవు కూడ తండ్రిని సత్యవచనుని చేయవలదా? అట్లుగాన విభవముతో నున్న రాజ్యమును చేకొనుము. నా కొఱకైనను నా మాటను వినుము. జనకుని ఋణమును దీర్పుము. నీ తల్లి సంతోషమునందునట్లు చరింపుము. పూర్వము గయుడను నాతడు గయయందు పితరులందఱు వినునట్లుగా సుగీతములతో నిట్లనెను. తండ్రి పున్నామ నరకమున బడిపోకుండగా కాపాడును గనుకను, అతని కోర్కెతీర్చి పుణ్యవంతుని చేయును గనుకను కుమారుడు పుత్రుడను పేరుతో ప్రసిద్ధినందును. జనులు పలువురు వేదపారగులు సుగుణవంతులు నయిన కొడుకులు కలుగుదురుగాక యని కోరుకొనవలెను. ఏలన వారిలోనొక

డైనను గయకు వెళ్లకుండునాయని వారాశింపవచ్చును. ఓ రాజపుత్రా! రాజర్షు లందఱునిట్లు తలంచుచుందురు కనుక నీవు తండ్రిని నరకము నుండి కాపాడుము. నీ తమ్ముడగు శత్రుఘ్నునితో గూడి భూమిజనులను పాలింపుము. పురమునకు వెడలుము. నీవు జనులందఱకు రాజువగుము. నేను మృగ సమూహమునకు రాజునయ్యెదను. నేను వేగముగా దండకారణ్యమునకు బోయెదను. నీవు పట్టణమునకు బొమ్ము. నీకు ఎండను నివారించుటకు ఛత్రముపయోగించు గాక! నాకు చెట్లకొమ్మలు సుఖప్రదముగా గొడుగు లగునుగాక! నీకచట శత్రుఘ్నుడు సహాయపడును. నాకిచ్చట లక్ష్మణుడు సహాయుడగును. ఓ పవిత్ర చరిత్ర గలవాడా! మనము నలువురము పుత్రులము. మన తండ్రిని సత్యవంతునిగా జేయుటకు తలంపుము.



# నూట యెనిమిదవ సర్గము

## జాబాలి రామునితో నాస్తిక వాక్యములు చెప్పుట :

ఈ ప్రకారముగా మంచి మాటలచేత భరత నూరడించుచున్న రాముని జూచి యచ్చట బ్రాహ్మణోత్తముడగు జాబాలి వారి హితమును గోరి కొన్ని కొన్ని అధర్మోక్తుల నిట్లు పలికెను. "రాఘవా! చూడగా నీవు సర్వము తెలిసినట్టి బుద్ధిమంతుడవు. నీకు పామరునకువలె ఈ మందబుద్ధి యెట్లు కలిగినది? ఈ మిక్కిలి నిరర్థకమైన ఆలోచన యెందులకు? ఇంక అయోధ్యకు వేగముగా వెళ్లుము. భరతుడు కోరినట్లు జనులను పాలించువాడవుకమ్ము. మానవునకు ఎక్కడి తండ్రి? ఎక్కడి బంధువులు? ఇవేమి మాటలు? తాను ఇతరునిచే పొందదగిన ప్రయోజనమేమున్నది? వ్యక్తి పుట్టునప్పుడు తానొక్కడే పుట్టును. చచ్చునప్పుడు కూడ తానొక్కడే చచ్చును. వెంట ఏ ఒక్కడైన వచ్చువాడుండునా? కన్నవారైనను తనవారు ఎట్లగుదురు? ఎక్కడి తల్లి? ఎక్కడి తండ్రి? అట్లు మాటాడుట కేవలము బుద్ధిహీనతయే! ఒక్కని కొక్కడెవ్వడును లేడు సుమా! పొరుగూరికి వెళ్లుచు బాటయందునిల్చి తెల్లవారగనే మఱల తానొక్కడే మఱియొకచోటునకు పోవు పాంథునివలె జీవుడు తల్లిని తండ్రిని భార్యను ధనమును వీడి వెడలిపోవును. రాఘవా! ఇవియన్నియు కేవలము త్రోవలో నిలిచిన ఆవాసము వంటివి. కనుక తెలిసినవాడు వీనియందు కోరికను చూపునా? ఓ రాజతనయా! ఇటువంటి విపరీత బుద్ధి నిన్నెట్లావేశించెను? తండ్రి యొక్క రాజ్యమును విడచి కష్టములకు కారణమైన ముండ్లచే వ్యాపింపబడిన ఎత్తుపల్లములు గల చెడు మార్గమునందు నేలసంచరించెదవు? సర్వభోగములతో నిండియున్న ఆ పురమునకు వేగముగా వెళ్లి అభిషేక విధిని స్వీకరించి స్వేచ్ఛగా సుఖింపుము. పురి నీకై ప్రేమతో ఏకవేణియై వేచియున్నది? తండ్రి యెవడు నీకు? తండ్రికి నీవెవ్వడవు? అతడు వేఱు రాజా! నీవు వేఱు. దీనిని నీవు తెలిసికొని మేమందఱము చెప్పినట్లు చేయుట నీకు సమంజసము సుమా. జనకుడు బీజము మాత్రమే. తల్లి యొక్క గర్భమందు శుక్లముతో

గూడిన రక్తమున పిండమగును. దానివలన ప్రాణి జన్మించును. ఇందు సందియములేదు గదా! ఎచ్చటికి వెళ్లవలెనో అచ్చటికే రాజు వెళ్లెను. ఇదియే మర్త్యులకు నిశ్చయింప బడిన ప్రకారము సుమా! దీనిని చూడకుండ పిచ్చితనము చేత వ్యర్థముగా నీ వనేక విధములుగా చెప్పుచున్నావు. నీ వెక్కడ? తండ్రి యెక్కడ? ఇది యేమిటి? ప్రాజ్ఞులు విన్నచో నవ్వరా? ధర్మార్థములు కోరినవారై కర్మలను చేయుచున్నవారి పాటునకు విచారించెదను. కర్మలు చేయువాడు ఇందు నందును సుఖము లేకకుండును సుమా! సౌఖ్యము కోరుట మేలు. అష్టకాశ్రార్ధ మనియు, ఆబ్దిక మనియు కష్టపడి కర్మలను చేయువారిని చూచితివా? కష్టార్జితమైన యన్నమును నష్టపోవుదురేగాని మృతిచెందినవాడు ఆ యన్నమును భుజించునా? ఆహా! ఒకడు కూడు తిన్నచో మఱియొక్కని పొట్ట నిండునట. ఇదెక్కడి మాట? ఇట్లయినచో ఇంట ప్రేమతో తద్దినము పెట్టినచో దారివెంట వెళ్లు బాటసారికి పొట్ట నిండునా? ఇవన్నియు టక్కరి మాటలు గాని నిజములని బుద్ధిమంతులు నమ్మెదరా? తెలివిగలవారు పరుల ధనము నపహరించుటకై యాగములు చేయుడు, తపస్సు చేయుడు, దీక్ష పూనుడు, దానములు చేయుడు అని గ్రంథములందు చెప్పిరి. మంచి బుద్ధిశక్తి గలవారలవి నమ్మెదరా? కాన ధీరులలో శ్రేష్ఠుడా! పరము లేనందున నీవిప్పుడు లభించిన భోగముల నేల విడచిపెట్టెదవు? ఎటువంటి బుద్ధిహీనుడైనను ప్రత్యక్షముగా కనుపించుదానిని విడచి కనబడని దానిని నమ్మునా? భూజను లందఱు నంగీకరించెడు నామాటను వినుము. దయతో రాజ్యపట్టాభిషేకమును చేసికొనుము.”



# నూట తొమ్మిదవ సర్గము

**శ్రీరాముడు జాబాలి మతమును ఖండించుట :**

అని జాబాలి చెప్పిన మాటలను విని సత్యముగా నడచువాడగు శ్రీరాముడు నిశ్చలమైన ఆత్మతో మిక్కిలి భక్తితో నిట్లనెను. "ఓ బ్రాహ్మణా! నా కొఱకు నీ వాడిన మాటలు ఆచరింపదగినట్లు కనిపించునవయ్యును ఆచరింపదగనివి, హితమువలె కన్పించుచున్నను అహితములు. కనుక జగత్తు గర్హించునవియైన ఆ మాటలను నేనెట్లు వినగలను? చెడు మార్గములను చూపించువారు తమ గొప్పతనమును గోల్పోయి మర్యాదను విడచిపెట్టి పాపమును ప్రవర్తింపజేయువారై సభలయందు దూషింపబడుదురు. ఇది సత్యము. కులము చెడినవానిని, కులముగలవానిని, తులువను, సజ్జనుని, శుచిని, పాపిని శౌర్యవంతుని, పౌరుషహీనుని, వాని వాని నడవడిని బట్టి తెలిసికొన వచ్చును. నిజముగా అనార్యుడయ్యును ఆర్యునివలె, శౌచములేనివాడయ్యు, శౌచముగలవాని వలె, అవలక్షణములు గలవాడయ్యు సలక్షణుని వలె; దుష్టమైన నడవడి గలవాడయ్యు సాధు ప్రవర్తన గలవానివలె, వేదవిహిత కార్యములను వీడి లోక సంకరమగు అధర్మమును ధర్మమని చెప్పుచున్నచో నావంటివాడు దానిని న్యాయమని గ్రహించినచో దుష్టశీలుని, లోకనింద్యుని నన్ను లోకములో పూజ్యు డెవ్వడు సన్మార్గదృష్టితో చూచును? నేనే ప్రతిజ్ఞను సముద్రములో గలిపి ధర్మమెవ్వనికి దెల్పెదను? నేను స్వర్గము నెట్లు పొందుదును?

**శ్రీరాముడు జాబాలికి సత్యమవశ్యానుష్ఠేయమని బోధించుట :**

రాజే నాస్తికుడైనచో ప్రజలు తమ యిష్టము వచ్చిన పోకడలు పోవరా? రాజేమార్గమున నడచిన ప్రజలు కూడ ఆ మార్గముననే సంచరింతురు గదయ్యా.

సత్య దయా రూపములతోనే నిత్యమును రాజుల యొక్క ధర్మము ప్రవర్తిల్లును కావున ఈ రాజ్యము సత్యమే ఆత్మగా కలిగినది సుమా! ఎల్లప్పుడును సర్వజగత్తును సత్యమే నిలుపును సుమా! సత్యమే శ్రేష్ఠమని దేవతలును మునిశ్రేష్ఠులును దెలుపుచుందురు. ఎల్లప్పుడు సత్యమును చెప్పువాడే సత్యముగా మోక్షమును పొందజాలును సుమా! పామును జూచి భయపడుదురు సుమా! ఓ మునీ! సత్యమే శుభప్రదమైన ధర్మము. స్వర్గమునకు గూడ సత్యమే మూలము సుమా! సత్యమునందే లక్ష్మి నిలిచియుండును. జగముల కన్నిటికి సత్యమే ఈశ్వరుడు సుమా! అంతకును సత్యమే మూలము. సత్యము కంటె శాశ్వతమైన పదవి లేదు సుమా. దానమును, వేదములును, ధ్యానమును, హోమములును, తపమును, యాగములును సత్యమే ఆశ్రయముగా గలవి. కావున మనుష్యుడు సత్యవంతుడు కావలయును సుమా! ఒకడు రాజై లోకములేలును, ఒక్కడు వంశమును సంరక్షించును. ఒక్కడు నరకమందుండును. ఒక్కడు స్వర్గమునకు వెడలును. ఈ విధముగా భిన్నమైన గతులెట్లు కలుగునో చెప్పుము. సత్యము తప్పనివాడని జగత్తునందు ప్రసిద్ధినంది ప్రతిన చేసి తప్పుట ధర్మమగునా? కనుక తండ్రి ఆజ్ఞాపించిన దానిని కాదని నావంటివాడు చెప్పుటకు ఇట్లు సాహసించును? లోభముచేతనో రాజ్య లాభముచేతనో, కోరికచేతనో, మోసము చేతనో తండ్రియెదుట చెప్పి సత్యమనెడు సేతువును దేనికొఱకైనను నరుకజాలను సుమా! నిలుకడలేనివాడు, మంచి మార్గమును విడచినవాడును, అబద్ధము చెప్పువాడును పెట్టిన శ్రార్ధములను పితరులుగాని చేసిన యజ్ఞములను దేవతలుగాని గ్రహింపరని మనము వినలేదా మునీంద్రా! సత్యస్వరూపమగు నీ ధర్మమును నేను ప్రత్యక్షముగా ప్రత్యగాత్మ రూపముగ దర్శించుచున్నాను. సజ్జనులాచరించిన ఈ సత్యమనెడు ధర్మముకొఱకే నేను జడల భారమును ధరించెదను. కొలది ధర్మముతో గూడిన యధర్మ స్వరూపమగు క్షత్రియ ధర్మము లుబ్ధులును, పాపాత్ములును, క్రూరులును, పాపములయందాసక్తి గలవారును సేవింపదగినది. దానిని నేను ఓ తాపసేంద్రా! విడచితిని. మనస్సునందు పాపమును మాటిమాటికి నాలోచించుచు నాలుకతో అబద్ధమును చెప్పుచు,

శరీరముచే పాపకార్యము చేయుచు మానవుడు మూడు విధముల పాపములను బొందును. భువియందు సత్యైకనిష్ఠుడగు పురుషుని కీర్తియు, లక్ష్మియును ప్రీతితో పొందును. స్వర్గమునకు వెళ్లినను పురుషునకు తోడుగ సత్యము వచ్చును. అట్టి సత్యమును పురుషుడెట్లు విడువదగును? ఎంతయో ఆలోచించి యిట్టి పనికిరాని మాటలను నీవు నొక్కి చెప్పినను రాజు ముందర ప్రతిజ్ఞచేసి చెడుధర్మము నెట్లాచరింప గలను? భరతుని కొఱకైన తండ్రి వాక్యములను నేనెట్లు తుంగలలో త్రొక్కి భంగపరతును? రాజు ముందు నేను చేసిన ప్రతిజ్ఞచే కైకేయి సంతోషమును పొందెను. ఇప్పుడు నేను మాట తప్పిన ఆమె తన మనస్సునందేమని తలంచును? అరణ్యమార్గములందు నియతమైన ఆహారమును భుజించుచు నిష్ఠ వహించి పూలు పండ్లు దుంపలు మొదలయిన వాటిని పితృదేవతలకు దేవతలకు తృప్తితో ఒసగెదను.

**జాబాలికి శ్రీరాముడు కర్మ మవశ్య కర్తవ్యమని చెప్పుట :**

శ్రద్ధావంతుడనై, నిష్కల్మషమైన మనస్సుతో సత్కార్యములయందు బ్రవర్తించుచు సంతుష్టములైన ఇంద్రియములు గలవాడనై ఎట్టి చింతలులేక లోకయాత్ర చేసెదను. ఇది కర్మభూమి. దీనియందు పురుషులెప్పుడును పుణ్య కర్మముల నాచరింపవలెను. గాలియు, అగ్నియు, చంద్రుడును, తమ కర్మముల ఫలముచేతనే వారటువంటి పదవులను బొందిరి. నూఱు యాగములను చేసి యింద్రుడు స్వర్గాధిపతి పదవిని సంపాదించెను. ఎక్కువైన ఉగ్రమైన తపోనిష్ఠలతో ఎల్ల ఋషులును సాటిలేని స్వర్గము నందగలిగిరి." అని చెప్పుచు తిరిగి ఆ ఋషి యొక్క నాస్తిక వాక్యములను తలంచి ఛీయని మనస్సునం దసహ్యము పొంది కోపమతిశయించి సత్యమునిట్లు చెప్పెను. "ఘనమైన పరాక్రమమును దయయును, ధర్మమును, మంచి మాటలును, ఆర్యులను, దేవతలను, అతిథులను పూజించుటయును నాకమునకు మార్గములు సుమా! ఇది యంతయు తెలిసికొన్నవారై బ్రాహ్మణులు ఒకే యభిప్రాయము గలవారై వారి వారి కుల పద్ధతి తప్పకుండగా ధర్మకార్యములను అధికముగా చేయుచుందురు. నీవంటి యధర్మ మార్గమున నడచువానిని నాస్తికుని విషమబుద్ధిని దగ్గరకు చేర్చిన

తండ్రిని ఛీ యని నిందింపవలెను. బుద్ధుడును నాస్తికుడును తథాగతుడును చోరుని వంటివాడు. ఇది నిజము. నాస్తికుడు ప్రజలకు శంకింపదగినవాడు కనుక బుద్ధి మంతుడతని కెదురు వెళ్లరాదు సుమా! నీకంటె పూర్వులు నిన్ను మించినవారు నిష్ఠతో గూడినవారై సొంతముగ కర్మలనాచరింపలేదా? ఇహ పరములందు విజృంభించిన జయశ్రీతో గూడినవారై శాశ్వతులై వెలుగొందలేదా? శుద్ధమైన మనస్సు కలవారై ఎల్లకాలమును మంగళకరములైన యభీష్టముల సిద్ధికొఱకు క్రియలు సల్పలేదా? ముని వేషమును ధరించియున్న ఓ జాబాలీ! దాన గుణ ప్రధానులును, ఇంతింత యనరాని దయగలవారలును, పుణ్యాత్ములైన సంతానము గలవారును, ఎదురులేని ప్రకాశము గలవారును, ఉత్తమమైన ధర్మమార్గమును గౌరవించువారును, పాపములేనివారును, సాటిలేని చరిత్రము గలవారును, కర్మలయందు నిష్ఠగలవారును అయిన మునీశ్వరులు లోకములో పూజింపబడుదురు'' అని రోషముతో గూడిన మాటలను పల్కుచున్న మహానుభావుడును మహాసత్త్వుడునైన రాముని జూచి జాబాలి ముని తిరిగి ఆస్తికతతో గూడినదియు, నిత్య సత్యమైనదియు నయి మాటను సానునయముగా నిట్లు వచించెను. "మంచివారలచే పొగడబడినవాడా! నేను నాస్తికుడను గాను. నాస్తిక వాక్యమును పల్కను. నాస్తి యనునది యెంతమాత్రమును లేదు సుమా!

**జాబాలి శ్రీరామునితో తనను క్షమింప వేడుట :**

జానకీనాథా! ధర్మసంకట స్థితిలో ఏదేనొక వాదము నవలంబించి కీడు తొలగించుట తగును. అది చూచియే నేనిప్పుడు అరాజకమను ఉపద్రవము తొలగుటకై నాస్తికవాద మొనర్చితిని. అంతేకాని నేను నాస్తికుడనుగాను. వినుము. ఇతరు డెవ్వడైన నాస్తిక వాదము చేయుచుండగా నేను విన్నచో ఆ వాదమును నేనే ఖండించెదను సుమా! నేనిప్పుడు చేసిన నాస్తికవాదము ధర్మ సంకటము దాపురించుటచే చేసినది సుమా! ఇట్టి ధర్మసంకట సమయము వచ్చినచో తిరిగి నేను నాస్తిక వాదమును పూనెదను. పూనుకొని నిన్ను పురమునకు మరలించుట కొరకై భరతుడిట్లు జాలిపడుటచేత నీ అనుగ్రహమును పొందుట కోసమై నేనట్లు పలికినాడను. అనఘా! నన్ను క్షమింపుము."

# నూట పదియవ సర్గము

## వసిష్ఠుడు శ్రీరామునితో జ్యేష్ఠుడు రాజ్యార్హుడని పూర్వరాజుల వృత్తాంతము చెప్పుట :

అని వేడగా, కోపగించియున్న రామునితో వసిష్ఠుడిట్లనెను. "రాజచంద్రా! జాబాలి కూడ జనులయొక్క గతాగతములను (జరిగినవి – జరుగనున్నవి) తెలిసినవాడే. కాని నిన్నరణ్యవాసము నుండి మరలించుట కిట్లు పలికెను. లోకేశ్వరుడా! వినుము. ఈ లోకోత్పత్తిని చెప్పెదను. ఈ జగత్తంతయు నొక్కటిగా జలమయమై యున్నప్పుడు భూమి నిర్మింపబడెను. పరబ్రహ్మము నుండి స్వయంభువై బ్రహ్మ దేవసమూహముతో జన్మించెను. నీటియందు మునుగుచున్న సమయమున విష్ణువు ఆదివరాహమై దానిని తేల్చెను. నాశనము లేనివాడును, నిత్యుడును, ఆకాశమునుండి పుట్టినవాడును అయిన బ్రహ్మ తన పుత్రులగు మరీచ్యాదులతో గూడి ఈ జగములనెల్ల సృష్టించెను. ఆ బ్రహ్మకు మరీచి, అతనికి కశ్యపుడు, అతనికి భాస్కరుడు, ఆతనికి ఘనుడగు మనువు జన్మించిరి. ఆ మనువు ఇక్ష్వాకుడను వానినిగని యతనికి అయోధ్య నిచ్చెను. అందువలన మీ కులమునకతడు మూలపురుషుడయ్యెను. అతనికి కుక్షియు, ఆతనికి వికుక్షియు జన్మించిరి. అతని కుమారుడు బాణుడు. అతడు ఎన్నరాని బలము గలవాడు. అతని కనరణ్యుడుదయించెను. ఆ అనరణ్య రాజు పాలనమునందు చోరబాధలుగాని, కరువు కాటకములుగాని కలుగలేదు. దానికతని సత్య ధర్మ నిష్ఠయే కారణము. అతనికి పృథువను రాజు పుట్టి కీర్తిని పొందెను. అతనికి

ప్రీతిపాత్రుడగు పుత్రుడై త్రిశంకుడు జన్మించి గొప్ప సత్యాసక్తిచేత తన శరీరముతోనే స్వర్గమునకై వెళ్లెను. త్రిశంకునకు ధుందుమారుడని ఖ్యాతిచెందిన యువనాశ్వుడు కుమారుడయ్యెను. మహా బలశాలియగు మాంధాత అతని కుమారుడే సుమా రామా! మాంధాతకు తనయుడై సుసంధి పుట్టెను. అతనికి ధ్రువసంధియు, గొప్ప వీర్య సంపద గలవాడగు ప్రసేనజితుండును పుత్రులైరి. గొప్ప కీర్తిశాలి యగు ధ్రువసంధి భరతుని గనెను. అతని కసితుడు పుట్టెను. అతనిని హైహయులును, తాలసంఘులును, శూరతములును శత్రువులై యుద్ధరంగమున నెదుర్కొని తరుమగా అతడు రాజ్యమునుబాసి వెడలి హిమవత్పర్వతమున మునియై సంచరించెను. అతని భార్యలిద్దఱు గర్భవతులు కాగా వారిలోనొకతె సవతికి గర్భము నశించుటకై విషము పెట్టెను. ఆ విషముదిన్న కాళిందియను సతి చ్యవనుడను ముని చెంతకు వెళ్లి నమస్కరింపగా ఆతడు దయగలవాడై వరమును కోరుచున్న ఆమె కిట్లనెను. 'నీకు సర్వలోకము లందు ఖ్యాతి చెందువాడు, శత్రువులను జయించువాడును, వంశమును వృద్ధిపొందించువాడును, సాధువులచే పొగడబడు గుణములు గలవాడును అయిన పుత్రుడు పుట్టును' అని దీవించగా మునికి మ్రొక్కి ఇంటికి వెళ్లి పద్మముల వంటి నేత్రములు గలవాడును, బ్రహ్మ సమానుడు నయిన పుత్రుని గనెను. అతడు గరము (విషము)తో బుట్టినవాడగుటచే సగరుడయ్యెను. పూర్వ మారాజు సముద్రమును త్రవ్వించెను. అతని పుత్రుడసమంజుడు. అతడు మదించి శిశువులను జంపుటచే మిక్కిలి బాధలనుభవించునట్లు అడవులకు గెంటింప బడెను. ఆ అసమంజునకు అంశుమంతుడు పుట్టెను. అతడు దిలీపుడను కుమారుని గాంచెను. ఆతడు భగీరథుడను రాజును గనెను. ఆయన పుత్రుడే ఆర్యజనులచే మెచ్చబడిన వాడగు కకుత్థ్సుడు. అతని పేరుననే ఈ వంశస్థు

లందఱకు కాకుత్థ్సులను ప్రఖ్యాతి కలిగెను. అతడు రఘువును కనెను. అతనికి కల్మాషపాదుడనియు, పురుషాదుడనియు, సౌదాసుడనియు పేర్లు గలవాడు జన్మించెను. అతనికి శంఖణుడను వాడు పుట్టెను. అతడు సైన్యసమేతముగా తన జనకుని చేతనే చంపబడెను. అతని పుత్రుడు సుదర్శనుడు. అతనికి అగ్నివర్ణుడు కలిగెను. అతని సుతుడు శ్రీఘ్రుగుడనువాడు. వాని కొడుకు మరుడు. మరునకు ప్రశుశ్రుకుడు పుట్టెను. అతనికి అంబరీషుడు కలిగెను. అతనికి నహుషుడు పుట్టెను. నాభాగుడు నహుష పుత్రుడు. ఆ మహాత్మున కిర్వురు మహాధీరులగు పుత్రులు గలిగిరి. వారు అజుడు సువ్రతుడు ననువారు. ఆ యజునకు దశరథుడు జన్మించెను. అతని పుత్రులలో నీవే అగ్రజాతుడవు. రామా! అందుచే తండ్రివలె నీవును భూమి నేలుము. ఓ అనఘా! ఇక్ష్వాకులలో జ్యేష్ఠ తనయుడు రాజ్యతంత్రములను దీర్చుట కులధర్మమై యున్నది. దానిని విడువకుండ ఈ రాష్ట్రమును ప్రజలను నేలుకొనుము.”



# నూట పదకొండవ సర్గము

## వసిష్ఠుడు శ్రీరాముని రాజ్యము గొనుమని వేడుట :

అని చెప్పుచు వసిష్ఠుడు తిరిగి న్యాయబద్ధముగా నిట్లు చెప్పెను. "ఓ రాజశ్రేష్ఠుడా! రామా! పురుషునకు ఆచార్యుడును, తల్లియును, తండ్రియును భూమియందు గురువులన బడుదురు. జన్మనిచ్చుటచే తల్లిదండ్రులును, మఱియు జ్ఞానదాతయై ఆచార్యుడును గురులైరి. వారిలో శరీరము నిచ్చిన తల్లిదండ్రులకంటెను మంచి బుద్ధి నిచ్చుటచేత ఆచార్యుడే గురుడను ప్రఖ్యాతిని గాంచి శ్రేష్ఠుడయ్యెను. రామచంద్రా! ఓ సీతాపతీ! నీ తండ్రికిని నేను గురుడను నీకును గురుడను నేను చెప్పినదానిని నీవు వినినచో సన్మార్గగతికి భంగము కలుగదు తండ్రీ! బ్రాహ్మణులు వీరే. వీరే పురజనులు – వీరే తక్కిన ద్విజన్ములు పవిత్రులు. వీరిని పరిపాలింపుము. తండ్రీ! సన్మార్గగతికి భంగము కలుగదు. శ్రేష్ఠమైన ధర్మశీలము గల వృద్ధురాలు, గొప్ప జ్ఞానము కలదియగు నీ తల్లిని సేవింపకుండుట తగునా? ఆమె మాటను విని సంచరింపుము. సన్మార్గ గమనమునకు భంగము కలుగదు. రామా! జానకీ నాథా! సత్యధర్మ పరాక్రమా! ప్రార్థనము చేయుచున్నట్టి భరతుని మాటలను బట్టి ప్రవర్తించుట ఆత్మధర్మము నతిక్రమించుట కాదు. దయతో నా మాటను మన్నింపుము."

## శ్రీరాముడు వసిష్ఠునితో ఆచార్యులకంటె తల్లిదండ్రుల శ్రేష్ఠులనుట :

అని వసిష్ఠుడు చెప్పగా విని రాముడిట్లు చెప్పెను. "ఆర్యులలో ఉత్తము డైనవాడా! పనిగట్టుకొని పుత్రప్రాప్తికై తల్లిదండ్రులు పడుపాట్లకు ప్రతి చేయుటకు శక్యమగునా? ఇంపుగాత్తలకు నీళ్లుపోసి, కడుపు చూచి యన్నము పెట్టి ఎండనుండి చలినుండి గాలినుండి కాపాడుదురు గదా ప్రతి నిత్యమును. ఇతరులు

వారితో సమానులగుదురా? తన్నుదాను గాపాడుకొనలేని పరిస్థితులందు ఏమరక ఎప్పుడును లాలింపుచు వృద్ధి పొందింతురు. ముచ్చట కల్గునట్లుగా మంచి యింపైన మాటలను చెప్పుదురు. కనుక కన్నతండ్రి కుమారా! ఇట్లు చేయుమని మునుపావిధముగా ఆజ్ఞ యిచ్చెను. అతని మాటను కల్లయగునట్లు చేయుట న్యాయమా?" అనగా కైక పుత్రుడు సారథిని జూచి "సారథీ నీవిచ్చట నేలమీద దర్భాసనమును సిద్ధము చేయుము. రాముడు పురమునకు వచ్చుటకు మనసునందు తలంచువఱకు ఇచ్చట పర్ణశాలముందఱ అప్పుపెట్టిన బ్రాహ్మణుడు అప్పు తీసికొన్నవాని యింటి ముంగిట ముఖముపై గుడ్డ కప్పుకొని అన్నము నీరు ముట్టక యుండు విధముగా నేనును ఉండెదను. ఇది నిశ్చయము సుమా!" అని చెప్పగా ఆ సుమంత్రుడు రాముని ముఖమును చూచుచు కనిపెట్టుకొనియుండగా రఘువంశ వీరుడైన భరతుడే దర్భలతో ప్రక్క పరచుకొనియుండ అతనితో రాము డిట్లనెను. "అన్నా! భరతా! నీకేమి యపకారమును నేను మునుపు చేసితిని వాకిటి కడ్డముగా పండుకొనుటకు? అప్పుపెట్టిన విప్రుడు తన సొమ్మును తిరిగి గ్రహించుటకు గాను ఒకప్రక్కనే పండుకొనును. తలమీద కిరీటమును ధరించి భూమిని పాలించు రాజునకు ఇట్లు చేయుట తగునా? లెమ్ము. భరతా! ఈ వ్రతమును విడువుము. నా మాటను విని మరలిపొమ్ము." అనగా విని భరతుడు "పురజనులారా! మీరైనను రామచంద్రుని నంగీకరింప జేయుడు. పురమునకు మరలింపుడు. అనగా వారందఱును భరతునితో నిట్లు పల్కిరి. రామచంద్రుని మనస్సు నందలి భావమును చూచితిమి. అతడు చెప్పు మాటలను వింటిమి. చక్కగా పలికెను. వివేకమే ధనముగా గలవాడగు రాముడు తండ్రి వాక్యమున నిల్చుటయే ఇష్టపడును. ఈ పుణ్యునకు ఇంకొక విధము ప్రియము కలుగజేయబోదు గాన ఈ సమర్థుని ఇక్కడ నుండి మరలించుట మాతరమా? దాశరథీ!" అని పల్కగా రామచంద్రుడును ఆ మాటలను విని "భరతా! హితులై ధర్మబుద్ధి గలవారి మాటలిట్టే యుండును. కాన వీరి మాటలను నా మాటలను నీ మనస్సునందు తలంచినవాడవై న్యాయమార్గమున బొమ్ము. ఊరకిట్లు పడియుండుటేల? ఈ దోషము పోవుటకై నన్నును జలములను స్పృశించుము."

అనగానే వినయముతో భరతుడు లేచి జలములను ముట్టుకొని భూజనములతో నిట్లనెను. "సరసులు మెచ్చురీతిగా నేను చెప్పుచున్న ఈ మాటలను భజనులారా! వినుడు. నేను తండ్రిని రాజ్యము నాకిమ్మని యెన్నడును కోరినవాడను గాను. ఇట్లు కుత్సితపు వృత్తితో ప్రవర్తించుమని, కైకను కోరినవాడనుగాను. శ్రీరఘురాము డిట్లడవులలో ప్రవేశించుటయు నెఱుగను. తనకు తండ్రి వాక్యము తీర్చుటయే యిష్టమయినచో తనకు బదులుగా నేనే ఈ అడవులలో నుండెదను."

**శ్రీరాముడు వనవాసానంతరము రాజ్యము గొన నంగీకరించుట :**

అనగా అతని సత్య హితోక్తులను విన్నవాడై రాముడు విస్మయము చెంది పౌరులతో నిట్లనెను. "తండ్రి బ్రతికియుండగా విధించిన విధమును తప్పుట ఇతనికిని నాకును ధర్మమగునా? కావున ఆ విధిని నేడు నేను తప్పనొల్లను సుండీ. వనవాస విధి నేను తీర్చవలసియుండగా బాలుడైన వీనిమీద ఆ భారము నెట్లు మోపుదును? కైక న్యాయముగా చెప్పినది. ఆ ధర్మమార్గముననే రాజు నడచెను. ఈ అనఘుడు ధీరగుణము గలవాడు. పూజ్యుడు ఓర్పు గలవాడు, వృద్ధులను సేవించుటయందత్యత భక్తి గలవాడు అని నేనెఱుగుదును. సత్యశీలము గల కైకేయి పుత్రునకు ఎల్లవేళలందును క్షేమము కల్గుగాక. వనమునందు పదునాల్గు సంవత్సరములుండి తరువాత పట్టణమున కేతెంచి ప్రఖ్యాతిగా పట్టముగట్టుకొని అప్పుడీ తమ్మునితో గూడియుండెదను. నేనెట్లు తల్లి మాటను నెరవేర్చుచుంటినో అట్లే పెద్దవాడనని నేను చెప్పిన మాటలను వీడు నెరవేర్పరాదా?"



# నూట పండ్రెండవ సర్గము

**అ**ని రాముడు పల్కు పలుకులను, భరతుడు పల్కిన మాటలను విని కనబడకుండనున్న సిద్ధ ఋషులు "అద్దిరా! ఇట్టి యన్నదమ్ములను గన్న దశరథు డెంతటి ధన్యతముడో గదా!" అని ఆత్మలయందు ప్రశంసించిరి. మనస్సులందు దశకంఠుని వధను గోరుచున్న మహామునులు భరతుని జూచి యిట్లు పలికిరి. "భరతా! నీ తల్లి తరింపవలెనని తలంపు గల్గెనేని జానకీ నాథుని పల్కులు గ్రహింపదగును. ఇతడు తండ్రి ఋణమును తీర్చుకొన దగును. కైక ఋణము తీర్చుటకే గదా నీ తండ్రి స్వర్గలోకమునకు వెళ్లుట?" అనుచు పలికి గంధర్వులు సిద్ధ ఋషులును వారి ఇచ్చకొలది వెడలిరి. సంతుష్టిచెందిన ముఖపద్మము గలవాడై సీతానాథుడు అప్పుడు మునుల వాక్యములకు చ్రాల సంతోషించి వారందఱిని గౌరవముతో బూజించెను. అందఱకు సమ్మతమైన అన్న యొక్క మాటలను విని భయముతో వణకుచున్న శరీరముతో చేతులను జోడించి అధికమైన వినయముతో భరతుడు జానకీనాథుని జూచుచు నిట్లనెను. "పరంపరాగతమైన వంశధర్మమును, క్షత్రధర్మమును మనసు నందు తలపోసి నా యొక్కయు నా తల్లి యొక్కయు కోరికలను తప్పకుండ నీవు తీర్పదగును. ఈ భూతలమును నేనొక్కడనే భరించుటకు కుతూహలపడుట లేదు. భూమి ప్రజల మనస్సులను సంతోషపెట్టుటయైనను నేను జేయజాలను సుమా! అన్నయ్యా! మన చుట్టములును, మన శ్రేయోభిలాషులును, మన యోధులును, మన మిత్రులును మానని ఆసక్తితో నీ కోసమై వానకొఱకు కృషీవలు లెదురు చూచు విధముగా ఎదురుచూచు చుందురు. అన్నా! నేను రాజ్యమును ఒల్లను. నీవే తీసికొనుము. అర్హుడవు నీవే" అనుచు ఆపన్నుడై పాదద్వయముపై బడి

ప్రార్థింపగా రాముడధికమగుచున్న ప్రేమతో లేవనెత్తి తన తొడమీద గూర్చుండ బెట్టుకొని ప్రకాశించుచున్న నీలమేఘము వంటి తనువు గలవాడును, హంసవంటి కంఠధ్వని గలవాడును పద్మములవంటి కన్నులు గలవాడును అగు భరతునితో నిట్లు పలికెను.

**శ్రీరాముడు భరతుని సమాధానపఱుచుట :**

"శత్రుభయంకరమైన చరితము గలవాడా! వినయముతో గూడిన యిట్టి బుద్ధి సహజముగా లభించిన ప్రశస్త గుణములు గలవాడవు నీకు భూ పరిపాలనమొక లక్ష్యమా? మంచి తెలివిగలిగిన మంత్రులును, మిత్రులును, ఎల్లప్పుడును మంచినే చెప్పుచుందురు. వీరి యాలోచనతో కార్యములను నడపుము. చంద్రుని మనోహర మండలము నుండి శోభ తొలగును గాక. హిమవత్పర్వతము నుండి మంచు తొలగుగాక. సముద్రము చెలియలి కట్టను దాటి విశ్వమును ముంచిన ముంచుగాక! నాయనా! రామచంద్రుడు తండ్రి యొక్క సత్యవాక్యమును తప్పడు సుమా! ఇన్ని మాటలెందుకు? కోరికతో గాని లోభముతో గాని నీ తల్లి నీకొఱకై కోరినది. తల్లి తల్లియే గదా! పుత్రుడామె యొక్క వాక్కును చేయవలదా? తక్కిన చింత విడువుము."

**శ్రీరాముడు భరతునకు తన పాదుకలొసంగుట :**

అని చెప్పుచున్న సూర్యసన్నిభుడైన అన్నగారిని చూచి భరతుడు "అన్నా! నీవింతగా స్థిరప్రతిజ్ఞుడవైనచో నిన్ను నేనేమందునయ్యా! ఇది నా యదృష్టహీనత గాక అయ్యారే! ఇంచుకంతయైన నీ మనస్సు కరుగదయ్యెను. నిర్మల మనస్కుడా! నేనూరక పోవుట కిష్టపడను. ప్రేమతో రత్నఖచితములైన బంగారు పాదుకలపై నీ పాదముల నుంచుము." అని ప్రార్థింపగా ప్రేమతో శ్రీరామభద్రుడట్లే పాదములను మోపి భరతునకు తన పాదుకల నిచ్చెను. వానిని తాను గ్రహించి మహాభక్తితో చేతులు జోడించి నమస్కరించి మ్రొక్కి భరతు డన్నతో నిట్లనెను. "రఘువీరా! వినుము. పదునాలుగేండ్లు జడలను చర్మములను ధరించి

నియమముతో రోజులు లెక్కించుచు ఫలములను దినుచు ఊరివెలుపల నివాస మేర్పరచుకొని రాజ్యతంత్రమును పాదుకలకు వినిపించుచుండెదను. పదునాలుగేండ్లు గడచిన మరునాడుదయమున నీవు రాకున్నచో అగ్నిలో బ్రవేశించెదను సుమా!" అని చెప్పగా రామచంద్రుడట్లే కానిమ్మని బాస చేసి క్రుచ్చి కౌగలించుకొని శత్రుఘ్నుని ఊరడించుచు కైక పుత్రునితో నిట్లనెను. "కైకను సంతోషముతో పోషింపుము. ఆమెను కోపముతో దూషించెదవేమో సుమా! ఓ రాజపుత్రా! సీతాదేవియు నేనును నిన్ను శపింతుము సుమా!" అని చెప్పుచు కన్నుల నీరునిండగా "వెళ్లిరమ్ము నాయనా!" యని తమ్ముని వీడ్కొలిపెను. అతడును పట్టపుటేనుగు కుంభస్థలముపై పాదుకలను వినయముతో నుంచి రామచంద్రునకు భక్తితో మ్రొక్కెను. రామచంద్రుడును చేనవుతో పౌరులకును, మిత్రులకును మంత్రులకును సెలవొసంగెను. తనను వదలి వెళ్లలేక యేడ్చుచున్న తన తల్లులందఱకును దండప్రణామముల నాచరించి రోదన ధ్వనితో తన కుటీరములోనికి ప్రవేశించెను.



# నూట పదమూడవ సర్గము

**భరతుడయోధ్యకు ప్రయాణమై భరద్వాజాశ్రమము చేరుట :**

భరతుడు రామచంద్రుని పాదుకలను తలను ధరించి సంతుష్టిని జెంది శత్రుఘ్నునితో రథము నధిరోహించెను. వసిష్ఠ మునీంద్రుడు, జాబాలి, వామదేవుడు మంత్రులతో గలసి ముందుగా వెళ్లుచుండిరి. మందాకినిని జూచుచు తూర్పు ముఖముగా కొంత దూరము వెళ్లి చిత్రకూటమునకు ప్రదక్షిణముగా వెళ్లుచు గైరికాది ధాతువులు గల పర్వత పార్శ్వములను జూచుచు భరతుడు సేనతో వెడలుచు చిత్రకూటమునకు సమీపమున బ్రహ్మసమానుడైన భరద్వాజుని యాశ్రమమును జూచెను. మంచి మనసుతో రథము నుండి దిగి కాలినడకతో ఆయనను చేరగా వెళ్లి వినమ్రుడై పాదములమీద వ్రాలగా సంతోషముతో ఆయన "నాయనా! సూర్యసమాన తేజుడయిన రామవిభుని జూచితివా? నీ యొక్క పనులన్నియు నెరవేరెనా? భరతా!" అనగా ఆ తపస్విచంద్రునితో భరతు డిట్లనెను. "తపోధనా! సీతానాథునితో నీవు నాయన్నవు గదా యంటిని. వ్యర్థముగా ఆఱడిపాలయితినంటిని. నన్ను మన్నించుమంటిని. శిష్యుడనగు నాయందు దయ లేకుందువా యంటిని. నేను కన్నులనీరు పెట్టుకొంటిని. పాదద్వయమును గట్టిగా పట్టుకొంటిని. నే నెన్ని విధముల వేడినను తన మనస్సు నించుకంతయినను త్రిప్పుకొన డయ్యెను. నేనేమి చేయుదును. మా గురువు కూడ మిక్కిలి బ్రతిమాలగా రాముడా మౌని చంద్రున కిట్లు చెప్పెను. తండ్రి చెప్పినట్లుగా పదునాల్గేండ్లును వనములందు నివసించి ప్రతిజ్ఞను తీర్చెదను. ఆ దృఢచిత్తుని మాట విని ఆ ముని యోగక్షేమ సంపాదన సమర్థములైన పాదుకలనయోధ్య యేలుటకుగాను ఇమ్మని చెప్పెను. ఆ లక్ష్మీపతి

తూర్పు ముఖముగా తిరిగి పాదుకలపై పాదములను మోపి వీనిని ఎంతో దయతో మునీశ్వరా! రాజ్యపరిపాలన కొఱకై యిచ్చెను. నన్నయోధ్యకు బొమ్మనగా నిట్లు వచ్చితిని. సమ్మదముతో పాదుకలను గైకొని యయోధ్యకు వెళ్లెదను" అనగా విని మునీంద్రు డిట్లనెను. "సాధుశీలవృత్తములతో నీవు సజ్జనులచేత పొగడబడినవాడవు. ధన్యమైన నడవడి గలవాడా! నీ చరిత్ర మాశ్చర్యమా? మిట్టనున్న నీరు పల్లమునకు బోవుట వింతయా? నీవంటి పుత్రుడు కలుగుటచేత రాజగు దశరథుడు భూమిని విడచి వెళ్లినను జీవించి యున్నవాడే సుమా" యనగా పవిత్రమైన మనస్సుతో భరతుడా సంయమికి మ్రొక్కి సైన్యము తన్ను కొలుచుచుండగా ఆ దశరథ పుత్రుడు తన పట్టణమునకు వెళ్లుచు యమునా నదిని దాటి జాహ్నవీ నదిని చూచి వేగముగా దానిని దాటి వెడలి తీరమున నున్న శృంగిబేర పురమును ప్రవేశించి యటనుండి కదలి యన్నయు, తండ్రియులేని యయోధ్యను చూచుచు సారథితో ఆకారముచెడి సంతోషము లేనిదై దీనములైన తడబడుచున్న కంఠధ్వనులు గలిగి సారవిహీనమై యున్న యయోధ్యా నగరముండు తీరును చూచుమని చెప్పుచు దీనతతో పురమును ప్రవేశించెను.



# నూట పదునాలుగవ సర్గము

## నిరానందయైన యయోధ్యాపురి వర్ణనము :

ఆ పట్టణమున పిల్లులు గుడ్లగూబల సంచార మధికమై యుండెను. ఏనుగుల మనుష్యుల సంచారములు తక్కువగ నుండెను. సంపదలు శోభలు తొలగి చిమ్మచీకట్లు క్రమ్మిన కాళరాత్రివలె నుండెను. అంగారక గ్రహపీడచే కాంతి గోల్పోయిన చంద్రపత్నియైన రోహిణివలె కాంతిహీనయై యుండెను. ఇగిరిపోయిన వేడియైనకొద్ది నీరు కలిగి, సెగలతో బాధనొందు జలపక్షులు గలిగి, మరణించిన వివిధములగు చేపలు గలిగియున్న సెలయేఱో యను నట్లుండెను. యజ్ఞమందు బంగారు ఛాయలతో మండుచు హోమద్రవ్యములను వేసినపుడు మలగిన అగ్నివలె కళాహీనమై యుండెను. చెదరిన ఏనుగులతో, పగిలిన టెక్కెములతో బెదరిన గుఱ్ఱములతో విరిగిన రథములతో ఆ పురము విరోధులచే కలంచబడి చెదరిపోయిన సైన్యమో యనునట్లుండెను. పెనుతుఫాను నందు నురుములు ధ్వనులు అధికముగా నుండి గాలి వేగముపశమింపగా స్తిమితములైన సముద్ర తరంగముల సముదాయము వలె యేశబ్దములు లేకుండెను. యజ్ఞాంతమునందు యాజకులు విడుచుట చేతను, సంభారములు లేకుండుటచేతను, సద్దుమణిగిన యజ్ఞవేదివలె జనశూన్యమై యుండెను. ఆబోతు వెడలిపోగా, పచ్చిక తినుటకు తలలు వంచక వెతలతో గుందుచున్న గోవుల మందయో యనునట్లుండెను. శ్రీలను విలసిల్లుచు అందమైన తేజస్సును గలుగజేయుచు దివ్యముగానున్న రత్నశ్రేణులు రాలిపోయి తేజోవిహీనమై యున్న హారమో యనునట్లుండెను. తాను చేసిన పుణ్యము నశింపగా నేలవ్రాలిన

యొకచుక్కను పోలియుండెను. వసంతమున తుమ్మెదలతోను వివిధ పుష్పములతోను ప్రకాశించుచుండి గ్రీష్మర్తువునందు ఎండలకు కమరిన తీగలవలె కాంతులు నశించియుండెను. బేరసారములు లేకపోవుటచే తలుపులైనను తీయబడని యంగడి వీధులతో అయోధ్య మబ్బులు గ్రమ్మి చుక్కలు చంద్రుడు మాసిపోయిన నిశివలె కళావిహీనమై యుండెను. వట్టిదైన కడవలతోను ఏమియులేని పిడతలతోను శూన్యమైయున్న పానశాలవలెను, దొరలుచున్న కుండలతోను పడిపోయిన గోడలతోను పాడువడియున్న చేలి పందిరివలెను అప్పుడయోధ్యయుండెను. వీరుని వింట నెక్కుపెట్టబడి శత్రువులు నరికివేయగా పట్టుదప్పి నేలమీదపడియున్న వింటి యల్లె త్రాటివలె కళ బాసియుండెను. యుద్ధశూరుడు అశ్వాలంకారములన్నియు చేసిన పిదప యుద్ధమునకుపయోగింపదని వదలివేసిన గుఱ్ఱపు పిల్లవలె నుండెను. తాబేళ్లు, చేపలు అధికము గలిగి, స్వచ్ఛమైన నీరు కొలదిగా మాత్రమే కలిగి ఒడ్డులు కూలిపోయి కలువలులేక అందముచెడిన పాడునూయియో యనున ట్లుండెను. దుఃఖముతో మైపూతలు ఆభరణములు తిరస్కరించిన వానియొక్క కళావిహీనమైన మేనివలెను, వానకారున అధికమైన మేఘముల సమూహము క్రమ్మగా మాసిపోయిన సూర్యకాంతి వలెను అయోధ్యా నగరముండెను. అట్టి యయోధ్యా నగరమును జూచి భరతుడు బాధనొందుచు ప్రవేశించెను.

**భరతుడు మఱల అయోధ్యను ప్రవేశించుట :**

భరతుడు రథమందుండి తన సారథిని జూచి “అయ్యో పట్టణమందెందును మునుపటి వలె కడుసంతసము కలుగజేయు శుభప్రదమైన గీతములును వాద్యములును వీనుల కింపుగా వినబడుటలేదు. ఎక్కువగా చందన గంధములు పుష్పమాలికల సుగంధములు నిండిన గాలులు వీచుటలే దిచ్చట. రాముడు లేకుండుటచేతనే సుమా! నగరమందు పల్లకి మోయు మ్రోతలును, ఏనుగుల

ఘీంకారములును, గుఱ్ఱముల సకిలింపులును, రథముల ధ్వనియు నేమాత్రమును వినిపించుట లేదయ్యెను. యువకులలో నొక్కరైనను మనస్సునందు సంతోషము లేకపోవుటచేత చందనము పుష్పమాలికలు ధరించి కనిపించుటలేదు. జనసమూహములో నెవ్వరును పట్టణమున రాముడు లేకపోవుటచే పుష్ప హారములు ఆభరణములు శరీరమున ధరించి విలాసముగా వాహ్యాళికి వెళ్లలేదు. ఈ ఊరి కళావిలాసములన్నియు మా యన్నయగు రామునితోడనే వెడలి పోయినవి గదా! ధారావర్షముతో గూడిన కృష్ణపక్షపు రాత్రివలె ఈ యయోధ్యాపురి కన్పట్టుచున్నది. జనులకు సంతోషము కలుగునట్లుగా మా యన్న యెప్పుడు వచ్చునో గదా! వేసవి మబ్బువలె అందఱకును సంతోషము నెన్నడు కలిగించునో? మిత్రమా! యువతీ యువకులలో నొక్కరయినను రాజమార్గమున విలాసముగా సంచరింపరుగదా!" అనుచు మిక్కిలి వగపుతో సింహములేని గుహవలెను, సూర్యుడులేని యాకాశమువలెను ఉన్నట్టి రాజభవనమును ప్రవేశించి విచారించుచు..



# నూట పదునేనవ సర్గము

## భరతుడు నంది గ్రామమును జేరుట :

అందు తల్లుల నుండ నియమించి ఆ సద్వ్రత నిష్ఠుడగు భరతుడు గురువగు వసిష్ఠునితో ఇట్లనెను. "నేను నంది గ్రామమున నివసించినచో భరింపలేని ఈ దుఃఖమును తట్టుకొన గలనేమో! కనుక నేను వెళ్లి అందు కాపురము ఉండెదను. మీరెల్లరును నా కనుజ్ఞనిండు. రాజు స్వర్గమునకు వెళ్లెను. నా ఆచార్యుడైన రాముడడవులకు వెళ్లెను. నేనచ్చట నుండి రామాగమనమునకు వేచియుండెదను. మహాత్మా! ఈ రాష్ట్రమునకంతకు రాముడే రాజు సుమా!" ఆ మాటను విని మంత్రులును గురువును శుభమైన ఆ మాటల నాదరించినవారై "భరతా! నీ మాట మెచ్చదగినది. మంచిదియు. నీవంటి భ్రాతృభక్తి గలవాడును, గొప్ప యశస్సు గలవాడు, సజ్జనులచే పొగడబడిన కులమందు పుట్టినవాడు, నిజబంధువుల నాదరించువాడు ఇట్లు చేసెదనన్నచో ఓ సార్థకజన్ముడా! యెవ్వడు సమ్మతింపకుండును?" అని తన యిష్టము ననుసరించి మంత్రులు గురుడును చెప్పగా భరతుడు సారథిని జూచి 'రథము సిద్ధము చేయుమా' అనగా అతడట్లు సిద్ధము చేయగా తల్లులందఱకు నమస్కరించి తన తమ్ముడు తనతో గూడ రాగా ముందుగా గురుడు మొదలైనవారు నడవగా వ్యథతో గూడినవాడై తూర్పుముఖముగా వెళ్లెను. సైన్యము మంత్రులు వెంటనంటి రాగా తన తలమీద రెండు పాదుకలను వెలయజేసి రాజపుత్రుడు నంది గ్రామమును జేరి మౌనులలో శ్రేష్ఠుడైన వసిష్ఠుని జూచి "మౌనీంద్రా! మా యన్న అస్ఖలితమైన ప్రేమతో రాజ్యమును నా యొద్ద ఇల్లడగా నుండెను. ఇవి రాజ్యము యొక్క యోగక్షేమము

లను వహించును” అని పలికి మంత్రులు మున్నగువారిని జూచి “మా యన్న పాదుకలకు ఛత్ర చామరములు పట్టుడు. ఇవియే చూడుడు ఇంక రాజ్య భారమును వహించును. సాటిలేని దయతో మా యన్నగారు వీనిని నా యొద్ద న్యాసముగ నుంచిరి. భూపుత్రీ నాథుడు తిరిగి వచ్చునంతదనుక వీని నత్యంతమైన భక్తితో రక్షించెదను. రాముడు రాగానే రాజ్యముతో గూడ వీని నర్పించి అతనిని భజించి యపకీర్తిని పోగొట్టుకొనువాడను. ఆయనకు రాజ్యము నిచ్చుట అందఱకు సంతోషము కలుగజేయును. అదియే నాకు కీర్తిని సమకూర్చును. మరియు నదియే నాకు రాజ్యముకంటె నాలుగింతలుగ మంచిది.” అని చెప్పుచు మునివేషముతో నున్న భరతుడు ఆ పాదుకలను రెండింటిని బంగారు సింహాసనమున నుంచి సంతోషముతో పట్టాభిషేకము చేసి వానికి ఏ దినమున జరిగిన రాజకార్యముల నాదినముననే ముందుగా దెల్పుచు, మనస్సునందన్న యొక్క రాకకై యెదురుచూచుచు, ప్రజలు సుఖపడునట్లుగా రాజ్యము చేయుచుండెను.



# నూట పదునాఱవ సర్గము

## ఋషీశ్వరులు చిత్రకూటమును విడిచిపోవుట :

అక్కడ చిత్రకూటమునందు శ్రీరామచంద్రుడు సోదరసహితుడై నివసించు చుండి భరతుడు వెళ్లిన తరువాత అచ్చటి ఋషీశ్వరులు తనవంక జూచి వారిలో వారు రహస్యముగా మాటలాడుకొనుచు చెప్పుటకు సందేహించుచు కనుబొమ కదల్చుచు కనులతో సంజ్ఞలను చేసికొనుచు, సమీపించుచు ఏమియో చెప్పబోయి మాటలను మ్రింగివేయుచు ఈ ప్రకారముగా సందేహించుచుండగా వారి యొక్క ప్రవర్తనను జూచి వింతగా తోచుచున్నదని సందేహించి ఏమియో తెలిసికొనెదనని తలచి వారిలో కులపతిని చూచి చేతులు జోడించి సూర్యవంశ ప్రదీపకుడగు రాముడిట్లనెను. "మునీంద్రా! నా ప్రవర్తన మునుపటివలె లేదా? లేక నా తమ్ముడు ధర్మము తప్పెనా? అక్కటా పొరపాటున భూపుత్రి నా సేవ చేయుటకయి మిమ్ము సేవించుటలో పతివ్రతా ధర్మమును వీడెనా? మును లందఱింత యలజడి పొందనేల?

## వృద్ధ ఋషి తమ కష్టములను శ్రీరామునితో జెప్పుట :

అనగానే వయస్సు చేతను, తపస్సుచేతను వృద్ధుడైన యా ముని వణకుచున్న వాడై "పరమ కల్యాణ స్వభావము కల్గిన జానకి యెక్కడ? అందులో తపస్వుల యందు తప్పి నడచుట యెక్కడ? నాయనా! నిన్ను గురించియే సుమా తాపసు లిట్లగుట. రాక్షస సంఘములచేత బాధింపబడి యిట్లందఱును గుసగుసలాడు కొనుచున్నారు. రాక్షస రాజైన రావణాసురుని తమ్ముడైన ఖరుడు దయలేనివాడు, మనుష్యులను తినువాడు, గర్వితుడు, పాపపు మనసు గలవాడు, జయముతో ప్రకాశించువాడు నీవిచ్చటికి వచ్చినది మొదలు మమ్ము బాధలను పెట్టుచుండెను. నీవిచ్చట నుండుట వారికిష్టము లేదు. మీరిచ్చటికి వచ్చినది మొదలుకొని ఎక్కువగా ముని సంఘములకు పీడయొనర్చుచున్నారు. హృదయమున నాటిన బాణముల వంటివారై మిక్కిలి క్రూరమైన భయంకరమైన రూపములను ధరించి యెల్లచోటులను పెచ్చురేగి మమ్ము హింసించుచున్నవారు. ఏమని చెప్పువారము.

అప్రశస్తములైన పదార్థములను మీద వర్షముగా కురిపి కొందఱు మునులను మోది వెళ్లిరి. ఎక్కువగా దుష్టులైనవారు మునులముందు నిలిచి భయకంపితులగునట్లు కొందఱిని ప్రాణములు తీసి వెళ్లిరి. కొన్నిచోట్ల చాటునదాటి దబ్బున మీద పడుదురు. కొన్నిచోట్ల హోమము చేయుచున్న స్రుక్కులను హోమాగ్నులలో బడవేయుచు, పాత్రలను పగిలిపోవునట్లు త్రోసివేయుచు నుపద్రవములు చేయుచుండగా బాధలను పడుచున్నారము. వివేక నిధీ! ఇచ్చట చచ్చినవారు చచ్చిరి. చావకయున్న వారమైనను ఎచ్చటికైన వెళ్లుదమని నన్ను ప్రేరేపించగా ఇచ్చటికి వచ్చినారము. ఓ రాజా! ఇచ్చటికి చాల దూరమున పత్రపుష్ప ఫల సంపదతో నొప్పుచున్నదియు, అందమైనదియు పూర్వము మేము నివసించినదియు అగు ఒక ఆశ్రమము గలదు. మేమందఱమును అచ్చటకు వెళ్లుదుము. మీరు శక్తిగలవారే యయినను సీతతో మీరిచ్చట నుండుట గాని పని. మావెంట వచ్చుట యంగీకారమైనచో ఆ ఖరుడు సాహసముతో మీద పడకముందే మీరును బయలుదేరుడు. రాఘవా! ఆ క్రూరునితోడి పోరు ఎంత సమర్థునికైనను దుఃఖమునే కలుగజేయును. ఈ ప్రకారముగా మౌని చెప్పగా పురుష సింహుడగు రాముడు వారికి ఎన్ని విధములుగా సమాధానములు చెప్పినను వారి యిష్టము ననుసరించి వారు వెడలిపోయిరి. రాముడును ఆ మునులవెంట కొంత దూరము వెళ్లి వారిని సాగనంపి ఆ మునులకు మ్రొక్కి వారి యానతిని బొంది పర్ణశాలకు తిరిగి వచ్చెను.



# నూట పదునేడవ సర్గము

## సీతారామ లక్ష్మణు లత్రిముని యాశ్రమము చేరుట :

తాపసులు వెళ్లిన వెనుక రాజించుకసేపు చింతించుచు "ఇప్పుడు నేనిచ్చట నిలిచి యుండకుండుటకు చాల కారణములున్నవి. సపరివారముగాను, తల్లులతోడను గూడి వచ్చి భరతుడు నన్నిచ్చటనే దర్శించెను. అది తలంచినచో మనస్సెంతయో తపతప లాడుచుండును. సుగుణవంతుడగు నా భరతుని సైన్య మిచ్చట విడిసెను. ఈ భూమి ఆ యేనుగుల గుఱ్ఱముల మూత్ర పురీషముల దుర్గంధములచేత నిలువరానిదై యున్నది. కాన దీనిని విడచి దూరముగా వెళ్లుటే యుచితము" అని ఆ ముగ్గురును బయలుదేరి మునులలో ముఖ్యుడైన అత్రిని చేరి నమస్కరింపగా మనస్సు సంతోషమున పొంగిపోవుచుండగా పుత్రులవలె వారి నాదరించి ఆతిథ్యమిచ్చి పవిత్రమైన చరిత్ర గలదియు, వృద్ధురాలును అగు తన భార్యయైన యనసూయ తపస్విని, మహాధర్మాత్మురాలు తనను సమీపించగా ఆమెకు జనకరాజ పుత్రికను జూచి "సతీ! ఈ పతివ్రతా తిలకము భూపుత్రికారత్నము. ఈమెను గారవింపుము" అని ప్రేమతో నిండిన మనస్సు గలవాడై చెప్పి ఆ యనసూయ యొక్క మహిమను రామునితో ఈ ప్రకారముగా చెప్పెను. "ఒక్క వాన చినుకన్నమాటలేక నరులు జీవరాసులు అన్నియు తగులబడిపోవుచుండగా తన తపస్సుచేత ఫలసమూహమును దుంపలు మొదలైన ఆహార సంపదలను పది సంవత్సరములు సమృద్ధిగా కలుగున ట్లొనర్చెను. గంగాతీరమున తీవ్రమైన నిష్ఠతో పది వేల సంవత్సరములు సర్వవిఘ్నములు నశింపగా పెద్ద తపస్సు చేసినది. దేవకార్యము కొఱకై ఈ అనసూయాదేవి పది రాత్రులను ఏకరాత్రిగా జేసెను. వ్రతములచే పవిత్రురా

లయ్యెను. సౌమ్యమైన శీలము గలది. ధన్య చరితము గల ఓ రామా! ఈమె నీకు తల్లివలె పూజింపదగినది. సర్వభూతములచేతను నమస్కరింప దగినది. మంచి కీర్తి గలది. కోపమును విడచినది. తన యొక్క కర్తలచేత యనసూయ యను పొగడ్తను పొందినది. నీవు మిక్కిలి భక్తితో జనకపుత్రిచేత ఈమెకు మ్రొక్కింపుము." అని చెప్పగా రామచంద్రుడు జనకరాజపుత్రిని జూచి యిట్లనెను. "జానకీ! ముని యొక్క మాటలను విన్నావు గదా. వృద్ధురాలైన తపస్వినిని చూచి సేవించుకొనుము. శుభములు కలుగును."

**సీత కనసూయ హితోపదేశము చేయుట :**

భర్త మాటలను విని భూపుత్రి వెళ్లి వృద్ధురాలును, శరీరమంతయు ముడుతలు పడినదియు, మిక్కిలి ముదుసలితనముచేత తెల్లబాటిన తలవెండ్రుకలు జడలుకట్టియున్న దియు, ఓరుగాలిచేత వణకిపోవుచున్న అరటిచెట్టు వలె మిక్కిలి వణకుచున్న శరీరము గలదియు, భూమియందు పతివ్రతాధర్మమే రూపము దాల్చినదా యనునట్లున్నదియు అయిన అనసూయాదేవిని చూచి జనకరాజ పుత్రి యెక్కువైన భక్తితో తన పేరు చెప్పి మ్రొక్కి చేతులు జోడించి నిలువబడి కుశలంబులడుగగా ఆ నిర్మలాత్మురాలు సీతతో నిట్లనెను. "సీతా! నీ వెంతటి ధన్యురాలవో కదా! సాధ్వీధర్మమును మనసునందు నిశ్చయించుకొని బంధువులను సంపదలను సౌఖ్యమును విడచి అభిమానమును లెక్కచేయక వనవాస వ్రతమునకై వచ్చు నీ భర్తతోగూడ వచ్చితివి. ఇటువంటి స్త్రీలు భూమియందున్నారా? పట్టణమున నున్నవాడో వనముల నివసించువాడో గుణవంతుడో గుణములు లేనివాడో, ధనహీనుడో, దుర్మార్గుడో, ఎక్కువైన కామము గలవాడో భర్త గల స్త్రీకి తన భర్తయే ఉత్తమగతులకు కారణము, ఆతడే దైవము సుమా! తాను చేసిన తపస్సుచేత సంపాదింపబడిన పుణ్యమువలె తన్నెల్లచోటులందును జాగ్రత్తగా కాపాడునట్టి ప్రాణసమానుడైన భర్తకంటెను మేటిచుట్టమును నేనెఱుగను సుమా! దుష్టురాండ్రగు స్త్రీలు చెడ్డమార్గముల సంచరింపుచు ఈ

విషయము నెఱుగజాలరు. తన భర్తను లెక్కచేయక అతిశయించిన మన్మథబాధకు గురియై స్వేచ్ఛగా తిరిగెడువారును, భర్తను ఆజ్ఞాపించువారును, దుర్మార్గ రాండ్రును నపకీర్తిని బొంది ధర్మభ్రష్టురాండ్రై ఇహపరములందును నశించుదురు. గుణ దోషములను గుర్తింపలేరు. దుష్టగుణము సుఖమును గలుగజేయునా? ఇంటివరుసను పాటించుచు, మేలును కీడును మనసునందు తలంచుచు శుభము తప్పని సాధ్వులు సమస్తమైన ధర్మములు చేసినవారివలె స్వర్గమును బొందుదురు. మంచి బుద్ధితో పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తి తెచ్చునట్టి ఆ సద్గుణశాలిని, సజ్జనులచే నుతింపబడిన శీలముగల సాధ్వి, ఉత్తమమైన కీర్తిని అధికమైన శుభములను పొంది తరువాత స్వర్గ సౌఖ్యమును పొందును గాన భర్తకు హితము చేయుదానవై సంచరింపుము కాంతామణీ!" యని అనసూయ అసూయలేనిదై తనకు చెప్పినట్టి ఆ మాటలకు జనకరాజపుత్రి సంతోషించుచు మెల్లగా మధురముగా నిట్లనెను.



# నూట పదునెనిమిదవ సర్గము

## సీత యనసూయ వాక్యములకు సంతోషించుట :

తల్లీ! అనసూయాదేవీ! నీ వంటి తపశ్శాలిని యీ మాదిరిగా అనుటలో చిత్ర మేమున్నది. సాధ్వులకు సేవించుటకు ప్రాణనాథుని కన్నను వేరుదైవము లేదని తెలిసియున్న దానను. నా భర్త చెడునడత గలవాడైనను గొప్ప భక్తితో భేదింపరాని బుద్ధితో ఓపికతో నేను సేవింపదగియున్నది. అట్టిచో ఇంద్రియము లను జయించినవాడును, ప్రశంసింపదగిన పవిత్రమైన సద్గుణములు గలవాడును, కరుణగలవారలలో శ్రేష్ఠుడును, ధర్మమైన బుద్ధిగలవాడును, తల్లిదండ్రులవలె ప్రీతిపాత్రమైనవాడును అగు ధన్యుడైన రాముని గొల్చుట అబ్బురమా? సమదృష్టి గలవాడు గుణసముద్రుడు నయిన రాముడు తల్లియగు కౌసల్యనువలె ఇతర రాజస్త్రీలను గాంచి భక్తితో గౌరవించును. రాజైన దశరథునిచే ప్రేమతో జూడబడిన యే స్త్రీయైనను అధాటున కన్పించినప్పుడు తన సౌశీల్యముచేత అహంకార రహితుడై తల్లిగా భావించును. తనయందున్న అనురాగముతో నేనడవులకు బయలుదేరిన సమయమున నా అత్తగారును, నా వివాహ సమయమునందు తల్లియు చెప్పినట్టి ఉత్తమమైన వాక్యముల సమూహము నా మనస్సునందు బాగుగ నాటియున్నది. ఇప్పుడు నీవు వానిని మరల క్రొత్తగా జేసితివి. స్త్రీలకు భర్త యొక్క సేవయే మంచి తపస్సగును. పతిసేవ చేయుట చేతనే కదా సతియైన సావిత్రి స్వర్గమునందు ప్రకాశించు చున్నది. పతిశుశ్రూష చేతనే గదా తల్లీ స్వర్గము నీ చేతికందినదయినది. ఆకాశముననున్న రోహిణీ దేవత, యువతులలో శ్రేష్ఠురాలు ఒక్క నిమిషమైనను తన భర్తయగు చంద్రుని వెంటనుండక యుండునా! స్థిరమైన పతిభక్తిని చేసెడి

పతివ్రతలు ఈ విధముగా జగములు నుతించునట్లుగా భూమియందు సంచరించి తాము చేసిన ధర్మకర్మముచే దివమందు పూజింపదగినవారై ఒప్పుదురు గదా!" యని సీత పల్కగా మౌని భార్య అత్యంత సంతోషముతో తానే జానకి శిరస్సు నాఘ్రాణించుచు దగ్గఱగా చేరదీసి యిట్లు చెప్పెను. "అమ్మా! నీవు చెప్పిన మనోహరములగు మాటలచేత మహానందము కలిగినది. నీకేది యిష్టమో కోరుకొనుము. నా తపశ్శక్తిచేత సమకూర్చెదను" అనగా ఆ మాటలు విని విస్మయము చిరునవ్వు మొలకలు కన్పింపగా ఆ సీతాదేవి "అమ్మా! నీ దయచేత నాకేదియు కొదువలేదమ్మా!" అని పల్కగా..

**అనసూయ సీతాదేవి కంగ రాగాదు లిచ్చుట :**

ఆ మాటలు విని ఆ తపస్విని మిక్కిలి ప్రీతితో సీతాదేవితో నిట్లనెను. "ఈ మాల్యములు ఈ చీరయును ఈ ఆభరణములును ఈ అంగరాగములు ఈ విలేపములును ఎంతయో దివ్యమైనవి. ఇష్టముతో సంప్రీతితో నీవు వీనిని తీసికొనుము. ఇవి వాడవు. పరిమళమును వీడవు. నీకు తగినట్లుండును. పగడము వంటి పెదవులు గలదానా! నీవు వీనిని ధరించినచో ఎన్నరాని క్రొత్తదైన శోభతో గూడిన అందమైన దేహకాంతితో లక్ష్మీదేవి విష్ణుమూర్తిని వలె నీ ప్రాణవిభుని సంతోషపెట్టెదవు." అని ప్రేమతో ఇవ్వగా ఆ జనకరాజ పుత్రి! వానిని సంతోషముతో తీసికొని పవిత్రమైన భక్తితో ఆ మునిపత్నికి నమస్కరించి సమీపమున గూర్చుండెను. ఇట్లు సమీపమున గూర్చొనియున్న కుటిలములైన ముంగురులు గలిగిన సీతను జూచి అత్రిముని భార్య ఇతరములైన విషయము లను ముచ్చటింపదలచి ముచ్చటజెందుచు ఆ రాముని భార్యతో నిట్లనెను.

**సీత అనసూయకు తన స్వయంవర వృత్తాంతము చెప్పుట :**

"చక్కనివాడగు రామచంద్రుడు నిన్ను విక్రమము ప్రకటమగునట్లు స్వయంవరమున బెండ్లాడెనని వింటిని గాని దానిని పూర్తిగా వినలేదు. ఓ

వనితా ఆ కథను వినవలెనని మనసు కలుగుచున్నది. ఓ కుటిలకుంతలా! అప్పుడు జరిగిన విషయములన్నియు సంప్రీతిగా చెప్పుము.” అనగా జానకి “వినవమ్మా! అనసూయాదేవీ! చెప్పెదను. నా తండ్రి జనక మహారాజు. క్షత్రియ ధర్మనిరతుడు. విదేహ దేశమునకు రాజు. ఆయన యొకనాడు తానొక యజ్ఞమును చేయదలంచి నేలను దున్నించుచుండగా నాగటిచివర తగులుటచే భూమి పెల్లగిల్లగా నేను పైకి రాగా యజ్ఞభూమియందు శాస్త్రోక్తముగ పిడికిళ్లతో బీజములు చల్లుటయం దాసక్తుడైయున్న రాజు మన్నుచే నిండియున్న దేహము గల నన్ను జూచి ఆశ్చర్యపడి కన్నపుత్రికను వలె వాత్సల్యముతో తన తొడమీద కూర్చుండబెట్టుకొని యిది నా పుత్రికయని ప్రేమించెను. ఆకాశవాణియు నీమె నీ పుత్రికయే యనెను. అది విని సంతోషముతో గూడిన ముఖము గలవాడై తన ప్రథమ భార్యకీయగా ఆమెయు నన్ను తన కన్నబిడ్డ వలె పెంచుచుండగా పెండ్లి చేయవలసిన వయసు వచ్చినది. అది చూచి ధనము లేనివాడు ధననాశమును గూర్చి విచారించినట్లు నా తండ్రి యెల్లప్పుడును ఇట్లు చింతించుచుండెను. కూతుర్లు గలవాడు వియ్యమందిన వారిచేతనో ఇతరుల చేతనో తన తలవ్రాతను బట్టి యింద్రునంత వాడైనను కారుకూతలను వినవలసి వచ్చును. ఇది తప్పదు. ఇట్టి గుణములు గల ధన్యాత్మురాలికి భర్తగా ఏ సజ్జనశ్రేష్ఠుడు లభించునో అనుచు చింతాసముద్రమున మునిగినవాడై పడవను కోల్పోయినవానివలె నా తండ్రి తీరమును గనలేకుండెను. అయోనిజనైన నన్ను జూచి, మన్మథునివంటి రూపసియై నాకు సదృశుడైన రాజు నెందును గానక సజ్జననుతుడగు నా తండ్రి నా సుకుమారి యగు కుమార్తెకు స్వయంవరమును చాటించెదనని తలంచెను. ఇట్లు తలంచి తనకు పూర్వము గొప్ప యజ్ఞమునందు వరుణ దేవుడిచ్చినట్టి ధనుస్సును అక్షయబాణ తూణీరములు గలదానిని, సాధారణ మనుష్యులచే కదలింపరాని దానిని, ఏ రాజులైనను ఎక్కుపెట్టుటకు తమ స్వప్నములందైనను తలంపరాని దానిని,

తనచే పిలువబడిన రాజకోటులకు జూపి యిట్లనెను. ఈ వింటిని ఎక్కుపెట్టిన వీరుడు నాకుమార్తెకు భర్తయగును. అనగా ఆ రాజసంఘమంతయు దాని నెత్తజాలక నమస్కరించుచు వెంటనే వెడలిపోయిరి. ఇట్లు చాలకాలము జరుగగా మహాత్ముడైన గాధి నందనుడు దశరథ పుత్రులైన రామ లక్ష్మణులను సజ్జన నుతుడైన నా తండ్రి చేయుచున్న యజ్ఞమును చూచుటకై తోడ్కొనివచ్చి విదేహ రాజుతో నిట్లనెను. మన్మథుని వలె అందమైనవారు ఈ రాజపుత్రులు దశరథుని యనుంగు పుత్రులు. నీవు దాచిన శివుని వింటిని తెప్పించి ఈ రామచంద్రునకు చూపించుము అనగా జనకరాజట్లే చేసెను. అప్పుడు మౌని యాజ్ఞచే రామచంద్రుడు ధనువును సమీపించెను. ఆ చాపమును మధ్యగా పట్టుకొని అవలీలగా నారి బిగించి లాగగా చూచువారు భయము చెందునట్లది పిడుగు పాటువలె ధ్వనించుచు రెండుగా విరిగెను. అంత సత్యవాదియైన జనకరాజు నన్ను రామచంద్రునకు ధారవోయుటకై జలమును తీసికొనగా రాముడు తన తండ్రి యిష్టమేమో కొంచెమైనను తెలియకపోవుటచే నన్ను స్వీకరింప నిష్టపడలేదు. అప్పుడు వేగముగా నా తండ్రి మా మామగారగు దశరథ మహారాజును తోడ్కొనివచ్చుటకై దూతలను బంపెను. అంతట జనకరాజు శ్రీరామచంద్రునకు నన్నిచ్చుచు ఊర్మిళయను పేరు గల నా చెల్లెలిని లక్ష్మణున కిచ్చెను. ఆ ప్రకారముగా నేను రామునందు అనురక్తి గలదాననైతిని.”



# నూట పందొమ్మిదవ సర్గము

## అనసూయ సీతకు సాయంకాలమును వర్ణించి చెప్పుట :

అని సీతాదేవి చెప్పగా మౌని భార్య సీత శిరస్సును మూర్కొని తన కౌగిటికి చేర్చి యిట్లనెను. "ఓ కోకిల స్వరము గలదానా! వినుటకు చిత్రముగాను, స్పష్టముగాను, తియ్యగాను నీ స్వయంవర చరితమును చెప్పితివి. ప్రొద్దు గ్రుంకినది. చీకట్లు వ్యాపించినవి. మేతకు వెళ్లిన పక్షులు గూండ్లకు చేరి కూయుచున్నవి. ఇంక అవి నిద్రజెందును. ఓ పంకజనేత్రా! జానకీ! అభిషేక జలమునకై వెళ్లిన మునినాథులు అదిగో! తడిసిన నారబట్టలు ధరించి నీటిపాత్రలను చేతులందు ధరించి తిరిగి వచ్చుచున్నారు. ఆ దిక్కుగా జూడుము. అగ్నియందు ఋషులు విధివిహితరీతిగా హోమము చేయగా గాలిచే నెగసిన పొగను జూచితివా? భూపుత్రీ! పావురములు రంగు తేరినవై మెడల అందముతో మెరయుచున్నవి. పల్చగా ఆకులున్న చెట్లు కూడ దూరమున నుండియు చీకట్లు నిండగా ఆకులు నిండియున్నట్లుగా అందముగా గన్పించుచున్నవి. దిక్కుల యందము తొలగెను. అమ్మా! రాత్రి సంచరించు మృగములు ఇటునటు తిరుగజొచ్చినవి. తపస్వుల పెంపుడు మృగములు వేదికల ప్రక్కలందు శయనించెను. చూచితివా? రాత్రి చ్రాల గడచినది. చంద్రుని వంటి ముఖము గలదానా! ఆకాశము చుక్కలతో ప్రకాశించుచున్నది. వెన్నెల మేలిముసుగుగా ధరించి యదిగో చంద్రుడు కన్పట్టుచున్నాడు. నీవు రఘుశేఖరుని దగ్గరకు వెళ్లవమ్మా. నిన్ను చూచుటచేతను, నీతో వేడుకగా ముచ్చటలాడుటచేతను సంతోషమయినది. తామరల వంటి నేత్రములు గలదానా! నేనిచ్చిన వస్త్రములు మొదలైనవి నీవు ధరింపగా కన్నుల నిండుగా నిన్ను జూడ గోరుచున్నాను.

నాయెదుటనే ధరింపు" మనగా ఆ భూపుత్రి వాటినన్నిటిని ధరించి అనసూయకు నమస్కరించి రాముని చేరబోయెను. ఆమెను జూచి రామచంద్రుడు మనసు నందు మిక్కిలి సంతోషించెను. సీతాదేవి రామచంద్రునకు జరిగినది అంతయు చెప్పుచు తనకు ఆభరణములు వస్త్ర మాల్యములు మొదలైన వస్తువులను దయతో మునిపత్ని యిచ్చిన విధమును సంతోషముతో వినిపించెను. మానవులకు లభించనటువంటి అభిమానముతో ఇచ్చినట్టి సత్కారమును జానకీజానియు లక్ష్మణుడును సంతోషముతో పొంగిపోయి తపోధన శ్రేష్ఠుడైన అత్రి మహాముని యొక్క సత్కారమును పొంది నిద్రించి సూర్యుడు గగనమండలము నలంకరింపగా సంధ్యా వందనము మొదలైన కల్య విధులన్నియు తీర్చి ముని సంఘమును మార్గమును చెప్పుడని వేడగా వారలు "రాజపుత్రా! యెచ్చటికి వెళ్లినను దుర్మార్గ వర్తనులు, మనుష్య భక్షకులు, భయంకరమైన రూపములు గలవారలునయిన రాక్షసులు గలరు. ఓయీ ఇంద్రసమానా! మైలపడచేయుచు, ప్రమాదములు గలిగించుచు మా ఋషి బృందమును తినివేయుచున్నారు. దీనిని నివారింపవే! అడవులకు వెళ్లి ఫలములను తీసికొని వచ్చుటకు మునులు వెళ్లి వచ్చెడి మార్గమిదియే. మీకు గూడ ఇదే మార్గము. ఇట్లే వెళ్లవయ్యా" యనుచు చేతులెత్తి దీవించిరి. సంయమి బృందము మంగళాశాసనము పలికి తనను వీడ్కొల్పగా తమ్ముడు సీతయును వెంటరాగా ఆకాశమున సూర్యునివలె రాముడరణ్య మార్గమున బ్రవేశించెను.



రాంకార బీజముతో గూడిన మంత్రరాజమునకు మూలమైనవాడా!
ప్రశస్తమైన సకల గుణములు కలిగి ప్రవర్తించువాడా!
సర్వజనులకు సులభమైనవాడా!
శంకలు నాస్తిక భావములు గలవారికి దూరమున నుండువాడా!
గురుజనుల వాక్యముల నాచరించుటలో సాటిలేనివాడా!
కోపమును కామమును వదలిన బుద్ధి గలవాడా!
గొప్పనైన దయకు ఆశ్రయమైనవాడా!
నిశ్చలమైన చిత్తము గలవాడా!
సోదరులయందు ప్రేమ గలవాడా!
కోరికల నీడేర్చువాడా!
సుఖదుఃఖముల కతీతమైన ఆత్మ గలవాడా!
జగత్తుచేత నుతింపబడిన వాడా!
జగదీశ్వరా! అనుపమానమైన ధర్మమునాచరించువాడా!
దయయే స్వభావముగా గలవాడా!
నిరంతరము ఆనందముగా నుండు స్వభావము గలవాడా!
నిత్యమును కొనియాడ దగిన గుణములు గలవాడా!

సముద్రమునకు చంద్రునివలె సంతోషమును గలిగించువాడా!
ప్రఖ్యాతి గలిగిన దేవతలచేతను పొగడబడు చరిత్ర గలవాడా!
దేవతలచేతను మనుజులచేతను నుతింపబడువాడా!
స్థిరమైన మనస్సు గలవాడా! సంపదలను గలుగజేయువాడా!
పాపములను హరించువాడా! దశరథుని పుత్రుడా!
ఓ శ్రీరామచంద్రా! నీకు నమస్కారము.





శ్లో॥ నమోఽస్తు రామాయ స లక్ష్మణాయ
నమోఽస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోఽస్తు వాతాత్మభువే వరాయ
నమోఽస్తు వల్మీకభవాయ తస్మై॥

**శ్రీరామార్పణమస్తు**

**శ్రీ శ్రీ శ్రీ**

**ఇది**

**శ్రీరామచంద్ర చరణారవింద మిళిందాయమాన మానసయు**
**శ్రీ మొలుగు వేంకట నృసింహాచార్య తనూజయు**
**శ్రీ మత్పండిత మంత్ర రత్న బిరుదాంచిత శ్రీమత్తిరుమల**
**పెద్దింటి వేంకట రాఘవాచార్యులు అయ్యవార్లంగారి ధర్మపత్నియు**
**నగు వేంకట సీతమ్మచే**
**శ్రీ వావిలికొలను సుబ్బారాయ ప్రణీత శ్రీమదాంధ్ర వాల్మీకి**
**రామాయణమునకు రచింపబడిన వచనానువాదమునందు**
**అయోధ్యాకాండము**
**శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధి రస్తు. శ్రీ జగన్మాత్రర్పిత మస్తు**

**శ్రీ శ్రీ శ్రీ**

**ఓం తత్ సత్**